మదరాసు

# గ్రామకోర్టుల మాన్యుయల్

సివిల్, క్రిమినల్ కేసుల విచారణకు సంబంధించిన యావత్తు అంశములు, హైకోర్టు తీర్పులు, ఇతర వ్యాఖ్యానములతో సహా 10 భాగములు గలది.

(1955 సం॥ డిశంబరు ఆఖరు వరకుగల అన్ని సవరణలు, తీర్పులతో సహా)

గ్రంథకర్త:
బందా కనకరాజు బి. ఏ.,
జిల్లాకోర్టు వకీలు,
లాజర్నల్ ఎడిటర్

(1) The Law of Madras Village Courts (English)
(2) మద్రాస్ వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు, (3) మద్రాసు ఋణముల రాజీబోర్డుల ఆక్టు, (4) మద్రాసు ఋణస్థుల రక్షణ ఆక్టు, (5) దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టుల గ్రంథకర్త.

గుడివాడ:
శ్రీ రామా ప్రెస్ నందు
ముద్రింపబడియె.

1956

 పోస్టేజీ ప్రత్యేకము [వెల రు 6—0—0.

# తృతీయ ముద్రణ పీఠిక



1951 సం॥లో ఈ గ్రంథము ద్వితీయ ముద్రణ జరిగినది. ఆ గ్రంథములన్నియు అయిపోయినందున తిరిగి నూతనముగా యీ ముద్రణ వేయబడినది. ఈ గ్రంథము ఆంధ్ర రాజ్యములోని గ్రామ మునసబు కోర్టులకు, పంచాయతీకోర్టులకు, యిప్పుడు పంచాయతీ కోర్టులుగా వ్యవహరించుచున్న గ్రామ పంచాయతీలకు పార్టీలకు అత్యవసరమైనదని చెప్పనక్కరలేదు.

గ్రామ పంచాయతీలు గ్రామమునసబులు వగైరాలు ద్వితీయ ముద్రణ గ్రంథములను కొని నాకు ప్రోత్సాహ మొసంగినందులకు వారికి నేనెంతయు కృతజ్ఞుడను. ఈ గ్రంథములో 1955 డిశంబరు ఆఖరువరకు చేయబడిన సవరణలు, తీర్పులు చేర్చబడినవి.

ఈ ముద్రణ కాపీలనుగూడ పంచాయతీలు తెప్పించుకొని నాకు ప్రోత్సాహ మొసంగుదురని నమ్ముచున్నాను.

గుడివాడ. }
1-1-56. }

బందా కనకరాజు,
గ్రంథకర్త.

---

మునిసిపల్ కౌన్సిళ్ళు, లోకల్ బోర్డుల ఇన్స్పెక్టరుగారి ఆఫీస్, మద్రాస్1
L. Dis. 58412. Dated 11—10—51.

సర్క్యులరు.

విషయము:- బందా కనకరాజుగారిచే ప్రచురింపబడిన పుస్తకములు, ప్రచురణలు: "లాజర్నల్" "గ్రామకోర్టుల మాన్యుయల్".

శ్రీ బందా కనకరాజుగారు (గుడివాడ) "లాజర్నల్"ను తెనుగులో 16-4-1941 తేదీనుండి ప్రకటించుచున్నారు. లాజర్నల్లో ఆక్టులు, విధులు, హైకోర్టుతీర్పులను ముఖ్యముగా గ్రామ పంచాయతీలు గ్రామకోర్టులకు సంబంధించిన సంగతులు ముఖ్యమైనవి యివ్వబడుచున్నవి. వారు గ్రామకోర్టుల మాన్యుయల్ (తెలుగు) ద్వితీయ ముద్రణమును ప్రకటించియున్నారు. ఆ మాన్యుయల్ గ్రామకోర్టులకు సంబంధించిన విషయములను తెలుసుకొనుటకు చాలా సహాయకారిగా యుండును. లాజర్నల్, గ్రామకోర్టుల మాన్యుయల్ గూడ తెలుగుజిల్లాలలో ప్రతిపంచాయతీబోర్డువారు తీసుకొనగలందులకు సిఫారసు చేయుచున్నాము. వాటికి బందా కనకరాజు, ఎడిటర్ అండ్ పబ్లిషర్: "లాజర్నల్" గుడివాడకు వ్రాసిన బడయగలరు.

# ద్వితీయ ముద్రణ పీఠిక.

మదరాసు గ్రామకోర్టుల మాన్యుయల్ 1936 సంవత్సరములో ప్రచురింపబడినది. అటుతరువాత గ్రామకోర్టుల ఆక్టులోను, విధుల లోను అనేక సవరణలు చేయబడినవి. ఇప్పుడు నూతనముగా 1-4-1951 తేదీనుండి అమలులో పెట్టబడిన మద్రాసు గ్రామపంచాయతీల ఆక్టు నిబంధనల ప్రకారము పంచాయతీ బోర్డులన్నియు పంచాయతీ కోర్టులుగా భావింపబడి గ్రామకోర్టుల ఆక్టు ననుసరించి సివిల్ క్రిమినల్ అధికారమును చెలాయించుటకు అధికారమివ్వబడినది. పంచాయతీ బోర్డులు రు 100 ల విలువవరకు గల దావాలను విచారించవచ్చును.

అందువల్ల గ్రామకోర్టుల మాన్యుయల్ను ఇప్పటివరకు చేయ బడిన అన్ని సవరణలు హైకోర్టు తీర్పులనుజేర్చి తిరిగి ప్రచురించుట ఆవశ్యకమైనది. ఇదివరలోని మాన్యుయల్లో 7 భాగములు మాత్రము గలవు. ఈ సారి యింకా మూడు భాగములనుజేర్చి 10 భాగములుగా ఈ గ్రంథము వెలువడినది. ఆ మూడుభాగములు నవన

I వడ్డీకి సంబంధించిన ఆక్టుల అంశములు – i మదరాసు వ్యవ సాయదారులకైన సహాయపు ఆక్టు, ii మదరాసు ఋణస్థుల రక్షణ ఆక్టు, iii దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు.

II గ్రామ కోర్టులకు సంబంధించిన పంచాయతీఆక్టు అంశములు.

III సాక్షిచట్టపు అంశములు.

గ్రామకోర్టులకు సంబంధించిన యితర ఆక్టుల అంశములు సుబోధకముగా యుండుటకు క్లుప్తముగా అవసరమైనంతవరకు మాత్రము పొందుపరచబడినవి.

నేను రచియించిన గ్రంథములన్నిటికి తొలిపలుకులు వ్రాసి గ్రంథ రచనకు పురిగొల్పి నాకు ప్రోత్సాహ మొసంగిన మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారికి నే నెంతయు కృతజ్ఞుడను.

గుడివాడ.
15-9-51.

బందా కనకరాజు,
గ్రంథకర్త.

# FOREWORD

By

Mr. Justice P. Satyanarayana Rao.

Being encouraged by the popularity of the first edition of the Madras Village Courts Manual Published in 1936, Mr. Kanaka Raju has now brought the manual up to date as there were several changes introduced by legislation pertaining to jurisdiction and functions of the Village Courts. Without the assistance of a Manual like this, it may not be possible to lay men not acquainted with the rules of interpretation of statutes to appreciate and grasp the changes of a fundamental character which have been brought about by recent legislation.

Mr. Kanakaraju has attempted in the book in a lucid and clear manner to expound the recent changes introduced by legislation besides bringing the decisions under the village Courts Act up to date. One new feature of this edition which I have noticed is that he has embodied relevant provisions of the Madras Agriculturists Relief Act, Madras Debtors Protection Act, Evidence Act, Usurious Loans Act and the Madras Panchayat Act.

I have no doubt that this nice little book will serve the needs of those who are interested in the administration of the Justice by Village Courts and Panchayat Courts and I hnve no hesitation to commend this book to Village Courts and the litigant public.

P. SATYANARAYANA RAO,

1—10—51.

# తొలి పలుకు

శ్రీ కనకరాజుగారు మదరాసు గ్రామకోర్టుల మాన్యుయల్ ప్రథమ ముద్రణమును 1936 సం॥లో ప్రకటించిరి. అది పొందిన జనాదరణమే ఈ ద్వితీయ ముద్రణకు వారిని ప్రోత్సహించినది. గ్రామకోర్టుల యధికారము యిటీవల పెంపు జేయబడినవి. వాటినన్నిటిని గ్రంథ కర్తగారు క్రోడీకరించియున్నారు. ఇటువంటి గ్రంథముయొక్క సహాయము లేనిదే శాసనముల నన్వయించుటకు అలవాటు లేని సామాన్యులకు శాసనముల ద్వారా యిటీవల చేయబడిన ముఖ్యమైన మార్పులను అన్వయించుకొని గ్రహించుట కలవిగాదు.

శ్రీ కనకరాజుగారీ గ్రంథమునందు ఇటీవల శాసనముద్వారా చేయబడిన మార్పులన్నిటిని చక్కగను, తేటతెల్లముగను విప్పిచెప్పుటయేగాక గ్రామకోర్టులకు సంబంధించిన నేటివరకు యివ్వబడిన హైకోర్టు తీర్పుల నన్నిటిని చేర్చిర

గ్రామకోర్టులకు సంబంధించినంతవరకు మదరాసు వ్యవసాయదారులకిచ్చు సహాయపుఆక్టు, మద్రాస్ ఋణస్థుల రక్షణఆక్టు, దారుణపు వడ్డీల ఋణములఆక్టు, సాక్షీచట్టము, మరియు మద్రాస్ గ్రామపంచాయతీఆక్టు నిబంధనలను యీ నూతన ముద్రణములో జేర్చుట నాకు కనుపడిన యీ గ్రంథములోని క్రొత్త విశేషము.

గ్రామకోర్టుల ద్వారానున్ను, పంచాయతీ కోర్టుల ద్వారానున్ను న్యాయ పరిపాలన జరుపుట కాసక్తిగల వారందరికిన్ని ఈచక్కని చిన్ని పుస్తకము మిక్కిలి యుపయోగపడుననుటలో నాకెట్టి సందియములేదు. గ్రామకోర్టులున్ను, ఆ కోర్టులలో వ్యవహారములు గలవారున్ను యీ గ్రంథమును విరిగా స్వీకరించగలందులకు నేను నొక్కి వక్కాణించుచున్నాను.

మద్రాస్,
1—10—51.

ప్రత్తిపాటి సత్యనారాయణరావు,
మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి.

---

ఈ మద్రాస్ గ్రామకోర్టుల మాన్యుయల్‌ను, గ్రంథకర్తచే ప్రకటింప బడుచున్న తెలుగు పక్ష పత్రిక "లాజర్నల్" ను ప్రతి పంచాయతీబోర్డున్ను తెప్పించుకొన వచ్చునని మ్యునిసిపల్ కౌన్సిళ్ల లోకల్‌బోర్డుల ఇన్‌స్పెక్టరుగారు ( మద్రాస్ ) ఆర్డరును జారీచేసిరి.

# FOREWORD
## TO
## THE FIRST EDITION

It gives me great pleasure to write the foreword to this book.

The absence of a commentary elucidating the important provisions of the Village Courts Act in the Vernacular for the benefit of the lay people of the villages has been a long-felt want. Mr. Kanakaraju has done well in undertaking the publication of this Manual with commentary in Telugu language for the benefit of the Telugu knowing public in the villages. He has attempted in the commentary to explain the important and obscure sections which require clarification and has also in the commentary referred to the leading decisions of the Madras High Court. The book embodies all the recent amendments and is up to date. The commentary is written in a simple and lucid style. The opinions expressed are to the point and accurate. He has also furnished relevant information relating to the provisions of the other Acts such as Indian Penal Code, Limitation Act, Stamp Act etc., which have a bearing upon the Village Courts Act. I have no doubt that the book will prove useful to the village munsiffs and to the members of the Panchayat Courts aswell as to the litigant public who resort to them.

MADRAS,
19 th Jan. 1936

**PRATTIPATI SATYANARAYANA RAO,**
B. A, M. L, advocate.

# ప్రథమ ముద్రణ తొలిపలుకు



ఈ గ్రంథమునకు తొలిపలుకు వ్రాయుటకు నాకు చాలా సంతసము కలుగుచున్నది.

గ్రామకోర్టుల ఆక్టుయొక్క ముఖ్యనిబంధనలను చక్కగా వివరించు వ్యాఖ్యానము గ్రామములందలి జనసామాన్యమునకు ఉపయోగపడునట్లు తెనుగున లేకపోవుట చాలకాలమునుండి కొరతగానున్నది. గ్రామములందలి తెనుగువారిఉపయోగమునిమిత్తము గ్రామకోర్టుల మాన్యుయల్‌ను ప్రకటించుటకు శ్రీయుత కనకరాజుగారు పూనుకొనుట చాల సమంజసముగనున్నది. ముఖ్యములై క్లిష్టములగునట్టియు, సుబోధకములుగ వివరింపబడవలసిన సెక్షనులను తేటగా జెప్పుటకు ఆయన ప్రయత్నించుటయే గాక తన వ్యాఖ్యానమునకు మద్రాస్ హైకోర్టువారి ముఖ్యతీర్పులనుగూడ ఉదహరించియున్నారు. నేటివరకు కాబడిన అన్ని సవరణలనుగూడ యీ పుస్తకమందు చేర్చియున్నారు. ఈ వ్యాఖ్యానము సరళమగు సులభశైలిని వ్రాయబడియున్నది. ఇందు సూచింపబడిన అభిప్రాయములు సందర్భోచితములుగను, సరియైనవిగను ఉన్నవి. గ్రామకోర్టుల ఆక్టుతో సంబంధముగల ఇండియన్ పీనల్‌కోడు లిమిటేషను ఆక్టు స్టాంపు వగైరా యితర చట్టములయొక్క అవసరమైన ముఖ్యనిబంధనలనుగూడ నిందు పొందుపరచియున్నారు.

గ్రామమునసబులకును, పంచాయతీకోర్టు మెంబర్లకును, ఆ కోర్టులందు పనిగల పార్టీలకును యీ గ్రంథము అత్యంతోపయుక్తముగా నుండు ననుటకు సందియము లేదు.

మద్రాస్
19-1-36

ప్రత్తిపాటి సత్యనారాయణరావు, బి.ఏ.,ఎం.ఎల్
అడ్వొకేటు.

# ప్రథమ ముద్రణ పీఠిక

మదరాసు గ్రామకోర్టుల ఆక్టుననుసరించి చాలకాలంనుండియు గ్రామమునసబులు, పంచాయతీకోర్టులు సివిల్ క్రిమినలు కేసులు విచారించుచుండినను, గ్రామకోర్టుల ఆక్టున్నూ, ఆ ఆక్టుతో సంబంధముగల యితరఆక్టుల అంశములుఉండి వ్యాఖ్యానము హైకోర్టుతీర్పులతోఉన్న యెట్టిగ్రంథము యిదివరలో తెలుగున ప్రచురింపబడియుండలేదు. గవర్నమెంటువారు తెనుగున ప్రచురించిన పంచాయతీకోర్టు మాన్యుయలు (క్రిమినలు) చాలాఉపయోగముగాఉన్నప్పటికి అందు హైకోర్టు తీర్పులుగాని యితరవ్యాఖ్యానముగాని లేనందున పాఠకులకు సెక్షనుల అర్థమొకప్పుడు సరిగా తెలియుటలేదు. ఇదిన్నిగాక ఆ మాన్యుయల్‌లో గ్రామకోర్టులు విచారించదగిన దావాలకు ఆకోర్టుల డిక్రీలకు వర్తించు లిమిటేషను ఆక్టు నూంశములుగాని, సదరు కోర్టులలో దాఖలగు దస్తావేజులకు అవసరమైనప్పుడు స్టాంపుడ్యూటీ పినాల్టీలు వసూలుచేయుటకు స్టాంపుఆక్టు నూంశములుగాని లేవు.

ఇదివరలో గవర్నమెంటువారు పంచాయతీకోర్టు మాన్యుయల్ ప్రచురించిన తరిమిలా ఆక్టులోను అందుక్రిందచేయబడిన విధులలోను అనేకసవరణలు చేయబడినవి. ఈగ్రంథమున 1935 సం॥ ఆఖరువరకు చేయబడిన అన్నిసవరణలు చేర్చబడినవి. 1935 సం॥ ఆఖరువరకు గ్రామకోర్టుల ఆక్టుక్రింద మద్రాస్ హైకోర్టువారు ఇచ్చినతీర్పులు అతి విపులముగా ఉదహరింపబడినవి. ఇతర వ్యాఖ్యానముకూడ హైకోర్టు తీర్పులపైననే ఆధారపడియున్నను వాటిని గ్రంథవిస్తరణ భీతిచేతను, అనవసరమని యెంచియు, ప్రత్యేకము గ్రామకోర్టుల ఆక్టుక్రింద యివ్వబడిన తీర్పులను మాత్రమే ఉదహరించియున్నాను.

ఈగ్రంథమునకు నేను కోరినంతనే తొలిపలుకు వ్రాసియిచ్చిన మహారాజశ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావు పంతులుగారికి నేనెంతయు కృతజ్ఞుడను.

గుడివాడ,<br>20—1—36.

బందా కనకరాజు,<br>గ్రంథకర్త.

# సంజ్ఞా వివరణ పట్టిక

| | |
|---|---|
| మ॥ గ్రా॥ కో॥ ఆ॥ | మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు |
| ఇం॥ పీ॥ కో॥ | ఇండియన్ పీనల్ కోడు |
| సి॥ ప్రొ॥ కో॥ | సివిల్ ప్రొసీజరు కోడు |
| క్రి॥ ప్రొ॥ కో॥ | క్రిమినల్ ప్రొసీజరు కోడు |
| మ॥ వ్య॥ స॥ ఆ॥ | మద్రాస్ వ్యవసాయదారుల కైన సహాయపు ఆక్టు |
| డి॥ ము॥ | డిస్ట్రిక్టు మునసబు |
| ఆ॥ ఇ॥ రి॥ మ॥ | ఆల్ ఇండియా రిపోర్టర్ మద్రాస్ |
| ఇ॥ లా॥ రి॥ మ॥ | ఇండియన్ లారిపోర్టరు మద్రాస్ |
| మ॥ వీ॥ నో॥ | మద్రాసు వీక్లీ నోట్సు |
| మ॥ లా॥ వీ॥ | మద్రాసు లా వీక్లీ |
| మ॥ లా॥ జ॥ | మద్రాసు లా జర్నలు |
| ఇం॥ కే॥ మ॥ | ఇండియన్ కేసెస్ మద్రాసు |
| ఉ॥ | ఉదాహరణము |
| సె॥ | సెక్షను |
| నో॥ | నోట్సు |
| నో॥ ఆ॥ రీ॥ కే॥ | నోట్స్ ఆఫ్ రీసెంటు కేసెస్ |
| మ॥ క్రి॥ కే॥ | మద్రాస్ క్రిమినల్ కేసెస్ |

# మదరాసు గ్రామకోర్టుల మాన్యుయల్

## విషయసూచిక.

# 1 వ భాగము.

# 1888 వ సం॥రపు మదరాసు గ్రామ కోర్టుల ఆక్టు

( 1889 వ సంవత్సరపు 1 వ మదరాసు ఆక్టు )

## సెక్షనువారీ విషయ సూచిక.

### 1 వ అధ్యాయము.

ప్రథమాంశములు.



### 2 వ అధ్యాయము.

గ్రామకోర్టులను స్థాపించడమున్ను, యేర్పాటు చెయ్యడమున్ను.

## 3-వ అధ్యాయము.

అధికారహద్దున్నూ, ముందే తీర్పు చెయ్యబడివున్న విషయమున్నూ, కాలనిర్ణయమున్నూ-సై.

13 గ్రామకోర్టువారు వ్యాజ్యములు విచారణ చెయ్యడము.
14 సమ్మతిత్రోటి 200 రూపాయలవరకు విచారణాధికారపు హద్దు.
15 వ్యాజ్యము వేయబడవలసిన కోర్టు.
16 గ్రామమునసబు స్వయముగా సంబంధము కలిగివున్న వ్యాజ్యము - ఒక మెంబరు స్వయముగా సంబంధము కలిగియున్న వ్యాజ్యము.
17 ముందే తీర్పు చెయ్యబడివున్న విషయము.
18 వ్యాజ్యములో దావా యావత్తు చేరి యుండవలసినది - దావాలో కొంతభాగమును మానుకోవడము.
19 గ్రామకోర్టుల వారివల్ల విచర్శించబడతగని విషయములను మధ్య తీర్మానము చెయ్యడము.
20 కాలనిర్ణయము.
20 (ఏ) గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యములు - డిస్ట్రిక్టుమునసబు విచారించు వ్యాజ్యముల ఖర్చులు.
21 వ్యాజ్యములను టాన్సఫరు చెయ్యడము - డిస్ట్రిక్టుమునసబు చర్యలను నిలిపిపెట్టుట,

## 4-వ అధ్యాయము.

వ్యాజ్యములు తేవడము, తయారు చెయ్యడము, అధికారము పొందిన ఏజెంట్లు, కక్షిదార్లకు సమ్మన్లు జారీచేసి అందచెయ్యడము, విచారణ నిలిపివుంచడము, వాదు హాజరు కాకపోవడమువల్ల కలిగిన ఫలితములు, వీటిని గురించి.

22 ప్లయింటు మూలముగా వ్యాజ్యము ఆరంభించబడవలసినది.
23 ప్లయింటులో వుండవలసిన వివరములు.
24 ఖుద్దునగాని ఏజెంటు మూలముగాగాని హాజరు కావడము.
25 ప్రతివాదికి సమ్మను యే ప్రకారము అందచేయబడవలసినది.
26 ప్రతివాది సమ్మను అందించుకోకుండా తప్పించుకొనేయెడల అది అందించేవిధము.
27 ప్రతివాది కోర్టుయొక్క ప్రదేశాధికార సూద్దుకు వెలుపల వున్నయెడల సమ్మను అందజేసే విధము.
28 ప్రతివాది హాజరు కాని పక్షమునకు చర్య - ప్రతివాది వ్యాజ్యమును గురించి రెండవ దినముల నోటీసు యివ్వవలసినదని అడుగవచ్చును.
29 సమ్మను జారీచేసే కక్షిదారుని ఖర్చున అందచెయ్యబడవలసినది.

## 5–వ అధ్యాయము

వ్యాజ్యములను విచారణచేయడము, తీసివేసుకోవడము, లేక రాజీగా పోవడము. సాక్షులను సమ్మను చేయడము, వారిని పరిశీలించడము, వీటిని గురించి.



## 6–వ అధ్యాయము.

డిక్రీని గురించియు దాని అమలును గురించియు.

## 7-వ అధ్యాయము

### నానావిధ విషయములు.

70 ఒకవాది లేక ప్రతివాదికంటె యెక్కువమంది వున్నయెడల శేషించినవారు అపీలు కోర్టున్నమీదట, లేదా అతనిమీద వ్యాజ్యము జరుగవలసినది.

71 డిక్రీదారుడు చనిపోయినపక్షమందు న్యాయశాస్త్ర సమ్మతుడైన అతని ప్రతినిధిని అతని బదులు వుంచుకోవచ్చును.

72 తీర్పుఋణస్థుడు చనిపోయినపక్షమునకు న్యాయశాస్త్ర సమ్మతుడైన అతని ప్రతినిధిమీద డిక్రీ అమలు నెరవేర్చబడవచ్చును.

73 గ్రామకోర్టువారి చర్యలను డిస్ట్రిక్టు మునసబు పునర్విమర్శ చేయవచ్చును.

74 డిస్ట్రిక్టు మునసబు డిస్ట్రిక్టు జడ్జికి రిపోర్టు చెయ్యవచ్చును. కొన్ని సంగతులలో డిస్ట్రిక్టు జడ్జికి రిపోర్టు చెయ్యవలసినది.

75 నమూనాలు నిర్ణయించుటకు హైకోర్టువారికిన్ని, రికార్డులు పరిశీలించుటకు డిస్ట్రిక్టు జడ్జికిన్ని, డిస్ట్రిక్టు మునసబుకున్ను గల అధికారము.

## 8-వ అధ్యాయము

### క్రిమినల్ విచారణాధికారము.

76 (1) కొన్ని నేరములను విచారణకు తీసుకొని విచారించుటకు పంచాయతీ కోర్టులకు రాజ్య గవర్నమెంటువారు అధికారమియ్యవచ్చును. (2) జుల్మానా విధించుటయును దాని పరిమితియును. (3) జుల్మానా చెల్లించుటయును చెల్లించని తప్పునందుకు శిక్షయును. (4) నేరముల విచారణలో చర్యాక్రమము. (5) ఫిర్యాదికి బదులు లేదా ముద్దాయికి బదులు ఏ న్యాయవాది వృత్తిదారుడయినను హాజరు కాకూడదు. (6), (7) పంచాయతీ కోర్టునుండి ఎప్పుడు వ్యాజ్యములు ట్రాన్సుఫరు చేయవచ్చును. (8) అప్పీలు. (9) పంచాయతీ కోర్టువారు విచారింపదగిన వ్యాజ్యముల ట్రాన్సుఫరు.

77 ఒక గ్రామ కోర్టుకు క్రిమినల్ ప్రొసీజరు కోడు 403, 476, 476A & 476 B సెక్షనులు వర్తించుట.

## 9-వ అధ్యాయము

### విధులు చేయుటకు అధికారము.

78 రాజ్య గవర్నమెంటువారు ఆక్టుయొక్క కార్యములను నెరవేర్చుటకు, విధులు చేయుటకు అధికారము.

# 1888 వ సంవత్సరపు
# మదరాసు గ్రామకోర్టుల ఆక్టు

## 1 వ భాగము

(1889 వ సం॥ I వ మదరాసు ఆక్టు)

పీఠిక

ఆంధ్ర రాజ్యములో గ్రామ మునసబుల కోర్టులను గురించిన చట్టమును ఏకీభవింపజేసి సవరించడము యుక్తముగా నున్నందున ఇందువల్ల యీ క్రింది విధమున శాసించడమైనది.

## 1 వ అధ్యాయము

### ప్రథమాంశములు.

సంగ్రహ నామమున్ను ప్రారంభమున్ను.

1. (1) ఈ ఆక్టును "1888 వ సంవత్సరపు మదరాసు గ్రామకోర్టుల ఆక్టు" అని చెప్పవచ్చును. మరిన్ని యిది తత్క్షణమే అమలులోకి రావలసినది.

ప్రదేశవ్యాప్తి

(2) ఈ ఆక్టు 1874 వ సంవత్సరపు 14 వ ఆక్టులో నిర్వచింపబడివున్న ప్రకారము పట్టీలో చేరిన డిస్ట్రిక్టులు తప్ప ఆంధ్ర గవర్నమెంటుకు లోబడివున్న దేశములను వ్యాపించును. అయితే ఆంధ్ర గవర్నమెంటు అఫీషియల్ గెజెటులో ప్రకటన మూలముగా యేదైనా గ్రామమునుగాని, విస్తీర్ణమును గాని యీ ఆక్టుయొక్క అమలునుండి అప్పటప్పటికి తీసివేయవచ్చును. అట్టి ప్రకటనను రద్దుచేయవచ్చును.

రద్దుచేయబడ్డ చట్టములు

2. [1901 వ సంవత్సరపు 11 వ దగు 1901 వ సంవత్సరపు రద్దుపరచు నట్టిన్ని, సవరించునట్టిన్ని ఆక్టుయొక్క సెక్షను 3 (2) చే రద్దుచేయబడినది.]

జరుగుతూవున్న వ్యాజ్యములను, లేక డిక్రీలను అమలు వర్తింపచేయడము.

3. ఈ ఆక్టు అమలులోకి వచ్చే కాలమందు గ్రామమునసబుల కోర్టులలో జరుగుతూవుండే అన్ని వ్యాజ్యములు యీ ఆక్టు ప్రకారము తేబడేటట్లు యెంచబడవలసినది. మరియు ఆ తారీఖుముందుగా గ్రామమునసబువల్ల చెయ్యబడ్డ అన్ని డిక్రీలున్నూ యీ ఆక్టును అనుసరించి చెయ్యబడ్డ డిక్రీలను అమలు నెరవేర్చడమును గురించి యిందులో యీ దిగువ చెప్పియున్న నిబంధనలను బట్టి అమలు నెరవేర్చబడవచ్చును.

అక్టుయొక్క వ్యాప్తిలోనుండి తీసివేయబడ్డ విస్తీర్ణములో జరుగుతూవున్న వ్యాజ్యములకున్నూ డిక్రీలకున్నూ చర్య.

4. ఏ గ్రామమైనను విస్తీర్ణమైనను యీ ఆక్టుయొక్క అమలునుండి తీసివేయబడే యెడల, అందులో వుండే గ్రామకోర్టులో జరుగుతూవున్న అన్ని వ్యాజ్యములున్నూ అట్టి కోర్టువారివల్ల చెయ్యబడి అమలు నెరవేర్చబడకుండా వున్న అన్ని డిక్రీలున్నూ, ఆ వ్యాజ్యము అప్పుడే వేయబడేటట్లు వున్న యెడల దానిని విమర్శించుటకు అధికారముగల సివిల్ కోర్టు వారివల్ల విమర్శించబడి తీర్మానింపబడవలసినదే గాక అమలు నెరవేర్చబడవలసినది.

అట్టి వ్యాజ్యములు ఆ సివిల్ కోర్టులో వేయబడ్డ వ్యాజ్యములవలె విమర్శించబడి, అట్టి డిక్రీలు ఆ సివిల్ కోర్టువారివల్ల చెయ్యబడ్డ డిక్రీలవలె అమలు నెరవేర్చబడవలసినది.

## వ్యాఖ్య.

ఈ ఆక్టు సె 1 క్లాజు (2) ప్రకారము గవర్నరుగారు యే గ్రామమునుగాని, యేదైనా విస్తీర్ణమునుగాని, యీ ఆక్టు అమలులోనుండి తగ్గించిన యెడల ఆ గ్రామ కోర్టులలో నిలువయున్న దావాలున్నూ, డిక్రీలున్నూ, అప్పుడు ఆ దావాలు దాఖలు చేయవలసి వచ్చే యెడల యే సివిల్ కోర్టులో దాఖలు చేయవలసియుండునో, అట్టి సివిల్ కోర్టు దావాలుగను, డిక్రీలుగను యెంచి సదరు కోర్టువల్ల సదరు కోర్టు యితర దావాలు డిక్రీలవలె విచారణ. అమలుచర్య జరుగవలసియుండును.

అర్థమును తెలియజేసే క్లాజు. 5. ఈ ఆక్టులో విషయమందుగాని సందర్భమందుగాని విరోధము యేమిన్ని లేని యెడల—

గ్రామము. "గ్రామము" అను మాటకు, శాశ్వత పైసలాయతీ ఎస్టేటులో దేనికిగాను యీ ఆక్టు జారీ అయ్యేటప్పుడు 1816 వ సంవత్సరపు మదరాసు 4 వ రిగ్యులేషనుబట్టి గ్రామమునసబుకోర్టు యేర్పరచబడివున్నదో లేక దేనికిగాను ఈ ఆక్టు ప్రకారం గ్రామకోర్టు స్థాపించబడివున్నదో అట్టి ప్రదేశ విస్తీర్ణమనిన్ని యితరస్థలములయందు భూమి శిస్తునసూలుచేసే కార్యములకుగాను గ్రామము వుండేటట్లు అప్పుడప్పుడు గవర్నమెంటువారు అంగీకరించే ప్రదేశ విస్తీర్ణమనిన్ని అర్థమవుచున్నది.

గ్రామకోర్టు. "గ్రామకోర్టు" అను మాటలకు 7 వ శెక్షను ననుసరించి నియమింపబడిన గ్రామమునసబుయొక్క కోర్టు అని లేదా 9వ సెక్షను ననుసరించి స్థాపించబడిన పంచాయతీకోర్టు అని అర్థము.

గ్రామమునసబు. "గ్రామమునసబు" అనే మాటలకు ఈ యాక్టు ననుసరించి స్థాపింపబడిన ఒక గ్రామమునసబు కోర్టుయొక్క జడ్జి (న్యాయాధిపతి) అని అర్థము. మరిన్ని 16 వ శెక్షన్ 1వ సబు. సెక్షనులో తప్ప ఆ మాటలలో.

(a) ఒక పంచాయతీకోర్టుయొక్క ప్రెసిడెంటు (అగ్రసనాధిపతి) మరిన్ని,

(b) ఈ ఆక్టు ననుసరించి లేదా దీని ననుసరించి చేయబడిన విధుల ననుసరించి ఒక పంచాయతీకోర్టుయొక్క ప్రెసిడెంటు పనులను చెలాయించు దానియొక్క వైసు ప్రెసిడెంటు చేరును.

డిస్ట్రిక్టుమునసబు. "డిస్ట్రిక్టు మునసబు" అను మాటలకు ఆ గ్రామకోర్టు ఎవరి అధికార ప్రదేశ హద్దులకు లోపల నున్నదో ఆ డిస్ట్రిక్టుమునసబు అని యర్థము.

కాని, ఆ గ్రామము యే డిస్ట్రిక్టు మునసబుయొక్క గాని అధికార ప్రదేశహద్దులలోపల నుండని యెడల ఎవరి అధికార ప్రదేశహద్దుల లోపల ఆ గ్రామము ఉన్నదో అసబార్డినేటు జడ్జీ, లేదా, సబార్డినేటు జడ్జి యెవరును లేనియెడల ఎవరి అధికార ప్రదేశహద్దులలోపల ఆ గ్రామము ఉన్నదో ఆ డిస్ట్రిక్టుజడ్జి, డిస్ట్రిక్టు మునసబుగా భావింపబడవలెను.

ఇదిగాక, యే ప్రదేశమునందైనను డిస్ట్రిక్టు మునసబు స్మాలు కాజు విచారణాధికారము చెలాయించకుండ, ఒక ప్రత్యేకమైన స్మాలు కాజుకోర్టు స్థాపింపబడియుండు నెడల అట్టి కోర్టుయొక్క జడ్జి డిస్ట్రిక్టు మునసబుగా భావింపబడవలెను.

"చరాస్తి"లో పెరుగుచున్న పైరులును, కోయబడని భూమి యందలి పంటకూడ చేరును.

నిర్దేశింపబడిన.

"నిర్దేశింపబడిన" అను మాటకు ఈ యాక్టు ననుసరించి ఆంధ్ర గవర్నమెంటుచే చేయబడిన విధిచే నిర్దేశింపబడిన అని యర్థము.

సంతకము చేయు

"సంతకముచేయు" అనుమాటయొక్క వ్యాకరణ సంబంధపు రూపభేదములతోడను, అదే ఉత్పత్తిగల పదములతోడను, ఆ మాటలో తన పేరును వ్రాయుటకు అశక్తుడై యుండు మనిషి విషయములో 'నిశాని' యనునదియును, దాని వ్యాకరణ సంబంధపు రూపభేదములును అదే ఉత్పత్తిగల పదములును చేరవలెను.

## వ్యాఖ్య.

ఈ సెక్షన్‌లో, యీ ఆక్టులో వుపయోగించిన కొన్ని పదములకు అర్థము నిర్వచింపబడినది.

"డిస్ట్రిక్టు మునసబు" అను పదము ప్రతి డిస్ట్రిక్టు మునసబునకు వర్తించదు. ఏ గ్రామకోర్టు ఏ డిస్ట్రిక్టు మునసబు అధికారమునకు లోబడియున్నదో, అట్టి డిస్ట్రిక్టు మునసబునకు మాత్రము వర్తించును. ఉదాహరణము:— ఏ అనువాదం "బి" డిస్ట్రిక్టు

మునసబు అధికారమునకు లోబడియున్న "సి" గ్రామకోర్టులో ఒక డిక్రీని పొందును. ఈఆక్టు 66 సెక్షను ప్రకారము డిక్రీని గ్రామకోర్టు అమలునిమిత్తము డిస్ట్రిక్టుమునసబుకు పంపవచ్చును. డిస్ట్రిక్టుమునసబు అనగా యీ సెక్షన్‌లో చెప్పబడిన నిర్వచనము ప్రకారము "సి" గ్రామ మునసబుకోర్టుపైన అధికారముగల "బి" డిస్ట్రిక్టుమునసబు అని అర్థము. "సి" గ్రామకోర్టు ఆ కోర్టు డిక్రీలను "బి" డిస్ట్రిక్టుమునసబు కోర్టుకు గాక యితర డిస్ట్రిక్టు మునసబుకోర్టులకు పంపుటకు అధికారములేదు.

66 సెక్షను క్రింది వ్యాఖ్యానము చూడవలెను.

"చరాస్తి" అను పదమునకు నిర్వచనము 1937 సం॥పు 2 మద్రాస్ గ్రామ కోర్టుల సవరణ ఆక్టువల్ల చేర్చబడినది. చరాస్తి అను పదములో పెరుగుచున్న పైరులు, కోయబడని నిల్వపైరులుగూడ జేరును. జప్తుఅయిన పైరులను భద్రపరచుటకు, వేలము వేయుటకు నిబంధనలు సె 53 లో యున్నవి.

51 మ. లా. జ. 561 కేసులో "చరాస్తి" అను పదములో నిల్వపైరుగూడ జేరునని తీర్మానించబడినది. కాని దరిమిలా 58 మ. లా. జ. 509 కేసులో నిల్వపైరు చరాస్తి కాదేమోనని అనుమానించిరి. కాని యిప్పుడు చేర్చబడిన నిర్వచనమువల్ల పైరుకూడ| చరాస్తిగా యెంచబడును. (పై తీర్పుల పూర్తి వివరములకు సె 13, 52 ల క్రిందవ్యాఖ్యానమును జూడవలెను.)

## 2 వ అ ధ్యా య ము.

### గ్రామ కోర్టులను స్థాపించడమున్నూ యేర్పాటు చేయడమున్నూ.

గ్రామకోర్టు స్థాపించడము.

6. రాష్ట్రీయ గవర్నమెంటువారు డిస్ట్రిక్టు గెజెటులో ప్రచురించబడు ఉత్తరువుద్వారా అప్పటప్పటికి—

(1) రెండు లేక యెక్కువగ్రామములు ఒకటిగాచేర్చి అందులో పూర్వము వుంటూవుండిన ఆ యా గ్రామకోర్టులకు బదులు వాటికి యొక గ్రామకోర్టు స్థాపించవచ్చును.

(2) ఏ గ్రామమందైనా డివిజన్‌లు యేర్పాటుచేసి అట్టి గ్రామమందు పూర్వము వుంటూవుండిన గ్రామకోర్టుకు బదులు అట్టి డివిజన్‌లలో నొక్కొక్క దానికి ప్రత్యేక గ్రామకోర్టు స్థాపింపవచ్చును.

(3) నిర్దేశించిన యేదైనా విస్తీర్ణమునకుగాను కొత్త గ్రామ కోర్టు స్థాపింపవచ్చును.

7. పంచాయతీ కోర్టులు ఏవియు లేని గ్రామములలో నిర్దేశింప బడిన విధముగా గ్రామమునసబులు కలెక్టరు వల్ల నియమింపబడవలసినది. అయితే గ్రామములో వాసము చేస్తూవుండని యే మనిషిన్ని ఆ ఉద్యోగమునకు అర్హుడు కాడు.

గ్రామ మునసబును నియమించడము.

ఈ సెక్షన్ క్రింద గ్రామ మునసబులును నియమించు విధులకు యీ పుస్తకము 2వ భాగములో సెక్షను 78 (2) ఏ. బి. సి. క్రింద చేసిన, 2, 3 విధులను చూడవలెను.

8. డిస్ట్రిక్టు కలెక్టరు గ్రామ మునసబునుగాని పంచాయతీకోర్టు తాలూకు ఒక మెంబరునుగాని అసమర్థత, పనిలో అశ్రద్ధ, దుర్నడత, లేక తగుపాటి న్యాయమైన ఇతర కారణములవల్ల సస్పెండు చెయ్యవచ్చును. (కొన్నాళ్ళవరకు పనిలోనుండి నిలిపి వుంచవచ్చును) లేక తోసివేయవచ్చును. మరిన్ని గ్రామకోర్టు జరిగించే న్యాయ విచారణ సంబంధమైన చర్యలవల్ల తెలియవచ్చే అట్టి కారణమునకుగాను డిస్ట్రిక్టు జడ్జి హుకుం జారీచేసేయెడల దానిపై కలెక్టరు ఆ గ్రామమునసబునుగాని మెంబరునుగాని సస్పెండు చెయ్యవలసినది, లేక తోసివేయవలసినది.

గ్రామమునసబును సస్పెండు చెయ్యడము లేకతోసివెయ్యడము

సస్పెండుచేయుటకయిన లేదా తీసివేయుటకయిన ప్రతివుత్తరువు మీద అవుత్తరువు డిస్ట్రిక్టు జడ్జివద్దనుండి హుకుంమీద కాకుండా కలెక్టరు వల్లనే చెయ్యబడ్డయెడల రెవిన్యూబోర్డువారికిగాని డిస్ట్రిక్టు జడ్జి యొక్క హుకుములమీద చెయ్యబడ్డయెడల హైకోర్టువారికిగాని మూడు మాసములలోగా అప్పీలు చేసుకోబడవచ్చును. అట్టి అన్ని అప్పీళ్ళమీద ఆయాసంగతికి తగ్గట్లు రెవిన్యూబోర్డువారయినను హైకోర్టువారైనను చేసే తీర్పు అఖరుదిగా వుండవలసినది.

వ్యాఖ్య.

గ్రామ మునసబులనుగాని, పంచాయతీకోర్టు మెంబర్లనుగాని సస్పెండు చేయుటకుగాని, తొలగించుటకుగాని జిల్లా కలెక్టరుకుమాత్రమే అధికారముకలదు. గ్రామమర

కోర్టు విచారించిన న్యాయవిచారణ చర్యలలో ఒక గ్రామమునసబుగాని, పంచాయతీ కోర్టు మెంబరుగాని యీ సెక్షన్‌లో చెప్పబడిన అక్రమములను జరిగించిన యెడల అందు విషయమై జిల్లాజడ్జి కలెక్టరుకు రిపోర్టు చేసినయెడల, వానిని కలెక్టరు తప్పక సస్పెండు చేయుటగాని, తొలగించుటగాని చేయవలెను.

ఈ సెక్షన్ ప్రకారము ఒక గ్రామ మునసబును లేదా పంచాయతీకోర్టు మెంబరును సస్పెండు చేయుటకు లేదా ఉద్యోగమునుండి తొలగించుటకు ముందు కలెక్టరు అతనిపై ఏల చర్యతీసుకొనగూడదో కారణము జూపుమని ముందుగా నోటీసు నిచ్చి ఆయన చెప్పు అంశములను విని ఆయన విచారించదలచిన సాక్ష్యమును విచారించిగాని చర్య తీసుకొనగాదు.

జిల్లాజడ్జి యీ సెక్షను ప్రకారము ఒక గ్రామమునసబుపైన గాని పంచాయితీ కోర్టు మెంబరుపైనగాని చర్యతీసుకొనమని కలెక్టరుకు వ్రాయకపూర్వము, సంబంధము గల గ్రామమునసబు లేదా పంచాయతీకోర్టు మెంబరుకు సమాధానము చెప్పుటకున్నూ సాక్ష్యము విచారించుటకున్నూ తగినంత అవకాశ మీయవలెను. ఈ సెక్షనుక్రింద తీసుకొనబడు చర్యలలో గ్రామమునసబు లేదా పంచాయితీ కోర్టు మెంబరు పార్టీగా యుండవలెను.

అట్టి విచారణజరిపి జిల్లాజడ్జి కలెక్టరుకు చర్యతీసుకొనమని వ్రాసినప్పుడు యీ సెక్షను ప్రకారము కలెక్టరు విధిగా అ గ్రామమునసబును లేదా మెంబరును ఆ యా పరిస్థితులనుబట్టి తన యిష్టానుసారము సస్పెండు చేయుటగాని లేదా తొలగించుట గాని చేయవచ్చును. కాని జిల్లా జడ్జి ఆర్డరును ప్రశ్నించుటకుఅధికారముయుండదు.

ఈ సెక్షనుక్రింద కలెక్టరు తనంటతతాను చర్యతీసుకొన్న రెవిన్యూబోర్డుకున్నూ జిల్లాజడ్జి కోరికపై తీసుకొన్న హైకోర్టుకున్నూ సదరు ఆర్డరుచే బాధించబడిన గ్రామ మునసబు లేక పంచాయతీకోర్టు మెంబరుకు అప్పీలుహక్కు యివ్వబడినది. అట్టి పరిస్థితులలో యీ సెక్షనుక్రింద జరుపబడు విచారణ ఒక కేసువలె న్యాయబద్ధముగా జరుపబడవలెను.

అట్టి అప్పీలులలో రెవిన్యూబోర్డువారుగాని హైకోర్టువారుగాని యిచ్చే తీర్పు ఆఖరు తీర్పుగా యుండును. ఈ సెక్షనులో రెవిన్యూబోర్డువారితీర్పు ఆఖరుతీర్పు అని యున్నప్పటికి అన్యాయము జరిగినప్పుడు రివెన్యూబోర్డు ఆర్డరును రద్దు చేయుటకు హైకోర్టువారికి అధికారము కలదని మద్రాస్ హైకోర్టువారు యీ దిగువ తీర్పులలో తీర్మానించిరి.

మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు సె 132 ప్రకారము పంచాయతీ కోర్టులుగా భావింపబడు పంచాయితీ మెంబర్లపైన చర్యతీసుకొనుటకు కలెక్టరుకు అధికారము యుండదు. సదరు ఆక్టు సె 132 (4) (b) ప్రకారము ఇనస్పెక్టరు చర్య తీసుకొనవలెను.

## తీర్పు

1931 మ. వీ. నో. 798 = ఆ. ఇ. రి. 1932 మద్రాస్ 33 = 61 మ. లా. జ. 479 = 34 లా. వీ. 448 = ఇ. లా. రి. 55 మద్రాస్ 137.

జడ్జీలు:— అనంతకృష్ణఅయ్యర్, సుందరంచెట్టిగార్లు.

మద్దూరి మునుస్వామిచెట్టి — పిటీషనరు.

రెవిన్యూబోర్డు వగైరా — రెస్పాండెంట్లు.

ఒక పంచాయతీకోర్టు మెంబరును తొలగించవలసినదని వచ్చిన ఒక రిపోర్టును కలెక్టరు విచారణనిమిత్తము తహశ్శీలుదారునకు పంపి ఆయన విచారణచేసి పంపిన రిపోర్టుపైన సదరు పంచాయితీకోర్టు మెంబరును కలెక్టరుగారు తొలగించిరి. ఆ మెంబరు సదరు ఆర్డరుపైన రెవిన్యూబోర్డుకు అప్పీలుచేయగా ఆ అప్పీలును రెవిన్యూబోర్డు వారు పరిహరించిరి. అందుపైన ఆ మెంబరు కలెక్టరు, రెవిన్యూబోర్డువారు యిచ్చిన ఆర్డర్లను రద్దుచేయవలసినదనికోరుచూ హైకోర్టులో పిటీషనుదాఖలుచేయగా రివెన్యూ బోర్డు తరఫున మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 8 క్రింద రివెన్యూబోర్డు తీర్పు ఆఖరు తీర్పుగా యుండవలసినదని యున్నందున హైకోర్టువారికి ఆ పిటీషను విచారించుటకు గాని, రెవిన్యూబోర్డు ఆర్డరును రద్దుపరచుటకుగాని యెట్టి అధికారము లేదని వాదన చేయగా హైకోర్టువారు మ॥ గ్రా॥ కో॥ ఆక్టు సె 8 లో రివెన్యూబోర్డు తీర్పు ఆఖరు తీర్పు అని యున్నప్పటికిన్నీ, పార్టీలకు మిక్కిలి అన్యాయము జరిగినప్పుడు హైకోర్టు వారికి రివెన్యూబోర్డువారి ఆర్డరును రద్దుచేయుటకు అధికారము కలదని తీర్మానించిరి.

(2) తీర్పు 1941 (2) మ.లా.జ 428=1941 మ.వీ.నో 1020= ఆ.ఇ.రి. 1941 మద్రాస్ 863=54 లా. వీ. 271 = 197 ఇం. కే. 432

## మద్రాస్ హైకోర్టు

న్యాయమూర్తులు వెంకటరమణారావు, హార్విల్ గారలు

వి. రంగారావు — అప్పెలెంటు

తిరుచునాపల్లి కలెక్టరు — రెస్పాండెంటు

తా 3-11-1937 తేదీన బిఖుందర్ కోయల్ గ్రామ కోర్టునుండి ఒక దావాను మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరు నిమిత్తము తిరుచునాపల్లి స్మాలుకాజు జడ్జి కోర్టులో ప్రతివాదివల్ల పిటీషను పెట్టబడినది. ట్రాన్స్ఫరు పిటీషను పర్యవసానమువరకు గ్రామ కోర్టువారు దావాను విచారించవలెనని స్టే ఆర్డరును (ఆపుదల ఆర్డరు) కోర్టు యిచ్చెను. ఆ ఆర్డరు గ్రామమునసబునకు తా 5-11-37 తేదీన అందెను. కాని గ్రామమునసబు ఆ ఆర్డరును ఉల్లంఘించి వాదికి డిక్రీ యిచ్చెను. అటుతరువాత ప్రతివాది పిటీషనుపై ఆ డిక్రీ రద్దుచేయబడినది. స్మాలుకాజుకోర్టుజడ్జి గ్రామమునసబు స్టే ఆర్డరునుల్లంఘించుట

దావాను తీర్మానించుట దుర్నడతయని అతనిపై చర్యతీసుకొనవని గ్రామకోర్టుల ఆక్టు సె 74 ప్రకారము తిరుచునాపల్లి జిల్లాజడ్జికి రిపోర్టు చేసెను.

ని 4-4-1938 తేదీ జిల్లాజడ్జి గ్రామమునసబును శిక్షించమని జిల్లా కలెక్టరుకు గ్రామకోర్టుల ఆక్టు సె 8 ప్రకారము ఒక ఉత్తరమును వ్రాసెను. అందుపైన జిల్లా కలెక్టరు గ్రామమునసబుకు దుర్నడతకు యేల ఉద్యోగములోనుండి తగ్గించకూడదో కారణము తెలుపమని నోటీసుచేసెను గ్రామమునసబు స్మాలుకాజుజడ్జి తీర్మానము సరికాదని వాదనచేయబూనెను. కాని జిల్లా కలెక్టరు స్మాలుకాజుజడ్జి తీర్మానమును తాను ప్రశ్నించుటకు వీలులేదని జిల్లాజడ్జి తనకు వ్రాసినప్పుడు తాను తగినశిక్ష నొసగుటయే తన విధియని తలచి గ్రామ మునసబును ఉద్యోగమునుండి తొలగించుచూ ఆర్డరు చేసెను.

ఆ ఆర్డరునుండి గ్రామమునసబు సె 8 ప్రకారము హైకోర్టుకుఅప్పీలుచేయగా హైకోర్టువారు యీ క్రింది విధమున తీర్మానించిరి.

## తీర్పు

సె 8 లోని భాషనుబట్టి చూచిన కలెక్టరు అభిప్రాయము సరియేయని తోచుచున్నది. కాని యీ కేసులో జిల్లాజడ్జి ఆర్డరు మాత్రము సరిగాలేదు. జిల్లాజడ్జికి స్మాలుకాజు జడ్జి సె 74 ప్రకారము రిపోర్టు చేసినపుడు జిల్లాజడ్జి అతనిపై చర్యతీసుకొనకుండుటకు తగిన కారణమును జూపుటకు నోటీసునిచ్చి అతడుచెప్పు సంగతులనువిని అతడు విచారించదలచిన సాక్ష్యమును విచారించి ఆర్డరు చేయవలెను. సె 8 లో గ్రామ మునసబుకు జిల్లాకలెక్టరు ఆర్డరునుండి అప్పీలుచేయు హక్కుయున్నది. దీనిని బట్టి గ్రామ మునసబుయొక్క దుర్నడతనుగురించి కోర్టువలె విచారించవలెను. ఆ చర్యలలో గ్రామ మునసబు పార్టీగా యుండవలెను.

కాని ఈ కేసులో స్మాలుకాజు జడ్జివద్దగాని, జిల్లాజడ్జి వద్దగాని, గ్రామ మునసబు పార్టీగా లేడు.

అందువల్ల జిల్లాకలెక్టరు ఆర్డరును రద్దుపరచి అప్పెలెంటుకు ఏల చర్యతీసుకొనగూడదో నోటీసునిచ్చి అతడు విచారించగోరు సాక్ష్యమును విచారించి తీర్మానించమని జిల్లాజడ్జికి పంపడమైనది.

పంచాయితీ కోర్టుల నిర్మాణము

9. (1) ఏదేని గ్రామమునకు గాని, గ్రామముల సమూహమునకుగాని, గ్రామభాగమునకు గాని, ఇందునిటు తెరువాత విధింపబడియున్న విధముగా ఒక పంచాయతీ కోర్టును, రాజ్య గవర్నమెంటువారు డిస్ట్రిక్టు గెజెటులో ప్రకటింపబడు ఉత్తరువు మూలకముగా, ఏర్పాటు చేయవచ్చును. అందు మీదట 7 వ సెక్షను ననుస

రించి నియమించబడు గ్రామమునసబు యొక్క కోర్టు యేదిగాని అట్టి ప్రదేశములో నే భాగమందయినను ఈ ఆక్టు ననుసరించి విచారణాధికారమును చెలాయించగూడదు.

ఈ ఆక్టు ప్రకారము ఒక గ్రామములో పంచాయితీకోర్టు స్థాపించబడిన తరువాత ఆ గ్రామమునసబునకు ఈఆక్టుప్రకారము కేసులవిచారించుటకు అధికారముండదు.

(2) అట్లు స్థాపింపబడిన ప్రతి కోర్టునకును మెంబర్ల సంఖ్యను కలెక్టరు నిర్ణయించవలెను. కాని అట్టి సంఖ్య అయిదుకంటె తక్కువ గాని పండ్రెండుకంటె ఎక్కువగాని అయియుండగూడదు.

(3) రాజ్య గవర్నమెంటువారిచే చేయబడునట్టి విధులకు లోబడి, పంచాయతీకోర్టు మెంబర్లు ఎలక్షను మూలకముగా నియమింపబడవలెను.

3. (ఎ) 2, 3 సబ్ సెక్షనులలో ఏమి చెప్పబడియున్నను దానితో నిమిత్తము లేకుండా, కలెక్టరు తన యిష్టానుసారముగా ఒక పంచాయతీకోర్టు స్థాపింపబడిన విస్తీర్ణములోని ఆ కోర్టులో అదివరకే ప్రాతినిధ్య మివ్వబడని యే ఒకటి లేక రెండు అల్ప సంఖ్యాక జాతులలో నుండియైన (అనగా మహామ్మదీయులు, ఇండియన్ క్రిస్టియన్లు, నిమ్న లేక వెనుకబడిన తరగతులు) పేర్కొనుట మూలముగా ఇద్దరి కంటె యెక్కువ గాకుండా పంచాయతీ కోర్టుకు సభ్యులను నియమించవచ్చును. అట్లు నియమింపబడిన సభ్యుడుగాని సభ్యులుగాని సె. 9 (2) సబ్ క్లాజు ప్రకారము నిర్ణయించబడిన సభ్యుల సంఖ్యాగాక అధికముగా యుండవలెను.

## వ్యాఖ్య.

(1) చాలా పంచాయతీ కోర్టులలో అల్పసంఖ్యాకజాతులకు ఎన్నికల ద్వారా ప్రాతినిధ్యము దొరకుట దుర్లభముగా యున్నందున అట్టివారికి ప్రాతినిధ్యము యివ్వగలందులకు 3 A సబ్ సెక్షను, 1935 సం॥రం 15 మదరాసు గ్రామకోర్టుల ఆక్టు సవరణ ఆక్టువల్ల 9 సెక్షన్‌లో చేర్చబడినది.

(2) ఎలక్షను విధులకు 2వ భాగములోని 4 నుండి 22 (ఎ) రూలువ్వను చూడవలెను.

మెంబర్ల ఉద్యోగ కాలము.

(4) రాజ్యగవర్నమెంటువారిచే చేయబడునట్టి నియమములకు లోబడి ఒక పంచాయతీ కోర్టులోని మెంబరు మూడు సంవత్సరముల కాలము వరకు ఉద్యోగమును వహించి యుండవలెను.

(5) (a "ఒక పంచాయతీకోర్టు సదరు విషయములో నిర్ణయింపబడిన విధుల ప్రకారము దాని సభ్యులలో నొకరిని దాని ప్రెసిడెంటుగాను, యింకొక సభ్యుని దాని వైస్ ప్రెసిడెంటుగాను ఎన్నుకొనవలెను.

b) ప్రెసిడెంటు వ్రాతమూలకమైన ఉత్తరువుద్వారా తన పనులలో వేటినైన వైస్ ప్రెసిడెంటుకు అప్పగించవచ్చును. అయితే తాను అప్పగించకూడదని పంచాయతీకోర్టు స్పష్టముగా ఆజ్ఞాపించు ఏపనులనైన ఆయన అప్పగించకూడదు.

(c) ప్రెసిడెంటు కోర్టుయొక్క విచారణాధికార ప్రదేశమునుండి గైరు హాజరగునెడల లేదా అశక్తుడుగా చేయబడిన యెడల ఆయన పనులు వైస్ ప్రెసిడెంటుకు సంక్రమించవలెను.

(d) ప్రెసిడెంటుయొక్క ఉద్యోగము ఖాళీగా నున్నయెడల ఒక క్రొత్త ప్రెసిడెంటు ఉద్యోగములో ప్రవేశించునంతవరకు వైస్ ప్రెసిడెంటు ప్రెసిడెంటుయొక్క పనులను చెలాయించవలెను.

(e) కోర్టుయొక్క ప్రతి సమావేశములోను ప్రెసిడెంటును ఆయన గైరుహాజరైనప్పుడు వైస్ ప్రెసిడెంటు ఒకరు వున్నయెడల ఆయనయును అగ్రాసనాధిపత్యము వహించవలెను. వైస్ ప్రెసిడెంటు ఎవరును లేని యెడల లేదా ప్రెసిడెంటును వైస్ ప్రెసిడెంటుకుకూడా గైరు హాజరగునప్పుడు హాజరైనట్టియు కోర్టుగా యేర్పడినట్టియు సభ్యులు సదరు సమావేశముయొక్క కార్యమునిమిత్తము వారిలో నొకరిని ప్రెసిడెంటుగా నెన్నుకొనవలెను.

కోరము.

(6) పంచాయతీ కోర్టులో ముగ్గురు మెంబర్లు కోరము (సభ జరుపుటకు కనీసము ఉండవలసిన సంఖ్య) గా నేర్పడవలెను. మరియు హాజరయియుండు వారిలో అధిక సంఖ్యాకుల తీర్మానము కోర్టువారితీర్పు అయియుండును. కాని వోట్లు సమాన సంఖ్యగా నుండు సందర్భములో ప్రెసిడెంటుకు తీర్మానము వోటు ఉండవలెను.

తీర్మానపు వోటు అనగా ప్రెసిడెంటుకు రెండవ వోటు.

పంచాయతీ కోర్టులను తీసి వేయుటకు లోకల్ గవర్నమెంటువారికి గల యధికారము.

(7) రాజ్య గవర్నమెంటువారిచే డిస్ట్రిక్టు గెజెటులో ప్రకటింపబడు ఉత్తరువు ద్వారా ఏ పంచాయతీ కోర్టునైనను తీసి వేయవచ్చును.

## వ్యాఖ్య.

ది 1-4-1951 తేదీనుండి మదరాసు గ్రామపంచాయతీల ఆక్టు (1950 సం॥రపు 10 వ ఆక్టు అమలులోనికి వచ్చినది. సదరు ఆక్టు సె 132 వల్ల ఆ ఆక్టు అమలులోనికి వచ్చునప్పటికి పనిచేయుచున్న పంచాయితీలన్నియు పంచాయితీ కోర్టులుగా యెంచ బడును. ఆ సె 132 యీ దిగువ యివ్వబడినది.

## మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టును సవరణ చేయుట గ్రామ పంచాయతీలు, గ్రామ పంచాయతీ కోర్టులుగా మార్చుటకు నిబంధనలు.

మద్రాస్ గ్రామ కోర్టుల ఆక్టును సవరణ చేయుట.

సె 132 (ఇందు నిట్టు తర్వాత ఈ సెక్షనులో సదరు ఆక్టు అని చెప్పబడు) 1888 సం॥రపు మద్రాస్ గ్రామ కోర్టుల ఆక్టులో యేదియున్నను, దానితో నిమిత్తము లేకుండ

(1) ఏ ప్రదేశమునకైనను ఈ ఆక్టుక్రింద నిర్మింపబడిన లేక నిర్మింపబడినట్లు భావింపబడిన ప్రతి పంచాయతీ సదరు ఆక్టుయొక్క 9 (1) సెక్షన్ క్రింద ఆప్రదేశ మునకైన పంచాయతీ కోర్టుగా భావింపబడవలెను. అట్టి పంచాయతీయొక్క సభ్యులు ప్రెసిడెంటు మరియు వైస ప్రెసిడెంటుతో సహా. అట్టి పంచాయతీ కోర్టుయొక్క ఉద్యోగరీత్యా మెంబర్లుగాభావింపబడవలెను. పైన చెప్పిన ప్రెసిడెంటు, వైసు

ప్రెసిడెంటు ఆ పంచాయతీకోర్టుయొక్క క్రమముగా ఉద్యోగకర్తా ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటుగా కూడ భావింపబడవలెను.

(2) ఒక పంచాయతీ ఈ ఆక్టుయొక్క 48 (1) సెక్షన్ క్రింద అంత్యము కావింపబడిన లేక రద్దుచేయబడిన విషయములో, పైన చెప్పిన పంచాయతీ కోర్టులో సదరు పంచాయితీ తిరిగి నిర్మింప బడునంతవరకు—

(a) ఆయా సందర్భమునకు తగినట్లు పంచాయితీయొక్క ప్రెసిడెంటు లేక ఈ ఆక్టు యొక్క సె 48 (5) క్రింద నియమింపబడిన మనిషి ఉండవలెను.

(b) పంచాయతీ మెంబర్లుగా ఎన్నుకొనబడుటకు అర్హతగల మనుష్యులనుండి ఇన్‌స్పెక్టరు నియమించిన యితర ముగ్గురు మెంబర్లు యుండవలెను.

(3) ఈఆక్టుక్రింద నిర్మింపబడినట్లు భావింపబడిన ఒకపంచాయితీయొక్క విచారణాధికారములోని ఏ విస్తీర్ణమునందైనను ఈఆక్టు ప్రారంభమునకుపూర్వము సదరుఆక్టు క్రింద స్థాపించబడిన ఏదైనగ్రామ లేక పంచాయతీ కోర్టు లేక కోర్టులు ఏవైనయున్న యెడల, దాని విచారణాధికారము అంతము కావలెను. మరియు ఆ పంచాయతీ సదరు ఆక్టుయొక్క 9 A మరియు 9 B సెక్షనుల అర్థములోను, దాని కార్యముల నిమిత్తమును, అట్టి కోర్టు లేక కోర్టులకు బదులుగా స్థాపించబడిన ఒక పంచాయతీ కోర్టుగా భావింపబడవలెను.

(4) అట్టి పంచాయితీయొక్కయైన విచారణాధికారములోనుండు ప్రదేశములో—

(a) సదరు ఆక్టుయొక్క 6 నుండి 8, 9 (2) (3) (4) (5) (a) మరియు (7) సెక్షనులయొక్క నిబంధనలు వర్తించకూడదు.

(b) ఇన్‌స్పెక్టరు ఏ పంచాయతీ కోర్టుయొక్కయైన ప్రసిడెంటు, వైస్ ప్రెసిడెంటు లేక మెంబర్లను వారు (1) వ క్లాజు (2) వ క్లాజు క్రింద ఉద్యోగము కలిగి యుండినప్పటికిని అసమర్థత, విధిని ఉపేక్షించుట, దుర్నడత, లేక ఇతర న్యాయమైనట్టియు చాలినట్టియు కారణము నిమిత్తము ఉద్యోగమునుండి తొలగించవచ్చును.

(c) సదరు ఆక్టుయొక్క సె 9(5) (b) (c) (d) మరియు (e) సెక్షనుయొక్క నిబంధనలు (2)వ క్లాజులో చెప్పబడిన సందర్భములో వర్తించకూడదు. అట్టిసందర్భములో ఆపంచాయతీయొక్క ప్రెసిడెంటు దాని సమావేశములకు అధ్యక్షత వహించవలెను. ఆయన ఏసమావేశమునకైనను హాజరుకానిపక్షమున హాజరుగానుండు సభ్యులు ఆ సమావేశముయొక్క కార్యముల నిమిత్తము తమలోనుండి ఒకరిని ప్రెసిడెంటుగా ఎన్నుకోవలెను.

(d) సదరు ఆక్టుయొక్క 13 సెక్షనుయొక్క నిబంధనలు "ఏబది రూపాయల మొత్తము" అను మాటలకు బదులుగా "వందరూపాయల మొత్తము" అనుమాటలు ఉంచబడిన సెట్లో అట్లే అర్థము చేసుకోవలెను.

(5) ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, ఈ సెక్షన్ క్రింద స్థాపించబడిన ఏ పంచాయతీ కోర్టుకైన, సదరు ఆక్టులో నిబంధింపబడని ఏ సివిల్ లేక క్రిమినల్ విచారణాధికారములైన ఇయ్యవచ్చును.

పై సె 132 ప్రకారము పంచాయతీలు పంచాయతీ కోర్టులుగా మారినప్పుడు సదరు పంచాయతీ విస్తీర్ణమందు గ్రామపంచాయతీల ఆక్టు ప్రారంభమునకు పూర్వము గ్రామకోర్టుల ఆక్టు క్రింద స్థాపించబడిన గ్రామ లేక పంచాయతీకోర్టు లేక కోర్టులు ఏవైనయున్నయెడల వాటివిచారణాధికారము అంతమగును. మరియు పంచాయతీ యే గ్రామకోర్టుల ఆక్టు సె 9 A, 9 Bల ప్రకారం అవివరములోయున్న కోర్టు లేక కోర్టులుకు బదులుగా స్థాపించబడిన ఒక పంచాయతీ కోర్టుగా భావించబడును.

అట్టి కోర్టులకు గ్రామకోర్టుల ఆక్టు సె 6 మొదలు 8వరకు సె 9 సబ్ సెక్షనులు (2), (3), (4), (5(a)), 7, 9 (5) (b) (c) (d) (e) ల నిబంధనలు వర్తించవు.

మరిన్ని పంచాయితీ గ్రామ పంచాయతీల ఆక్టు సె 48 (1) ప్రకారము అంత్యము కావింపబడిన లేక రద్దుచేయబడిన విషయములోగూడ యీ సె (5)(b)(c)(d) (e) సబ్ క్లాజు నిబంధనలు వర్తించవు.

మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు సె 48 (1) లో యిటులున్నది.

"సె 48 (1) గవర్నమెంటువారియొక్క అభిప్రాయములో ఒక పంచాయితీ చట్టముఖళల విధింపబడిన పనులు చేయుటకు అర్హత కలిగి యుండని యెడల లేదా చేయుటలో పదేపదే తప్పిపోవుచుండు నెడల లేదా దానిఅధికారములను అతిక్రమించు చున్నయెడల, దుర్వినియోగ పరుచుచున్నయెడల, వారు ప్రకటన ద్వారా—

(a) నిర్ణయింపబడిన ఒక తేదీనుండి పంచాయతీ తొలగింపబడి, వెంటనే లేదా నిర్ణయింపబడిన మరియొక తేదీనుండి అది పునర్నిర్మాణము చేయబడవలెనని ఆజ్ఞాపించవచ్చును. లేదా—

(b) నిర్ణయింపబడిన ఒక తేదీనుండి ఒక సంవత్సరమునకు మించని ఒక కాల పరిమితికి సదరు పంచాయతీని రద్దు చేయవచ్చును."

పై సె 48 (1) క్రింద పంచాయతీ అంతము గావింపబడిన సందర్భములో సదరు పంచాయతీ తిరిగి నిర్మింపబడువరకు అటువంటి సందర్భములకు తగినట్లు.—

(a) పంచాయతీయొక్క ప్రెసిడెంటు లేక సదరు ఆక్టు సె. 48 (5) క్రింద నియమింపబడిన మనిషి ప్రెసిడెంటుగాను,—

(b) మరియు పంచాయతీ మెంబర్లుగా ఎన్నుకొనబడుటకు అర్హత గల మనుష్యుల నుండి ఇనస్పెక్టరు నియమించిన యితర ముగ్గురు మెంబర్లు మొత్తము నలుగురు మెంబర్లు పంచాయతీ కోర్టుగా యుందురు.

మ॥ గ్రా॥ పంచాయతీల ఆక్టు సె. 48 (5) లో యిటులున్నది.

"సె. 48 (5) ఆయా సంగతికి తగినట్లు ఒక పంచాయతీ తీసివేయబడుటకును, పునర్నిర్మాణము చేయబడుటకును మధ్య వ్యవధి, ఏదైన ఉన్నయెడల ఆకాలములో లేదా అది రద్దుచేయబడియుండు కాలములో ప్రెసిడెంటు, గవర్నమెంటువారు ఆ విషయముగా నిర్ణయించగల విధముగా సాధ్యమైనంతవరకు, అట్టి మేరకును పంచాయతీ అధికారములను చెలాయించవలెను. పంచాయతీ పరిసమాప్తియగు లేదా రద్దు అగు తేదీన ప్రెసిడెంటు ఉద్యోగము ఖాళీగావున్న సందర్భములో లేక పంచాయతీని పునర్నిర్మాణము చేయుటకు పూర్వము ఖాళీ యైన సందర్భములలో, పంచాయతీ యొక్కయు వారి ప్రెసిడెంటు యొక్కయు అధికారములను చెలాయించుటకును, విధులను నెరవేర్చుటకున్నూ, మరియు ప్రెసిడెంటు కార్యనిర్వాహక అధికారిగాకూడా నుండుపక్షమున పంచాయతీ పునర్నిర్మాణము చేయబడునంతవరకు అతని అధికారములను చెలాయించుటతో విధులను నెరవేర్చుటతో సహా ఇనస్పెక్టరు ఒక మనిషిని నియమించవచ్చును."

9. A ఏదైనా స్థానిక విస్తీర్ణములో సదరు విస్తీర్ణముపై విచారణాధికారముగల గ్రామకోర్టు లేదా కోర్టులకు బదులుగా 6వ శెక్షనుయొక్క లేదా 9 వ సెక్షను 1వ సబు సెక్షనుయొక్క నిబంధనలలో దేని ననుసరించియైన ఒక గ్రామకోర్టు యేర్పాటు చేయబడిన సందర్భములో—

సివిల్ దావాలను చర్యలనుపరివర్తన చేయుట

(a) అట్టి కోర్టులో లేదా కోర్టులలో పరిష్కరింపబడకుండ నిల్వయున్న యావత్తు దావాలు లేదా సివిల్ చర్యలు అట్టి విస్తీర్ణము నిమిత్తము క్రొత్తగా ఏర్పాటుచేయబడిన కోర్టులో దాఖలు చేయబడినట్లుగా లేదా తీసికొనబడినట్లుగా తలంపబడవలెను.

(b) అమలులో పెట్టబబడని లేదా అమలులో పెట్టబడుచున్న అట్టి కోర్టువలన లేదా కోర్టులవలన జారీచేయబడిన యావత్తుడిక్రీలును అట్లు యేర్పాటు చేయబడిన కోర్టువలన జారీ చేయబడినట్లు తలంపబడవలెను.

9. B. 9 A. సెక్షనుయొక్క నిబంధనలు. పంచాయతీకోర్టు లేదా కోర్టులకు బదులుగా ఒక పంచాయతీకోర్టు

క్రిమినలు కేసులయొక్కయు చర్యల యొక్కయు పరివర్తనము

కొత్తగాఏర్పాటు చేయబడినదో ఆ పంచాయతీకోర్టు లేదాకోర్టులయెదుటతీర్పుకాకుండ నిల్వయున్న క్రిమినల్ కేసులకు లేదా చర్యలకు ఎంతవఱకు వర్తించవచ్చునో అంతవఱకు వర్తించవలెను."

వ్యాజ్యములరిజిష్టరున్నూ చర్యల రికార్డున్నూ వుంచడమందు గ్రామకరణము మునసబుకు సహాయము చేయవలసినది.

10. గ్రామమునసబు గ్రామకోర్టులో వేసిన వ్యాజ్యములకు రిజిష్టరువుంచి కోర్టుచర్యలను వ్రాయవలసినది. ఉత్తరువు చెయ్యబడివున్న పక్షమునకు, అట్టి రిజిష్టరు వుంచడములోనున్ను కోర్టుచర్యలు వ్రాయడములోనున్ను సహాయము చెయ్యడము గ్రామకరణముయొక్క పనిగా వుండవలసినది.

## వ్యాఖ్య.

యీ సెక్షనులోని "గ్రామమునసబు" అను మాటలో పంచయతీకోర్టు ప్రెసిడెంటుగూడ చేరును, సె 5 లో "గ్రామమునసబు" పదము నిర్వచనము చూడవలెను

గ్రామనౌకరు సమన్లు వగైరాలను అందచెయ్యవలసినది.

11. ఈ ఆక్టు ప్రకారము జారీచెయ్యబడు దరోబస్తు సమన్లు—నోటీసులు—హుకుములు—వీటిని అందచెయ్యడమున్నూ యీ ఆక్టుకు అనుసరించి జప్తుచెయ్యబడ్డ చరాస్తిని పట్టుకొని, విక్రయించి అప్పగింత చెయ్యడములో గ్రామమునసబుయొక్క ఉత్తరువుల ప్రకారము ప్రవర్తించడమున్ను సమాచారములు పట్టించుకొని పోవడమందు వాడుకగా పనిలో వుంచబడ్డ గ్రామనౌకరు యొక్క పనిగా వుండవలసినది.

## వ్యాఖ్య.

ఈ ఆక్టుక్రింద జారీకాబడే అన్నిబాపతుల సమనులు, నోటీసులు, హుకుములు అనగా ఆర్డర్లు, వీటినిఅమలు జరుపుట, ఈ ఆక్టుప్రకారం ఆస్తిని జప్తుచేయుటలోను, విక్రయించుటలోను, ఆస్తినిస్వాధీనపరచుటలోను గ్రామమునసబు ఉత్తరువుల ప్రకారము నడచుట గ్రామనౌకరు విధి అయియున్నది.

12. వెనుకనా 10,11 సెక్షనులవల్ల నిర్ణయించబడ్డ పనులు నెరవేర్చుటకుగాను గ్రామకరణము, లేక 11 వ సెక్షనులో చెప్పియుండే గ్రామ నౌకరును జమలుగాగాని అతనితోటిగాని యే మనిషి నయినా నియమించడమునకు, రాజ్యగవర్నమెంటు పై విచారణకు లోబడి, డిస్ట్రిక్టు కలెక్టరుకు అధికారము వుండవలసినది.

గ్రామ కరణమునకున్నూ గ్రామనౌకరుకున్నూ బదులుగాగాని వార్లతోటి గాని ఏ మనిషినైనా కలెక్టరు నియమించవచ్చును.

వ్యాఖ్య.

ఈ సెక్షను ప్రకారము నియమింపబడే సిబ్బందిమీద శిక్షవిధించుటకు యీ క్రింది విధుల ప్రకారము రివిన్యూడివిజనల్ ఆఫీసరుకు అధికార మియ్యబడినది.

పంచాయతీ కోర్టులయొక్క సిబ్బందిమీద రెవిన్యూడివిజనల్ ఆఫీసర్లు చెలాయించవలసిన శిక్షణ సంబంధమైన సలహాలు.

ఫోర్టు సెంటుజార్జి 1934వ సం॥ జూన్ 19వ తేదీ జి.ఓ. నె 1825 రు లా (జనరల్) డిపార్టుమెంటు.

పంచాయతీ కోర్టులయొక్క సిబ్బందిమీద రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు చెలాయించవలసిన శిక్షణ సంబంధమైన పై విచారణనుగురించి యీ క్రింది సలహాలు జారీ చేయబడుచున్నవి. ఈ విధులు గ్రామముయొక్క క్రమమైన రెవిన్యూ సిబ్బందులకు చెందినట్టిన్నీ, 1888వ సం॥పు మదరాసు గ్రామకోర్టుల ఆక్టుయొక్క 10, 11 వ సెక్షనులలో నిర్ణయింపబడిన పనులను చేయునట్టిన్నీ, గ్రామవుద్యోగస్థులకును, నౌకర్లకును వర్తించవు. ఎందుకనగా అట్టి మనుష్యుల విషయములో శిక్షణ సంబంధమైన పై విచారణ ఆయా సంగతికి తగినట్లు 1894 వ సం॥పు 2వ మదరాసు ఆక్టులో, లేదా 1895 వ సం॥పు 3వ మదరాసు ఆక్టులో, లేదా నె 156 రు బోర్డువారి స్టాండింగు ఆర్డరులో యిదివరకే ఏర్పాటు చేయబడియున్నది.

విధులు.

1. ఏ రెవిన్యూడివిజనల్ ఆఫీసరుయొక్క విచారణాధికార ప్రదేశములో ఒక పంచాయతీకోర్టు వుండునో ఆ రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు 1888వ సం॥పు మదరాసు గ్రామకోర్టుల ఆక్టుయొక్క 12వ సెక్షను ననుసరించి అట్టి కోర్టులో పనికి నియమింపబడిన యే అసిస్టంటు కరణమునకు లేదా ప్రాసెస్ సర్వరునకు (సమ్మనులు వగైరాలను అందజేయు మనిషి) తాత్కాలికముగా నిలుపుదల చేయుట, తొలగించుట, బరతరఫు చేయుటతోచేరి యెట్టి శిక్షయైనను విధింపవచ్చును.

2. ఏదైన శిక్షను విధించు యెట్టి ఉత్తరువుగాని, సంబంధముగల అసిస్టెంటు కరణమునకు లేదా ప్రాసెస్‌సర్వరుకు (ఒకనిష్కర్షమైన చార్జి లేక చార్జిలరూపముగా వ్రాయబడవలసిన) యేకారణమునుబట్టి చర్యతీసుకొనుట కుద్దేశింపబడినదో, ఆకారణమును వ్రాతమూలకముగా తెలిపి, తన్ను తాను సమర్థించుకొనుటకు అనతగిన అవకాశము యిచ్చిననేతప్ప, 1వ విధి ననుసరించి జారీచేయబడకూడదు. ఒక న్యాయమైన కాలము లోపుగా తన ప్రతివాదము గల ఒక వ్రాతమూలకమైన యాదాస్తును దాఖలుచేయునట్లును, స్వయముగా తన విషయమును తెలుపుకొనుటకు యిష్టపడుచున్నాడా అను దానిని తెలుపునట్లును అతడు కోరబడవలెను. అతడు అట్లుకోరినయెడల లేదా రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు అట్లు ఆజ్ఞాపించినయెడల ఒక వాగ్రూపమైన విచారణను నడుపవలెను. చర్యక్రమములో చాలినంత సాక్ష్యము వ్రాయబడి యుండవలెను. మరిన్ని దానిలో తీర్పులయొక్క స్టేటుమెంటున్నూ దానికిగల కారణములున్నూ వుండవలెను.

అయితే—

(ఏ) శిక్షతాలూకు ఉత్తరువు, సంబంధముగల అసిస్టెంటు కరణము లేదా ప్రాసెస్‌సర్వరు ఒక క్రిమినల్ కోర్టులో శిక్షింపబడునట్లు చేసిన విషయములమీద ఆధారపడి యుండునప్పుడు; లేదా—

(బి) సంబంధము గల అసిస్టెంటు కరణము లేదా ప్రాసెస్‌సర్వరు పరారి అయినప్పుడు, లేదా యితరకారణములనుబట్టి అతనితోయుత్తర ప్రత్యుత్తరములుజరుపుటకు సాధ్యము కానప్పుడు, ఈ విధి వర్తించకూడదు.

3. తాత్కాలికముగా పనిలోనుండి నిలిపియుంచుట, తొలిగించుట, లేదా బరతరఫుచేయుట కానట్టి యే యితర శిక్షనైనవిధించు 1వ విధి ననుసరించిన రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్క ఉత్తరువు ఆఖరుదిగా యుండవలెను.

4. (1) 1వ విధి ననుసరించి రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుచే జారీచేయబడిన పనిలోనుండి నిలిపియుంచు, తొలగించు, లేదా బరతరఫుచేయు ప్రతి యుత్తరువు మీదను, సదరు ఉత్తరువు తేదీనుండి 30 రోజులకు లోపుగా జిల్లాకలెక్టరుకు ఒక అప్పీలు వుండవలెను.

(2) అట్టి అప్పీలు ఏదియు దాఖలు చేసుకొనబడనప్పుడు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్క వుత్తరువున్నూ అట్టి యొక అప్పీలు దాఖలు చేసుకొనబడినప్పుడు దానిమీద జిల్లాకలెక్టరుయొక్క వుత్తరువును ఆఖరుదిగా నుండవలెను.

## 3 వ అధ్యాయము.

అధికార హద్దున్నూ, ముందు తీర్పుచెయ్యబడివున్న విషయమున్నూ కాల నిర్ణయమున్నూ.

గ్రామకోర్టులవారు వ్యాజ్యములు విచారణ చెయ్యడము.

13. ఈదిగువ కనుపరచి వుండేవి గ్రామకోర్టుల వారివల్ల విచారించబడ తగ్గ వ్యాజ్యములు (అవేవనగా) ఋణము లేక దావా లెక్కబాకీ మీద్దుగా నైనాసరే, మరియొక విధముగా నైనాసరే మొత్తము లేక విలువలో 50 రూపాయులకు మించనియెడల ఖరారుమీద బాకీగావున్న పైకమునకుగాని, చరాస్తికిగాని, అట్టి ఆ స్తియొక్క విలువకుగాని ఒకస్థానిక అధికార వర్గమునకు బాకీగాయుండు ఎట్టి పన్నునకు, రుసుమునకు లేదా ఇతర సొమ్మునకు గాని తేబడు దావాలు.

నిబంధన

అయితే యేదైనా అట్టి కోర్టులో

(1) పాలికాపుతనపు లెక్కలో బాకీ యింతమాత్రమనిఅందులో సంబంధపడ నవారుగాని వారి ఏజెంట్లుగాని తీర్చితేనే తప్ప లేనిపట్ల ఆ బాకీకీగాను;

(2) మరణశాసనము వ్రాయకుండా చనిపోయిన సంగతిలో భాగమునకు లేక భాగములో కొంతమట్టుకు, లేక మరణశాసన ప్రకారము యేర్పాటు అయిన ఆస్తికి, లేదా అంకుల భాగమునకు గాను;

(3) భూమికిగాను చెల్లించతగ్గ గుత్తమొత్తముప్రతివాది సంతకముచేసిన లిఖితమూలమైన ఖరారుమీద బాకీవుంటేనేతప్ప ఆగుత్త మొత్తమునకుగాను;

(4) గవర్నమెంటువారివల్ల లేక వారిమీద లేదా ఉద్యోగ ధర్మమందు సర్కారు ఉద్యోగస్థులవల్ల లేక వారిమీద;

(5) మైనర్లు, లేక చిత్తస్వాస్థ్యములేనివారివల్ల లేక వారిమీద వ్యాజ్యము తేబడకూడదు.

## వ్యాఖ్య.

“పాళీకాపుతనపు లెక్కలబాకీ” అనగా భాగస్వాముల మధ్యయుండే లెఖ్ఖాబాకీ అని అర్థము. సత్త అనగా శిస్తు లేక అద్దె లేక కట్టుబడి అని అర్థము. గ్రామకోర్టులలో

(1) రు 50 లకు మించని ఋణములకున్నూ (2) రు 50 ల ఖరీదుకు మించని చరాస్తిగాని అందుల కిమ్మతుకు గాని (3) రు 50 ల మొత్తమునకు మించని ఖరారు మీద బాకీలకుగాని ఒక స్థానిక అధికారివర్గమునకు బాకీగా యుండు ఎట్టి పన్నునకు రుసుమునకు లేదా ఇతర సొమ్మునకు గాని, దావాలు తేవచ్చును. సదరు ఋణములు లెఖ్ఖబాకీమీదగాని మరియొక విధముగాగాని యుండవచ్చును.

(2) వాదికి రావలసినబాకీ రు 50-0-0 ల పైగా యున్నప్పటికిన్ని రు 50-0-0 లు పై సొమ్మును వదలుకొని, రు 50-0-0 లకు మాత్రమే గ్రామకోర్టులో దావా దాఖలు చేయవచ్చును. సెక్షను 18 చూడవలెను.

(3) ఖరారునుబట్టి రావలసిన బాకీలు అనగా ప్రోనోట్లు, బాండ్లు, జట్టీ కంట్రాక్టులు, ఖాతా బాకీలు వగైరాలు. ఖరారు (యెగ్రిమెంటు) లిఖిత రూపకముగా గాని మాజువాణీగా గాని యుండవచ్చును. చేబదుళ్లు వగైరా మాజువాణీ ఖరారులను బట్టి రావలసిన బాకీలకు గ్రామ కోర్టులలో దావాలు తేవచ్చును. ఖాతా బాకీల విషయములో ప్రతివాది సంతకము ఖాతాపైన యుండితీరవలెననే నిబంధన లేదు. ఖాతా పుస్తకములో ప్రతివాది సంతకము లేకున్నను ఖాతానుబట్టి గ్రామకోర్టులలో దావాలు తేవచ్చును. భూమి శిస్తు లేదా యిండ్లు లేక స్థలముల అద్దె రాబట్టుకొనుటకు గ్రామకోర్టులలో దావా తెచ్చుటకు ఉభయ వాదులమధ్య వ్రాతమూలకమైన ఖత్తు లేదా అద్దె ఖరారు నామాలు యున్నగాని వీలులేదు. వ్రాతమూలకమైన ఖత్తులు, అద్దెఖరారునామాలు లేని దావాలు డిస్ట్రిక్టు మునసబు కోర్టులలో దాఖలు చేయవలెనేగాని గ్రామ కోర్టులలో దాఖలు చేయుటకు వీలులేదు.

(4) చరాస్తికి దావాలు. చరాస్తిని రాబట్టుకొనుటకు లేదా అట్టి ఆస్తి కిమ్మతును రాబట్టుకొనుటకు దావాలు గ్రామ కోర్టులలో తేబడవచ్చును. వాది ఒక నిర్దిష్టమైన చరాస్తి స్వాధీనమునకు దాఖలు చేయు దావాలో ప్రతివాది సదరు చరాస్తిని వాదికి స్వాధీన పరచని యెడల దాని కిమ్మతును ప్రతివాది వద్దనుండి యిప్పించమనే ప్రార్థన యుండవలెను. చరాస్తి చెరుపు చేసిన దాని కిమ్మతుకు గ్రామకోర్టులలో దావాలు తేవచ్చును. చరాస్తి అనుమాటలో నిలువుపైరు చేరునా చేరదా అను అంశముపై యిదివరలో హైకోర్టులో భిన్నాభిప్రాయములతో తీర్పులు యివ్వబడినవి.

1937 సం||లో గ్రామకోర్టుల ఆక్టును సవరణచేయుచూ చరాస్తి అను పదము నకు ప్రత్యేకముగా "చరాస్తి" అను పదములో పెరుగుచున్న పైరులును కోయబడనిభూమి యందలి పంటగూడ చేరునని నిర్వచన మీయబడినది. మరిన్ని జప్తు చేయబడిన పైరులను వగైరాలను జాగ్రత్త పెట్టుటకు నిబంధనలు చేయుచూ సె 53 A అను క్రొత్త సెక్షను చేర్చబడినది.

(5) ఖరారు భంగమువల్ల కలిగిన నష్టమునకు దావాలు గ్రామ కోర్టు లలో దాఖలు చేయుటకు వీలులేదు. అట్టి దావాలను విచారించుటకు గ్రామ కోర్టు లకు అధికారములేదు.

(6) స్థిరాస్తికి సంబంధించిన దావాలను గ్రామ కోర్టులు విచారించు టకు అధికారములేదు. ఒక స్థిరాస్తి తనఖా లేక జామీయున్న బాకీలకు అట్టి తనఖా లేదా జామీని వారు పూర్తిగా వదులుకొన్నగాని గ్రామకోర్టులలో దావాలు దాఖలు చేయరాదు. స్థిరాస్తి స్వాధీనమునకు గ్రామ కోర్టులలో దావాలు దాఖలు చేయుటకు వీలులేదు.

(7) స్థానిక అధికార వర్గమునకు రావలసిన పన్ను లేదా రుసుము, యితర బాకీలకు దావాలు. మునిసిపల్ కౌన్సిల్సు పంచాయతీ వగైరా యితర స్థానిక అధికార వర్గములకు రావలసిన క్రింది బాకీలను డిస్ట్రిక్టు మునసబు కోర్టులలో యెక్కువ ఖర్చుతో దావా వేయనగత్యము లేకుండా చేయుటకు 1940 సం||పు 18 వ మద్రాస్ గ్రామ కోర్టుల సవరణ ఆక్టువల్ల అట్టి దావాలు గ్రామ కోర్టులలో దాఖలు చేయబడవచ్చునని సె 13 సవరణ చేయబడినది.

1-4-1951 తేదీనుండి అమలులోకి వచ్చిన మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు నిబంధనల ప్రకారము పంచాయతీలన్నియు, యీ ఆక్టుక్రింద స్థాపించబడిన పంచాయతీ కోర్టులుగా యెంచబడును. అట్టి పంచాయతీలకు రావలశిన పన్నులు రుసుములు వగైరాలకు ఆ పంచాయతీ యెదుటనే దావాలు వేయుటకు వీలులేదు. ఏలనన దావాలో వాదిగా యుండు పంచాయతీయే దావాను విచారించవలసియుండును. కాని ప్రతివాది ఆ పంచాయతీ అధికార హద్దుల వెలుపల మరియొక గ్రామకోర్టు అధికార ప్రదేశములో వాసము చేయుచున్న లేదా వ్యాపారము చేయుచున్న లేదా లాభమునకు స్వయముగా పనిచేయుచున్న అట్టి గ్రామకోర్టులో దావా దాఖలు చేయుటకు అభ్యంతరము యుండదు.

కాని పైన చెప్పినమాదిరి దావాలైనప్పటికిన్నీ,

(1) భాగస్వాముల లెఖబాకీకి, సదరు భాగముస్వాములుగాని, వారి యేజెంట్లు గాని ఖుజావుపడి వెరశికట్టు కట్టుకొంటేనేతప్ప ఆ మొత్తములకున్నూ.

(2) మరణశాసనము వ్రాయకుండా చనిపోయిన సందర్భములో సంక్రమించిన ఆస్తికి లేక ఆ స్తిలో భాగమునకు లేదా మరణశాసనము ప్రకారము సంక్రమించిన ఆ స్తికి గాని, అందుల భాగమునకు గాని,

(3) ప్రతివాది సంతకముతోయున్న లిఖిత రూపకమైన ఖరారు లేనప్పుడు బాకీ వుండే భూమి శిస్తునకున్నూ (అనగా యిండ్లు లేక స్థలముల అద్దెకూడా చేరును.)

(4) గవర్న మెంటువారివల్ల లేక వారిమీద లేక ఉద్యోగధర్మములో సర్కారు ఉద్యోగస్థులవల్ల లేక వారిమీద,

(5) మైనర్లు లేక చిత్తస్వాస్థ్యము లేనివారివల్ల లేక వారిమీద గ్రామకోర్టులో దావాలు తెచ్చుటకు వీలులేదు.

గ్రామకోర్టులో ఒకదావా మేజరువల్ల మరియొక మేజరుపైన దాఖలుచేయబడిన తరువాత దావామధ్యలో కక్షిదారులు చనిపోయిన వారిస్థానే వారిమైనరు వారసులను పార్టీగా చేర్చరాదని నిషేధము లేదని 1942 (2) మ.లా.జ. 272 కేసులో మద్రాస్ హైకోర్టువారు తీర్మానించిరి. కాని గ్రామకోర్టుల ఆక్టులో అట్టి మైనర్లకు గార్డియన్లను నియమించుటకు అవసరమైన నిబంధనలేవిన్నీ లేవు. అందువల్ల గవర్న మెంటువారు ఆక్టులోను, విధులలోను అట్టి మైనర్లకు గార్డియన్లను నియమించుటకు తగిన నిబంధనలు చేర్చుట అవుసరము.

గవర్న మెంటు వారివవల్ల లేక వారిమీద, లేక ఉద్యోగ ధర్మములో గవర్న మెంటు ఉద్యోగస్థులవల్ల లేక వారిపైన దావాలను విచారించుటకు గ్రామకోర్టులకు అధికారములేదు. స్థానికసంస్థలకు రావలసిన పన్నులు రుసుములు వగైరాలు రాబట్టుకొనుటకు సె 13 సవరణ చేయబడుటవల్ల గ్రామకోర్టులలో దావాలు దాఖలు చేయవచ్చును. గవర్న మెంటు ఉద్యోగులవల్ల లేక వారిపైన గ్రామకోర్టులలో దాఖలు చేయకూడదని నిషేధించిన దావాలు వారి ఉద్యోగ విధుల నిర్వర్తించుటకు సంబంధించినవి మాత్రమే. కాని గవర్న మెంటు ఉద్యోగస్థులు వ్యక్తి పరముగా చేయు ఖరారు వగైరాలకు బాకీలకు సంబంధించిన దావాలో గ్రామకోర్టులలో దాఖలు చేయబడవచ్చును.

## పంచాయతీ కోర్టులుగా మారిన పంచాయతీల అదనపు అధికారములు.

1-4-1951 తేదీనుండి అమలులోనికి వచ్చిన మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు సె 132 ప్రకారము ఆ తేదీన పనిచేయుచున్న పంచాయతీ లన్నియు పంచాయతీ కోర్టులుగాకూడ పనిచేయును. (సె 132 యీ ఆక్టు 9 సెక్షను వ్యాఖ్యలో పూర్తిగా యివ్వబడినది.) అట్టి పంచాయతీకోర్టులు సె 13 లో చెప్పబడిన మాదిరి దావాలను

రు 100 ల విలువవరకుగలవానిని విచారించుటకు సదరు సె 132వల్ల అధికార మివ్వ బడినది.

అంతేగాకుండా ప్రభుత్వమువారు ప్రకటనద్వారా అట్టి పంచాయతీలకు గ్రామకోర్టుల ఆక్టులో నిబంధింపబడని ఏ సివిల్ క్రిమినల్ విచారణాధికారములను గూడ కలుగజేయుటకు అధికారము సె 132 (5) క్రింద నిబంధన చేయబడినది.

## గ్రామకోర్టుల ఆక్టు సె 13 సవరణచేయుచూ నూతన ఆక్టు.

ఈమధ్య దేశములో ఆస్తుల కిమ్మతులు ధరలు చాలా హెచ్చినందున సివిల్ కోర్టులు, గ్రామకోర్టులు విచారించు దావావిలువ హెచ్చుచేయుచూ యీదిగువ 1951 సం॥పు 16 నంబరు మదరాసు ఆక్టు జారీచేయబడినది.

## 1873 సం॥పు మదరాసు సివిల్ కోర్టుల ఆక్టును, 1888 వ సం॥పు మదరాసు గ్రామకోర్టుల ఆక్టును ఇంకను సవరించుటకైన ఆక్టు.

(1951 సం॥పు మదరాసు 16 నంబరు ఆక్టు)

ఇందు నిటుతరువాత అగపడు కార్యముల నిమిత్తము 1873 వ సం॥పు మదరాసు సివిల్ కోర్టుల ఆక్టును, 1888 వ సం॥పు మదరాసు గ్రామ కోర్టుల ఆక్టును, ఇంకను సవరించుట యుక్తముగా నున్నందున్న, ఇందుమూలమున ఈ క్రిందివిధముగా శాసించబడ మైనది:—

సంగ్రహ నామమును, ప్రారంభమును.

1. (1) ఈఆక్టును 1951వ సం॥పు మద్రాసు సివిల్, మరియు గ్రామ కోర్టుల (సవరణ) ఆక్టు అని చెప్పవచ్చును.

(2) రాజ్య ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా, అఫీషియల్ గెజెటులో, నియమించగల తేదీన అది అమలులోనికి రావలెను.

1873 వ సం॥పు 3 వ సెంట్రల్ ఆక్టుయొక్క సవరణ.

2. 1873 వ సం॥పు మదరాసు సివిల్ కోర్టుల ఆక్టులో—

(1) 12 వ సెక్షనులో, జిల్లా మునిసిఫులయొక్క విచారణాధి కారమునకు సంబంధించిన 2 వ పారగ్రాఫులో "మూడు వేల రూపాయలకు" అను మాటలకు బదులుగా "అయిదు వేల రూపాయలకు" అను మాటలను ఉంచవలెను.

(2) 28 వ సెక్షనులో జిల్లా మరియు సబార్డినేటు జడ్జీలయొక్క స్మాలుకాజు విచారణాధికారమునకు సంబంధించిన 2 వ పారగ్రాఫులో "వెయ్యి రూపాయలవరకు" అను మాటలకు బదులుగా "రెండు వేల రూపాయల వరకు" అనుమాటలనున్నూ, జిల్లా మునిసిఫులయొక్క స్మాలుకాజు విచారణాధికారమునకు సంబంధించిన 3వ పారగ్రాఫులోని "మూడువందల రూపాయలవరకు" అనుమాటలకు బదులుగా "అయిదు వందల రూపాయల వరకు" అను మాటలను ఉంచవలెను.

1889 వ సం॥పు 1 వ మదరాసు ఆక్టును మార్చుట.

3. (1) 1888 వ సం॥పు మదరాసు గ్రామ కోర్టుల ఆక్టులో, ఏది యున్నను దానితో నిమిత్తము లేకుండ రాజ్య ప్రభుత్వమువారు అఫీషియల్ గెజెటులో, ప్రకటనద్వారా, ప్రకటనలో నిర్దేశింపబడగల, గ్రామ కోర్టుల సందర్భములోను, అట్టి తేదీ లేక తేదుల నుండియు, ఆ సెక్షన్‌లో వచ్చు "ఏబది రూపాయల మొత్తమునకు" అను మాటలకు బదులుగా "నూరురూపాయల మొత్తమునకు" అను మాటలనుంచిన నెట్లో అట్లే ఆక్టుయొక్క 13 వ సెక్షను తాలూకు నిబంధనలు, అమలు కలిగి యుండవలెనని ఆజ్ఞాపించవచ్చును.

(2) (1) వ సబు సెక్షనులో నున్నదేదియు, 1950 వ సం॥పు మదరాసు గ్రామ పంచాయతీల ఆక్టుయొక్క 132 వ సెక్షనుయొక్క అమలును బాధించునట్లు భావింపబడకూడదు.

పై ఆక్టు సె 1 (2) ప్రకారము రాజ్య ప్రభుత్వమువారు అఫీషియల్ గెజెటులో నియమించగల తేదీన అమలు లోనికి రావలెను. పై నిబంధన ప్రకారము యివ్వబడిన అధికారములను చెలాయించుచూ ఆంధ్ర గవర్నరుగా సదరుఆక్టు ఆంధ

రాజ్యములో 20-5-1954 తేదీనుండి అమలులోనికి రావలెనని యీ క్రిందినోటిఫికేషను జారీ చేసిరి.

లా డిపార్టుమెంటు.

## (No. 230. G. O. Ms. No. 437 Law 28-4-54)

1951 సం॥పు మద్రాస్ సివిల్ మరియు గ్రామ కోర్టుల (సవరణ) ఆక్టు (16 ఆఫ్ 1951 సె 1 (2) క్రింద యివ్వబడిన అధికారములను చెలాయించుచూ ఆంధ్ర గవర్నరుగారు సదరు ఆక్టు 20-5-54 తేదీని అమలులోనికి వచ్చునట్లు యిందు మూలముగా నిర్ణయించినారు.

పైన ప్రకటింపబడిన నోటిఫికేషనువల్ల ఇదివరలో 1951 సంవత్సరములో జారీ చేయబడిన మద్రాస్ సివిల్ కోర్టుల ఆక్టును మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టును సవరించుటకు సంకల్పించబడిన పై ఆక్టు 20-5-1954 నుండి అమలులోనికి వచ్చినది.

1. ఈ ఆక్టు నిబంధనల ప్రకారము ది 20-5-1954 నుండి డిస్ట్రిక్టు మునసబులు రు 5000 లు వరకు విలువగల, జిల్లా జడ్జీలు. అసలు దావాలను 500 రుల విలువగల స్మాలుకాజు దావాలను సబ్‌జడ్జీలు రు 2000 ల వరకు విలువగల స్మాలుకాజు దావాలను విచారించుటకు అధికారమియ్యబడినవి.

2 ఇదివరలో మద్రాస్ గ్రామపంచాయతీల ఆక్టు అమలులోనికి వచ్చిన ది 1-4-1951 తేదీనుండి గ్రామ పంచాయతీలన్నియు, గ్రామ పంచాయతీ కోర్టులుగా మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు క్రింద సివిల్ క్రిమినల్ విచారణాధికారమును పొంది యున్నవి. అంతేగాకుండా అట్టి పంచాయతీలైన పంచాయతీకోర్టులకు రు 100 ల విలువగల దావాలను విచారించుటకు మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు సె 132 ప్రకారము 1-4 51 తేదీ నుండియే అధికారమివ్వబడినది

3. ఇప్పుడు పై మద్రాస్ సివిల్ కోర్టుల ఆక్టు మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సవరణ ఆక్టు అమలులో పెట్టుటవల్ల గవర్నమెంటువారు పంచాయతీలుగాని యితర పంచాయతీ కోర్టులకుగాని గ్రామ మునసబులకుగాని రు 100 ల వరకు విలువగల దావాలను విచారించుటకు గెజెటులో ప్రకటన ద్వారా అధికారమును గలుగజేయుటకు అవకాశము యేర్పడినది

4. పై ఆక్టు అమలులోనికి వచ్చినంతటనే ది 20-5-54 నుండి పంచాయితీలుగాని అన్ని గ్రామకోర్టులకు రు 100 ల దావాలను విచారించు హక్కు యుండదు. ఇందుకుగాను గవర్నమెంటువారు ఫలాని కోర్టుకు ఫలాని తేదీనుండి రు 100 ల విలువగల దావాలను విచారించుటకు అధికారం యివ్వబడెనని గెజెటులో ప్రకటన చేసిననే ఆ ప్రకటనలో పేర్కొనబడిన కోర్టులకు ప్రకటనలు పేర్కొనబడిన తేదీల నుండి అట్టి అధికారము గలుగును.

కాని మద్రాస్ గ్రామపంచాయతీల ఆక్టు నిబంధనల ప్రకారము పంచాయితీ కోర్టులుగా మారిన పంచాయతీబోర్డులు. 1-4-51 తేదీనుండి రు 100 ల విలువగల దావాలను విచారించుటకు అధికారము గలదు.

## గ్రామ కోర్టులు విచారించదగు దావాలను డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయవచ్చునా?

ఈ సెక్షను ప్రకారము గ్రామ కోర్టులకు రు 50 లు (a) పంచాయతీలకు రు 100 లు విలువగల దావాలను విచారించుటకు హక్కు యివ్వబడినప్పటికి అట్టి దావాలను విచారించుట డిస్ట్రిక్టు మునసబు కోర్టులకు గల అధికారములను తీసివేయ లేదు. అట్టి దావాలను వాది యిష్టానుసారము గ్రామకోర్టులోగాని డిస్ట్రిక్టు మునసబు కోర్టులోగాని దాఖలు చేయవచ్చును.

కాని గ్రామకోర్టు విచారించగల ఒక దావాను వాది డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దాఖలుచేసిన డిస్ట్రిక్టు మునసబు సదరు దావాను డిస్ట్రిక్టుమునసబు కోర్టులో దాఖలు చేయుటకు చాలినంత కారణమున్న నేతప్ప లేనియెడల ఆ దావాను అధికారము గల గ్రామకోర్టుకు ట్రాన్సుఫరుచేయవచ్చును. (సె 20 A చూడవలెను.)

మరిన్ని డిస్ట్రిక్టుమునసబు గ్రామకోర్టులో దాఖలు కావలసిన దావాను తాను విచారించినమీదట సదరు దావా గ్రామకోర్టులో దాఖలు చేయబడవలసి యుండెనని అభిప్రాయపడునెడల వాదికి ఖర్చులు నిరాకరించవచ్చును.

## ఈ సెక్షనుక్రింద మద్రాసు హైకోర్టు తీర్పులు.

(1) 1923 వ॥ వీ॥ నో 86 = 17 లా॥ వీ॥ 321 = 72 యిం॥కే॥ 744 = 1923 ఆ. ఇ. రి. మద్రాస్. 330.

జడ్జీ:— వాలెస్ గారు,

కోసలై రామపిళ్ళై వగైరా — పిటీషనర్లు

పుల స్త్యంపిళ్ళై — రెస్పాండెంటు

ఒక గ్రామములో రివాజుగా వాది ప్రతివాదుల కులమువారివద్దనుండి చందాలను వసూలుచేసి ఒక ఉత్సవము చేయుచున్నారు. ప్రతివాది ఉత్సవము అయిన దరిమిలా వాదికి కొంత చందా నిచ్చెదనని వాగ్దానముచేసి యివ్వక తప్పిపోయినాడు. కాని ప్రతివాది ఉత్సవమునకు పూర్వము తాను చందానిచ్చెదననిగాని, వాదిని ఖర్చు పెట్టవలసినదనిగాని చెప్పియుండలేదు. పై సందర్భములో వాది ప్రతివాదిపైన చందాకు గ్రామకోర్టులో దావా దాఖలుచేయగా గ్రామకోరువారు డిక్రీ యిచ్చిరి. సదరు డిక్రీపైన ప్రతివాది డిస్ట్రిక్టు మునసబు కోర్టులో సెక్షను 73 ప్రకారము రివిజన్

పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు దానిని కొట్టివేసెను. ప్రతివాది తరువాత హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు.—

(1) వాదికి ప్రతివాది ఉత్సవమునకు దక్షిణా చేసిన వాగ్దానమునకు యెట్టి ప్రతిఫలము లేదనిన్ని, అందువల్ల సదరు యెగ్రిమెంటు చెల్లదనిన్ని—

(2) సదరు చందా విలేజికోర్టు ఆక్టు సె. 13 లో చెప్పిన ప్రకారము ఖరారు మీద బాకీ కానేరదనియు, సదరు దావాను విలేజికోర్టు విచారించుటకు అధికారము లేదనియు

(3) క్రిందికోర్టు తీర్పులు న్యాయవిరుద్ధముగా యున్నప్పుడు హైకోర్టువారు జోక్యము కలుగచేసుకొనుటకు అధికారము కలదనిన్ని తీర్మానించిరి.

(2) 1929 ఆ.ఇ.రి, మద్రాసు 295 పేజీ = 118 యిం. కే. 511.

జడ్జి:—దేవదాసుగారు.

రసలింగం ఆసారి—పిటీషనరు (ప్రతివాది)

నల్లయన్ ఆసారి—రెస్పాండెంటు (వాది)

చిరకాలమునుండి ఒక గ్రామములో ప్రతివాదిన్ని ప్రతివాది పూర్వులున్నూ యిచ్చుచున్న చందాలవల్ల ఒక దేవాలయములో ఉత్సవములు చేయుచున్నారు. ఆ చందాల నాధారము చేసుకొని యుత్సవమునకు డబ్బు ఖర్చు పెట్టినప్పుడు, వాది ప్రతివాదులమధ్య చందానిచ్చుటకు నిర్దిష్టమైన ఖరారు లేనప్పటికిన్నీ, చిరకాలమునుండి వచ్చుచున్న రివాజునుబట్టి అట్టి ఖరారు యున్నట్లు యెంచవలసి యుండుననియు తీర్మానించిరి.

1923 సు॥ వీ॥ నో 86 పేకీలోని కేసులో ఉత్సవమునకు పూర్వము ప్రతివాది యెట్టి చందాను యిచ్చుటకు ఖరారు చేసినట్లుగాని, సదరు ఖరారునుగాని రివాజును గాని ఆధారపరచుకొని సొమ్ము ఖర్చుపెట్టినట్లుగాని ప్లయింటులో వ్రాయబడి యుండనందున సదరు తీర్పు యీ కేసుకు వర్తించదనికూడా తీర్మానించిరి.

(3) 20 ఇ.లా.రి. మద్రాస్ 21.

జడ్జీలు:— షెప్పర్డు, సుబ్రహ్మణ్యం అయ్యర్ గార్లు

నారాయణమ్మ—పిటీషనరు.

కామాక్షమ్మ—రెస్పాండెంటు.

కామాక్షమ్మ తనయింట్లో నారాయణమ్మ మూజువానీ ఒడంబడిక ప్రకారము అద్దెకు యున్నట్లు చెప్పుచూ తనకుగావలసిన అద్దె రు 19-0-0 లకు పుట్టూరు గ్రామ కోర్టులో దావా దాఖలు చేసినది. గ్రామ మునసబు డిక్రీ యిచ్చెను. అందుపైన డిస్ట్రిక్టు

మునసబుకోర్టులో సె 73 క్రింద పిటీషను పెట్టగా డిస్ట్రిక్టు మునసబు యీ దిగువ రెండు విషయములపై హైకోర్టువారి అభిప్రాయమునకు వ్రాసెను.

(1) "భూమి" అను పదములో ఇండ్లు నివేశన స్థలములు కూడా చేరునా?

(2) ప్రతివాది సంతకముతో వ్రాతమూలకమగు ఖరారు లేనిదే యింటి అద్దెకు తెచ్చిన దావాను విచారించుటకు గ్రామకోర్టుకు అధికారము కలదా? హైకోర్టువారు "భూమి" అనుపదము ఇండ్లు నివేశన స్థలములకు వర్తించుననియు, ప్రతివాది సంతకముచేసిన వ్రాతమూలకమైన ఖరారు లేనిదే యింటిఅద్దె దావాలను విచారించుటకు గ్రామకోర్టులకు అధికారము లేదనియు అభిప్రాయ మునగిరి.

(4) ఆ.ఇ.రి. 1929 మద్రాస్ 781=117 యిం. కే. 304.

జడ్జి:— అనంత కృష్ణఅయ్యర్ గారు.

ముత్తువెల్లి చెట్టియార్ — పిటీషనరు

టి. గోవిందస్వామి చెట్టియార్ — రెస్పాండెంటు

ఒకడు తన మైనరుకుమారునికి రావలసిన జీతమునిమిత్తము అతని యజమానిపై తాను వారిగాయుండి గ్రామకోర్టులో దావా దాఖలుచేసెను. సదరు దావా డిక్రీ అయినది. అందుపైన ప్రతివాది హైకోర్టులో పిటీషను దాఖలుచేసి జీతము పుచ్చుకో వలసినవాడు మైనరైనందున దావాను గ్రామకోర్టువారు విచారించుటకు వీలులేదని వాదించగా, హైకోర్టువారు కొన్ని సందర్భములలో మైనరుకుగాను తండ్రి జీతము నిమిత్తము దావా తెచ్చుటకు సాధ్యమయున్నదనియు, రికార్డునుబట్టి యీ కేసులో పిటీషనరున్నూ, వాదిగాయున్న మైనరు తండ్రి అయిన రెస్పాండెంటున్నూ, ఉభయ వాదులు మేజర్లు అయినందున యీ దావాను గ్రామకోర్టువారు విచారించుటకు అధికారము కలదనియు తీర్మానించిరి.

(5) 51 మ. లా. జ. 561 = 50 ఇ. లా. రి. మద్రాసు 494 = ఆ. ఇ. రి. 1927 మద్రాసు 192=24 లా. వీ. 611=1926 మ. వీ. నో. 953.

జడ్జి:— జాక్సను గారు.

సుందరనాయకర్ — పిటీషనరు (ప్రతివాది)

పొట్టినాయకర్ — రెస్పాండెంటు (వాది)

వాది పైరుకు ప్రతివాది చెరుపుచేసి నష్టము కలుగచేసినందున సదరు పైరు కిమ్మతుకు వాది గ్రామకోర్టులో దావాదాఖలుచేసెను. గ్రామకోర్టువారు డిక్రీనివ్వగా ప్రతివాది డిస్ట్రిక్టు మునసబు కోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేసెను. డిస్ట్రిక్టు మునసబు సదరు పిటీషను పరిహరించగా ఆ ఆర్డరుపైన హైకోర్టులో రివిజను పిటీషను పెట్టగా హైకోర్టువారు,

(1) చరాస్తి అను పదమునకు సం॥ గ్రా॥ కో॥ ఆక్టులో ఎట్టి నిర్వచనము లేదనియు, సదరు పదమునకు ట్రాన్సుఫరు ఆఫ్ ప్రాపర్టీ ఆక్టులోని నిర్వచనమే వర్తించు ననియు, ఆనిర్వచనము ప్రకారము నిలువపైసకూడ చరాస్తి అయినందున నిల్వపైసు నష్టమునకు వాది గ్రామకోర్టులో దావా దాఖలు చెయ్యవచ్చుననియు,

(2) గ్రామకోర్టులపైని వచ్చిన రివిజన్ పిటీషను విచారించునప్పుడు డిస్ట్రిక్టు మునసబు గ్రామకోర్టు తీర్పులలో సె-73 లో చెప్పిన లోపము లేకున్నను, తీర్పు మొత్తముమీద న్యాయముగా లేకున్నదని యెంచినయెడల సదరు తీర్పును రద్దుచేయ వలసిన అగత్యము లేదనిన్ని తీర్మానించిరి.

నోటు:—దరిమిలా ఆ.ఇ.రి. 1930 మద్రాస్ 509కేసులో నిల్వపైకు చరాస్తి కాదని తీర్మానించిరి. ఆ తీర్పు సె 52క్రింద వ్యాఖ్యానములో పూర్తిగా యివ్వబడినది.

(6) 1930 ఆ. ఇ. రి. మద్రాస్ 795=32 మ. లా. వీ. 158=1930 మ. వీ. నో. 712

జడ్జి:— క ర్ట్ న్ గా రు.

ఆరుముఘనాడర్ — పిటీషనరు

వ్యయపూరిచెట్టి — రెస్పాండెంటు

గ్రామకోర్టులకు ఖరారు భంగమువలన కలిగిన నష్టములకు తెచ్చిన దావాలను విచారించుటకు అధికారము లేదనియు, అవి కంట్రాక్టు ప్రకారము యివ్వవలసిన సొమ్మునకు తెచ్చే దావాలవంటివి కావనియు తీర్మానించిరి.

(7) 21 ఇ. లా. రి. మద్రాస్ 115.

జడ్జీలు:— షెప్పర్డు, సుబ్రహ్మణ్య అయ్యర్ గార్లు.

గాసిబీఅమ్మాళ్ — వాది

ఒలగపడయాచీ — ప్రతివాది

ఒక గ్రామకోర్టులో వాది తన భర్త వ్రాయించుకొన్న దస్తావేజును బట్టి భర్త చనిపోయిన తరువాత దావా దాఖలుచేసెను. ప్రతివాది సక్సెషన్ సర్టిఫికెటు లేనిదే దావా డిక్రీ యిచ్చుటకు వీలులేదని అభ్యంతరము చెప్పెను. గ్రామకోర్టువారు యీ విషయమై జిల్లాజడ్జీగారికి వ్రాయగా వారు హైకోర్టుకు వ్రాసిరి. హైకోర్టువారు గ్రామకోర్టు దావాలకు సక్సెషన్‌సర్టిఫికెట్టు ఆక్టువర్తించుననియు, సక్సెషన్‌సర్టిఫికెట్టు అవసరమని తీర్మానించిరి.

(8) 1942 (2) మ.లా.జ. 272=1942 మ.వీ.నో. 537=55 లా.వీ. 556 = ఆ.ఇ.రి. 1942 మద్రాస్ 648=204 ఇం. కే. 538.

మద్రాసు హైకోర్టు

న్యాయమూర్తి అబ్దుల్ రహిమాన్ గారు

## C. R. P. 1450 of 41 (8-4-42)

నాగప్ప ప్రభు — పిటీషనరు (వాది)

ఎదిరి

చంద్రశేఖర మరియు అతని తల్లి } రెస్పాండెంట్లు
రుక్మాబాయి అనే త్రివేణి } (ప్రతివాదులు)

మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె 13, 32 68 & 69 ప్రతివాది చనిపోయినప్పుడు అతనిస్థానే మైనరైన అతని న్యాయశాస్త్ర ప్రతినిధిని ప్రతివాదిగా చేర్చవచ్చునా? ప్రతివాది చనిపోయిన తరువాత అతని న్యాయశాస్త్ర ప్రతినిధిని పార్టీగా చేర్చకుండా ఉభయవాదులు గైరుహాజరైనందున దావా కొట్టివేయబడుట, ఆ పరిస్థితులలో సె 32 ప్రకారము క్రొత్తదావా తేవచ్చును.

### కేసు సంగతులు

శంకరనారాయణ గ్రామపంచాయతీ కోర్టులో నరసింహ భండారి అనే గుండు అనువానిపై రు 34-14-0 లకు ఒక దావా దాఖలు చేయబడినది. ఆ దావాను సదరు పంచాయితీ కోర్టువారు ఉభయ వాదులు హాజరులేరనే కారణముపైన 7-4-1940 తేదీన పరిహరించిరి. ఆ దావా పరిహరింపబడిన తరువాత ఆ మొత్తమునకే వాది కుండపూర్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దావా తెచ్చెను. అప్పటికి గుండు చనిపోయినందున దావా అతని మైనరు కుమారుడైన చంద్రశేఖర, మరియు అతని భార్యయైన త్రివేణి, పైన దాఖలు చేయబడెను. ప్రతివాదులు గుండు వాదికి యచ్చియ్యవలసిన బాకీ లేదనియు వాది దావాకు కాలదోషము పట్టెనని వాదించిరి. కాని డిస్ట్రిక్టు మునసబు వారి వాదనల నంగీకరించలేదు. కాని పై వాదనలేగాక ప్రతివాదులు అసలు వరలో వాది యీ బాకీకి పంచాయితీ కోర్టులో దావా దాఖలు చేసిన తరువాత గుండు మరణించెననియు అతడు చనిపోయిన తరువాత వాది మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె 68, 69 ల ప్రకారము గుండు న్యాయశాస్త్ర ప్రతినిధులను పార్టీగా చేర్చమని పిటీషను దాఖలుచేసి యుండవలెనని, వాది అటుల చేయనందున వాది తిరిగి ఆ బాకీకే మరియొక దావాను తెచ్చుటకు హక్కు యుండదని కూడ వాదించిరి. ఈ వాదనను డిస్ట్రిక్టు మునసబు అంగీకరించి వాదికి తిరిగి గుండు న్యాయశాస్త్ర ప్రతినిధులపైన వేరుగా దావా తెచ్చు హక్కు యుండదని వాది దావాను పరిహరించెను, అందుపైన వాది హైకోర్టులో రివిజను పిటీషను పెట్టగా హైకోర్టువారు ఈ క్రింది విధమున తీర్మానించిరి.

## తీర్పు

మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె 13 ప్రకారము మైనరుపైన పంచాయతీ కోర్టులో దావాను తెచ్చుటకు హక్కు లేదు. ప్రతివాది దావా మధ్యములో చని పోయినప్పుడు అతని న్యాయశాస్త్ర ప్రతినిధి మైనరైనప్పుడు వానిని తాను పార్టీగా చేర్చనక్కరలేదని వాది మొదటి వాదన. కాని ఈవాదన సరియైనది కాదు. సె 13 లో మైనరుపైన గ్రామ కోర్టులో దావా దాఖలు చేయకూడదని యున్నది. కాని దావా ఒక మేజరు మైనదాఖలు చేయబడి అతడు దావామధ్యమందు చనిపోయిన అతని న్యాయ శాస్త్ర ప్రతినిధి మైనరైనను అతనిని చేర్చకూడదని దానిలో నిబంధన లేదు.

పంచాయతీ కోర్టువారు దావాను ఉభయ వాదులు హాజరు లేరనే కారణముపైన పరిహరించి యున్నందున గ్రామ కోర్టుల ఆక్టు సె 32 ప్రకారం తనకు దావా తెచ్చుటకు హక్కు యున్నదని వాది రెండవ వాదన. కాని డిస్ట్రిక్టు మునసబు ఈ వాదనను అంగీకరించలేదు. సె 30 (ii) ప్రకారము ఒక దావా ఉభయవాదులు హాజరులేరనే కారణముపై పరిహరింప బడినపుడు వాదికి సె. 32 ప్రకారము మరియొక దావా తెచ్చుటకు హక్కు యున్నదనుటకు సందేహములేదు. ప్రతివాదులు గుండు చని పోయిన తరువాత అతని న్యాయశాస్త్ర ప్రతినిధిని పార్టీగా చేర్చనందున వాదికి మరియొక దావా తెచ్చు హక్కు యుండదని వాదించిరి. కాని గుండు చనిపోయిన తేదీఅయిన 19-1-1940 నుండి 60 దినములు దాటకముందే పంచాయతీకోర్టువారు వాది దావాను పరిహరించినట్లుల కనుపడుచున్నది. ప్రతివాదులు వాది దావాను పంచాయతీ కోర్టువారు గుండు చనిపోయిన తేదీ లగాయితు 60 దినములు దాటక ముందే పరిహ రించినను వాది గుండు న్యాయశాస్త్ర ప్రతినిధిని పార్టీగా చేర్చుటకు సె 69 ప్రకారము పిటీషను పెట్టి యుండవలసినదనియు ఆ విధముగా పిటీషను పెట్టుటతప్ప వాదికి వేరు మార్గము లేదని క్రొత్త దావాను తెచ్చుటకు అధికారము లేదని ప్రతివాదులు వాదించుచున్నారు. కాని ప్రతివాదుల ఈ వాదన సరిగా యున్నట్లుల తోచుటలేదు. అట్టి వాదనకు ఆధారము ఆక్టు నిబంధనలలో లేదు. దావా ఉభయ వాదులు లేరనే కారణముపైన పరిహరింపబడినపుడు ఆ ఆర్డరును రద్దు పరిపించుకున్న తరువాతగాని వాది, ప్రతివాది న్యాయశాస్త్ర ప్రతినిధిని చేర్చమని కోరుటకు హక్కు యుండదు. ఒక దావా ఉభయ వాదులు హాజరులేని కారణముపైన పరిహరింపబడినయెడల వాది అట్టి ఆర్డరును రద్దు పరిపించుకొనుటకు పిటీషను దాఖలు చేయవచ్చును. లేదా నూత నముగా దావా తేవచ్చును. ఆ విధముగా వాదికి రెండు హక్కులు యున్నవి. గుండు పంచాయతీకోర్టువారు దావాను పరిహరించకముందే చనిపోయినందున దావాను ఉభయవాదులు హాజరులేని కారణముపైన కొట్టివేయబడినట్లుల యెంచతగదని, అప్ప టికి ప్రతివాది హాజరగుట అసంభవమైనందున దావాను వాది హాజరు లేనందున కొట్టి వేసినట్లుల యెంచవలెనని ప్రతివాదులు వాదించుచున్నారు. కాని ఇది సరికాదు. దావా ఉభయవాదులు హాజరులేనందున కొట్టివేయబడినది. కాని ఉభయవాదులు

హాజరు కాకపోవడమునకు కారణములు వేరుగా యుండవచ్చును. దానితో నిమిత్తము లేదు. అన్నిగాక గుండు చనిపోయి అప్పటికి ఇంకను 60 దినములు దాటలేదు. పంచాయతీ కోర్టువారు దావాను పరిహరించినందున వాదికి ప్రతివాది న్యాయశాస్త్ర ప్రతినిధులను చేర్చుటకు దరఖాస్తు పెట్టుకొను అవకాశముపోయినది. అందువల్ల వాది ఆ బాకీకి తిరిగి దావా తెచ్చుటకు హక్కుయున్నది. ప్రతివాది చనిపోవునాటి నుండి 60 దినములు దాటిన తరువాత పంచాయతీకోరువారు వాది దావాను పరిహరించి నను వానికి తిరిగి దావా తెచ్చుహక్కు యుండునని నేను అభిప్రాయ పడుచున్నాను. కాని ఆ విషయము ఈ కేసులో తీర్మానించవలసిన పనిలేదు. ఏలనన ఈ కేసులో ప్రతివాది చనిపోయిన 60 దినములలోపలనే వాది దావా పరిహరింపబడినది. అందువల్ల ఈ కేసులో వాని దావా చెల్లతగినది కావున వాదికి డిక్రీ యివ్వదగినది.

(9) 1940 (2) మ.లా.జ. నో.ఆ.సీ.కే. 66=52 మ.లా.వీ. యస్.ఆర్.సి. 75.

మద్రాస్ హైకోర్టు
న్యాయమూర్తి పతంజలి శాస్త్రిగారు

## C. R P. 194 of 1938 (1-11-1940)

ఆదిశేషయ్య ఎదుటిపార్టీ వెంకటస్వామి మరియొకరు

సె. పదమూడులో వ్యక్తిపరమైన ఆస్తి (Personal property) అనగా చరాస్తి (Movable property) అని అర్థమని హైకోర్టువారు తీర్మానించిరి.

[నోటు:- సె. 13 లోని అనివరణలోయున్న "వ్యక్తిపరమైన ఆస్తి (Personal property) అను మాటలను తీసివేసి "చరాస్తి" (Movable Property) అను మాటలను 1937 సం॥పు గ్రామకోర్టుల సవరణ ఆక్టువల్ల చేర్చబడినది.]

సమ్మతితోటి 200 రూపాయల వరకు విచారణాధికారపు హద్దు.

14. కోర్టువారియెదుట వ్రాయబడ్డ ఉభయ కక్షిదార్ల లిఖిత మూలమైన సమ్మతితోటి గ్రామ కోర్టువారు 13వ సెక్షనులో వివరించియున్న స్వభావము గల వ్యాజ్యముల మొత్తముగాని విలువగాని 200 రూపాయలకు మించనియెడల అట్టి వ్యాజ్యములను విమర్శించి తీర్మానించవచ్చును.

వ్యాఖ్య.

13 వ సెక్షను ప్రకారము గ్రామకోర్టులకు రు 50 లకు, పంచాయతీలకు రు 100 లకు మించిన విలువగల దావాలను విచారించుటకు హక్కులేదు. కాని ఉభయవాదులు అనగా వాది ప్రతివాదులు కోర్టువారి యెదుట వ్రాతమూలకమైన

వప్పుదల వ్రాసియిచ్చినయెడల 13వ సెక్షనులో చెప్పబడిన స్వభావము గల దావాలు రు 200-0-0 లు విలువను మించని దావాలను విచారించుటకు అధికారము గలదు.

ఈ సెక్షన్‌క్రింద హైకోర్టు తీర్పు

1937 సం॥ వీ॥ నో॥ 715

మద్రాసు హైకోర్టులో

ప్రధాన న్యాయమూర్తి సర్ ఓవెన్ బీస్లీగారు

C. R .P. 315 of 1936 (5-3-37)

ముప్పాల పాపనయ్య — పిటీషనరు

ఉడుతు సుబ్బారావు — రెస్పాండెంటు

12-9-31 తేదీన వాదిపేర ప్రతివాది వ్రాశియిచ్చిన ఒక ప్రోనోటును బట్టి, వాది ప్రతివాదిపైన రాజమండ్రి పంచాయతీ కోర్టులో రు 136-5-3 లకు ది11-9-34 తేదీన దావా తెచ్చెను. దావా మొత్తము రు 50 లకు మించినదైనందున ఉభయ వాదులు వ్రాతమూలకముగా దావాను పంచాయతీ కోర్టువారు విచారించవచ్చునని కోర్టువారి యెదుట తమ సమ్మతిని వ్రాసియిచ్చినగాని, దావాను విచారించుటకు పంచాయతీకోర్టుకు అధికారము యుండదు.

ఈ దావాను లిమిటేషను పట్టుచుండగా ఆఖరు దినమున దాఖలు చేసినందున ఆరోజున ఉభయవాదులు తమసమ్మతిని వ్రాసియిచ్చుటకు అవకాశమే లేదు. దావా ప్రతివాదికి నోటీసునిమిత్తము ది 13-10-34 తేదీకి వాయిదా వేయబడెను. ప్రతివాది ది 21-11-34 తేదీన ఆన్సరు దాఖలుచేసెను. దావా ప్రథమములో ది 29-12-34 తేదీకి విచారణకు వాయిదాపడినది. తరువాత కొన్ని వాయిదాలుపడి ఆఖరున ది 26-2-35 తేదీన విచారణకువచ్చెను. ప్రతివాది అన్సరులో పంచాయతీకోర్టువారు యీదావాను విచారించుటకు అంగీకరించనని వ్రాసెను. అందువల్ల ది 26-2-35 తేదీన పంచాయతీ కోర్టువారు దావాను అధికారముగల కోర్టులో దాఖలు చేసుకొనమని త్రిప్పివేసిరి.

ఆ తేదీననే వాది ఆ దావాను రాజమండ్రి సబ్ కోర్టులో దాఖలు చేసెను. ప్రతివాది వాది దావాకు లిమిటేషను పట్టినదని వాదనచేసెను. అందుపైన సబ్‌కోర్టు వారు వాది అనవసరముగా లిమిటేషను ఆఖరువరకుఆగి ప్రతివాది అంగీకారము తీసు కొనుటకు అవకాశములేకుండా పంచాయతీకోర్టులో ఆఖరుదినమున దావాను దాఖలు చేసినాడని ప్రతివాది పంచాయతీ కోర్టువారు దావాను విచారించుటకు వీలులేదని అన్సరు దాఖలుచేసిన తరువాతగూడ చాలా వాయిదాలవరకు ప్లయింటును తిరిగి తీసు కొనక ఉపేక్షించినాడని, అందువల్ల వాది దావాకు లిమిటేషనుపట్టినదని తీర్మానించిరి. ఆ తీర్పునుండి వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు సబ్‌కోర్టువారి అభిప్రాయము సరిగా యున్నదని వాది తీర్పును ఖాయపరచి వాది రివిజను పిటీషను పరిహరించిరి.

15, 16 వ సెక్షనులలో చెప్పియున్న నిబంధనలకు లోబడి, యీ ఆక్టు ప్రకారము తేబడు ప్రతివ్యాజ్యము వ్యాజ్యప్రారంభ కాలమందు వ్యాజ్యము వేయబడవలసిన ప్రతివాదులు అందరున్నూ యెవరి అధికార కోర్టు ప్రదేశ హద్దుల లోపుగా వాసము చేస్తూ వున్నారో, వ్యాపారము జరిపిస్తున్నారో లేదా లాభమునకుగాను స్వయముగా పనిచేస్తున్నారో ఆ గ్రామకోర్టులో వేయబడవలసినది.

## వ్యాఖ్య.

గ్రామ కోర్టులో దాఖలు కావలసిన దావాలు ప్రతివాది ఒకడు అయినయెడల సదరు ప్రతివాది, యెక్కువమంది ప్రతివాదులున్నయెడల సదరు ప్రతివాదులు అందరు యే గ్రామకోర్టు అధికార ప్రదేశహద్దులలో వాసము చేస్తూయున్నారో, వ్యాపారము జరిపిస్తూయున్నారో లేక లాభమునకుగాను స్వయముగా పనిచేస్తూయున్నారో ఆ గ్రామకోర్టులో దాఖలు చేయవలసియుండును, దావా కారణముతోగాని వాదివాస స్థలముతోగాని యెట్టి సంబంధమున్నూ లేదు. ఒకదావాలో యిద్దరు ప్రతివాదులుండి వారు చెరియొక గ్రామకోర్టు అధికారప్రదేశహద్దులలో యున్నయెడల సదరు దావాను డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయవలసినదేగాని ఏ ఒక ప్రతివాదికిఉన్న గ్రామ కోర్టులో దాఖలు చేయ వీలులేదు.

ఒక గ్రామకోర్టులో దాఖలు చేయబడవలసిన దావాలో ఆ గ్రామమునసబు దావాలో కక్షిదారుడుగాయున్న లేదా స్వయముగా సంబంధము గలిగియున్న ఆదావాను ఆగ్రామమునకు అవ్యవహితముగా ఆనుకొనియున్న మరియొక గ్రామకోర్టులో దాఖలు చేయవచ్చును. సె 16. (1) చూడవలెను.

"వాసముచేయుచున్నారో" అను పదములోని "వాసము చేయుట" అనగా శాశ్వతముగా కాపురము చేయుచున్న అని అర్థము. తాత్కాలికముగా యెవరైన యేదైన పనిమీద అనగా ఒక వ్యాజ్యము నడపుటకు ఒక గ్రామము వెళ్ళినగాని, లేక ఒక ఉద్యోగి సెలవులలో తన స్వగ్రామమువచ్చియున్నగాని, లేక ఒకరు జబ్బుగాయుండి ఔషధసేవకు ఒక గ్రామములో కొద్దికాలమున్నగాని, అట్టి సంగతులలో వారు తాత్కాలికముగా వచ్చియున్న ఆ గ్రామములలో వాసముచేస్తూయున్నట్లు యెంచవీలులేదు. ఎవనికైనను శాశ్వతమైన కాపురస్థలము యెచ్చటను లేనియెడల అతడు యెప్పుడు యెచ్చట నివసించుచూ యుండునో అప్పుడు అచ్చట వాసము చేస్తూయున్నట్లు యెంచవచ్చును. సాధారణముగ ఉద్యోగస్థులు యెప్పుడు యెచ్చట ఉద్యోగము చేయుచున్న అప్పుడు ఆ గ్రామమున వాసము చేయుచున్నట్లు యెంచవచ్చును. ఒకడు బొంబాయిలో 10 సంవత్సరముల నుంచి కాపురమున్నాడని

అనుకొందము అయనకు బెజవాడలో ఒక స్వంతయిల్లున్నది. ఆయన యెప్పుడైనా తన స్వంతయింటికి వచ్చిపోవుచున్నను, ఆయన బెజవాడలో వాసము చేస్తూయున్నట్లు యెంచతగదు. ఆయనపైన బెజవాడ పంచాయతీ కోర్టులో దావా దాఖలు చేయ వీలులేదు. ఒకప్పుడు ప్రతివాది ఒక గ్రామములో తాత్కాలికముగా కాపుర మున్నప్పటికిన్ని, అట్లు కాపురమున్న కాలము కొంచెము యెక్కువగా యున్నయెడల అతడు సదరు గ్రామములో యీ సెక్షనులో చెప్పిన ప్రకారము వాసము చేస్తూ యున్నట్లు యెంచబడును. ఉ॥ ఒక విద్యార్థి కాలేజీలో చదువుటకు చేరెను. అతడు ఆ గ్రామములో ఒక సంవత్సరము కాపురముండును. ఆ సంవత్సరములో అతడు సదరు గ్రామములో వాసము చేస్తూయున్నట్లు యెంచి అతనిపై ఆ గ్రామకోర్టులో దావా దాఖలు చెయ్యవచ్చును.

“వ్యాపారము జరిపిస్తూయున్న” అనగా.

వ్యాపారము జరుపుటకు ప్రతివాది సదరు గ్రామములో స్వయముగా కాపుర ముండుట, ఒక దుకాణమునుగాని, కొట్టునుగాని పెట్టుట అవసరములేదు. ప్రతివాది సదరు గ్రామమునకు తరుచుగా పోవుచూ తన స్నేహితుని యింటనుండి వ్యాపారము చేయుచున్నను లేదా ఒక యేజంటు ద్వారాగాని, గుమాస్తాద్వారాగాని వ్యాపారము చేయుచున్నను, సదరు గ్రామములో అతడు యీ సెక్షనులో చెప్పిన ప్రకారము వ్యాపారము జరిపిస్తూయున్నట్లు యెంచవచ్చును. ప్రతివాదియే స్వయముగా యుండి వ్యాపారము చేయవలసిన అగత్యములేదు.

“వ్యాపారము జరుపుట” అనగా వ్యాపారముయొక్క ముఖ్యభాగములు అనగా, అమ్ముట, లాభమును పొందుట వగైరాలు ఆ గ్రామములో జరుగవలెను. ఉ॥ బెజవాడ గ్రామంలో ఒక వర్తకుడు కాకినాడలో ఒక యేజంటును పెట్టి సదరు యేజెంటుద్వారా యూరోపు దేశమునుంచి సరుకులు తెప్పించుచూ కాకినాడలో ఖరీదు చేయుచూ, బెజవాడలో దుకాణముపెట్టి సదరు సరుకులను బెజవాడలో అమ్ముచున్నాడు. అతడు అట్టి సందర్భములో కాకినాడలో వ్యాపారముచేయు చున్నట్లు యెంచవీలులేదు. కాకినాడలో వ్యాపారము చేయుచున్నట్లు చెప్పుటకు కాకినాడలో సరుకులు అమ్ముచున్నట్లు ధృవపరచవలెను.

“లాభమునకు స్వయముగా పనిచేయుచున్న” అనగా ప్రతివాది స్వయముగా ఒక గ్రామములో పని చేయవలెను. ఒక గ్రామకాపురస్థుడు మరియొక గ్రామములో నౌకరుగాయుండి పని చేయుచున్నయెడల అతడు నౌకరుగాయున్న గ్రామంలో అతని పైన దావా దాఖలు చేయవచ్చును. అతడు ఖాయముగా కాపుర మున్న గ్రామములోకూడ అతనిపైన దావా వేయవచ్చును,

ఈ సెక్షను క్రింద హైకోర్టు తీర్పు

1938 మ. వీ. నో. 242=47 మ. లా. వీ. 259=1938 (1) మ. లా. జ. 229=
ఆ. ఇ. రి. 1938 మద్రాస్ 497 = 178 ఇం. కే. 824

మద్రాసు హైకోర్టు
న్యాయమూర్తి అబ్దుల్ రహిమాన్‌గారు

## C. R. P. 1519 of 1936

క్రిష్టయ్య చెట్టి — పిటీషనరు
పెదనారాయణప్ప — రెస్పాండెంటు

ధర్మవరం గ్రామకోర్టులో పిటీషనరు (ప్రతివాది) పైన రెస్పాండెంటు (వాది) ఒక దావాను దాఖలు చేసెను. ప్రతివాది ఆ దావాను ధర్మవరం గ్రామకోర్టులో దాఖలు చేయుటకు వీలులేదని, తాను ధర్మవరం గ్రామకోర్టు అధికార హద్దులలో వాసము చేయుటగాని, వ్యాపారము చేయుటగాని లేదా స్వయముగా లాభము నిమిత్తము పనిచేయుటగాని, లేదని ఆన్సరు దాఖలు చేసెను.

మరియు సదరు దావాను ధర్మవరం గ్రామకోర్టునుండి ట్రాన్స్ఫరు చేయించమని గ్రామకోర్టుల ఆక్టు సె. 21 క్రింద డిస్ట్రిక్టు మునసబుకోర్టులో పిటీషను దాఖలు చేసెను. కాని ఆ పిటీషను పరిష్కారము కాకముందే గ్రామకోర్టువారు ప్రతివాదిపైన యక్స్‌పార్టి డిక్రీ నిచ్చిరి.

ప్రతివాది ఆ డిక్రీ రద్దుపరచమని డిస్ట్రిక్టు మునసబు కోర్టులో సె 73 ప్రకారము పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు ఆ పిటీషనును పరిహారంచెను. ఆ ఆర్డరునుండి ప్రతివాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు ఈ క్రిందివిధమున తీర్మానించిరి.

తీర్పు

గ్రామకోర్టులు ప్రతివాది తమ అధికార ప్రదేశములో వాసముచేయుచున్న లేదా వ్యాపారము చేయుచున్న లేదా స్వయముగా లాభమునిమిత్తము పనిచేయుచున్న నే ఆదావాను విచారించుటకు అధికారము యుండును. ప్రతివాది ఈకేసులో తాను ధర్మవరం గ్రామకోర్టు అధికారప్రదేశములో వాసముచేయుటగాని, వ్యాపారముచేయుటగాని, లేదా స్వయముగా లాభమునిమిత్తము పనిజేయుటగానిలేదని దావాను విచారించుటకు గ్రామకోర్టుకు అధికారములేదని స్పష్టముగా ఆన్సరులో వ్రాసెను.

డిస్ట్రిక్టు మునసబు ప్రతివాది ధర్మవరంలో వ్యాపారముచేయుచున్నట్లు వప్పుకొన్నాడని తమ ఆర్డరులో వ్రాసిరి. కాని అట్టి వప్పుదల యెచ్చటనులేదు. ప్రతివాది ధర్మవరంలో చీరెలు ఖరీదుచేసినట్లుమాత్రము వప్పుకొనెను. అంతమాత్రముచే ధర్మవరం గ్రామకోర్టుకు ప్రతివాదిపై దావాను విచారించుటకు అధికారము కలుగదు. వాది

ప్లయింటులో వ్యాజ్యకారణము ధర్మవరంలో కలిగినదనిమాత్రము వ్రాసెను. సివిల్ ప్రొసీజరుకోడు నిబంధనలు గ్రామకోర్టులకు వర్తించవు. వ్యాజ్యకారణము కలిగినంత మాత్రముచే గ్రామకోర్టుకు అధికారము యేర్పడదు. గ్రామకోర్టుకు అధికారము యున్నట్లు తెలియగలందులకు వాది ప్రతివాది గ్రామకోర్టు అధికారి హద్దులలో వాసముచేస్తూయున్నాడనిగాని లేదా వ్యాపారముచేస్తూయున్నాడనిగాని లేదా స్వయముగా లాభమునిమిత్తము పనిచేయుచున్నాడనిగాని వ్రాయవలెను. గ్రామకోర్టుకు అధికారమున్నదని ఋజువుచేయవలసిన భారము వాదిపై నున్నది.

ఈ కేసులో గ్రామకోర్టు తమకు అధికారములేని దావాలో డిక్రీనిచ్చెను. ఆడిక్రీ చెల్లనేరదు. అందువల్ల డిస్ట్రిక్టు మునసబు తీర్పును రద్దుపరచి ప్రతివాది డిస్ట్రిక్టు మునసబువద్ద పెట్టిన పిటీషనును తిరిగి విచారించగలందులకు అర్డరు చేయడమైనది.

గ్రామమునసబు స్వయముగా సంబంధము కలిగివున్న వ్యాజ్యము.

16.(1) దేనికి లేక యెందులో, గ్రామమునసబు కక్షిదారుడుగా వున్నాడో, లేదా స్వయముగా సంబంధము కలిగివున్నాడో అట్టి యే వ్యాజ్యమునైనను అతడు విమర్శించనూకూడదు, లేక అట్టి వ్యాజ్యముతో చేరిన, లేక అందువల్ల కలిగిన యేదైనా చర్యవిషయమై తీర్పు చెప్పనూ కూడదు. అట్టి ప్రతి వ్యాజ్యముగాని చర్యగాని అవ్యవహితముగా సమీపమందున్న యేదైనా గ్రామకోర్టులో వేయబడవచ్చును.

ఒక మెంబరు స్వయముగా సంబంధము కలిగివున్న వ్యాజ్యము.

(2) ఒక పంచాయతీకోర్టుయొక్క మెంబరు ఎవరైనను అట్టి కోర్టు యెదుట గల యే వ్యాజ్యములోగాని చర్యలోగాని ఒక పార్టీ అయి యుండినా, స్వయముగా బాధ్యత కలిగియుండినా, అట్టి వ్యాజ్యమునో చర్యనో విచారించు సమయమందు అతడు కోర్టునుండి వెళ్ళిపోవలెను. మరియు దాని తీర్మానములో అతడు యే జోక్యమును పుచ్చుకోగూడదు.

వ్యాఖ్య.

ఒక గ్రామములో గ్రామ మునసబుకోర్టు (పంచాయతీకోర్టుకాదు) యున్న యెడల సదరు గ్రామమునసబు యే దావాలోనైనా వాదిగా గాని, ప్రతివాదిగాగాని యున్నయెడల, లేక అతనికి యే దావాలోనైనా స్వయముగా సంబంధమున్నగాని

ఆ దావాను సదరు గ్రామమునకు ఆనుకొనియున్న (అవ్యవహితముగాయున్న) మరియొక గ్రామకోర్టులో దాఖలు చేయవచ్చును. కాని ఒక పంచాయతీకోర్టు మెంబరు ఒకదావాలో కక్షిదారుడుగాయున్న గాని, దావాలో స్వయముగా సంబంధము కలిగియున్న గాని సదరు దావాను ప్రక్కనున్న గ్రామకోర్టులో దాఖలు చేయ వీలులేదు. కాని సదరు మెంబరు సదరు విచారణతోగాని, తీర్పుతోగాని యెట్టి సంబంధము గలుగజేసుకోకుండా యుండవలెను. గ్రామమునసబు పార్టీగా యున్న లేక స్వయముగా సంబంధము కలిగియున్న దావాను సదరు గ్రామమునకు అనుకొనియున్న గ్రామకోర్టులోనే దాఖలు చేయవలసియున్నది. దూరముగాయున్న అనగా ఆనుకొనకుండాయున్న మరియొక గ్రామకోర్టులో దాఖలుచేయుటకు వీలులేదు. యీ సె॥లో చెప్పబడిన సందర్భములలో సె 21 క్రింద డి॥ ము॥ వల్ల కేసు ట్రాన్సుఫరు చేయబడినప్పుడు తప్ప యితర సందర్భములలో తమకోర్టు యిలాకా గ్రామ కాపరస్థుడు కాని వానిపై తెచ్చినదావా విచారించుటకు గ్రామకోర్టుకు అధికారముండదు.

“స్వయముగా సంబంధము కలిగియున్న” అనగా ఒక గ్రామమునసబుకుగాని పంచాయతీ మెంబరుకుగాని ఒక దావాలోని కక్షిదారులు అనగా పార్టీలు సన్నిహిత బంధువులైనగాని, లేక దావా పర్యవసానమువల్ల తనకు లాభనష్టములు కలుగనున్న గాని, లేక సదరు గ్రామమునసబుగాని పంచాయతీకోర్టు మెంబరుగాని ఒక దావాలో కక్షిదారులకు ముఖ్యమైన సాక్షిగా యున్న గాని లేక యే కక్షిదారునికైనను అతడు యేజంటుగా యున్న గాని, సదరుదావాలో అతనికి స్వయముగా సంబంధమున్నట్లు యెంచవచ్చును.

### హైకోర్టు తీర్పు

**5 మ. లా. వీ. నో. ఆ. క్రి. కే. 43.**

జడ్జి:—శ్రీనివాస అయ్యంగారు.

వాది తన గ్రామమునకు ప్రక్కనయున్న గ్రామకాపురస్థుడైన ప్రతివాదిపైన తన గ్రామ కోర్టులో దావాదాఖలుచేసి యక్సుపార్టీ డిక్రీనిపొందెను. ప్రతివాది డి॥ ము॥ కోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా డి॥ ము॥ మ॥ గ్రా॥ కో॥ ఆ॥ సె 16 చెప్పబడిన సందర్భములో తప్ప ఒక గ్రామకోర్టు అధికార ప్రదేశములో లేని వానిపై తెచ్చినదావాను విచారించుట గ్రామకోర్టుకు అధికారముండదని గ్రామకోర్టు యిచ్చిన డిక్రీని రద్దుపరచెను. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను పెట్టి ప్రతివాది గ్రామకోర్టులో హాజరై సదరు కోర్టుకు అధికారములేదని వాదనచేయనందున సి॥ ప్రొ॥ కో॥ సె. 21 ప్రకారము ఆ వాదన వదలుకొన్నట్లు యెంచవలసి యుండుననియు, అతడు డి॥ ము॥ కోర్టులో గ్రామకోర్టుకు అధికారములేదని వాదించుటకు హక్కులేదనియు వాదనచేయగా హైకోర్టువారు:—(1) సి॥ ప్రొ॥ కో॥ సె 21 గ్రామకోర్టులకు వర్తించదనియు, (2) ప్రతివాది గ్రామకోర్టుకు అధికారములేదని డి॥ ము॥ కోర్టులో వాదన

చేయవచ్చుననియు, (3) యీ కేసులో గ్రామకోర్టుకు అధికారము లేదనియు, (4) డి॥ ము॥ యీ కేసులో డిక్రీని రద్దుపరచి, సదరు కేసులో ముందు దావా గ్రంథము జరుగ గలందులకు ఆర్డరు జారీచేయకుండుట పొరపాటనియు, (5) డి॥ ము॥ సె 73 క్రింద తనకు న్యాయమని తోచిన దావా గ్రంథము జరుగుటకు ఆర్డరు జారీచేసి యుండవలె ననియు తీర్మానించిరి.

ముందే తీర్పు చెయ్యబడివున్న విషయము.

17. అదే కక్షిదారల్లో, లేక వారు యెవరు కొని దావా చేస్తున్నారో వారిల్లో, పూర్వపు వ్యాజ్య మందు, తగిన అధికారముగల కోర్టువారి వల్ల విచారింపబడి తీర్చబడ్డ వ్యాజ్యకారణ విషయమై అట్లా మళ్ళీ తేబడు యేదైనా వ్యాజ్యమును గ్రామకోర్టు వారు విమర్శింపకూడదు.

## వ్యాఖ్య.

•ఒక వ్యాజ్యకారణమునుబట్టి లోగడ అధికారము కలిగిన ఒక కోర్టులో ఒకే పార్టీలమధ్యగాని, లేక వారిస్థానీయుల, బాధ్యస్థుల మధ్యగాని దావా దాఖలై తీర్పు అయినయెడల ఆదావాలో కోరిన పరిహారము నిమిత్తము సదరు పార్టీలవల్లగాని, సదరు పార్టీలస్థానీయులు లేక బాధ్యస్థులవల్లగాని యే గ్రామకోర్టులోనైనను మరియొక దావాను తెచ్చినయెడల. సదరు దావాను ఆ కోర్టువారు విచారించకూడదు. కాని ప్రథమదావాను విచారించినకోర్టు సదరు దావాను విచారించుటకు తమకు అధికారము లేదని త్రిప్పివేసినయడల, సదరు వ్యాజ్యకారణమును బట్టి అధికారము కలిగిన కోర్టులో దావా దాఖలు చేయవచ్చును. "యెవరు కొని దావా చేస్తూయున్నారో" అనగా కక్షిదారులయొక్క స్థానీయులుగాని బాధ్యస్థులుగాని అని అర్థము.

వ్యాజ్యములో దావా యావత్తు చేరివుండవలసినది

18. ఒక గ్రామకోర్టులో వేయబడు ప్రతివ్యాజ్యమందు వ్యాజ్య కారణ విషయమై చేయుటకు వాదికి బాధ్యత గల యావత్తు దావా చేరి యుండవలసినది. అయితే అట్టి కోర్టు యొక్క అధికార హద్దులకు లోగా వ్యాజ్యము తెచ్చే నిమిత్తము తన దావాయొక్క యే భాగము నయినా అతడు మానుకోవచ్చును.

వాది తనదావాలో నేభాగమునుగురించి అయినను వ్యాజ్యము వేయకుండా తప్పిపోయిన యెడల, లేక బుద్ధిపూర్వకముగా మానుకొన్న యెడల అట్లా తప్పిపోయిన, లేదా మానుకొన్న భాగమునకుగాని అందునుగురించిగాని అతడు కొత్త వ్యాజ్యము తేకూడదు.

దావాలో కొంతభాగమును మానుకోవడము.

## వ్యాఖ్య

వాదికి ప్రతివాదివల్ల ఒక వ్యాజ్య కారణమునుబట్టి రావలసిన యావత్తు మొత్తమునకు ఒకమారే దావా తేవలసియుండును. అందులో కొంత మొత్తమునకు ఒకసారిన్ని మిగతా మొత్తమునకు మరియొకసారిన్ని రెండు దావాలు దాఖలు చేయుటకు వీలు లేదు.

ఉ. (1) "ఏ" అనువానికి "బి" అనువాడు రు 100 లు ఒకసారి అప్పుపుచ్చుకొని బాకీయుండును. "ఏ" మొదట రు 50-0-0 లకు ఒక దావాయున్నూ మిగిలియున్న రు 50-0-0 లకు తరువాత మరియొక దావాయున్నూ తెచ్చుటకు వీలులేదు. రెండవదావా యీ సెక్షను ప్రకారము సెల్లనేరదు.

కాని "బి" అనువాడు రెండు పర్యాయములు రు 50-0-0 లు చొప్పున అప్పుపుచ్చుకొని యుండినయెడల "ఏ" రెండుదావాలు తేవచ్చును. ఏలనన వ్యాజ్యకారణములు వేరు కావున.

ఉ. (2) "ఏ" అనువాడు "బి" అనువాని యింట్లో అద్దెకు యుండును. 5 మాసముల అద్దె బాకీ యుండును. "బి" మొదట 3 నెలలకు ఒక దావా తెచ్చి తరువాత మిగతా రెండు నెలలకు మరియొకదావా తెచ్చుటకు వీలులేదు. రెండవసారి తెచ్చిన దావా చెల్లనేరదు. ఏలనన రెండుదావాల వ్యాజ్యకారణము ఒకటేఅయినందున ఒకేసారి దావావరకు రావలసిన అద్దె యావత్తు మొత్తమునకు ఒకేదావా తేవలసియుండును.

కాని వాది తన దావాను విలేజి కోర్టులో దాఖలు చేయుటకు అధికారము యుండగలందులకు రు 50-0-0 లకు పైగాయున్న మొత్తమును వదలుకొని రు50-0-0 లకు మాత్రమే గ్రామకోర్టులో దావా తేవచ్చును. కాని వాది తనకు ఒకే వ్యాజ్య కారణమునుబట్టి రావలసిన పరిహారములో నుంచి కొంతభాగము వదలుకొన్నగాని, లేక బుద్ధిపూర్వకముగా దావాలో చేర్చకయున్నగాని సదరు మొత్తమునకు తిరిగి వేరొక దావా దాఖలు చేయుటకు హక్కుయుండదు.

"వ్యాజ్యకారణమువిషయమై చేయుటకు వాదికి బాధ్యతగల యావత్తుదావా" అనగా వ్యాజ్యకారణమునుబట్టి వాదికి రావలసిన యావత్తు పరిహారమున్ను అని అర్థము.

హైకోర్టు తీర్పులు.

65 మ.లా.జ. 583 = 1934 ఆ. ఇ. ఆ. మద్రాస్ 99 = 38 లా.వీ. 633 = 140 ఇం. కే. 230.

జడ్జి:— రామేశం గారు.

సుడాలి అనే ముత్తు అమ్మాళ్ళు — పిటీషనరు

వేలాయుధంపండారమ్ — రెస్పాండెంటు

"ఏ" అనువాడు ఒక ప్రోనోటును "బి" అను వానిచేత వ్రాయించుకొని అందుపైన రావలసిన వడ్డీకి మాత్రము ఒక గ్రామకోర్టులో దావావేసి డిక్రీ పొందెను. పరిమిగా సదరు నోటు క్రింద యివ్వవలసిన అసలు ఫాయిదాలకు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దావా దాఖలు చేయగా వాది తన బాకీ యావత్తు మొత్తమునకు ఒకేదఫా దావా తేకుండా కొంత మొత్తమునకే తెచ్చినందున మిగతా మొత్తమునకు తిరిగి దావావేయుటకు మ.గ్రా.కో. ఆ. సె 18 ప్రకారము వీలులేదనియు, రెండవసారి డి. ము. కోర్టులో వాది తెచ్చిన దావా చెల్లదనియు తీర్మానించిరి.

గ్రామ కోర్టువారివల్ల విమర్శించ బడతగని విషయములను మధ్య తీర్మానము చెయ్యరాదు.

19. గ్రామ కోర్టువారివల్ల విమర్శింపబడ తగ్గ వ్యాజమును తీర్మానించడములో, ఆ వ్యాజ్యపు కక్షిదార్లలో స్థిరాస్తికిగల హక్కును గురించిగాని వారిలో యెవరియొక్క అయినా లేదా యెవరును కొని వారు దావాచేస్తున్నారో వారియొక్క అయినా న్యాయశాస్త్రసమ్మతమైన హోదాను గురించిగాని యేదైనాఖరారు, లేక విధాయకము యేర్పడివుండడమును గురించిగాని వివాదము కలిగియుండే యేవిషయము ఆ వ్యాజ్యమునకు ప్రత్యక్ష అంశముగా వున్నపట్ల గ్రామకోర్టువారివల్ల యీఆక్టును అనుసరించి విమర్శించబడతగ్గదికాదో, అట్టి యే సంగతిని అయినా మధ్య తీర్మానించడము ఆవశ్యకముగా వున్నయెడల, అట్టి వ్యాజ్యమును తీర్మానించడమునకు గాను యెంతమట్టుకు జరూరుగా యుండవచ్చునో అంతమట్టుకు, హక్కు, న్యాయశాస్త్ర సమ్మతమైనహోదా, ఖరారు లేదా విధాయకము యేర్పడి వుండడమును గురించి కలిగే అట్టి వివాదము తీర్మానించడమునకు గ్రామ కోర్టువారికి అధికారము వుండవలసినది. అయితే ఆతీర్మానము అనేది అదే కక్షిదార్లలోగాని, వారి

ప్రతినిధులలోగాని యేదయినా యితర వ్యాజ్యముతేబడినా ఆవ్యాజ్య మందు అట్టి హక్కు, న్యాయశాస్త్ర సమ్మతమైన హోదా, ఖరారు లేక విధాయకమును గురించి నిదర్శనముగా యెత్తుకోకూడదు,

వ్యాఖ్య.

గ్రామ కోర్టువారు విచారించే దావాలలో తీర్పు చెప్పుటకుగాను, స్థిరాస్తి యొక్క హక్కులను గురించిగాని, లేక వాది ప్రతివాదుల హోదాను గురించిగాని, లేక ఉభయవాదుల మధ్య జరిగిన మరి యే యితర ఖరారులనుగురించిగాని విచారించ వలసిన అవసరము కలిగినయెడల, తమ కోర్టుయెదుట విచారణ జరుగుచున్న దావా తీర్మానించుకొరకు యెంతవరకు సదరు అంశములు విచారించవలసిన అవసర ముండునో అంతవరకు విచారించి తీర్మానము చేయవచ్చును. ఒక దావాను ఒక తండ్రిపైనను, అతని అవిభక్త కుమాళ్ళనేకారణముతో వారిపైనను దాఖలుచేసినప్పుడు కుమాళ్ళు తాము అవిభక్తకుమాళ్లు కామనియు, దావాబాకీని తీర్చుటకు బాధ్యులము కామనియు వాదించేయెడల అట్టి సందర్భములో గ్రామకోర్టువారు వారి హోదాను గురించి విచారించి తీర్మానించవచ్చును. అటులనే ఒకరి మైనార్టీ విషయమును గాని, దత్తతవిషయమునుగాని, వారసత్వవిషయమునుగాని విచారించవచ్చును. ఒకదావాలో వాది చనిపోయిన యెడల అతని స్థానే చేరదలచినవారికి వాది న్యాయశాస్త్ర ప్రతి నిధినని చెప్పే హోదా కలదా లేదా అను అంశమును, లేక ఒక దావాలో ప్రతివాది చనిపోయినయెడల అతని స్థానే చేరవలసిన ప్రతినిధి అతని న్యాయశాస్త్ర ప్రతినిధి యగునా కాదా అను అంశమున్ను, అతని స్వాధీనములోయున్న చరాస్తి గాని, స్థిరాస్తిగాని చనిపోయిన ప్రతివాదికి చెంది అతని ద్వారా న్యాయశాస్త్ర ప్రతినిధికి సంక్రమించెనా లేదా అనే అంశములను గ్రామ కోర్టువారు తమ యెదుటయున్న దావాను పరిష్కరించుటకు యెంతవరకు ఆవశ్యకమో అంతవరకు తీర్మానించవచ్చును. కాని అట్టి తీర్పువల్ల ఆ అంశము ఉభయవాదులమధ్య శాశ్వతముగా నిర్ణయింపబడి నట్లున్ను, సదరు దావాకు పార్టీలను వారి స్థానీయులను లేక బాధ్యస్థులను దరిమిలా వ్యవహారములలో బాధించునని గాని యెంచుటకు వీలులేదు.

కాలనిర్ణయము.

20. 1877 వ సంవత్సరమందు పుట్టిన ఇండియాదేశపు కాల నిర్ణయ ఆక్టుయొక్క నిబంధనలు ఈ ఆక్టును అనుసరించిన వ్యాజ్యములకున్ను దర ఖాస్తులకున్ను సంబంధపడవలసినది.

వ్యాఖ్య.

(1) ఈ సెక్షనువల్ల ఇండియన్ లిమిటేషను ఆక్టు నిబంధనలు ఈ ఆక్టుక్రింద దాఖలగు దావాలకు పిటీషనులకు వర్తింపజేయబడినవి.

(2) గ్రామకోర్టుల డిక్రీలకు లిమిటేషను:—

ఈ సెక్షను ప్రకారము గ్రామకోర్టుల డిక్రీల లిమిటేషనుకుకూడ లిమిటేషన్ ఆక్టు నిబంధనలే వర్తించును. సివిల్ ప్రొసీజరుకోడు వర్తించు సివిల్ కోర్టులచే యివ్వబడిన డిక్రీలను అమలుజరుపుటకు డిక్రీ తేదీనుండి 12 సంవత్సరములు గడచిన తరువాత క్రొత్తవారంటు దరఖాస్తు దాఖలు చేయబడ కూడదనే నిబంధన సివిల్ ప్రొసీజరుకోడు సె 48 లో యున్నది. కాని సివిల్ ప్రొసీజరుకోడు నిబంధనలేవియు గ్రామకోర్టులకు వర్తించవని మద్రాసు హైకోర్టువారు అనేక కేసులలో తీర్మానించియున్నారు. ఆ.ఇ.రి 1930 మద్రాస్ 795=1930 మ.వీ.నో 712=32 మ.లా.వీ 158; 65 మ.లా.జ. 795; 51 మ.లా.జ 561; 52 మ.లా.జ 153; 5 మ.లా.వీ నో.ఆ.కే 43; ఇ.లా.రి 13 మద్రాస్ 145; 1933 మ. వీ. నో 1370 = ఆ. ఇ. రి 1934 మద్రాస్ 8; 44 మ.లా.జ 643=ఇ.లా.రి 46 మద్రాస్ 734 కేసులను చూడవలెను.

అందువల్ల సివిల్ ప్రొసీజరు కోడులోయున్న 12 సం॥ల లిమిటేషను గ్రామకోర్టు డిక్రీలకు వర్తించదు.

లిమిటేషను ఆక్టు ఆర్టికిల్ 182 ప్రకారము మూడు సంవత్సరముల కొక పర్యాయము వారంటుదరఖాస్తుయున్న గ్రామ కోర్టుల డిక్రీలకు యెంతకాలముకు లిమిటేషను యుండదు. పూర్వము సివిల్ ప్రొసీజరుకోడు వర్తించు కోర్టుల డిక్రీలకు కూడ ప్రథమములో 12 సంవత్సరముల లిమిటేషను లేదు. తరువాత కొంతకాలమునకు ఆ నిబంధన చేర్చబడినది.

ఒక గ్రామకోర్టులో పొందబడిన డిక్రీ డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు అమలు నిమిత్తము ట్రాన్స్ఫరు చేయబడినప్పటికి 12 సంవత్సరముల లిమిటేషను వర్తించదు. ఒక డిక్రీకి లిమిటేషనుపట్టినదా లేదా అని నిర్ణయించుటకు డిక్రీని జారీచేసిన కోర్టుకు వర్తించు లిమిటేషను నిబంధనలనుబట్టి యుండునుగాని డిక్రీ అమలుచేయుచున్న కోర్టుకు వర్తించు లిమిటేషను నిబంధనలు వర్తించవు.

మద్రాస్ హైకోర్టులో

ప్రధాన న్యాయమూర్తి:- రాజమన్నార్ న్యాయమూర్తి:–సోమసుందరంగారలు.

## C. R. P. 1870 of 1952 (22-4-1955)

పొన్నంబట్ కూమిల్లి గోపాలన్ నంబియార్ — పిటీషనరు

వరిస్సకు కూనియల్ కృష్ణన్ నంబియార్ — రెస్పాండెంటు

సివిల్ ప్రొసీజరు కోడు సె 48—గ్రామకోర్టుల డిక్రీ అమలుకు వర్తించునా?

కేసు సంగతులు.

20-11-1937 తేదీన ఒక పంచాయతీబోర్డువల్ల ఒక డిక్రీ యివ్వబడినది. ఆడిక్రీ తెల్లిచెర్రి అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు అమలుకు ట్రాన్స్ఫరు చేయబడినది. ఆ డిక్రీ అమలుకు అనేక పర్యాయములు దరఖాస్తులు దాఖలుచేయబడినవి. చివరకు 28-6-1951 తేదీన యీరివిజన్ పిటీషనుకు సంబంధించిన వారంటు దరఖాస్తు దాఖలు చేయబడినది. ఆదరఖాస్తుకు లిమిటేషను ఆక్టు ఆర్టికిల్ 182ప్రకారము లిమిషనులేదు అనగా 3 సంవత్సరముల కొకసారి లోగడ వారంటు దరఖాస్తులున్నవి.

కాని ప్రతివాది ఆ వారంటు దరఖాస్తుకు సివిల్ ప్రొసీజరు కోడు సె 48 ప్రకారము లిమిటేషను పట్టినదని వాదన చేసెను.

డిస్ట్రిక్టు మునసబు సివిల్ ప్రొసీజరు కోడు సె 48 గ్రామ కోర్టులకు డిక్రీ అమలుకు వర్తించదని తీర్మానించెను. ఆ ఆర్డరునుండి జిల్లాకోర్టుకు చేయబడిన అప్పీలులో జిల్లాజడ్జి డిస్ట్రిక్టు మునసబు తీర్పును ఖాయపరచెను. ఆ ఆర్డరును రద్దుచేయమని ప్రతివాది హైకోర్టులో యీ రివిజన్ పిటిషను దాఖలాచేయగా హైకోర్టువారు యీ క్రింది విధమున తీర్మానించిరి.

తీర్పు.

ముందుగా గ్రామకోర్టుల డిక్రీ అమలుకు మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టులోగల నిబంధనలను పరిశీలించవలసియున్నది. సదరు ఆక్టు సె 48 లో ఆ కోర్టు డిక్రీలు, డిక్రీ యిచ్చిన గ్రామకోర్టువల్లగాని, లేదా ఆ డిక్రీ ట్రాన్స్ఫరు చేయబడిన మరియొకగ్రామ కోర్టు లేదా డిస్ట్రిక్టు మునసబు కోర్టు వల్ల అమలు జరుపవలెనని యున్నది. అమలు డిస్ట్రిక్టు మునసబువల్ల జరుపబడుచున్నగాని లేనియెడల ప్రతివాదిని అరెస్టుచేయుటగాని ప్రతివాది స్థిరా స్తిపై అమలు జరుపుటగాని కూడదని సె 51 లో యున్నది. గ్రామ కోర్టు ప్రతివాదియొక్క చరా స్తిని మాత్రము జప్తుచేయవచ్చునని సె 52లో యున్నది. జప్తు చేయబడిన ఆస్తి వేలముకుతెచ్చి వేలము వేయుటకు, వేలములో ఆ స్తిని ఖరీదుచేసిన ఖరీదుదారుకు ఆ స్తిని స్వాధీనపరచుట మొదలగు విషయములను గురించి ప్రత్యేక నిబంధనలున్నవి.

తరువాత సె 66 లో గ్రామ కోర్టుల డిక్రీని డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు ట్రాన్స్ఫరు చేయుటకు నిబంధనయున్నది. ఆ సెక్షనులో యిటులున్నది.

సె 66 (1) డిక్రీహోల్డరు దరఖాస్తుపెట్టుకొన్నమీదట ఒక గ్రామకోర్టువారిచే సాదరు చేయబడిన యే డిక్రీ అయినను అమలు జరుపబడగలందులకు డిస్ట్రిక్టుమునసబు గారికి పంపబడవచ్చును. మరిన్ని ఆయన (ఏ) అది తనచే సాదరు చేయబడిన డిక్రీ అయియుండిన నెట్లో అట్లే ఆ డిక్రీని అమలు జరిపించవచ్చును, లేదా,

(బి) ప్రతివాదికి వ్యాస్తి యున్నట్లు చెప్పబడు తన విచారణాధికారస్థానికమునకు లోగానుండు ఏ యితర గ్రామ కోర్టుకైనను అమలు జరుపుటకొరకు దానిని పంపవచ్చును, లేదా,

(సి) ఎవరి విచారణాధికారస్థానికములో ప్రతివాది కాపురముండునో లేదా ఆస్తిని కలిగియున్నట్లు చెప్పబడునో అట్టి వేరే యితర డిస్ట్రిక్టు మునసబు కోర్టుకైనా దానిని పంపవచ్చును.

(2) (1) వ సబ్ సెక్షను "సి" క్లాజు ననుసరించి డిక్రీ పంపబడిన డిస్ట్రిక్టు మునసబు, అది తనచే సాగు చేయబడిన డిక్రీయై యుండిన యెట్లో అట్లే ఆ డిక్రీని అమలు జరిపించవచ్చును. లేదా ప్రతివాదికి వ్యాస్తి యున్నట్లు చెప్పబడు తన విచారణాధికారస్థానికమునకు లోగా యేదైనా యితర గ్రామకోర్టుకు అమలు జరుపుటకొరకు దానిని పంపవచ్చును.

(3) 1వ సబు సెక్షను లోని (సి) క్లాజు ననుసరించిగాని 2వ సబుక్లాజు ననుసరించి గాని, డిక్రీ పంపబడిన గ్రామకోర్టువారు, ఆ డిక్రీ తనచే సాగు చేయబడియుండిన యెట్లో అట్లే చర్యతీసుకొనవలెను.

సె 67 ప్రకారము దరఖాస్తు లేకున్నను డిస్ట్రిక్టు మునసబు తనంతటతాను ఒక డిక్రీని గ్రామకోర్టునుండి తనకోర్టుకు తీసుకొని తనచే యివ్వబడినట్లు అమలుజరుపుటకు అధికారముయున్నది. సె 67 A లో అట్టి డిక్రీ అమలులో చరాస్తి జప్తుకు లేదా విక్రయమునకు సంబంధించిన డిస్ట్రిక్టు మునసబు ఆర్డర్లనుండి అప్పీలు యుండదని స్పష్టముగా నిబంధన చేయబడినది. సె 20 లో ఇండియన్ లిమిటేషను ఆక్టు నిబంధనలు గ్రామకోర్టుల దావాలకు దరఖాస్తులకు వర్తించుననే నిబంధనయున్నది.

సివిల్ ప్రొసీజరుకోడు సె 48 గ్రామకోర్టు డిక్రీలకు వర్తించునా అని తీర్మానించవలసియున్నది. సివిల్ ప్రొసీజరుకోడుగాని అందులోని ఏ నిబంధనలైనా గ్రామకోర్టులకు వర్తించుననే నిబంధన గ్రామకోర్టుల ఆక్టులో లేదు. దానినిబట్టి అనేక తీర్పులలో సివిల్ ప్రొసీజరుకోడు నిబంధనలు గ్రామ కోర్టులకు వర్తించవని తీర్మానించబడినవి. 1938 (1) మ.లా.జ 229, (1933) 65 మ.లా.జ 1951, 1940 (1) మ.లా.జ 220, (1923) 44 మ.లా.జ 643=ఇ.లా.రి 46 మద్రాసు 734 తీర్పులను జూడవలెను. ఆ తీర్పులనుబట్టి సివిల్ ప్రొసీజరుకోడు సె 48 గ్రామకోర్టుల డిక్రీఅమలుకు వర్తించదని కనుపడుచున్నది. గ్రామకోర్టు డిక్రీ డిక్రీయిచ్చిన కోర్టు వల్లగాని డిస్ట్రిక్టు మునసబు కోర్టువల్లగాని అమలు జరుపబడవచ్చును. గ్రామకోర్టులో డిక్రీ అమలు జరుపబడిన సివిల్ ప్రొసీజరుకోడు సె 48 వర్తించదని ఉభయవాదులు అంగీకరించుచున్నారు. కాని ఆ డిక్రీ డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు ట్రాన్సఫరు చేయబడిన సె 48 వర్తించునా అని విచారించవలసి యున్నది.

పిటీషనర్ల తరఫున కొన్ని తీర్పులు జూపబడినవి. కాని ఆ కేసులలో సె 48 విషయములేదు. మరిన్నీ ఆ కేసులలో డిక్రీయిచ్చిన కోర్టుకు డిక్రీ అమలుజరుపు

అధికారముులేదు. కాని గ్రామకోర్టుల డిక్రీ వేరు. అది ఒక సివిల్ కోర్టు డిక్రీ అయి యున్నది. గ్రామకోర్టుల ఆక్టులో ఆ డిక్రీ అమలుకు పూర్తి నిబంధనలున్నవి.

మద్రాస్ హైకోర్టు తీర్పులలో ఒక కోర్టుచే జారీచేయబడిన డిక్రీ మరియొక కోర్టుకు అమలుకు ట్రాన్స్ఫరుచేయబడిన, డిక్రీ యిచ్చిన కోర్టుకు వర్తించు లిమిటేషను నిబంధనలే, డిక్రీ ట్రాన్స్ఫరు చేయబడిన కోర్టుకుగూడ వర్తించునని ఆధారమున్నది. 21 మ. లా. జ 777 = ఇ. లా. రి 36 మద్రాస్ 108 కేసు చూడవలెను. ఆ కేసులో ప్రెసిడెన్సీ స్మాలుకాజు కోర్టు జారీచేసిన యొక డిక్రీ అమలుకు సిటీ సివిల్ కోర్టుకు పంబడనది. సె 48 సివిల్ ప్రొసీజరుకోడు ప్రెసిడెన్సీ స్మాలుకాజు కోర్టు డిక్రీలకు వర్తించదు. కాని సిటీ సివిల్ కోర్టు డిక్రీలకు వర్తించును. సె 48 సివిల్ ప్రొసీజరుకోడు ప్రెసిడెన్సీ స్మాలు కాజు కోర్టు డిక్రీ సిటీ సివిల్ కోర్టులో అమలు జరుపబడుచున్నను వర్తించదని తీర్మానించిరి.

ఈ విధముగనే ఇ.లా.రి 17 కలకత్తా 491, ఇ.లా.రి 24 కలకత్తా 473 కేసులలో గూడ తీర్మానించబడినవి. ఆ సూత్రమే 1950 (1) మ.లా.జ 437 లోను ఆ.ఇ.రి 1942 పాట్నా 128 కేసులలో అనుసరించబడినవి.

కాబట్టి సివిల్ ప్రొసీజరుకోడు సె 48 గ్రామకోర్టుల డిక్రీ డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు ట్రాన్స్ఫరు చేయబడినను వర్తించదని తీర్మానించుచున్నాము.

1955 (2) మ. లా. జ 388

(3) లిమిటేషను ఆక్టు సె 12 (2) గ్రామకోర్టుల ఆర్డర్లనుండి డిస్ట్రిక్టు మునసబు కోర్టులలో సె 73 ప్రకారము దాఖలగు రివిజన్ పిటీషనులకు వర్తించును. సె 73 ప్రకారము 60 దినములు లెక్కించుటలో గ్రామకోర్టు తీర్పు నకలు తీసుకొనుటకు పట్టిన కాలము మినహాయించవలసియుండును. సె 13 క్రింద పిటీషనులతో గ్రామకోర్టు తీర్పు నకలు దాఖలుచేయ నగత్యములేనప్పటికి నకళ్ళు తీసుకొనుటకు పట్టిన కాలమును మినహాయించవలెను.

(4) గ్రామకోర్టులు లిమిటేషను ఆక్టు నిబంధనలను గమనించి వాటిననుసరించ వలెనేగాని ఒక దావాకుగాని పిటీషనుకుగాని లిమిటేషను ఆక్టు నిబంధనల ప్రకారము లిమిటేషను పట్టినట్లు కనుపడిన, ఆ నిబంధనలకు వ్యతిరేకము తీర్మానించుటకు అధికారము యుండదు. అట్టి తీర్పులు చెల్లవు.

ఈ సెక్షను క్రింద హైకోర్టు తీర్పు

(1) 1936 మ॥ వీ. నో. 947

మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి వెంకటరమణారావుగారు

C. R .P. 1064 of 1934 (30-7-36)

ఉప్పరపల్లి చిట్టి అనే గోవిందరాజు మరియొకరు—పిటీషనర్లు

కొప్పుల అచ్చాయమ్మ—రెస్పాండెంటు.

వాని పంచాయతీకోర్టులో ప్రతివాని తన భర్తకు రు 50 లు బాకీయున్నాడని, తన భర్త దావాకు రెండు సంవత్సరములకు పూర్వము చనిపోయినాడని, ఆబాకీ తనకు రావలెనని దావా దాఖలు చేసెను.

కాని దావా విచారణలో వాని భర్త దావాకు పూర్వము 4 సంవత్సరముల క్రింద చనిపోయినట్లు తేలినది. ఆ ప్రకారము ప్లయింటుకూడా సవరణ చేయబడినది. ప్లయింటునుబట్టియే దావాకు లిమిటేషను పట్టినట్లు స్పష్టముగా కనబడుచున్నది. కాని పంచాయతీకోర్టువారు ఆ బాకీ వడ్డీ క్రింద ప్రతివాది వసూలు యిచ్చినట్లు కొందరు సాక్షులను విచారించి ఆ సాక్ష్యముపై వాదికి డిక్రీనిచ్చిరి.

ఆ తీర్పునుండి ప్రతివాది డిస్ట్రిక్టు మునసబు కోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు పంచాయతీకోర్టువారు సాక్ష్యముపై దావాను తీర్మానించి నందున తనకు ఆ తీర్పును రద్దుపరచుటకు రివిజన్‌లో అధికారములేదని యెంచి ప్రతివాది పిటీషనును పరిహరించెను. ఆ తీర్పునుండి ప్రతివాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు పంచాయతీ కోర్టులో వాది దాఖలు చేసిన ప్లయింటునుబట్టియే వాది దావాకు లిమిటేషను పట్టినట్లు స్పష్టముగా కనబడుచున్న దనియు, అట్టి పరిస్థితులలో పంచాయతీకోర్టువారు సాక్షులను విచారించి డిక్రీనిచ్చుట తప్పనియు, డిస్ట్రిక్టుమునసబు రివిజన్‌లో విధిగా పంచాయతీకోర్టు డిక్రీని రద్దు పరచి యుండవలసినదని యెంచి వాది దావాను ఖర్చులతో పరిహరించిరి.

(2) 1941 మ. వీ. నో. 349 = 1941 (1) మ. లా. జ. 540

మద్రాస్ హైకోర్టులో

న్యాయమూర్తి- కృష్ణస్వామి అయ్యంగారు.

దిస్టాండర్డు షైపు ఫౌండరీ తరఫున ప్రొప్రయిటరు, ఎ. తిరువెంగడ మొదలియార్. } పిటీషనరు

చేబ్రోలు వెంకటరామయ్య — రెస్పాండెంటు

ప్రతివాదిపైన వాది రాజమండ్రి రెండవపంచాయతీకోర్టులో రు 24-10-6లకు దావా తెచ్చెను. ప్రతివాది తాను వాదికి బాకీ లేదని, ఆ దావాను విచారించుటకు పంచాయతీ కోర్టుకు అధికారము లేదని ఆన్సరు దాఖలు చేసెను. కాని విచారణ దినమున అనగా ది 4-2-1937 తేదీన ప్రతివాది పంచాయతీకోర్టుకు హాజరుకానందున ప్రతివాదిపైన యక్సుపార్టీగా డిక్రీ యివ్వబడినది.

ది 3-8-37 తేదీన ప్రతివాది సదరు డిక్రీని రద్దుపరచమని డిస్ట్రిక్టు మునసబు కోర్టులో సె 73 ప్రకారము రివిజన్ పిటీషను దాఖలు చేసెను. ఆ పిటీషనులో ప్రతివాది తాను రాజమండ్రిలో కాపురములేనందున ఆ పంచాయతీకోర్టుకు దావాను విచారించుటకు అధికారము లేదని వ్రాసెను.

గ్రామకోర్టుల ఆక్టు సె 73 ప్రకారము డిస్ట్రిక్టు మునసబుకోర్టులో గ్రామకోర్టు ఆర్డరు తేదీనుండి 60 దినములలోగా రివిజన్ పిటీషను దాఖలు చేయవచ్చుననియున్నది. అందువల్ల డిస్ట్రిక్టు మునసబు ప్రతివాది పిటీషనుకు లిమిటేషను పట్టినదని ది 5-8-37 తేదీన పరిహరించెను. ది 12-8-37 తేదిన ప్రతివాది ది 5-8-37 తేదీ ఆర్డరును రివ్యూ చేయమని మరియొక పిటీషను దాఖలు చేసెను. ఆ పిటీషనులో అతివరిలో తాను దాఖలుచేసిన సె 73 పిటీషనుకు 60 దినములు లెక్కించుటలో గ్రామకోర్టు ఆర్డరు నకలును తీసుకొనుటకు పట్టిన కాలమును లిమిటేషను ఆక్టు సె 12 ప్రకారము మినహాయించవలెనని కోరెను.

కాని డిస్ట్రిక్టు మునసబు లిమిటేషను ఆక్టు సె 12 లో చెప్పబడిన అప్పీలుగా గ్రామకోర్టు తీర్పుపైన తనవద్ద దాఖలుకాబడిన రివిజను పిటీషనును యెంచుటకు వీలులేదని లిమిటేషను ఆక్టు సె 12 వర్తించదని ప్రతివాది పిటీషనును పరిహరించెను.

ఆ తీర్పునుండి ప్రతివాది హైకోర్టులో రివిజను పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు యీ క్రింది విధమున తీర్మానించిరి.

తీర్పు.

డిస్ట్రిక్టుమునసబు లిమిటేషను ఆక్టు సె 12 లో అప్పీలు అనేమాటకు సంకుచిత అర్థమును జెప్పెను. 1937 (1) మ. లా. జ. 458 = ఇ. లా. రి. 1937 మద్రాస్ 606 కేసులో లిమిటేషను ఆక్టు ఆర్టికల్ 182 (2) లోని అప్పీలు అను మాటలో రివిజన్ పిటీషనులు గూడ జేరునని తీర్మానించబడినది. రివిజన్ కూడ అప్పీలు హక్కుమారిన హక్కు.

రెస్పాండెంటు తరఫున సె 73 క్రింద పెట్టిన పిటీషనులతో ఆర్డరు నకలు దాఖలు చేయవలసిన అగత్యము లేదని, అందువల్ల ఆ కాలము మినహాయించ వీలులేదని వాదించబడినది. కాని 54 మ. లా. జ. 696 (ప్రీవికౌన్సిల్) కేసులో ప్రీవికౌన్సిల్ వారు ఒక పిటీషనుతో నకళ్ళు దాఖలుచేయవలసిన అగత్యము లేనప్పటికి లిమిటేషను ఆక్టు సె. 12, (2) నిబంధనలు వర్తించునని తీర్మానించిరి.

కాబట్టి డిస్ట్రిక్టు మునసబు ఆర్డరును రద్దు పరచవలసినది.

గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యములు.

**20–A.** (1) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యము ఒక డిస్ట్రిక్టు మునసబుయొక్క కోర్టులో దాఖలుచేయబడు నెడల, ఆయన యిందుకు భిన్నముగా చాలినంత కారణము లుండిననే తప్ప దానిని గ్రామ కోర్టునకు ట్రాన్స్ఫరు చేయవచ్చును.

డిస్ట్రిక్టు మునసబు విచారించు వ్యాజ్యముల ఖర్చులు.

(2) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యమును ఒక డిస్ట్రిక్టు మునసబు విచారించునెడల మరియు, ఆ వ్యాజ్యము గ్రామకోర్టులో దాఖలు చేయబడవలసి యుండెనని ఆయన అభిప్రాయుడైనయెడల విజయముపొందిన వాదికి ఖర్చులు ఏవియు అనుమతింపబడగూడదు. మరియు జయము పొందిన ప్రతివాదికి ప్లీడరు క్లయింటు సంబంధపు ఖర్చులు అనుమతింపబడవలెను.

## వ్యాఖ్య.

(1) ఒక గ్రామకోర్టులో దాఖలు కాబడవలసిన దావా డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయబడినయడల, సదరు దావాను డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దాఖలు చేయుటకు తగిన కారణములున్నగాని లేనియడల సదరు దావా యే గ్రామ కోర్టులో దాఖలు కావలసియుండునో ఆ గ్రామ కోర్టుకు ట్రాన్స్ఫర్ చేయవచ్చును. ఉ॥ "ఏ" అనే డిస్ట్రిక్టు మునసబుకోర్టు యిలాకా "బి" అనే గ్రామకోర్టులో దాఖలు కావలసిన దావాను "ఏ" డిస్ట్రిక్టు మునసబుకోర్టులో యెట్టికారణములేనిదే దాఖలు చేయబడెను. అప్పుడు "ఏ" డిస్ట్రిక్టు మునసబుకోర్టువారు సదరు దావాను "బి" గ్రామకోర్టుకు ట్రాన్స్ఫర్ చేయవచ్చును. కాని తమకోర్టు అధికారములోయున్న మరి యే యితర గ్రామకోర్టుకు ట్రాన్స్ఫర్ చేయు అధికారములేదు. కాని సె. 21 ప్రకారము వాదిగాని ప్రతివాదిగాని ఒక గ్రామకోర్టునుంచి ఒక దావాను ట్రాన్స్ఫర్ చేయమని పిటీషను దాఖలు చేసినప్పుడు డిస్ట్రిక్టు మునసబుకోర్టువారు సదరు దావాను తమకోర్టుకుగాని తమకోర్టు అధికారములోయున్న మరి యే యితర గ్రామకోర్టుకుగాని ట్రాన్స్ఫర్ చేయవచ్చును.

(2) గ్రామకోర్టువారికిన్ని వాదికిన్ని విరోధమున్న సందర్భములోగాని లేక దావాలో విచారించవలసిన "లా" విషయములు యెక్కువ కష్టముగా యున్నప్పుడు గాని సాధారణముగా దావాలను డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దాఖలు చేయవచ్చును.

(3) డిస్ట్రిక్టు మునసబుగారు ఒక గ్రామకోర్టులో దాఖలు కాబడవలసిన దావాను విచారించిన మీదట సదరు దావా తమ కోర్టులో దాఖలు చేయుటకు తగిన కారణములులేవని యెంచేయెడల వాది దావాలో జయము పొందినను వాదికి ఖర్చులకు డిక్రీ యివ్వనగత్యములేదు. ప్రతివాది జయముపొందినయెడల ప్రతివాదికైన యావత్తుఖర్చులు ప్లీడరు ఫీజుతోసహా వాదివల్ల ప్రతివాదికి యిప్పించవలసి యుండును.

(4) కాని గ్రామకోర్టులో దాఖలు కావలసిన దావా డి॥ము॥ కోర్టులోదాఖలు చేయుటకు యెట్టికారణములు లేనప్పుడు దాఖలుచేయబడినను దానిని విచారించుటకు

డి॥ ము॥ కు సంపూర్ణ అధికారముకలదు. గ్రామకోర్టు ఆక్టు క్రింద గ్రామకోర్టులకు అధికారము యిచ్చుటవల్ల గ్రామకోర్టులు విచారించే దావాలను విచారించేహక్కు డి॥ ము॥ కోర్టుకు తిసివేయబడియుండలేదు. డి॥ ము॥ గారికికూడా ఆ దావాలను విచారించుటకు గ్రామకోర్టులతోపాటు అధికారముకలదు.

హైకోర్టు తీర్పు.

(1) 13 ఇ. లా. రి. మద్రాసు 145

జడ్జీలు:— ముత్తుస్వామిఅయ్యర్, పార్కర్ గార్లు

మీర్ ఖాన్—వాది

కాదర్ సా—ప్రతివాది

వాది తనకు ప్రతివాదివల్ల రావలసిన అద్దె రు 18-0-0 లకు లిఖితరూపకమైన అద్దె ఖరారునామానుబట్టి డి॥ ము॥ కోర్టులో దావా తెచ్చెను. ప్రతివాది సదరుదావా గ్రామకోర్టులో దాఖలు కాబడవలసినదేకాని డి॥ ము॥ కోర్టువారు విచారించుటకు సి. ప్రొ. కో. సె 15 ప్రకారము వీలులేదని వాదించెను. అందుపైన హైకోర్టువారి అభిప్రాయమునకు వ్రాయగా హైకోర్టువారు:— సి. ప్రొ. కో. విధులు గ్రామకోర్టులకు వర్తించవనియు, అట్టి దావాలను విచారించుటకు గ్రామకోర్టులతోపాటు డి॥ము॥కు కూడ అధికారమున్నదనియు, గ్రామకోర్టులకు యివ్వబడిన అధికారమువల్ల డి॥ ము॥ కోర్టుకు అట్టి దావాలు విచారించే అధికారము తీసివేయబడలేదనియు తీర్మానించిరి.

(2) 1947 (1) మ.లా.జ. 252=1947 మ.వీ.నో. 189=60 మ.లా.వీ. 202=ఆ.ఇ.రి 1948 మద్రాస్ 67

మద్రాస్ హైకోర్టులో న్యాయమూర్తి యాహ్యాలి గారు.

## S. A. 1333 of 1945 (13—3—46)

యరమళ్ళ సంజమ్మ—అప్పెలెంటు

ఎదిరి

అన్న శాయన్న—రెస్పాండెంటు

గ్రామ కోర్టుల తీర్పు ఆఖరుదిగా యుండవలెనని సె 73 లో యున్న మాటలకు ఆ గ్రామ కోర్టుకు సంబంధించినంతవరకు ఆఖరు తీర్పుఅని యెంచవలసి యుండును.

కేసు సంగతులు

అప్పెలెంటు యీ దావాలోని వాదియై యున్నాడు, అతని యిల్లు ప్రతివాదికి రు 170 లకు స్వాధీన తాకట్టు పెట్టబడినది. 1 ప్రతివాదికి వాది యివ్వవలసిన ఒక బాకీకి అతనిపై కంబం పంచాయితీ కోర్టులో ఒక దావా తేబడి డిక్రీ పొందబడినది. వాదియిల్లు మార్కాపురం డిస్ట్రిక్టు మునసబు కోర్టు అధికార హద్దులలో యున్నందున ఆ డిక్రీ సదరు డిస్ట్రిక్టు మునసబుకు అమలు నిమిత్తము ట్రాన్స్ఫరు చేయబడినది. అతను

లులో ఇ. పి. 28 ఆఫ్ 1942 వారంటు సరిక్షాస్తుపయిన చర్యలలో 16-10-1942 తేదీన వేయబడిన వేలములో వాదియొక్క ఆస్తిని 2 ప్రతివాది తనపేర ఖాతుగా జడి రు. 155 లకు ఖరీదు చేసెను.

అందుపయిన వాది ఆ డిక్రీ తనపయి దగాగా పొందబడినదనిన్ని ఆ డిక్రీ అమలులో జరిగిన వేలం చర్యలు దగాగా చేయబడినవనిన్ని వేలం రద్దు పరిపించమని ఈ దావాను దాఖలు చేసెను. డిక్రీ పొందుటలో జరిగిన దగా ఏమన, వాది అసేవరంలో శాశ్వతముగా కంబం గ్రామము వదలిపెట్టి మార్కాపురంలో శాశ్వతముగా కాపురముంటూ యున్నప్పటికి, అధికారములేని కంబం కోర్టులో దావా దాఖలు చేయబడినది.

వేలం విషయములోని దగా ఏమన, వాది వద్దనుండి 1 ప్రతివాది తన డిక్రీ పూరా పరిష్కారము క్రింద రు 50 లు తీసుకొనేలాగున యేర్పాటు చేసుకొన్నారనియు, సదరు యేర్పాటు ననుసరించి 17-8-42 తేదీన వాది ప్రతివాదికి, ఆ మొత్తమును వాది యిచ్చుటకు వేలమును రెండు మాసములు వాయిదా వేయమని ఉభయ వాదులు పిటీషను దాఖలుచేసిరని, అందుపై వేలం 16-10-42 తేదీకి వాయిదా వేయబడినదని, ఆ లోగా వాది 1 ప్రతివాదికి రు 50 లు మొత్తములో కొంత మొత్తమును యిచ్చెనని, 1 ప్రతివాది 16-10-42 తేదీన వేలం కాకుండా వాయిదా వేయించెదనని నమ్మించినాడని, ఆ ఏర్పాటుకు భిన్నముగా 1 ప్రతివాది 2వ ప్రతివాదితో లాలూచి అయి 16-10-42 తేదీన 1 ప్రతివాది చెప్పిన మాటలు నమ్మి వాది కోర్టును హాజరు కాని అవకాశము చూచుకొని ఆపైని వేలం వేయించెనని దావాయిల్లు వాస్తవముగా రు 600 లు ఖరీదు చేయునని; 1, 2 ప్రతివాదులు లాలూచీఅయి తక్కువ మొత్తమునకు వేలం వేయించిరని వాది వాదించుచున్నది. 1 ప్రతివాది వాది వాదనలను బలపరచుచూ తాను వేలమును వాయిదా వేయించమని తన వకీలుగారికి ఉత్తరము వ్రాసి ఆ ఉత్తరమును వాదికి యివ్వమని 2వ ప్రతివాది ద్వారా పంపగా 2 ప్రతివాది దగా చేసి యివ్వక వేలంలో తానే ఖరీదుచేసెనని ఆన్సరు దాఖలుచేసెను. 2 ప్రతివాది పై అంశములన్నియు అబద్ధమని, డిక్రీ పొందుటలోగాని వేలంచర్యలలోగాని యెట్టి దగా లేదని వాది 1 ప్రతివాదులు లాలూచీ అయిరని దావా లా ప్రకారము నిల్వనేరదని ఆన్సరు దాఖలు చేసెను.

దగా విషయమైయున్నా వారంటుచర్యలలో ముఖ్యమైన పొరబాటులున్నవా అను విషయమును గురించి చాలా సారాంశములు యివ్వబడెను.

3వ సారాంశము యిటుల యివ్వబడినది. వారంటు చర్యలలో జరిగిన వేలమును రద్దుచేయమని దాఖలుచేసిన దావా లా ప్రకారము చెల్లునా ?

దావాను విచారించిన మార్కాపురం డిస్ట్రిక్టుమునసబుకోర్టువారు పైసారాంశమును మాత్రము ముందుగా విచారించి సి.ప్రొ.కో. ఆ. 21 రూ. 92 (3) ప్రకారము అట్టి దావా చెల్లదని వాది దావాను పరిహరించెను. ఆ తీర్పును అప్పీలులో

కర్నూలు జిల్లా కోర్టువారు ఖాయపరచిరి. ఆతీర్పునుండి వాది హైకోర్టుకు రెండవది అప్పీలు చేయగా హైకోర్టువారు యీ క్రింది విధమున తీర్మానించిరి.

తీ ర్పు.

ఈ దావా నిల్వదని చెప్పుటకు సి. ప్రో. కో. ఆ 21 రూ92 (3) పై అధారపడు చున్నారు. ఆ21 రూ90 ప్రకారము వేలం చర్యలలో లోపముగాని దగాగానియున్న వేలమును రద్దు పరిపించమని పిటీషను దాఖలు చేయవచ్చునని యున్నది.

రూ 92 (1) లో ఆ 21 రూ 90 ప్రకారము వేలం రద్దు నిమిత్తము పిటీషను దాఖలు చేయబడనప్పుడు వేలము ఖాయపరుప బడవలెనని అందుపైన వేలము ఖాయ పడునని యున్నది.

ఆ 92 (3) లో వేలంను ఖాయపరుచుచు జారీచేసిన ఆర్డరును రద్దుపరచుటకు యెట్టి దావాను దాఖలుచేయకూడదని యున్నది. ఈ కేసులో ఆ 21 రూ 90 ప్రకారము పిటీషను దాఖలు చేయబడనందున ఆ 21 92 (1) క్రింద వేలము ఖాయపరచుచు ఆర్డరు చేయబడినది.

జిల్లాకోర్టులోని మొదట అప్పీలులో వాది వకీలు దావా ఆ 21 రూ 92 (3) ప్రకారము నిల్వనేరదని వప్పుకొన్నట్లు అందుపైన జిల్లాజడ్జి క్రిందికోర్టు తీర్పును ఖాయపరచినట్లు చెప్పబడినది. యీకోర్టులో వాది (అప్పెలెంటు) వకీలు క్రిందికోర్టులో వాది వకీలు వప్పుకొనుట తప్పని, యీ అంశము లాకు సంబంధించిన అంశమగుట చేతను ఆ వప్పుదలకు వ్యతిరేకముగా వాదన చేయవచ్చునని చెప్పుచున్నారు.

ఒక డిక్రీ అమలు చర్యలలో జరిగిన వేలం ప్రచురపరచుటలోను వేలంవేయుట లోను ఏవో లోపములుగాని దగాగాని యున్నచో ఆ 21 రూ 90, 92 లు వర్తించును. గాని వాదన అట్టి విషయములకు సంబంధించినదిగా యుండనప్పుడు ఆ 21 రూ 90, 92లు వర్తించవని అప్పెలెంటు వకీలు వాదన. ఆవాదన సరియైనదని నేను భావించుచున్నాను. అమలు జరుపబడిన డిక్రీ దగాగా పొందబడినదనే విషయము, సదరు డిక్రీ అమలులో వేలం డిక్రీహోల్డరు, ఖరీదుదారు వగైరాలు లాలూచీ అయి దగాగా వేలం వేయించి రనే విషయములకు ఆ 21 రూ 90 వర్తించదు.

ఇ. లా. రి. 29 కలకత్తా 395 ప్రీవికౌన్సిలు 2 ఇ. లా. రి 47 అల్హాబాదు 217 కేసులను చూడవలెను.

జిల్లాజడ్జి తన తీర్పులో వాది క్రిందికోర్టులో వేలము వాయిదా వేయించమని 1 ప్రతివాదితో కలిపి పిటీషను దాఖలుచేసినందున డిక్రీకి వప్పుకొన్నట్లు యెంచవలెనని దరిమిలా డిక్రీ చెల్లదని వాదించుటకు వీలులేదని యెంచెను. కాని ఆ విషయమై దావాలో యెట్టి స్పష్టమైన వాదనగాని సారాంశముగాని లేదు. వాది డిక్రీ చెల్లని దైనను 50 రూపాయలు యిచ్చి పరిష్కారము చేసికొనవలెననితలచినట్లు 1 2 ప్రతివాద్లు

ఆలోచించి అయి దగా చేసి తక్కువ మొత్తమునకు ఆ ఆస్తిని వేలం వేయించిరని చెప్పు చున్నది. ఆ విషయమును విచారించక పిటీషను దాఖలుచేసినదన్న కారణముపైననే డిక్రీకి నప్పుడున్నట్లు గొంచుట న్యాయముకాదు. ఆ విషయము దావాలో పూర్తిగా విచారించవలసియున్నది.

జిల్లాజడ్జి మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె 73 ప్రకారము వాది దావా నిల్వనేరదని యెంచెను. సె 73 లో గ్రామకోర్టుల తీర్పును డిస్ట్రిక్టు మునసబుగారు పునర్విమర్శ చేయవచ్చునని యున్నది.

గ్రామకోర్టు చట్టప్రకారము తమకు యేర్పడిఉండిన అధికారమును తాము చలాయించలేద నే లేక మరియొక విధమున చట్టమునకు విరుద్ధముగా గాని బహు అక్రమముగా గాని ప్రవర్తించినారనే కారణము మీద డిస్ట్రిక్టు మునసబు గ్రామ కోర్టువారి డిక్రీ గాని, వుత్తరువునుగాని అట్టి డిక్రీ లేదా ఉత్తరువువల్ల అన్యాయమునుపొందిన యేకక్షిదారుడైనను అట్టి వుత్తరువు లేదా డిక్రీ చేసిన తారీఖు లగాయితు 60 దినముల లోగా. అర్జీ యిచ్చిన డిస్ట్రిక్టు మునసబులు రద్దుచేయవచ్చునని సె 73 లో యున్నది. మరియు ఆ సెక్షనులో నిబంధన కలుగచేసి వున్నప్రకారముతప్ప, గ్రామకోర్టుచేసే ప్రతి డిక్రీయున్నూ, ఉత్తర్వున్నూ ఆఖరుదిగా వుండవలసినదనికూడ యున్నది.

అందువల్ల వాది ఈ కేసులో గ్రామకోర్టులో 60 దినములలో డిక్రీరద్దుకు పిటీషను దాఖలుచేయనందున డిక్రీరద్దునిమిత్తము డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దావా దాఖలు చేయుటకు అధికారము యుండదనికూడ జిల్లాజడ్జి యెంచెను. కాని ఆ అభిప్రాయము సరియైనదికాదు. గ్రామకోర్టుల ఆక్టులో గ్రామకోర్టు తీర్పు ఆఖరుదని ఉన్నమాత్రముచే అట్టి డిక్రీల రద్దు పరచుటకు సివిల్ కోర్టులకు అధికారములేదా అని ఆలోచించవలసియున్నది. ఈ సందర్భములో అప్పెలెంటు తరఫున అనేక కేసులు చూపబడినవి. వాటిలో ముఖ్యమైనవాటిని ఆలోచించుచున్నాను. (1) 1949 (2) మ. లా. జ. 140 కేసులో ప్రీవీకౌన్సిల్ వారు ఒక ఆక్టులో సివిల్ కోర్టు అధికారము ప్రత్యక్షముగా తీసివేయబడిననేతప్ప సివిల్ కోర్టు అధికారముపోదు. అట్టి సందర్భములలోగూడ అట్టి ప్రత్యేక ఆక్టువల్ల నియమింపబడిన అధికారవర్గము సదరు ఆక్టు ప్రకారము విధులను నిర్వర్తించిరా లేదా అను అంశము సివిల్ కోర్టులు విచారించుటకు హక్కుయుండునని తీర్మానించిరి. ఆతీర్పును మద్రాస్ హైకోర్టువారు 1941 (2) మ.లా.జ 47=ఇ.లా.రి 1941 మద్రాస్ 850 (ఫుల్ బెంచి) తీర్పులో అనుసరించిరి.

పైతీర్పులలోని సూత్రముల ప్రకారము గ్రామకోర్టుల ఆక్టు సె 73 ప్రకారము సివిల్ కోర్టుల అధికారము పూర్తిగాతీసివేయబడినదా అని ఆలోచించవలసియున్నది.

గ్రామకోర్టుల ఆక్టు సె 13 లో ఆ కోర్టులు విచారించతగిన, విచారించ తగని కేసులు పేర్కొనబడినవి. సె 14 లో యే పరిస్థితులలో గ్రామ కోర్టుకు అధికారము యేర్పడునో ఆ విషయమున్నది. సె 20 ఏ లో ఈ విధముగా యున్నది.

20 ఏ (1) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యము ఒకడిస్ట్రిక్టుమునసబు కోర్టులో దాఖలుచేయబడునెడల అందుకు భిన్నముగా చాలినంత కారణములుండిననే తప్ప దానిని గ్రామకోర్టుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును.

(2) ఒక గ్రామకోర్టుచే విచారింపబడదగు వ్యాజ్యమును ఒక డిస్ట్రిక్టు మునసబు విచారించునెడల మరియు ఆవ్యాజ్యము గ్రామకోర్టులో దాఖలుచేయవలసియుండెనని ఆయన అభిప్రాయపడునెడల విజయముపొందిన వాదికి ఖర్చులు ఏమియు అనుమతించబడకూడదు. మరియు జయము పొందిన ప్రతివాదికి ప్లీడరు క్లయింటు సంబంధపు ఖర్చులు అనుమతింప బడవలెను.

సె 73 లో గ్రామ కోర్టుల తీర్పులను డిస్ట్రిక్టు మునసబు పునర్విమర్శచేయు అధికారము యివ్వబడినది. ఆక్టులో సివిల్ కోర్టుల అధికారము పూర్తిగా తొలగించు యెట్టి నిబంధన లేదు. పైగా సె 20 ఏ లో గ్రామకోర్టులతోపాటు డిస్ట్రిక్టుమునసబు లకుకూడా అధికారములున్నట్లు కనపడుచున్నది.

అందువల్ల 3 వ సారాంశముపై దావా చెల్లదని జిల్లాజడ్జి యిచ్చిన తీర్పు సరి కాదు. దావా చెల్లదగినదిఅయి వున్నది. అందువల్ల జిల్లాజడ్జి తీర్పునురద్దుపరచి దావా నిల్వతగినదని ఆ సారాంశముపై వాది పక్షముగా తీర్మానించుచున్నాము. అందువల్ల తక్కిన సారాంశములపై దావా తీర్మానించుటకు క్రింది కోర్టుకు పంపడమైనది.

(3) 1940 (I) మ.లా.జ 220=1940 మ. వీ. నో 189=51 మ.లా.వీ 179

మద్రాస్ హైకోర్టులో న్యాయమూర్తి మాకెట్ గారు

## C. R. P. 214 of 1937 (8-12-1939)

బోడ సుబ్బారావు — పిటీషనరు (వాది)

కాండ్రేగుల నర్సయ్య — రెస్పాండెంటు (ప్రతివాది)

వేసంగి శలవలలో లిమిటేషను పట్టిన ఒక నోటు బాకీ రు 20 లకు డిస్ట్రిక్టు మునసబు కోర్టు తెరచిన దినమున దాఖలు చేయుట - ఆ దావాను విచారించిన గ్రామ కోర్టు లిమిటేషను తేదీన తెరచియుండుట - వాది దావాను తన యిష్టానుసారము డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయవచ్చునా ?

కేసు సంగతులు

వాదికి ప్రతివాది యివ్వవలసిన ఒక ప్రోనోటు బాకీక్రింద వసూల్లుపోను నిలచియున్న రు 20 ల బాకీకి వాది రామచంద్రపురం డిస్ట్రిక్టు మునసబు కోర్టులో 22-6-1936 తేదీన దావాను దాఖలు చేసెను. దావా నోటుకు 12-6-1936 తేదీతో కాలదోషము పట్టినది. కాని డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు 9-5-36 మొదలు 21-6-36

వరకు వేసంగి శలవులు. అందువల్ల లిమిటేషను లేదని వాది దావాను డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేసెను. ప్రతివాది ఆ దావా న్యాయముగా గ్రామకోర్టులో దాఖలు చేయబడవలెనని, దావా నోటు లిమిటేషను పట్టునాటికి గ్రామకోర్టుకు శలవులు లేవని పనిచేయుచున్నదని, అందువల్ల వాది దావాకు లిమిటేషను పట్టినదని ప్రతివాదన చేసెను. డిస్ట్రిక్టు మునసబు ప్రతివాది వాదన నంగీకరించి వాది దావాను పరిహరించెను. ఆ తీర్పునుండి వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు యీ క్రిందివిధముగ తీర్మానించిరి.

తీర్పు

రెస్పాండెంటు తరఫున సివిల్ ప్రొసీజరుకోడు సె 15 ప్రకారము ఒక దావా దానిని విచారించుటకు హక్కుకలిగిన అన్నిటికంటె చిన్న కోర్టులో దాఖలు చేయవలెనని, అందువల్ల వాది యీ దావాను గ్రామకోర్టులో దాఖలు చేసియుండవలెనని, డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయుటకు వీలులేదని వాదించబడినది. పిటీషనరు తరఫున మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 20 నిబంధనలుచూపబడినవి, ఆ నిబంధనల ప్రకారము ఒక గ్రామ కోర్టు విచారించతగిన దావా డిస్ట్రిక్టు మునసబు కోర్టులో దాఖలు చేయబడినయెడల, యేమైనా వ్యతిరేకమైన కారణములు చూపినతప్ప, డిస్ట్రిక్టు మునసబు ఆ దావాను గ్రామ కోర్టులకు ట్రాన్స్ఫరు చేయవచ్చునని యున్నది. ఇంతే గాకుండా సివిల్ ప్రొసీజరుకోడు నిబంధనలు గ్రామకోర్టులకు వర్తించవు. 29 మ. లా. జ 474 = 31 ఇం. కే. 59 కేసు చూడవలెను. వాది గ్రామకోర్టులో విధిగా దావాను దాఖలు చేయవలెననే నిర్బంధములేదు. వాది తన యిష్టానుసారము డిస్ట్రిక్టు మునసబు కోర్టులోగూడ దావా తేవచ్చును. అట్టి దావాకు లిమిటేషను ఆక్టు సె 4 ప్రకారము డిస్ట్రిక్టు మునసబుకోర్టు శలవలకాలము లిమిటేషను కాలము లెక్కించుటలో మినహాయించవచ్చును. అందువల్ల డిస్ట్రిక్టు మునసబు తీర్పు రద్దుపరచడమైనది.

వ్యాజ్యములను ట్రాన్స్ఫర్ చెయ్యడము.

21. (I) డిస్ట్రిక్టు మునసబు, కక్షిదార్లలో నెవరైనను దరఖాస్తు చేసుకొన్న మీదట, గ్రామకోర్టులో నుండి యే వ్యాజ్యమునైనను తెప్పించుకొని ఆ వ్యాజ్యము తమ కోర్టులో వేసి వుంటే యెట్లాగో, అట్లాగే దాన్ని తామే విమర్శచెయ్యవచ్చును. లేక తమ ప్రదేశాధికార హద్దులకు లోపుగా వున్న యేదయినా యితర గ్రామకోర్టుకు విమర్శ నిమిత్తము దాన్ని ట్రాన్స్ఫరు చెయ్యవచ్చును. అయితే ఒక వ్యాజ్యమును గ్రామ కోర్టులోనుండి తెప్పించుకొని అది

డిస్ట్రిక్టు మునసబువల్ల విమర్శించబడుటకుగాను దరఖాస్తు చేసుకొనేయే కక్షిదారుడైనను, యేదయినా అట్టి ట్రాన్స్ఫర్ వుత్తరువు చేయుటకు ముందు 1870 వ సంవత్సరపు కోర్టుఫీజు ఆక్టు ప్రకారము అందుకుగాను కట్టబడతగ్గ ఫీజు మొత్తము చెల్లించవలసినది.

(2) 1వ సబుసెక్షను ననుసరించి యేదేని దరఖాస్తు పరిష్కరింపబడుటను నిరీక్షించుచు గ్రామ కోర్టులోని చర్యలను నిలిపి పెట్టవలసినదని డిస్ట్రిక్టు మునసబు ఉత్తరువు చేయవచ్చును.

డిస్ట్రిక్టుమునసబు చర్యలను నిలిపి పెట్టుట.

వ్యాఖ్య.

(1) గ్రామ కోర్టులో దాఖలయిన ఒక దావాలో వాదిగాని ప్రతివాదిగాని సదరుదావాను డిస్ట్రిక్టు మునసబుకోర్టుకుగాని, సదరు డిస్ట్రిక్టు మునసబుకోర్టు ఖిలాకా మరి యేయితర గ్రామకోర్టుకుగాని ట్రాన్స్ఫరు చేయవలసినదని పిటీషను దాఖలుచేయవచ్చును. అందుపైన డిస్ట్రిక్టు మునసబు విచారించి దావాను ట్రాన్స్ఫరు చేయుటకు తగిన కారణములున్న తన కోర్టుకుగాని తనకోర్టు అధికారములో యున్న మరి యేయితర గ్రామకోర్టుకుగాని సదరు దావాను ట్రాన్స్ఫరు చేయవచ్చును. కాని పార్టీల పిటీషను లేనిదే డిస్ట్రిక్టు మునసబుకోర్టువారికి గ్రామకోర్టులోని దావాలను యితర కోర్టులకు ట్రాన్స్ఫరు చేయు అధికారములేదు. ఒక గ్రామకోర్టులో దాఖలు అయిన దావాను విచారించుటకు ఆ గ్రామకోర్టుకు అధికారము లేనియెడల పార్టీలు పిటీషను పెట్టినను సదరు దావాను అధికారముగల గ్రామకోర్టుకు ట్రాన్స్ఫరు చేయుటకు డిస్ట్రిక్టు మునసబుకోర్టువారికి అధికారముండదు. కాని సదరు దావాను సరియైన గ్రామ కోర్టులో దాఖలు చేయుటకు తిప్పివేయమని గ్రామకోర్టుకు ఆర్డరు పంపవచ్చును.

(2) ఒక దావాను డి॥ ము॥ తన కోర్టుకు ట్రాన్స్ఫర్ చేయదలచుకొన్నపుడు సదరు దావాకు చెల్లించవలసిన కోర్టుఫీజు దరఖాస్తుదారునివల్ల పుచ్చుకొన్న తరువాతనే ట్రాన్స్ఫర్ చేయవలెను.

(3) ఒక దావా ట్రాన్స్ఫరు నిమిత్తము పిటీషను నిల్వలోయున్నపుడు సదరు పిటీషను పర్యవసానమువరకు విచారణ ఆపుదల చేయవలసినదిగా ఆర్డరు చేయవచ్చును. కాని అట్టి ఆర్డరు గ్రామకోర్టువారికి అందకపూర్వమే గ్రామకోర్టువారు దావాను తీర్మానించేయెడల ట్రాన్స్ఫరు పిటీషను నిల్వనేరదు. సదరుపిటీషనును అసందర్భములో డిస్ట్రిక్టు మునసబుగారు పరిహరించవలసియుండును. సరియైన కారణము లున్నయెడల పార్టీలు సె. 73 ప్రకారము సదరు తీర్పును రద్దు చేయించుకొనుటకు వేరే పిటీషను దాఖలు చేసుకొనవలసి యుండును.

(4) ఒక పంచాయతీకోర్టు మెంబర్లుగాని, గ్రామ మునసబుగాని యే దావాలోనైనా ఒక కక్షిదారుని తరఫున పక్షపాత బుద్ధితో వ్యవహరించు చున్నగాని లేక ఒకరివద్దనుండి లంచము పుచ్చుకొన్నగాని లేక యితర విధముగా ఒక దావాలో మరి జతగా ఒక కక్షిదారునికి వ్యతిరేకముగా ప్రవర్తించుచున్నగాని, సదరు దావాను సదరు కోర్టునుండి ట్రాన్సుఫరు చేయవలెనని పిటీషను దాఖలు చేయవచ్చును. కాని అట్టి పిటీషను పెట్టు కక్షిదారుడు ట్రాన్సుఫరు చేయుటకు గల కారణములను స్పష్టముగా ఋజువు చేయవలసియుండును. ఒక దావాలో పార్టీకిన్ని గ్రామకోర్టువారికిన్ని విరోధమున్న యెడల ఆ దావాను గ్రామకోర్టునుండి ట్రాన్సుఫరు చేయవలసియుండును. గ్రామ కోర్టువారు ఒక కక్షిదారుని యెదుటి కక్షిదారుని తరఫు సాక్షులను అడ్డసవాళ్ళు వెయ్యకుండా అభ్యంతరము కలుగజేయుట, దాఖలు అయిన దస్తావేజులు వగైరాలను నకళ్ళను యిచ్చుటకు నిరాకరించుట, సాక్ష్యము నిమిత్తము తగిన అవకాశము నివ్వకుండుట, దావాను డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు విచారించకుండా ఆపుదల ఆర్డరు యిచ్చినారని చెప్పినను వినక దురుద్దేశముతో అతిత్వరితముగా సదరు దావాను విచారించుట మొదలగు సంగతులనుబట్టి సాధారణముగా గ్రామ కోర్టువారు పక్షపాతబుద్ధితో యున్నట్లు యెంచవచ్చును. ఒక గ్రామ కోర్టువారు ఒక దావాలో అనేక మాసముల వరకు యెట్టిచర్యను తీసుకొనక బుద్ధిపూర్వకముగా వూరకున్నయెడల సదరు దావాను ఆ కోర్టునుంచి ట్రాన్సుఫర్ చేయవచ్చును. పంచాయతీకోర్టు మెంబర్లుగాని, గ్రామ మునసబుగాని కక్షిదారులలో యెవరికైనా బాకీయున్నగాని, లేక యింక యేయితర సంబంధము కలిగియుండి దావావిచారణలో వారి ప్రవర్తన అనుమానకరముగా యున్నయెడల ఆ దావాను ఆ కోర్టునుంచి ట్రాన్సుఫర్ చేయవచ్చును. ఒకపంచాయతీ కోర్టులోని ఒక మెంబరు మాత్రమే కక్షిదారునితో సంబంధము కలిగియున్న యెడల అతను మాత్రము దావాలో యెట్టి జోక్యము పుచ్చుకొనకుండా యుండిన చాలును. కాని అట్టి పంచాయతీ కోర్టు మెంబరు తక్కిన పంచాయతీ కోర్టు మెంబర్లతో యెక్కువ స్నేహము, పలుకుబడి కలిగియున్నవాడైనందున సదరు దావాలో తక్కిన మెంబర్లు నిష్పక్షపాత బుద్ధితో ప్రవర్తించరని అనుమానము కలిగినప్పుడు ఆ దావాను మరియొక కోర్టుకు ట్రాన్సుఫరు చేయవచ్చును. ఒక గ్రామ మునసబుగాని, పంచాయతీ కోర్టు మెంబర్లుగాని ఒక వివాద పరిష్కారములో మధ్యవర్తులుగా పాల్గొనియుండిన సదరు విషయమై వచ్చిన దావాను విచారించకూడదు. అట్టి దావాలోవారికి స్వయముగా సంబంధమున్నట్లు యెంచబడును. అట్టిదావా ఆ గ్రామ కోర్టులోనే దాఖలు చేయబడినయెడల ఈ సెక్షను ప్రకారము యితర కోర్టుకు ట్రాన్సుఫరు చేయవచ్చును. యింకా యీ సంబంధమగు విషయములను 16 సెక్షను క్రింద వ్యాఖ్యానము చూడవలెను.

(5) గ్రామకోర్టులలోని దావాలను గ్రామకోర్టులు ఏ పరిస్థితులలోను మరియొక గ్రామకోర్టుకు ట్రాన్సుఫరు చేయు అధికారము యుండదు. అట్టి అధికారము సె. 20 A క్రింద పరిస్థితులలో డిస్ట్రిక్టు మునసబు తహశీలుదారుగాని, యీ సెక్షను క్రింద

పార్టీలు పెట్టిన పిటీషనుపైన గాని చెలాయించవచ్చును. ఒక గ్రామమునసబు తన కోర్టులోని దావాను ఒకపార్టీ తనకు విరోధ మున్నదన్న కారణముచే ప్రక్క గ్రామ కోర్టుకు ట్రాన్సఫరు చేసెను. అటుల ట్రాన్సఫరు చేయుటకు గ్రామకోర్టుకు అధికారము లేదని ఇ.లా.రి. 8 మద్రాస్ 500 తీర్పులో తీర్మానించిరి.

హైకోర్టు తీర్పులు.

ఆ. ఇ. రి. 1930 మద్రాస్ 708 = 125 యిం. కే. 560

జడ్జి:— కార్నిష్‌గారు.

జోస్యుల వెంకటేశ్వర్లు—పిటీషనరు.

కస్తూరి శేషగిరిరావు—రెస్పాండెంటు.

ఒక గ్రామకోర్టులోని ఒక దావాను ట్రాన్సఫరు చేయవలసినదిగాను, సదరు పిటీషను పర్యవసానమువరకు గ్రామకోర్టువారు దావాను విచారించకుండా ఆపునట్లు ఆర్డరు యిప్పించవలెనని కోరుచూ డిస్ట్రిక్టు మునసబుకోర్టులో ప్రతివాది పిటీషనుదాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబుకోర్టువారు దావాను విచారించకుండా ఆపుచేయవలసినదని గ్రామ కోర్టువారికి ఆర్డరును జారీచేయించిరి. సదరు ఆర్డరు గ్రామకోర్టుకు అందక పూర్వమే గ్రామకోర్టువారు దావాలో యక్సుపార్టి డిక్రీనిచ్చిరి. అట్టి సందర్భములో ప్రతివాది పెట్టిన పై పిటీషనుపైన దావాను ట్రాన్‌స్ఫర్ చేయుటకు డిక్రీ అయిపోయినందున వీలులేదనియు, ఆ పిటీషను పైననే డిక్రీని రద్దుచేయుటకు తగిన కారణములు గాని డిస్ట్రిక్టు మునసబుకు అధికారముగాని లేదనియు తీర్మానించిరి.

(2) ఆ. ఇ. రి. 1928 మద్రాస్ నోట్సు 62 (c)

వాసుదేవషానభాగ్ — పిటీషనరు

దామోదరషానభాగ్ — రెస్పాండెంటు

గ్రామకోర్టులో దావా జరుగుచున్నపుడు కక్షిదారునికి సదరు కోర్టువారు పక్షపాతముగా యున్నట్లున్నూ, లంచము పుచ్చుకొన్నట్లున్నూ, కనుపడినను అతను వెంటనే సదరు దావాను ట్రాన్‌స్ఫరు చేయవలసినదిగా డిస్ట్రిక్టు మునసబు కోర్టులో పిటీషను దాఖలుచేయవలసిన అవసరములేదు. దావాతీర్పుఅయిన తరువాత 60 దినములలోగా సె 73 ప్రకారము పిటీషను దాఖలుచేయవచ్చును. సదరు పిటీషనును డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు లోగడనే పక్షపాతము వగైరాలు కనుపడినప్పుడు ట్రాన్‌స్ఫర్ నిమిత్తము పిటీషను పెట్టలేదనే కారణముపైననే పరిహరింప వీలులేదని తీర్మానించిరి.

## 4 వ అ ధ్యా య ము.

వ్యాజ్యములు తేవడము, తయారుచెయ్యడము, అధికారము పొందిన ఏజెంట్లు కక్షిదార్లకు సమన్సులు జారీచేసి అందచెయ్యడము, విచారణ నిలిపివేయించడము, వారు హాజరు కాకపోవడమువల్ల కలిగిన ఫలితములు, వీటినిగురించి.

22. ఈ ఆక్టు ప్రకారము తేబడు ప్రతి వ్యాజ్యముయొక్క గ్రామ మునసబువద్ద ప్లెయింటుయిచ్చి ఆ మూలముగా ప్రారంభింపబడవలసినది. పైగా ప్రతివాదులు యెందరు వున్నారో అన్ని ప్లెయింటు ప్రతులుకూడా యివ్వవలసినది.

ప్లెయింటు మూలముగా వ్యాజ్యము ఆరంభించబడవలసినది.

సమ్మను ప్రతితోకూడా ప్లెయింటుప్రతి నొకటి యిందులో యీదిగువ నిబంధన కలుగచేసినప్రకారము అప్పగించబడవలసినది. లేక అంటించబడవలసినది.

23. గ్రామములో వ్యవహరించబడు భాషలో ప్లెయింటువ్రాసి అందులో వాదిగాని, అతడు లేనిపట్ల ఆతనివల్ల క్రమ ప్రకారము అధికారము కలుగచేయబడ్డ ఏజెంటుగాని సంతకము చేయవలసినదే గాక అందులో యీ దిగువ కనపరచివుండే వివరములు వుండవలసినది;—

వివరములు ప్లెయింటులో వుండవలసినది.

(a) వాది ప్రతివాదుల పేళ్ళు - వివరము - వాస స్థలము,

(b) వ్యాజ్యకారణము తాలూకు సంగతుల టూకీ వివరము లున్ను అది యెప్పుడు కలిగినదిన్ని,

(c) కోరే పరిహారమున్ను, దావాయొక్క మొత్తము లేక విలువ.

హైకోర్టు తీర్పు

30 మ. లా. పీ. 499.

జడ్జి:— కర్జన్ వన్ గారు.

మహమ్మద్ ఖాశింసాహేబు — పిటీషనరు

వాది ఒక గ్రామకోర్టులో పిటీషనరుపైన ప్లయింటు దాఖలుచేయుచూ ప్లయింటుపైన సంతకము చేయలేదు. ఆ ప్లయింటునుబట్టి గ్రామకోర్టువారు వాదికి యిచ్చిన డిక్రీపైన పిటీషనరు డి॥ము॥కోర్టులో రివిజన్ పిటీషను పెట్టినప్పుడు ప్లయింటుపైన సంతకము చేయనందున డిక్రీ చెల్లదని వాదించెను. కాని డి॥ము॥ ఆ వాదన అంగీకరించక పిటీషనరు పిటీషనును పరిహరించెను. అందుపైన పిటీషనరు హైకోర్టులో రివిజన్

పెటీషను దాఖలుచేయగా హైకోర్టువారు:— 1. ప్లయింటు పైన సంతకము సరిగా లేదనిగాని, అసలే లేదనిగాని దావా చెల్లకూడదనేవాదన అప్పీలు కోర్టువారు అంగీకరించవలసిన అవసరము లేదని అల్లాహాబాద్ హైకోర్టువారు తీర్మానించి యుండిరనియు, 2. దావా వాదియొక్క యెరుకసమ్మతులతో దాఖలై తీర్మానించబడ్డ తరువాత సంతకము చేయుటలో లోపమున్నను, ప్రతివాదికి అందువల్ల యెక్కువ నష్టము సంభవించినట్లు ఋజువుచేసినగాని సదరు వాదనను సె.73 క్రింద డి॥ ము॥ గారు గాని, రివిజన్‌లో హైకోర్టువారు గాని అంగీకరించవలసిన అవసరము లేదనియు తీర్మానించిరి.

ఖుద్దునగాని ఏజెంటుమూలముగా గాని హాజరుకావడము.

24. అర్హతకలవాడైనను, లేనివాడైనను న్యాయవాది వృత్తిదారు డెవ్వడుగాని ఒక వ్యాజ్యము లేదా చర్యతాలూకు ఏ కక్షిదారుని తరఫునైనను ఒక గ్రామ కోర్టు నెదుట హాజరగుటకు అనుమతింపబడగూడదు. కాని యే కక్షిదారుడైనను తనకు బదులు హాజరయి వాదించుటకు ఒక నౌఖరుకు, గుమస్తాకు, భాగస్వామికి బంధువుకు లేదా స్నేహితునికి అధికారమీయవచ్చును. కాని, న్యాయము కలుగగలందులకై కక్షిదారుడు స్వయముగా హాజరుకావడము ఆవశ్యకమని గ్రామమునసబుకు తోచేటప్పుడెల్లా, ఆ వ్యాజ్యకక్షిదార్లలో యెవనినైన స్వయముగా హాజరుకావలసినదని ఉత్తరువు చేయుటకు అతనికి అధికారము కద్దు; అట్లా ఉత్తరువు చెయ్యబడ్డ కక్షిదారుడు స్వయముగా హాజరు కానియెడల, స్వయముగా తానైనను సరే, తనకుగాను ఏజంటైనను సరే హాజరు కానిపట్ల అతనికి యేమి ఫలితము గలుగునో అదే ఫలితమునకు అతడు లోబడవలసినది.

## వ్యాఖ్య.

గ్రామకోర్టులలో ఏ కక్షిదారుని తరఫున వకీళ్లుగాని, ప్రయివేటు వకీళ్లుగా యుండువారుగాని హాజరై వ్యవహరించుటకు వీలులేదని యీ సెక్షను 1920 సం॥రంలో సవరణచేయుట మూలముగా విధించబడినది. అంతవరకు యెవరైనను ఒక కక్షిదారునివద్దనుండి వకాలతునామా పుచ్చుకొని పనిచేయవచ్చునని యుండెను. కాని యే కక్షిదారుని తరఫునైన అతని నౌకరుగాని, గుమాస్తాగాని, భాగస్వామి లేక స్నేహితుడు లేక బంధువుగాని హాజరై చర్యజరుపుటకు ఆ కక్షిదారుడు అధికారము యివ్వవచ్చును. కాని గ్రామకోర్టువారు *అవసరమైనప్పుడు యే కక్షిదారు

నైనను స్వయముగా హాజరు కావలెనని ఆర్డరు చేయవచ్చును. సదరు ఆర్డరు ప్రకారము ఆ కక్షిదారుడు హాజరు కానియెడల అతడు స్వయముగాగాని యేజంటుద్వారా గాని హాజరుకానట్లు యెంచి దావాను సె. 30, 31 ల ప్రకారము తీర్మానించవచ్చును.

హైకోర్టు తీర్పు.

39 ఇ॥లా॥రి॥ మద్రాస్ 808=31 యిం॥ కే॥ 310

జడ్జీలు:— వైలింగు, తయాబ్జీగార్లు.

మాచిరాజు రామచంద్రరావు—వాది

ఇండియా శెక్రటరీ ఆఫ్ స్టేటు—ప్రతివాది.

వాదిని కాకినాడ డిప్యూటీ కలెక్టరుగారు తన అధికారముకు లోబడియున్న యే గ్రామకోర్టులోను యే పార్టీ తరఫు యేజంటుగా పని చేయకూడదని ఆర్డరు యిచ్చినారు. సదరు ఆర్డరును గోదావరిజిల్లా కలెక్టరుగారున్నూ రెవిన్యూబోర్డువారున్నూ ఖాయ పరచిరి. వాది సదరు ఆర్డరు "లా" ప్రకారము చెల్లదగినదికాదని డిక్లరేషను పొందుటకు స్పెసిఫిక్ రిలీఫ్ఆక్టు సె. 42 ప్రకారము దావా దాఖలుచేయగా ప్రతివాది వాది నడత సరియైనదికాదనిన్ని వాది దాఖలుచేసిన కొన్ని వకాల్తనామాలు అనుమానముగా వున్నవనే మొదలగు సంగతులతో ఆన్సరుపెట్టినారు. సదరు దావా హైకోర్టుకు వెళ్ళగా హైకోర్టువారు సదరుదావా స్పెసిఫిక్ రిలీఫ్ ఆర్డరుక్రింద కాకపోయినను లాప్రకారము చెల్లతగినదనిన్నీ మ॥ గ్రా॥ కోర్టులఆక్టు సె. 24 ప్రకారము యెవరైనను వకాల్తనామా తీసికొని యే కక్షిదారుని తరఫునైనను పనిచేయవచ్చుననిన్నీ అందువల్ల డిప్యూటీ కలెక్టరుగారి ఆర్డరు "లా"కు వ్యతిరేకమైనదనిన్నీ, చెల్లతగినదికాదనిన్నీ చెప్పుచూ సదరు ఆర్డరులను రద్దుపరచిరి.

ఈ తీర్పు యీ సెక్షను సవరణ కాకపూర్వ మివ్వబడినది.

ప్రతివాదికి సమ్మను యే ప్రకారము అందచేయబడ వలసినది.

25. ప్లెయింటు క్రమప్రకారము దాఖలు చెయ్యబడ్డమీదట గ్రామ మునసబు దాన్ని రిజిష్టరు చేయించి నిర్దేశించిన ఒక రోజున హాజరై దావాకు జవాబు చెప్పవలసినదని లిఖిత మూలమైన సమ్మనుద్వారా ప్రతివాదికి ఉత్తరువు చెయ్యవలసినది. ఆ సమ్మను అనునది ప్రతివాదికి ఖుద్దున అందచేయబడి దానిమీదఅతని సంతకము తీసుకొనబడవలెను. మరిన్నీ అందుల నకలును, సమాచారము తీసుకొని పొయ్యేపని మామూలుగా యెవరిదో ఆగ్రామ నౌకరుగాని 12 వ సెక్షను ప్రకారము కలెక్టరు వల్ల నియమించబడ్డ యే యితర మనిషిగాని అతనికి యిప్పించవలసినది.

## వ్యాఖ్య

దావా దాఖలు అయినతరువాత గ్రామకోర్టువారు ప్రతివాదికి లిఖితరూపకమైన సమ్మను జారీచేయవలెను. సదరు సమ్మను ప్రతివాదికి స్వయముగా అందజేసి అందుల నకలు ప్రతివాదికియిచ్చి ప్రతివాదిచేత సంతకము చేయించుకొనవలెను. యీ సె. క్రింద జారీచేయబడే సమనులు 12 వ సె॥లో నియమింపబడిన మనిషి వల్ల జారీచేయుటకు గాను చెల్లించవలసిన రుసుములకు 2 వ భాగములోని 58 రూలు చూడవలెను.

ప్రతివాది సమ్మను అందించుకోకుండా తప్పించుకొనే యెడల అది అందించే విధము.

26. ప్రతివాది సమ్మనుఅందించుకోకుండా తప్పించుకొంటున్నాడని లేదా సమ్మనులో తన సంతకముచేయనని నిరాకరించినాడని గ్రామ మునసబుకు తృప్తిగా తెలిసిన పక్షముకు ప్రతివాదితో కూడా వాసముచేస్తూవుండే అతనికుటుంబముతో చేరిన వయస్సు వచ్చిన యేమగవానివద్దనయినా అది అందజేసి అందుల నకలు అతనికి యిప్పించవలసినదనిగాని ప్రతివాది సాధారణముగా వాసము చేసే యింట్లో యేదో ఒక వెల్లడిఅయిన భాగమందు అందుల నకలు అంటించవలసినదని గాని గ్రామ మునసబు ఉత్తరువు చేయవచ్చును.

## వ్యాఖ్య.

ప్రతివాది సమను పుచ్చుకొనకుండా తప్పించుకుంటూ యున్నాడని గాని లేక సమను ముట్టినట్లు సంతకము చేయుటకు నిరాకరించినాడని గాని గ్రామకోర్టు యెంచే యెడల సదరు కోర్టువారు ప్రతివాది సమ్మనును ప్రతివాది కుటుంబములోని వాడై అతనితో వాసము చేస్తూయున్న ఒక వయస్సు వచ్చిన మగవానికి సమ్మను నకలును అందజేయ వలసినదని గాని లేక ప్రతివాది కాపుర ముంటూయున్న యింటియొక్క బహిరంగ భాగమునకు అంటించ వలసినదనిగాని ఆర్డరు చేయవచ్చును.

ప్రతివాది కోర్టుయొక్క ప్రదేశాధికారహద్దుకు వెలుపల వున్నయెడల సమ్మను అందజేసే విధము.

27. గ్రామ కోర్టు యొక్క ప్రదేశాధికార హద్దుకు వెలుపల ప్రతివాదికి సమ్మను అందచెయ్యడము ఆవశ్యకముగా వుండేటప్పుడెల్లా, అది డిస్ట్రిక్టు మునసబు వద్దకు పంపించబడవలసినది. ఆయన, అది తనవల్ల సాదరుచెయ్యబడ్డ సమ్మనుగావుంటే యెట్లాగో, అట్లాగే

అందచేసే లాగున చేసినతర్వాత అట్లా అందజేసిన రిపోర్టు సహితము దాన్ని గ్రామ కోర్టుకు రిటరన్ చేయవలసినది. అట్టి రిపోర్టు అనునది అందులో చెప్పివున్న సంగతులకు ప్రత్యక్ష నిదర్శనముగావుండవలసినది.

వ్యాఖ్య.

ప్రతివాది దావా దాఖలు చేయబడిన గ్రామకోర్టు అధికార హద్దులలో లేని యెడల అతనికి జారీచేయవలసిన సమనును డిస్ట్రిక్టుమునసబుకోర్టుకు పంపవలెను. సదరు కోర్టువారు సదరు సమ్మను తమ కోర్టునుంచి జారీ అయ్యే సమనులవలె అమలు జరిపి, అమలు చర్య పర్యవసానము రిపోర్టును గ్రామ కోర్టుకు పంపవలెను. డిస్ట్రిక్టు మునసబు గారు పంపిన అమలుచర్య రిపోర్టు అందలి అంశములను ఋజువు చేసినట్లు అంగీకరించ బడును. యీ సెక్షను క్రింద ప్రతివాదికి జారీ చేయవలసిన సమనులకు చెల్లించవలసిన రుసుములకు 2 వ భాగములోని 57 వ విధిని చూడవలెను.

ప్రతివాది హాజరు కాని పక్షమునకు చర్య.

28. ప్రతివాది నిర్ణయించియున్న రోజున ఖుద్దునుగాని ఏజెంటు మూలముగా గాని హాజరు కాకుండా వుండి సమ్మను క్రమ ప్రకారము అందచెయ్యబడ్డదని ఋజువు అయిన యెడల గ్రామ కోర్టు వారు ఎక్స్పార్టీ (ఏకపక్షము)గా విచారణ చెయ్యనారంభించవచ్చును.

సమ్మను క్రమ ప్రకారము అందజెయ్యబడ్డదని ఋజువుకాని యెడల గ్రామ మునసబు క్రొత్తగా సమ్మను జారీ చేయవలసినది.

ప్రతివాది వ్యాజ్యమును గురించి రెండుదినముల నోటీసు యివ్వవలసినదని అడుగవచ్చును.

ఒక్కొక్క ప్రతివాది వ్యాజ్యమును గురించి పరిష్కారముగా రెండుదినముల నోటీసు యివ్వవలసినదని అడగ వచ్చును. నిర్ణయించిన రోజున జవాబు చెప్పుటకు ప్రతివాది సాధ్యమయ్యే లాగు తగిన కాలమందు సమ్మను అంద చెయ్యబడని యెడల విచారణను మరియొక రోజువరకు నిలిపి పెట్టి అందుగురించి ప్రతివాదికి లిఖిత మూలముగా నోటీసు యివ్వవలసినది.

వ్యాఖ్య.

ప్రతివాదికి సమను "లా" ప్రకారము అందజేయబడినతరువాత అనగా 25 లేక

26 లేక 27 సెక్షనుల ప్రకారము అందజేయబడిన తరువాత దావా వాయిదా దినమున ప్రతివాదిగాని, ప్రతివాది ఏజెంటుగాని హాజరు కాని పక్షమున గ్రామ కోర్టువారు సదరు దావాను ప్రతివాది పరోక్షమందు ఎక్సుపార్టీగా (ఏక పక్షముగా) విచారించి తీర్మానము చేయవచ్చును. సమను సరిగా అందని యెడల తిరిగి సమను చేయుటకు ఉత్తరువు వేయవలెను.

ప్రతివాదికి సమ్మను జారీ అయిన తరువాత కనీసము రెండుదినములైనను వాయిదాకు వ్యవధి యుండవలెను. అట్టి వ్యవధి లేనప్పుడు ప్రతివాది ఆన్సరు నిమిత్తము వాయిదా కోరేయెడల గ్రామకోర్టువారు ప్రతివాదికి లిఖితరూపకమైన నోటీసు నిచ్చి వాయిదాను యిచ్చితీరవలెను.

సమన్సు జారీచేసే కక్షిదారుని ఖర్చున అంద చెయ్యబడవలసినది.

29. గ్రామ సప్రకరువల్ల కాకుండా మరియొక విధమున యీ ఆక్టు ప్రకారము అందచెయ్యబడు ప్రతి సమ్మను యెవరి తరఫున జారీచెయ్య బడుచున్నదో ఆకక్షిదారుని ఖర్చున అది అంద చెయ్యబడవలసినది.

వాది హాజరు కాకుండానున్ను ప్రతివాది దావా వొప్పుకోకుండానున్ను వున్నయెడల, లేక వాది తప్పిపోవడమువల్ల సమ్మను అందచేయబడని యెడల చర్య.

30. ప్రతివాది హాజరవుటకు నిర్ణయించిన రోజున—

(1) ఉభయ కక్షిదార్లున్ను హాజరుకానియెడల, లేక

(2) వాది హాజరుకాకుండా ప్రతివాది మాత్రము హాజరై దావా వొప్పుకోనియెడల, లేక

(3) వాది తప్పిపోవడమువల్ల ప్రతివాదికి సమ్మను అందజేయ బడకపోయి వుండి ఆ ప్రతివాది హాజరుకానియెడల,

గ్రామ కోర్టువారు మరియొక విధమున వుత్తరువు వెయ్యని పక్షమందు ఆ వ్యాజ్యమును తోసివేయవలసినది.

## వ్యాఖ్య.

వాయిదా దినమున (1) ఉభయవాదులు రానియెడల లేక,

(2) ప్రతివాది వచ్చి వాది రాకయుండి, ప్రతివాది దావాబాకీ యివ్వవలసినట్లు ఒప్పుకొనియెడల లేక,

(3) వాది జరిగించిన లోపమువల్ల (వాని తప్పిపోవడమువల్ల) ప్రతివాదికి సమ్మను ముట్టనందున ప్రతివాది హాజరు కానియెడల సదరు దావాను గ్రామకోర్టువారు పరిహరించవచ్చును. కాని గ్రామకోర్టువారు అట్టిదావాను కొట్టివేయకుండా తిరిగి వాయిదా వేయుటకుకూడ అధికారము కలదు.

వాది హాజరుకాకుండావుండి ప్రతివాది దావా యొప్పుకొనే యెడల చర్య.

31. వాది హాజరుకాకుండా ప్రతివాదిమాత్రముహాజరై దావా మొత్తము యావత్తుగాని కొంతమట్టుకు గాని ఒప్పుకు నేపక్షమందు అట్లా ఒప్పుకోవడమునకు అనుగుణముగా గ్రామకోర్టువారు ప్రతివాదిమీదతీర్పు చెప్పవలసినది. అయితే దావా మొత్తములో కొంతభాగము మాత్రము ఒప్పుకోబడ్డయెడల కోర్టువారు విచారణను మరియొక దినమునకు నిలిపిపెట్టవచ్చును.

## వ్యాఖ్య

వాయిదా రోజున వాది హాజరుకాక ప్రతివాది మాత్రము హాజరై దావా బాకీ యావత్తుగాని కొంతవరకుగాని ఒప్పుకొన్నయెడల ప్రతివాది ఒప్పుదలప్రకారము కోర్టువారు డిక్రీయివ్వవచ్చును. ప్రతివాది దావాబాకీలో కొంతభాగమే ఒప్పుకొన్నయెడల కోర్టువారు సదరు ఒప్పుదల ప్రకారము అప్పుడే డిక్రీ యివ్వక దావాను విచారణ నిమిత్తము వాయిదా వేయవచ్చును.

కారణము చూపినమీదట 30 వ సెక్షనును, లేక 31 వ సెక్షనునుబట్టిచెయ్యబడ్డ ఉత్తరువును రద్దుచెయ్యడము.

32. 30 వ సెక్షనుతాలూకు (1) వ క్లాజు, లేక 3 వ క్లాజును బట్టి ఒక వ్యాజ్యము తోసివేయబడేటప్పుడల్లా, వాది కాలనిర్ణయపు చట్టమునకు లోబడి కొత్తగా వ్యాజ్యము తేవచ్చును; వ్యాజ్యము తోసివేసేలాగు 30 వ సెక్షను తాలూకు (2) వ క్లాజు ప్రకారము చెయ్యబడ్డ ఉత్తరవు తేదీ మొదలుకొని, లేక 31 వ సెక్షను ప్రకారము దావాలో కొంతభాగమునకుమాత్రము చేయబడ్డ డిక్రీతేదీమొదలుకొని ముప్పది దినములకు లోగా వాది తాను హాజరవుటకు ఆటంకమైన దని తగిన కారణమువల్ల గ్రామకోర్టువారికి తృప్తికరముగా తెలియ

చేసిన యెడల, ఆ కోర్టువారు వ్యాజ్యము తోసివేయడముగాని, డిక్రీగాని రద్దుపరచి వ్యాజ్యమును జరిగించుటకుగాను ఒక దినము నిర్ణయించవలసినది.

## వ్యాఖ్య.

వాది దావాను గ్రామ కోర్టువారు 30 సెక్షను 1 వ క్లాజు (అనగా ఉభయ వాదులు హాజరు కానందున) లేక 3వ క్లాజు (ప్రతివాదికి వాది లోపము వల్ల సమను అందక ప్రతివాది హాజరు కానందున) ప్రకారము పరిహరించి యుండినయెడల వాది తన దావాకు లిమిటేషను దోషము లేనియెడల ఆ వ్యాజ్యకారణము పైననే వేరొక దావాను సదరు కోర్టులో తేవచ్చును. అట్టి దావాకు యీ ఆక్టు సె 17 ప్రకారము యెట్టి అభ్యంతరమున్ను యుండదు. సె 13 క్రింద యివ్వబడిన 1942 (2) మ.లా.జ. 272 తీర్పును చూడవలెను.

కాని గ్రామకోర్టువారు వాది దావాను సె 30 (2) క్లాజు ప్రకారము (అనగా వాది హాజరు కాక ప్రతివాది హాజరై దావా బాకీ వప్పుకోని యెడల) పరిహరించి యుండినకాని లేక 31 సెక్షను ప్రకారము ప్రతివాది దావా బాకీలో కొంతభాగమే వప్పుకొన్నందున, సదరు మొత్తమునకు డిక్రీ యిచ్చియుండినగాని, వాదికి వేరే దావా తెచ్చే హక్కు లేదు. వాది దావాను పరిహరించినట్టి లేక కొంత మొత్తమునకే డిక్రీయిచ్చినట్టి తేదీనుండి 30 దినములులోగా గ్రామకోర్టులో వాది తాను వాయిదా తేదీన రాకపోవుటకు సరియైన కారణమును జూపుచూ పిటీషను దాఖలు చేసేయెడల సదరు కోర్టువారు దావాను పరిహరించిన ఆర్డరును గాని, లేక కొంత మొత్తమునకే యిచ్చిన డిక్రీని గాని రద్దుపరచి దావాను తిరిగి విచారణకు వాయిదా వేయవచ్చును.

గ్రామకోర్టువారు ఒక దావాలో కొంత సాక్ష్యమును ఉభయ వాదుల సమక్షమున తీసికొని తక్కిన సాక్ష్యమునకు మరియొక వాయిదా వేసినప్పుడు ఆ వాయిదాకు వాది హాజరుకానియెడల, వాది హాజరు కాలేదనే కారణమున దావాను పరిహరించక, అదివరలో సాక్ష్యమును ఆలోచించి తీర్పు జెప్పిన వాది అట్టి తీర్పును రద్దుపరచి దావాను తిరిగి విచారించమని యీ సెక్షను క్రింద పిటీషను పెట్టుటకు హక్కు యుండదు.

కాని అట్టి తీర్పును సె 73 లో చెప్పబడిన కారణము లున్న రద్దు చేయమని డిస్ట్రిక్టు మునసబు యెదుట సె 73 ప్రకారము రివిజన్ పిటీషను పెట్టుకొనవలెను.

ఈ సెక్షను క్రింద హైకోర్టు తీర్పు.

**1940 (2) మ. లా. జ. 780 = 1940 మ. వీ. నో. 1140 = 52 మ. లా. వీ. 753= 1941 ఆ. ఇ. రి. మద్రాస్ 272.**

## మద్రాసు హైకోర్టు, న్యాయమూర్తి హార్విక్ గారు

## C. R. P. 1670 of 1937 (23-8-40)

యం. జె. సుబ్బన్న — పెటీషనరు

నతల్ కింటోబాయి మరియొకరు — రెస్పాండెంట్లు

అత్తవర్ పంచాయతీకోర్టు ఒక దావాను 12-1-1937 తేదీన ఉభయ వాదుల సమక్షమున కొంత సాక్ష్యమును తీసికొని, మిగతా సాక్ష్యమునకు గాను 14-1-37 తేదీకి వాయిదావేసెను. ఆ తేదీన కోర్టుకు వాది హాజరుకాలేదు. కాని వాది హాజరుకాలేదని కోర్టువారు సె 32 ప్రకారము దావాను పరిష్కరించక అదివరకుతీసుకున్న సాక్ష్యముపైన తీర్పునిచ్చిరి.

దరిమిలా అత్తవర్ కోర్టు అధికారము పొందిన కదిరి పంచాయతీకోర్టులో వాది తాను హాజరు కానందున అత్తవరు పంచాయతీకోర్టు యిచ్చిన ఆర్డరును రద్దుచేయమని ఆనోజు తాను కోర్టుకు హాజరు కాకుండుటకు తగిన కారణమున్నదని పెటీషను పెట్టెను. కదిరిపంచాయతీకోర్టువారు వాయిదానోజున వాదిరాకపోవుటకు తగిన కారణమున్నదని అదివరలో అత్తవరు పంచాయతీ కోర్టువారు యిచ్చిన తీర్పును రద్దుపరచి దావాను తిరిగి విచారించుటకు ఉత్తర్వు చేసెను.

ఆ ఆర్డరునుండి ప్రతివాది మంగళూరు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో సె 73 ప్రకారము రివిజన్ పిటీషను దాఖలుచేయగా పంచాయతీకోర్టు డిక్రీరద్దుపరచి దావాను తిరిగి విచారించమని ఆర్డరుచేయుటకు కదిరి పంచాయతీ కోర్టుకు అధికారము లేదని తీర్మానించిరి.

ఆ తీర్పునుండి వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టు వారు ఈ క్రింది విధమున తీర్మానించిరి.

### తీర్పు.

అత్తవర్ పంచాయతీ కోర్టు దావాను వాది హాజరులేదని కొట్టివేయక వున్న సాక్ష్యమును ఆలోచనలోనికి తీసుకొని తీర్పునిచ్చెను. అట్టి పరిస్థితులలో వాది ఆతీర్పు నుండి డిస్ట్రిక్టు మునసబు కోర్టులో రివిజన్ పెట్టవలసియుండెను. సె 32 ప్రకారము పిటీషను పెట్టుటకు హక్కు లేదు. కాని అటులచేయలేదు. వాది కదిరి పంచాయతీకోర్టు అదివరలో అత్తవర్ పంచాయతీకోర్టు తీర్పును రివ్యూచేసినట్లు (పునర్విమర్శ) యెంచ వచ్చునని వాదనచేయుచున్నారు. కాని ఆ వాదన సరికాదు. గ్రామ కోర్టులు తమ ఆర్డర్లను రివ్యూచేసుకొనుటకు అధికారము ఆక్టు ప్రకారము లేదు.

పంచాయతీకోర్టు ఆర్డరునుండి 60 దినములు దాటినను, డిస్ట్రిక్టుమునసబు రివిజన్ పిటీషనును అంగీకరించుటకు సె73లో అధికారమియబడినది. కాబట్టి డిస్ట్రిక్టుమునసబు ఆర్డరు సరియైనదని వాది రివిజన్ పిటీషనును పరిహరించడమైనది.

33. ఎవరిమీద ఎక్సుపార్టీగా డిక్రీ చెయ్యబడ్డదో అట్టి యే ప్రతివాది అయినను దాన్ని జారీలోకి తెచ్చుటకు గాను యేదైన ఆజ్ఞాపత్రిక నెరవేర్చే తేదీ మొదలు ముప్పది రోజులలోగా దాన్ని రద్దు పరచవలసినదని గ్రామకోర్టుకు దరఖాస్తు చేసుకోవచ్చును. సమ్మనుగాని నోటీసుగాని క్రమప్రకారము అందచేయబడలేదని అయినా, ప్రతివాది హాజరవుటకు తగినకారణమువల్ల తనకు ఆటంకమైనదని అయినా, కోర్టువారికి తృప్తిగా తెలిసినయెడల వారు డిక్రీని రద్దుపరచి వ్యాజ్యము జరిగించుటకుగాను ఒక దినము నిర్ణయించవలసినది.

ప్రతివాదిమీద చేసిన ఎక్సుపార్టీ డిక్రీని రద్దు చెయ్యడము.

## వ్యాఖ్య

ఒక ప్రతివాదిపైన యిచ్చిన ఎక్సుపార్టీ డిక్రీని (అనగా ప్రతివాది హాజరు లేనప్పుడు ప్రతివాదిపరోక్షమందు యిచ్చినడిక్రీని) రద్దుపరిపించుకొనుటకు సదరు డిక్రీ అమలు చర్యలో కోర్టువారు యిచ్చిన యే అర్డరు (ఆజ్ఞాపత్రిక) పైన అమలుచేయుటకు ప్రతివాది పైన చర్య తీసుకొన్న తేదీనుండి 30 దినములలోగా ప్రతివాది గ్రామ కోర్టులో పిటీషను దాఖలుచేసి తనకు దావా సమను సక్రమముగా ముట్టియుండలేదని గాని లేక తాను వాయిదానాటికి గాకపోవుటకు తగినంత కారణ మున్నట్లుగాని ఋజువు చేసినయెడల గ్రామకోర్టువారు సదరు డిక్రీని రద్దుపరచి దావాను తిరిగి విచారించవచ్చును. కాని ఎక్సుపార్టీ డిక్రీ యిచ్చినప్పటినుండియు 30 దినముల లోగానే పిటీషను దాఖలు చేయవలసిన అవసరము లేదు.

ఈ సెక్షనుక్రింద ప్రతివాది హాజరు లేనప్పుడు యిచ్చిన డిక్రీని రద్దుపరచుటకు మాత్రమే పిటీషను దాఖలు చేయవచ్చును. ప్రతివాది హాజరుగాయుండి ప్రతివాదికి సాక్ష్యములేనందున డిక్రీ యిచ్చినయెడల అట్టి డిక్రీ ఎక్సుపార్టీ డిక్రీ కానేరదు. అట్టి దానిని రద్దుపరచుటకు గ్రామకోర్టువారికి అధికారములేదు.

ప్రతివాది తాను హాజరు కాకపోవడమునకు సమ్మను జారీ చేయుటలో గమనించవలసిన విధులను సరిగా నిర్వర్తించలేదని అందువల్ల తనకు దావాసంగతి తెలియలేదని ఋజువు చేసినగాని, లేక వాదిచేసిన దగావల్ల తనకు యెట్టిసమను అందలేదని ఋజువు చేసినగాని ఎక్సుపార్టీ డిక్రీ రద్దుపరచి దావాను తిరిగి విచారించవలెను.

* ప్రతివాదికిగాని ప్రతివాది సన్నిహిత బంధువులకుగాని జబ్బుగాయుండి ప్రతివాది రాలేకపోయినగాని, ప్రతివాదికిగాని ప్రతివాదియేజెంటుకుగాని వాయిదాకు

వచ్చుటకు రైలు మోటారు వగైరాలు తప్పిపోవడమువల్ల ఆలస్యముగా వచ్చుటవల్లగాని, వాయిదా తేదీ కోర్టుగుమాస్తాగాని కోర్టువారుగాని పొరబాటు చెప్పుటవల్లగాని, లేక తాను పొరబాటు వేసుకొనుటవల్లగాని ప్రతివాది వాయిదాకు రానియెడల అట్టివి వాయిదాకు రాకపోవుటకు తగిన కారణములుగాయెంచి ఎక్సుపార్టి డిక్రీని రద్దుచేయవచ్చును. ప్రతివాది జైలులో యుండుటవల్లగాని, యితర కోర్టులో చాలా ముఖ్యమైనట్టి, తాను వెళ్ళకపోయినయెడల యెక్కువ నష్టము సంభవించెడి పనియుండి కోర్టుకు హాజరుకానియెడలకూడ అట్టి సందర్భములలో కూడ ప్రతివాదికి రాకపోవడమునకు తగిన కారణము యున్నట్లు యెంచి డిక్రీని రద్దుపరచవచ్చును.

ఒక గ్రామకోర్టు ఎక్సుపార్టి డిక్రీయిచ్చిన తరువాత యీ ఆక్టు అమలులోనుండి తగ్గింపబడిన లేక యీ దావా గ్రామముయొక్క దావాలు వగైరాలు యీవస్తు మరియొక గ్రామకోర్టుకు ట్రాన్స్ఫర్ చేయబడినగాని, యీ సెక్షనుక్రింద పెట్టవలసిన పిటీషను అప్పుడు ఆ దావా దాఖలు చేయవలసివచ్చే యెడల యేకోర్టులో దాఖలుచేయవలసివచ్చునో ఆ కోర్టులో దాఖలు చేయవచ్చును. ఎక్సుపార్టి డిక్రీ అయిన తరువాత ప్రతివాది చనిపోవుట తటస్థించేయెడల ప్రతివాది న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధి యీ సెక్షనుక్రింద పిటీషను దాఖలు చేయవచ్చును.



ఎదుటి కక్షిదారునికి నోటీసు యివ్వకుండా డిక్రీ రద్దుచెయ్యబడగూడదు.

34. 32 వ సెక్షనుకు పట్టిగాని 33 వ సెక్షనుకు పట్టిగాని యేదైనా దరఖాస్తు చేసుకొన్నమీదట దాన్ని గురించి యెదుటి కక్షిదారునికి నోటీసు యివ్వకుండా డిక్రీ రద్దు చెయ్యబడగూడదు.

## వ్యాఖ్య.

గ్రామకోర్టువారు యిచ్చిన యే డిక్రీని ఎదుటి కక్షిదారునికి నోటీసు నివ్వకుండా, 32, 33 సెక్షనులక్రింద పెట్టిన పిటీషనులపై రద్దుపరచ వీలులేదు.

సె. 31 ప్రకారము ప్రతివాది దావా బాకీలో కొంత మొత్తమును వప్పుకొన్నందున సదరు మొత్తమునకుయిచ్చిన డిక్రీని ప్రతివాదికి నోటీసులేకుండా వాది 32 సె॥ క్రింద పెట్టిన పిటీషనుపై రద్దుపరచ వీలులేదు. ప్రతివాదిపైన యిచ్చిన ఎక్సుపార్టి డిక్రీని ప్రతివాది 33 సె॥ క్రింద పెట్టిన పిటీషనుపై వాదికి నోటీసు లేకుండా రద్దుపరచుటకు వీలులేదు.

కాని వాది దావాను గ్రామకోర్టువారు 30 సె. క్రింద పరిష్కరించి యుండిన యెడల సదరు దావాను ప్రతివాదికి నోటీసు లేకుండా వాది 32 సె॥ క్రింద పెట్టిన పిటీషనుపై రద్దుచేసి దావాను విచారించవచ్చును.

## 5 వ అధ్యాయము

వ్యాజ్యములను విచారణ చేయడము, తీసి వేసుకోవడము, లేక రాజీగా పోవడము, సాక్షులను సమ్మను చేయడము, వారిని పరిశీలించడము, వీటిని గురించి.

ఉభయ కక్షీదారులు హాజరయినమీదట చర్య.

35. ప్రతివాదిహాజరైనయెడల ప్లెయింటులో చేసియున్న దావా అతడు ఒప్పుకొంటాడా లేదా అని కోర్టు వారు అతనిని అడిగి తెలుసుకోవలసినది. అతడు దావా ఒప్పుకొనేపక్షమునకు, లేక ఆవ్యాజ్యము రాజీచేయబడ్డపక్షమునకు అట్లాఒప్పుకోవడముగాని రాజీగాని లిఖితముచేసి అందులో కక్షీదార్లు సంతకములు చేయవలసినది. అందుమీదట కోర్టువారు అందుకు అనుగుణముగా డిక్రీచేయవలసినది. అతడు దావా ఒప్పుకోనిపక్షమందు అతనికిగల ఆక్షేపణలను వాగ్రూపముగాగాని లిఖితమూలముగాగాని తెలియజేయమని అతనిని అడగవలసినది. మరిన్ని కోర్టువారికి యుక్తమని తోచేపట్ల లిఖిత రూపమయిన స్టేటుమెంటు దాఖలు చేసుకొనేటట్టు అతనికి అవకాశము కలుగగలందులకై వారు ఆ కేసు నిలిపి పెట్టవచ్చును.

### వ్యాఖ్య.

ప్రతివాదిగాని, ప్రతివాది ఏజెంటుగాని, కోర్టుకు సమను ప్రకారము హాజరైనపుడు గ్రామకోర్టువారు ప్రతివాది దావాబాకీని వప్పుకొనునా లేదా అని ప్రశ్నించవలెను. ప్రతివాది దావాబాకీని వప్పుకొన్నయెడల సదరు వప్పుదలనున్నూ, లేక ఉభయ వాదులు దావా రాజీచేసుకున్నయడల సదరు రాజీనామా షరతులున్నూ వ్రాయించి కక్షీదారులచే సంతకములుచేయించవలెను. కోర్టువారు సదరువప్పుదల లేక రాజీనామా ప్రకారము డిక్రీ యివ్వవలసి యుండును. కాని ప్రతివాది వప్పుకొన్నందున డిక్రీయివ్వడమైనదని, పైన చెప్పిన సంతకములు చేసిన వప్పుదల లేకుండా గ్రామ కోర్టువారు డిక్రీ యిచ్చుట సరికాదు.

ప్రతివాది దావా బాకీని వప్పుకోని యడల అతనికిని దావాకుచెప్పే ఆక్షేపణలను వాగ్రూపముగాగాని, లేక లిఖితరూపకమైన ఆన్సరు దాఖలు చేయుట మూలముగాగాని చెప్పుమని గ్రామ కోర్టువారు అడుగవచ్చును. అవసరమని కోర్టువారు యెంచేయెడల ప్రతివాది కోరినయడల ఆన్సరుకు వాయిదా యివ్వవచ్చును.

36. వాది వ్యాజ్యమును తీసివేసుకోవలెనను కోరే పక్షమున అతడు ఆ సంగతిని లిఖితమూలకముగా కోర్టువారికి తెలియచేయవలసినది. వారు ఆ వ్యాజ్యమును ఫైలులోనుండి తీసివేయవలసినది. మరిన్ని అదే వాజ్యకారణమునుపట్టి కొత్తగా వాజ్యము తేబడకూడదు.

వ్యాజ్యము తీసివేసుకోవడము.

## వ్యాఖ్య

వాది దావాను యే కారణము చేతనైనా యెత్తివేసుకొనదలచుకొన్న, అతడు ఆ సంగతి లిఖిత రూపకముగా కోర్టువారికి తెలియజేయవలెను. అందుపైన కోర్టువారు సదరు దావాను కోర్టు ఫయిలులోనుంచి తగ్గించవచ్చును. అట్లు దావాను వాది యెత్తివేసుకొన్న తరువాత, సదరు వ్యాజ్య కారణమునుబట్టి మరియొక దావా తెచ్చుటకు వాదికి హక్కు యుండదు.

37. ఉభయకక్షిదార్లలో యెవరైనను యితర కక్షిదారుడు ప్రమాణము చేసినమీాదట వ్యాజ్యము ఫైసలు చేసుకోవడమునకు యిష్టపడివుండి అట్టి యితర కక్షిదారుడు ప్రమాణము చేయుటకు సమ్మతించి చేసిన యెడల కోర్టువారు అట్టి ప్రమాణము ప్రకారము తీర్పు చెప్పవలసినది.

ప్రమాణముమీాద వ్యాజ్యము యెప్పుడు పైసల్ చెయ్యబడవచ్చును.

38. వాది ప్రతివాదికి న్యాయశాస్త్ర సమ్మతముగా బాకీవుండి ఆ ప్రతివాది గ్రామకోర్టులో వ్యాజ్యము తేకూడినదిగావున్న యేదయినా మొత్తమును ఎదురు దావాగా ప్రతివాది తెలియజేయవచ్చును. అట్టి యెదురు దావా స్థాపించబడ్డయెడల ఉభయకక్షిదార్లలో యెవనికయినను బాకీవున్నట్టు కడపట అగుపడే యే మొత్తమునకయినను డిక్రీ చేయబడవలసినది.

ఎదురు దావా

## వ్యాఖ్య.

వాది, ప్రతివాది తనకు యివ్వవలసిన బాకీకి గ్రామకోర్టులో దావాదాఖలు చేసినప్పుడు, ప్రతివాదికి వాదిబాకీయుండి, సదరుబాకీకి ప్రతివాది వాదిపైన గ్రామకోర్టులో

దావా చేయుటకు హక్కు కలిగియుండిన సదరు మొత్తమునకు ప్రతివాది ఎదురు దావా చేయవచ్చును. అట్టి ఎదురుదావా ఋజువుఅయినయెడల ప్రతివాది వాదికి తన ఎదురు దావా సొం తీసుకోగా బాకీ యున్నయెడల గ్రామకోర్టువారు అట్టి మిగతా మొత్తము నకు వాదికి డిక్రీ యివ్వవలసియుండును. లేక ప్రతివాదికి రావలసిన యెదురు దావా సొం త్తము వాది దావా సొం త్తముకంటె హెచ్చుగా నున్నయెడల, వాది దావా సొం త్తమును ప్రతివాదికి ఎదురు దావా మొత్తములో నుంచి మినహాయించి మిగతా సొం త్తమునకు ప్రతివాదికి డిక్రీ యివ్వవలసియుండును. కాని ప్రతివాది తనకురావలసిన బాకీకి యెదురుదావాచేయకుండా అలాయిదాగా మామూలుప్రకారము వాదిపై దావా దాఖలు చేయవచ్చును.

ప్రతివాది వేయు యెదురుదావాను గ్రామ కోర్టువారు విచారించుటకు సె. 13 ప్రకారము అధికారము కలిగియుండవలెను. అనగా గ్రామకోర్టువారు విచారించ తగ్గ స్వభావము కలవిన్ని, కిమ్మతు కలవిన్ని అయి యుండవలెను. మరిన్ని అట్టి యెదురు దావాకు లిమిటేషను దోషము లేకుండా యుండవలెను. లిమిటేషను పట్టిన బాకీకి యెదురు దావా తెచ్చుటకు వీలులేదు. కాని ప్రతివాది వేయు యెదురు దావాను మ॥ గ్రా॥ కో॥ అ. సె. 15 వ రించదు. అనగా సదరు ఎదురు దావాను వాది కాపుర స్థలమైన గ్రామకోర్టులో దాఖలు చేయవలసిన అగత్యములేదు.

ఉ. (1) "ఏ" అనువాడు "బి"అనువానిపై తనకురావలసిన ప్రోనోటుబాకీ రు 50-0-0 లకు గ్రామకోర్టులో దావా దాఖలు చేసెను. "బి" వానివద్ద అప్పటికి 4సం॥లక్రిందట రు 50 లు చేబదులు పుచ్చుకొనియుండెను. "ఏ"దాఖలుచేసినదావాలో ప్రతివాదిఅయిన "బి" తనకురావలసిన చేబదులుకు ఎదురుదావా తెచ్చుటకువీలులేదు. ఏలనన "బి" యిచ్చిన చేబదులు బాకీకి లిమిటేషను పట్టినది. అట్లు లిమిటేషనుపట్టిన బాకీకి ఎదురు దావా వేయుటకు వీలులేదు.

ఉ. (2)"ఏ"అనువాడు "బి"అనువానిపై రు 50-0- 0లకు ప్రోనోటును బట్టి దావా తెచ్చెను. "ఏ" "బి" అనువానికి ఒక ప్రోనోటుపైన రు 150-0 0 లు బాకీ యుండును. "ఏ"దాఖలుచేసిన దావాలో "బి"తనకు రావలసిన రు 150-0.0 బాకీకి ఎదురుదావాచేసి "ఏ"కు యివ్వవలసిన రు 50-0-0 పోను మిగతా రు100-0-0 లకు డిక్రీ యివ్వమని ఎదురుదావా దాఖలుచేయుటకు వీలులేదు. ఏలనన ప్రతివాదిఅయిన "బి" తనకు రావలసిన రు 150-0-0 లకు దావా తెచ్చేయెడల అది గ్రామకోర్టులో దాఖలుచేయ వీలులేదు. ప్రతివాది తెచ్చు ఎదురుదావా మొత్తముకూడ గ్రామకోర్టు వారు విచారించుటకు హక్కుగల మొత్తమునకు మించియుండకూడదు. కాని ఇప్పుడు పంచాయతీకోర్టులుగాయున్న పంచాయతీలకు రు 100 ల విలువగల దావాలను విచా రించు హక్కు యివ్వబడినది. అందువల్ల అట్టి కోర్టులలో ప్రతివాది రు 100-0-0 ల వరకు ఎదురు దావా తేవచ్చును. ఏలనన ఆ రు 100 ల బాకీకి ప్రతివాది ఆ కోర్టులో

దావా తేవచ్చును. రు 50 ల విలువగల దావాలను మాత్రము విచారించు హక్కుగల కోర్టులలో రు 50 ల వరకు ఎదారు దావా తేవచ్చును.

39. ప్రతివాది యొక్క వివర పత్రిక దాఖలైనమీదట కోర్టు వారు, ఆ దావా యొక్క వాస్తవమును గురించి పరిశీలన చేయ నారంభింప వలసినదే గాక ఉభయ కక్షిదార్లలో యెవరి వల్లనయినను వుదహరించబడి హాజరు లేకుండా వున్న సాక్షులను సమ్మనుచేసి పిలిపించవలసినది.

హాజరులేని సాక్షులను సమ్మను చేసి పిలిపించవలసినది.

## వ్యాఖ్య.

ప్రతివాది ఆన్సరుదాఖలుచేసినతరువాత కోర్టువారుదావాను విచారించవచ్చును. దావా విచారణలో అచ్చట హాజరు లేని సాక్షులను కోర్టువారు కక్షిదారుల కోరికపై సమనులు చేయించి పిలిపించవలెను. కక్షిదారుల అట్టి కోరికను కోర్టువారు నిరాకరించ కూడదు.

40. గ్రామకోర్టుయొక్క అధికారహద్దులకు లోపుగా వాసము చేసే యేసాక్షిఅయినను వాగ్రూపముగా నయినా లిఖితమూలముగానైనా సమ్మను చేయబడవచ్చును. కోర్టుయొక్క అధికార హద్దుకు వెలుపల అయిదు మైళ్ళకు లోపుగా వాసముచేసే యేసాక్షి అయినను లిఖితమూలకముగాసమ్మనుచేయబడవచ్చును. అట్టి సమ్మను యెవరి అధికారహద్దుకులోపుగా అతను వాసముచేస్తున్నాడో ఆ గ్రామ మునసబు మూలముగా అందజేయబడవలసినది. ఏ సాక్షి అయినను అధికార హద్దులకు వెలపల అయిదు మైళ్ళకు జాస్తిదూరములో వాసము చేసే యెడల, లిఖిత మూలమైన సవాళ్ళు తయారు చేసే లాగు కోర్టువారు కక్షిదార్లకు ఉత్తరవుచేసి, యెవరి అధికార హద్దుకు లోగా ఆసాక్షి వాసముచేస్తున్నాడో ఆ గ్రామ మునసబువద్దకు అట్టి సవాళ్ళను ఒక వుత్తరముతోకూడ పంపవలసినది. ఆ మునసబు సదరు

సాక్షులకు సమ్మను యెట్లా అందజెయ్యబడవలసినది.

సవాళ్ళు యెప్పుడు పంపవలసినది.

సాక్షిని తక్షణము సమ్మనుచేసి పిలిపించి సవాళ్ళనుకొని అతనిని పరిశీలనచేసి అతడుచెప్పే జవాబులను వ్యాజ్యము యెక్కడ జరుగుతున్నదో ఆ కోర్టుకు వాపసు చెయ్యవలసినది.

## వ్యాఖ్య.

ఒక గ్రామకోర్టు అధికారహద్దులలో వాసము చేయుచున్న సాక్షులను కోర్టువారు లిఖిత రూపకముగా సమనుపంపిగాని, లేక వాగ్రూపకముగా కబురు పంపిగాని పిలిపించవచ్చును. ఏ సాక్షి అయినను ఒక గ్రామకోర్టు అధికార హద్దులు దాటి 5 మైళ్ళ లోపల వాసము చేస్తూయున్నయెడల అతనికి లిఖితరూపకమైన సమను అతడు యే గ్రామ మునసబు అధికారహద్దులలో కాపురము చేయుచున్నాడో ఆ గ్రామ మునసబు ద్వారా అందజేయవలెను. ఏ సాక్షి అయినను ఒక గ్రామకోర్టు అధికార హద్దులు దాటి 5 మైళ్ళకు పైగా వాసము చేయుచున్నాడో అట్టి సాక్షిని హాజరు కావలసినదని గ్రామకోర్టువారు సమనుచేయుటకు అధికారములేదు. గాని సదరుసాక్షిని ఉభయకక్షిదారులు అడుగవలసిన ప్రశ్నలను వ్రాతమూలముగా తీసికొని, ఆ సాక్షి యే గ్రామమునసబు అధికార ప్రదేశములో వాసము చేస్తూయున్నాడో ఆ గ్రామ మునసబుకు పంపవచ్చును. అప్పుడు ఆగ్రామమునసబు ఆసాక్షిని సమనుచేసి పిలిపించి విచారించి ఆ ప్రశ్నలకు జవాబులను వ్రాసిపంపవచ్చును. యీ సె. క్రింద జారీచేయబడవలసిన సమనులను యీ ఆక్టు సె. 12 ప్రకారము నియమించబడ్డ మనిషివల్ల అమలు జరిపించుటకు చెల్లించవలసిన బుసుములకు 2వ భాగములోని 58 వ రూలును చూడవలెను.

హాజరై సాక్ష్యము చెప్పే లాగు, లేక దస్తావేజు హాజరుపరిచేలాగు సమ్మను.

41. సమ్మను అయినది, హాజరై సాక్ష్యము చెప్పే లాగున గాని దస్తావేజు హాజరు పరచే లాగున, లేక హాజరు పరచేటట్లు చేసేలాగున గాని సమ్మను చేయబడ్డ మనిషికి వుత్తరువు చెయ్యవచ్చును.

## వ్యాఖ్య.

గ్రామకోర్టువారు ఒకసాక్షిని స్వయముగా హాజరై సాక్ష్య మిచ్చుటకుగాని లేక ఒక దస్తావేజును హాజరుపరచమనిగాని సమనుచేయవచ్చును. ఏదైనా దస్తావేజు హాజరుపరచమని సమను చేసినప్పుడు సదరు సాక్షి తాను స్వయముగా కోర్టుకువచ్చి దస్తావేజును హాజరుపరచవలసిన అగత్యములేదు. సదరు దస్తావేజును యితరులద్వారా కోర్టుకు పంపిన చాలును.

42. దేశాచారములను పట్టిన్ని దేశమర్యాదలను పట్టిన్ని బహిరంగముగా అగుపడేటట్లు బలవంత పరచబడకూడదని స్త్రీలున్నూ, కోర్టులో ఖుద్దున హాజరు కాకుండా మినహాయించబడ్డ మనుష్యులున్నూ, వ్యాధివల్లగాని దేహదౌర్బల్యమువల్లగాని బలమైన అసందర్భము లేకుండా హాజరుకాజాలని యే మనిషిన్ని సమ్మను చేయబడకూడదు. అయితే అట్టి యేమనిషియొక్క అయినా సాక్ష్యము ఆవశ్యకముగానున్న యెడల గ్రామకోర్టువారు అట్టివారిని వారివాసస్థలమందు పరిశీలనచేయవలసినది.

ఖుద్దున హాజరు కాకుండా కొందరు స్త్రీలను యితర మనుష్యులను మినహాయించడము.

43. సాక్షులను ప్రమాణముమీదగాని ప్రమాణపూర్వకమైన రూఢివాక్యము మీదగాని పరిశీలించ వలసినది. అయితే గ్రామకోర్టువారు సాక్షుల యొక్క వాఙ్మూలమును వ్రాతమూలకముగా పుచ్చుకోవలసిన ఆవశ్యకము లేదు.

సాక్షులను పరిశీలించడము.

వ్యాఖ్య

గ్రామకోర్టువారు సాక్షుల వాఙ్మూలమును వ్రాతమూలకముగా రికార్డు చేయవలసిన అవసరములేదు. కాని గ్రామకోర్టువారు సాక్ష్యమును వ్రాతమూలకముగా రికార్డుచేసినప్పుడు ఆ సాక్ష్యమును పూర్తిగా రికార్డు చేయవలసియుండును.

హైకోర్టు తీర్పు.

23 మ॥లా॥వీ॥ నో॥ఆ॥రి॥కే॥ 79

జడ్జీ:— స్పెన్సరుగారు.

వాదివద్ద ప్రతివాది పుచ్చుకొన్న చేబదులు మొత్తము రాబట్టుకొనుటకు ప్రతివాదిపైన వాది గ్రామకోర్టులో దావాదాఖలుచేసి బాకీబుజువుచేయుటకు యిద్దరు సాక్షులను విచారించెను. వారి సాక్ష్యమును గ్రామకోర్టువారు లిఖితపూర్వకముగా తీసికొని ఆ సాక్ష్యముపై గ్రామకోర్టువారు దావాను డిక్రీ చేసిరి. కాని ఆ సాక్ష్యములో వాది ప్రతివాదికి సొమ్ము యిచ్చినట్లు చెప్పిరేకాని వాది ప్రతివాదికి అప్పుగా యిచ్చినట్లు చెప్పియుండలేదు. ప్రతివాది అందుపైన సబు కోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా సబుజడ్జీగారు బాకీ బుజువుచేయు సాక్ష్యము యేమిన్ని లేదని, బాకీ బుజువుకాలేదని డిక్రీని రద్దుపరచిరి. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను పెట్టగా హైకోర్టువారు:—

(1) గ్రామకోర్టువారు తీసికొన్న సాక్ష్యమువల్ల కేసు బుజువు కానందున డిక్రీ చెల్లదనిన్ని,

(2) గ్రామకోర్టువారు సాక్షుల వాఙ్మూలములను వ్రాతమూలకముగా తీసికొనవలసిన అగత్యములేనప్పటికి, సదరు వాఙ్మూలములను వ్రాతమూలకముగా తీసికొన్నపుడు, ఆ సాక్ష్యమును పూర్తిగా వ్రాయబడలేదని అనుకొనుటకు వీలులేదనిన్ని.

(3) సబ్ జడ్జిగారు యిచ్చిన ఆర్డరు సరియైనదనిన్ని తీర్మానించిరి.

రాజీగా పోవుటకుగాని యితర కారణమును బట్టిగాని వ్యాజ్యము నిలిపి పెట్టడము.

44. కక్షిదార్లు రాజీగా, లేక యేదయినా చాలినంత యితర కారణమునకుగాను ఆ సంగతిని పరిష్కరించేటట్టు వున్నదని అగుపడే యెడల గ్రామ కోర్టు వారు, వ్యాజ్య విచారణను మరియొక దినము వరకు నిలిపి వుంచవచ్చును. అట్లా విచారణకుగాను యేర్పరచిన దినమును కక్షిదార్ల సమక్షమందుగాని, ప్రతివాది హాజరుకాని సంగతులలో వాదియొక్క సముఖమందుగాని నిర్ణయించవలసినది. ఆట్టిరోజున కక్షిదార్లుగాని వారిలో యెవరైనాగాని హాజరు కాకుండా తప్పిపోయిన పక్షమందు గ్రామకోర్టువారు 30-31 సెక్షన్లలో ఆ విషయమై నిర్ణయించియున్న విధములో ఒక విధమున వ్యాజ్యమును పరిష్కరించ నారంభించవచ్చును, లేక తమకు యుక్తమని తోచే యితర వుత్తరువు చెయ్యవచ్చును.

వ్యాఖ్య

ఈ సెక్షను ప్రకారము దావా విచారణకు వాయిదా వేయబడినప్పుడు సదరు వాయిదా రోజున వాది ప్రతివాదులు హాజరుకానియెడల సె. 30, 31 ల ప్రకారము కోర్టువారు దావాను పరిష్కరించవచ్చును.

## 6 వ అధ్యాయము.

### డిక్రీని గురించియు దాని అమలును గురించియు.

విచారణ ముగిసిన మీదట కోర్టువారు డిక్రీచేయవలసినది

45. కక్షిదార్లనుగాని వారిఏజంట్లనుగాని విచారణచేసి ఉభయపక్షపు సాక్ష్యము యోచించినందుమీదట, గ్రామకోర్టువారు న్యాయముగానున్ను నిష్పక్షపాతముగానున్ను మనస్సాక్షికి అనుగుణముగా అగుపడే విధముననున్ను డిక్రీ చేయవలసినది.

డిక్రీలో వుండవలసిన సంగతులు.

**46.** డిక్రీలో, వ్యాజ్యపుసంబరు-కక్షిదార్ల పేర్లు-దావావివరములు-విమర్శింపబడిన సాక్షుల పేర్లు - చూడబడ్డ దస్తావేజులు ఫలానివి అనేదిన్ని - అంకుపైన చేసిన తీర్పు - అట్టి తీర్పుకు వుండుకొన్న కారణములు - యివి వుండవలయును. మరిన్ని తీర్పుచెయ్యబడిన పైకపు మొత్తము, అప్పగింత చెయ్యబడవలసివున్న చరాస్తి, అప్పగింత చెయ్యని పక్షమునకు అందుకు బదులు చెల్లించవలసిన మొత్తము, ఖర్చులమొత్తము, యేయే కక్షిదారు యెంతెంత అట్టి ఖర్చులుచెల్లించవలసినదో ఆ సంగతి, యివి అంకులో కనుపరచి వ్రాయవలసినది.

ఏ తారీఖున డిక్రీ చేయబడుతున్నదో ఆ తారీఖును నమూదు చేసి గ్రామమునసబు అందులో సంతకము చేయవలసినది. వ్యాజ్యము పంచాయతీ కోర్టువల్ల విమర్శించబడే పక్షమునకు డిక్రీ అంగీకరించే అట్టి పంచాయతీకోర్టు మెంబర్లు అందులో సంతకము చేయవలసినది.

అంతట డిక్రీయొక్క నకలు ప్రతిపార్టీకిని నిర్దేశింపబడిన విధముగా అప్పగింపబడవలెను.

### వ్యాఖ్య.

గ్రామకోర్టువారు డిక్రీయిచ్చిన తరువాత ఉభయ వాదులకు డిక్రీ నకళ్ళను యివ్వవలెను. సదరు నకలు యీ ఆక్టు క్రింద చేయబడిన 65 రూలు ప్రకారము పార్టీలకుగాని వారి యేజెంట్లకుగాని హాజరుగా యుండిన యెడల స్వయముగా యివ్వవచ్చును. లేదా ఏ కక్షిదారుడైనను అట్టి నకలును పోష్టుద్వారా పంపమని పోష్టు ఖర్చు ముందుగా చెల్లించినయెడల పోష్టుద్వారా పంపవలెను.

డిక్రీలో వడ్డీ చెల్లించేటట్టు తీర్మానించ వచ్చును. లేక వాయిదాలుగా చెల్లించేటట్టు వుత్తరువు చెయ్యవచ్చును.

**47.** రొక్క పైకమునకు తెచ్చిన వ్యాజ్యములలో గ్రామకోర్టు వారుడిక్రీఅయినమొత్తమునకు వ్యాజ్యము తెచ్చిన తేదీ మొదలు పైకము చెల్లించే తేదీవరకు సంవత్సరానికి నూటికి పండ్రెండుకు మించకుండా వడ్డీ వేసేటట్టు డిక్రీ చెయ్యవచ్చును.

రొక్కపయికెముతు చెల్లించేటట్లు గ్రామకోర్టువారు డిక్రీచేసే పక్షమందు, పైన చెప్పినవంతున వడ్డీతోగాని వడ్డీలేకుండాగాని వాయిదాలుగా చెల్లించవలసినదని వారు వుత్తరువు చెయ్యవచ్చును.

వ్యాఖ్య.

సొమ్ము రాబట్టుకొనుటకు తెచ్చిన దావాలలో గ్రామకోర్టువారు దావా తేదీ లగాయతు సొమ్ము ముట్టేవరకు నె. 1కి 100 కి రు 1-0-0 కి మించకుండా వడ్డీని కూడా యివ్వవలెనని డిక్రీ యివ్వవచ్చును. ఉ॥ వాది ప్రతివాదికి తనపేర నెల 1కి 100 కి రు 1-8-0 లు చొ॥ వడ్డీయిచ్చే యేర్పాటుతో ప్రోనోటు వ్రాసియిచ్చెను. వాది సదరు నోటును బట్టి దావా వేసినప్పుడు గ్రామకోర్టువారు దావా తేదీనుండి డిక్రీ తేదీ వరకు గాని లేక డిక్రీఅయిన తరువాతగాని ప్రోనోటులోయున్న రు 1-8-0 చొ॥ వడ్డీ యివ్వవలెనని డిక్రీయిచ్చుటకు అధికారములేదు. దావా తేదీలగాయతు కోర్టువారు నెల 1 కి 100 కి రు 1-0-0 మించకుండా వడ్డీకి డిక్రీ యివ్వవచ్చును.

యిప్పుడు అమలులోయున్న మద్రాస్ వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు నిబంధనల ప్రకారము వ్యవసాయదారుడైన ప్రతివాదివద్దనుండి నెల 1 కి 100 కి 0-7-4 కంటె హెచ్చు వడ్డీని యిప్పించుటకు వీలులేదు. ఈ గ్రంథములోని 5 వ భాగములో వడ్డీని గురించిన అంశములు యివ్వబడినవి.

గ్రామకోర్టువారు డిక్రీయిచ్చినపుడు సదరు సొమ్మును ప్రతివాది వాయిదాల మీద యివ్వవలసినదిగా డిక్రీ యిచ్చుటకు అధికారముకలదు. ఆయా కేసుయొక్కయు, పార్టీలయొక్కయు, పరిస్థితులు గమనించి కోర్టువారు డిక్రీసొమ్మును చెల్లించుటకు యివ్వవలసిన వ్యవధిని, వాయిదాలను నిర్ణయించవలసియుండును.

ఎవరివల్ల డిక్రీ అమలు నెర వేర్చబడవచ్చునో ఆ కోర్టువారు.

48. డిక్రీ చేసిన గ్రామకోర్టువారుగాని అమలు నెరవేర్చుడము నకుగాను అది యెవరి వద్దకు పంపబడుతున్నదో ఆ గ్రామకోర్టువారుగాని డిస్ట్రిక్టు మునసబుగాని ఇందులో యీదిగున చెప్పివున్న నిబంధనలను అనుసరించి ఆ డిక్రీని అమలు నెరవేర్చవలసినది.

వ్యాఖ్య.

ఈ సెక్షను ప్రకారం డిక్రీ అమలుచర్య జరుపు గ్రామమునసబు సదరు చర్యను జడ్జీహోదాలో చేసినట్లు యెంచబడునని మద్రాస్ హైకోర్టువారు యీ క్రిందితీర్పులో తీర్మానించియున్నారు.

తీర్పు.

1929 ఇ. ఇ. ఠి. మద్రాస్ 256=1929 మ॥వీ॥నో॥ 67=56 మ॥ లా॥ జ॥ 609. 115 యిం॥ కే॥ 53.

జడ్జి:— జాక్సన్ గారు.

పరసుబ్బనాయుడు—పిటీషనరు.

గవర్నమెంటువారు—రెస్పాండెంటు.

మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 48 ప్రకారము డిక్రీ అమలులో జప్తుచర్య గ్రామమునసబు స్వయముగా జరిపినప్పుడు, సదరు గ్రామమునసబు జపును జడ్జి హోదాలో చేసినట్లే యెంచవలసి యున్నది. ఆయన సదరు జపు చర్యలో చేసిన పనికి ప్రాసిక్యూషన్ చేయదలచుకొన్నయెడల క్రి॥ప్రొ॥కో॥ సె. 197 ప్రకారము గవర్నమెంటువారి అనుమతిని పొందవలసి యుండునని తీర్మానించిరి.

నిర్దేశించిన చరాస్తికిగానైన డిక్రీ యెట్లా అమలు నెరవేర్చబడవలసినది.

49. నిర్దేశింపబడ్డ యేదైనాచరాస్తికిగాను డిక్రీచెయ్యబడ్డ పక్షమందు, అట్టి చరాస్తిని జప్తుచేసి దానిని డిక్రీపొందిన వానికి అప్పగింత చెయ్యడమువల్ల అది అమలుచెలాయించబడవచ్చును. ఆ ఆస్తి జప్తుచెయ్యడమునకు సాధ్యపడని పట్ల అందుకు ప్రత్యామ్నాయము అని డిక్రీ చెయ్యబడ్డ పయికపు మొత్తమును చెల్లించేటట్లు నిర్బంధించడము వల్ల డిక్రీ అమలు చెలాయించబడవలసినది.

వ్యాఖ్య.

వాది తన తాలూకు యేదైనా చరాస్తి స్వాధీనం నిమిత్తము ప్రతివాదిపైన డిక్రీని పొందినయెడల గ్రామకోర్టువారు అట్టి చరాస్తిని జప్తుచేసి వాదికి వప్పగింత చేయుట మూలముగా డిక్రీని అమలుచేయవలెను. అట్టి చరాస్తి దొరకనియెడల డిక్రీలో నమోదు జేయబడిన సదరాస్తి కిమ్మతును రాబట్టుటకు డిక్రీని అమలుజరుపవలెను.

డిక్రీనిపట్టి పైకము చెల్లించుటగాని యితర పరిష్కారముగాని మునసబుయెదుట చెయ్యబడవలసినది. లేక, రికార్డు చేయబడవలసినది.

50. గ్రామకోర్టువారివల్ల చెయ్యబడ్డ డిక్రీనిబట్టి చెల్లించిబడతగ్గ యావత్తు పయికము ఆ డిక్రీ అమలు నెరవేర్చడము, ఎవనిపనిగావున్నదో ఆ గ్రామమునసబు యొక్క సమక్షమందు, డిక్రీ పొందిన వానివద్దనైనను వ్రాతమూలమున ప్రత్యేకముగా అధికారము కలుగచెయ్య

బడ్డ అతని ఏజెంటువద్దనయినను చెల్లించబడవలసినది. అయితే డిక్రీ పొందినవానికి సమాధానకరమయ్యేలాగు ఆడిక్రీని మరియొకవిధమును పరిష్కరించబడ్డ పక్షమునకు అది ఏలానివిధమున పరిష్కరించబడ్డదని లిఖితముచేసి అట్టి గ్రామ మునసబు యొక్క సముఖములో ఆ డిక్రీ పొందినవాడుగాని అతని ఏజెంటుగాని అందులో సంతకము చేయవలసినది. మరిన్ని ఆ గ్రామమునసబు దాన్ని యధార్థ పరచవలసినది.

అట్లా పయికము చెల్లించబడ్డదని, లేక పరిష్కరింపబడ్డదని గ్రామమునసబు డిక్రీలో ఇండార్సు చేసి 10 వ సెక్షన్‌లో చెప్పివున్న వ్యాజ్యముల రిజిష్టరునందు రికార్డు చేయవలసినది.

డిక్రీ ప్రకారము పైకము చెల్లించడముగాని, డిక్రీని బొత్తిగానైనా కొంతమట్టుకైనా పరిష్కరించడము గాని యీ సెక్షన్‌లో నిర్ణయించివున్న విధమున నయినా డిస్ట్రిక్టుమునసబు కోర్టులోనయినా పయికము చెల్లించబడి, లేక రికార్డు చేయబడివుంటేనేతప్ప, లేనియెడల నప్పుకోబడకూడదు.

## వ్యాఖ్య.

గ్రామకోర్టు డిక్రీల ప్రకారము యివ్వవలసిన సొమ్మును సదరు డిక్రీని అమలు చేయవలసిన గ్రామ మునసబు (యీ సెక్షన్‌లోని "గ్రామమునసబు" అను పదము పంచాయతీకోర్టు ప్రెసిడెంటుకుకూడ వర్తించును.) ఎదుట డిక్రీనిపొందినవానికి యివ్వవలెను. లేక అవేవరిలోనే డిక్రీ పరిష్కారమైనయెడల సదరు పరిష్కారము వివరములు వ్రాతమూలముగా వ్రాయించి డిక్రీపొందినవారిచేతగాని వారి ఏజెంట్లచేతగాని గ్రామ మునసబు యెదుట సంతకములు చేయించవలెను. అట్టి దానిపైన గ్రామ మునసబు సాక్షి సంతకములు చేయించవలెను.

ప్రతివాది గ్రామమునసబు యెదుట యిచ్చిన వసూలు సంగతిగాని లేక అవ్వరలో అయిన పరిష్కారముయొక్క వివరముగాని గ్రామమునసబు డిక్రీపైన కూడా నమోదు చేయవలెను. మరియు 10 సెక్షన్‌లో చెప్పిన దావాల రిజిష్టరులో కూడ నమోదు చేయవలెను.

పైవిధముగా నమోదు చేయబడని వసూలుగాని, పరిష్కారముగాని అంగీకరించబడదు. సదరు వసూలుగాని, పరిష్కారము గాని మరియొక విధముగా ఋజావు

చేయుటకు వీలులేదు. అనగా డిక్రీపొందినవానికి లోగడ ప్రతివాది వసూలు యిచ్చియున్నను, సదరు వసూలు పైన చెప్పిన ప్రకారము నమోదు అయి యుండనప్పుడు. డిక్రీపొందినవాడు తిరిగి యీవస్తు డిక్రీ యిమ్మత్తమునకు డిక్రీని అమలు జరుపుచున్న యెడల ప్రతివాది తాను లోగడ వసూలు యిచ్చినట్లున్నూ, సదరు వసూలు ముజరాగావలెనని కోరుటకు హక్కు యుండదు. అట్టి వసూలు సంగతిని విచారించుటకు గాని, అట్టి వసూలును ముజరా యిచ్చుటకుగాని డిక్రీని అమలుజరుపు గ్రామకోర్టుకు అధికారము యుండదు.

ఒక గ్రామకోర్టు డిక్రీ అమలు నిమిత్తము డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు పంపబడి అచ్చటయుండగా డిక్రీ క్రింద వసూలు యివ్వబడినగాని, లేక యితరవిధముగా డిక్రీ పరిష్కారమైనగాని, అట్టి వసూలు లేక పరిష్కారము సదరు డిస్ట్రిక్టు మునసబుగారివల్ల నమోదు అయి యుండవలెను.

తీర్పు ఋణస్థుడు పట్టుకోబడనూకూడదు, స్థిరాస్తి జప్తు చెయ్యబడనూకూడదు.

51. 66–67 వ సెక్షను నిబంధనలకు లోబడి, గ్రామకోర్టువారి వల్ల చెయ్యబడ్డ డిక్రీని అమలు నెరవేర్చడము కొరకు తీర్పు ఋణస్థుడు పట్టుకోబడనూ కూడదు. ఏ స్థిరాస్తిన్ని జప్తు చెయ్యబడనూకూడదు.

వ్యాఖ్య

గ్రామకోర్టు డిక్రీని సె. 66, 67 ల ప్రకారము డిస్ట్రిక్టుమునసబుకోర్టులో అమలు జరుపుచున్న యెడల ప్రతివాదిని సదరు అమలులో అరెష్టు చేయించవచ్చును. లేక ప్రతివాది స్థిరాస్తిపైన అమలు జరుపవచ్చును. కాని సదరు డిక్రీని గ్రామకోర్టు అమలు జరిపేయెడల ప్రతివాది చరాస్తిపైనమాత్రమే అమలు జరుపుటకు అధికారముకలదు. డిక్రీని అమలుజరుపుచున్న గ్రామకోర్టులకు ప్రతివాదిని అరెష్టు చేయుటకుగాని, ప్రతివాది స్థిరాస్తిపై అమలు జరుపుటకుగాని అధికారము లేదు.

తీర్పు.

ఆ. ఇ. రి. 1929 మద్రాస్ 805=57 మ. లా. జ. 453=1929 మ .వీ. నో. 623 = 121 ఇం. కే. 842.

జడ్జీలు:— వాలెస్, మాదవన్ నాయర్ గార్లు.

అమృతనాదన్ వగైరా — పిటీషనర్లు

ఇన్నాసి ముత్తునాదన్ — రెస్పాండెంటు

ఒక గ్రామకోర్టు డిక్రీ అమలు నిమిత్తము డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు పంపబడినది. సదరు కోర్టులో వాది, ప్రతివాదుల స్థిరాస్తిని జప్తుచేయించి వేలం వేయించెను. ప్రతి

వాదులు సదరు వేలం సక్రమమైనది కాదనిన్ని సి.ప్రో.కోడు ఆ 21 రూ 90 ప్రకారము వేలమును రద్దు చేయవలసినదని పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు వేలమును రద్దుపరచెను. అందుపైన వాది సబ్‌కోర్టుకు అప్పీలు చేయగా అప్పీలు కోర్టువారు వేలమును ఖాయపరచిరి. ప్రతివాదులు సబ్‌కోర్టు ఆర్డరుపైన హైకోర్టుకు రెండవ అప్పీలు చేసిరి. కాని లా ప్రకారము రెండవ అప్పీలు లేనందున, సదరు అప్పీలు రివిజన్ పిటీషనుగా భావించి తీర్పు చెప్పుమని కోరిరి. ప్రతివాదుల తరఫున, వాది పొందిన డిక్రీని డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు స్మాలుకాజు డిక్రీవలె అమలు జరుపవలసినదేగాని, తమ స్థిరాస్తిని జప్తుచేయుటకుగాని వేలం వేయుటకుగాని అధికారములేదని వాదించిరి. కాని హైకోర్టువారు గ్రామకోర్టు ఆక్టు సె 51 లో గ్రామకోర్టు డిక్రీ 66, 67 సె॥ల క్రింద డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు ట్రాన్స్‌ఫర్ కాబడినయెడల సదరు కోర్టులో ప్రతివాదిని అరెస్టుచేయుటగాని, స్థిరాస్తి వేలంవేయించుటగాని జరిగించవచ్చునని కనుపడుచున్నందున ప్రతివాదుల వాదన సరికాదని త్రోసివేసి వాది వేయించిన వేలము సరియైనదని తీర్మానించిరి.

చరాస్తిని జప్తు చెయ్యడము.

52. డిక్రీ పొందిన మనిషి దరఖాస్తు చేసికొన్నమీదట, గ్రామకోర్టువారు లేదా ఒక పంచాయతీకోర్టు విషయములో దాని ప్రెసిడెంటు లేదా వైస్ ప్రెసిడెంటు తన అధికారమును అప్పజెప్పగల కోర్టుతాలూకు యేఇతర మెంబరుగాని సదరు కోర్టుయొక్క విచారణాధికార ప్రదేశములో డిక్రీ పొందిన మనిషి చూపునట్టి తీర్పు ఋణస్థుని యొక్క యేదయినా చరాస్తిని డిక్రీ ప్రకారము చెల్లించ బడవలసిన మొత్తముయొక్క కిమ్మతు వరకు జప్తుచెయ్యవలసినది. కాని, 1908 వ సంవత్సరపు సివిల్ ప్రొసీజరుకోడుతాలూకు 60 వ సెక్షను ననుసరించి జప్తు చేయబడకుండా మినహాయింపబడియుండు ఆస్తి యేదిగాని అట్లు జప్తు చేయబడదగి యుండగూడదు.

వ్యాఖ్య.

1. డిక్రీ అమలు చేయుటకు డిక్రీ పొందినవారు చెల్లించవలసిన రుసుములకు 2 భాగములోని 61 వ రూలును చూడవలెను.

ఈ సెక్షను క్రింద గ్రామకోర్టువారికి ప్రతివాది చరాస్తిని మాత్రము జప్తు చేయుటకు అధికారము కలదు. నిలువుపైరు చరాస్తికాదనియు, దానిని జప్తుచేయుటకు గ్రామకోర్టువారికి అధికారము లేదనియు యీ దిగువ తీర్పులో మద్రాస్ హైకోర్టువారు తీర్మానించిరి.

తీర్పు.

ఆ. ఇ. రి. 1930 మద్రాసు 509 = 1930 మ. వీ. నో 352=58 మ. లా. జ 509 = 127 యిం. కే. 296

జడ్జి:— జాక్సన్ గారు
నల్లమదన్ చెట్టియార్ వగైరా—పిటీషనర్లు
ఎదిరి—గవర్నమెంటువారు.

ముద్దాయిలయిన పిటీషనర్లు గ్రామకోర్టువారివల్ల జప్తుచేయబడిన నిలువుపైరును తీసికొని పోయిరని ఇం. పీ. కో. 424 క్రింద శిక్షింపబడిరి. అందుపైన ముద్దాయిలు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు సి.ప్రొ.కో. సె 2 (13) ప్రకారము నిలువుపైరు చరాస్తిగా యెంచబడుచున్నప్పటికి, ఇం.పీ.కో. సె 22 ప్రకారముగాని జనరల్ క్లాజస్ ఆక్టు ప్రకారముగాని నిలువుపైరు చరాస్తి కాదనియు, మ. గ్రా. కో. ఆ. సె. 52 ప్రకారము నిలువుపైరును జప్తు చేయుటకు గ్రామకోర్టుకు అధికారము లేదనియు తీర్మానించిరి.

1926 మ. వీ.నో 953=51 మ. లా. జ. 561 లో జాక్సన్ గారు నిలువుపైరు కూడ చరాస్తియగునని తీర్పు యిచ్చియున్నప్పటికిన్ని, అది సరియైనది కాదనియు, నిలువుపైరు చరాస్తికాదని వాదించుటకు అవకాశము కలదనియు తీర్మానించిరి.

1937 సం॥పు 2వ మదరాసు గ్రామకోర్టుల సవరణ ఆక్టువల్ల "చరాస్తి" అను పదమునకు "చరాస్తిలో పెరుగుచున్న పైరులును, కోయబడని భూమియందలి పంటలు కూడ చేరును?" అని ప్రత్యేక నిర్వచన మీయబడినది. మరిన్ని జప్తుచేయబడిన పైరును జాగ్రత్త పెట్టుటకు ప్రత్యేకము నిబంధనల నేర్పాటు చేయుచూ సె 53 A అను నూతన సెక్షను చేర్చబడినది. అందువల్ల పై తీర్పు యిప్పుడు వర్తించదు.

2. సి.ప్రొ.కో సె. 60 లో జప్తుచేయుటకు వీలులేదని మినహాయించబడిన ఆస్తులు యీ సెక్షను క్రింద గ్రామకోర్టువారుకూడ జప్తుచేయుటకు వీలులేదు. సివిల్ ప్రొసీజరు కోడ్ క్రింద జప్తుచేయకూడని ఆస్తులు.

(1) తీర్పు ఋణస్థుని యొక్కయు, అతని భార్యాపిల్లల యొక్కయు, ధరించుటకు అవసరమైన దుస్తులున్ను, వారి పరుపులు, పక్కబట్టలున్నూ, వంటపాత్రలున్నూ, (వంట పాత్రలు అనగా వంటకొరకు వుపయోగించు పళ్ళెములు వగైరాలుకూడ చేరును.) ఏ స్త్రీ అయినను మతానుసారము విడువకుండా విధిగా ధరించవలసిన ఆభరణములు (అనగా మంగళసూత్రమువంటి ఆభరణములు)

(2) శిల్పులయొక్క పనిముట్లు (అనగా వడ్రంగి మొదలగువారి పనిముట్లు) సబ్బులు తయారుచేయువారి యొక్కయు, లేదా మిఠాయి లేదా కాఫీహోటల్ లో ఫలహారములు తయారుచేయు పనిముట్లున్నూ జప్తుచేయవీలులేదు. (కాని సంగీత పాట

ములు గాని డాక్టర్లుగాని శిల్పులుగా యెంచబడరు. సంగీతమునకు వుపయోగించు హార్మోనియమ్, ఫిడేలు వగైరా పనిముట్లున్నూ డాక్టరు శస్త్రము చేయుటకు ఉపయోగించు పనిముట్లున్నూ జప్తుచేయబడవచ్చును. కాని ఒక కుట్టుపనివాని యంత్రము శిల్పియొక్క పనిముట్టుగా యెంచబడును. దానిని జప్తుచేయ వీలులేదు.)

(3) తీర్పు ఋణస్థుడు వ్యవసాయదారుడైన యెడల, అతని వ్యవసాయమునకు అత్యంత అవసరమని కోర్టువారు యెంచే, అతని వ్యవసాయమునకు ఉపయోగపడే పనిముట్లు (అనగా నాగలి వగైరాలవంటివి) పశువులు, విత్తనములున్నూ జప్తుచేయబడకూడదు. కాని తీర్పుఋణస్థుడు యెక్కువ ఆస్తిపరుడై పైనచెప్పిన ఆస్తులను జప్తుచేసినప్పటికిన్ని తాను తిరిగి అట్టివాటిని ఖరీదుచేసి వ్యవసాయము నిరాటంకముగ సాగించగలవాడైన లేక జప్తుచేయబడిన పశువులుగాక అతనికి వ్యవసాయమునకు చాలినన్ని యితర పశువులున్న, పైన చెప్పిన ఆస్తులనుకూడ జప్తుచేయవచ్చును. ఈ విధి బీదలగు వ్యవసాయదారులకు తమ జీవనోపాధియగు వ్యవసాయ వృత్తిని నిరాటంకముగా సాగించు కొనుటకు జేయబడిన సౌకర్యమై యున్నది.

(4) తీర్పుఋణస్థుని లెఖ పుస్తకములు.

(5) తీర్పుఋణస్థునికి యెవరిపైనఅయినను నష్టమునకు దావాతెచ్చే హక్కును.

(6) గవర్నమెంటువారివల్ల పెన్షనుపొందినవారికి లేక ఒక స్థానికఅధికారివర్గము కేంద్ర ప్రభుత్వమువారివల్ల ఇండియా గెజెట్టులో ప్రచురిణ చేయబడిన యే ఫామిలీ ఫండులోనుంచియివ్వబడే జీతములు లేక పారితోషికములు (అనగాబ హుమానములు.)

(7) గవర్నమెంటుయొక్క, లేక రైల్వే లేక యితర లోకల్ గవర్నమెంటు వారివల్ల వారి ఉద్యోగములకు ఇచ్చే జీతములో మొదటి రు 100 లు, రు 100 లు పై మొత్తములో సగమున్నూ.

(8) ఇండియన్ ఆర్టికిల్సు ఆఫ్ వార్ వర్తించు వారికి యివ్వబడే జీతములు అలవెన్సులు.

(9) ప్రావిడెంటు ఫండుల ఆక్టుప్రకారము డిపాజిట్టుచేయబడి సదరు ఆక్టువల్ల జప్తుచేయుటకు వీలులేదని విధించబడిన మొత్తములు.

(10) కూలీలు, లేక యింటివౌకర్లుయొక్క రొఖ్ఖముగా యివ్వవలసిన లేక వస్తురూపకముగా యివ్వవలసిన జీతములు.

(11) ముందు రావలసిన మనోవర్తి.

(12) ఏ ఇండియన్ చట్టము ననుసరించిఅయినను జప్తుచేయకూడదని చెప్పబడిన అలవెన్సులు.

(13) తీర్పుఋణస్థుడు భూమిశిస్తు చెల్లించువాడై అట్టి శిస్తును రాబట్టుకొనుటకు యేర్పడిన యే "లా" ప్రకారమైనను జప్తుచేయకూడదని విధించబడిన ఏచరాస్తినీ్న జప్తుచేయకూడదు.

మదరాసు యస్టేటులాండు ఆక్టు ప్రకారము రైతు తన భూముల మరమ్మతు నిమిత్తము నిల్వచేసిన యెరువును జప్తు చేయకూడదు. అట్టి యెరువును సి. ప్రొ. కో. ప్రకారముకూడ జప్తు చేయుటకు వీలులేదు.

3. గ్రామకోర్టువారు డిక్రీ అమలు చేయుటలో డిక్రీ మొత్తమునకు సరిపడే చరాస్తిని మాత్రమే జప్తుచేయవలెను.

తీర్పు ఋణస్తుని స్వాధీనమందు వున్నపట్ల యెట్లా జప్తు చెయ్యావలసినది.

**53.** సొత్తు తీర్పుఋణస్థుని స్వాధీనములోవున్న యెడల దానిని నిశ్చయముగా పట్టుకొని జప్తు చేయవలసినది గ్రామమునసబు దానినిబందోబస్తుగా వుంచడమునకు యేర్పాటు చెయ్యావలసినది. కావలసినప్పుడు దానిని తెచ్చి హాజరుపరచగలందులకుగాను లిఖిత మూలముగా చాలినంత జామీను యిచ్చిన మీాదట తీర్పుఋణస్థుని వశమందు అది వుంచబడవచ్చును. అట్లా చెయ్యనియెడల హాజరు చెయ్యాబడని సొత్తుయొక్క కిమ్మతు వరకు జామీనుదారునిమీాద డిక్రీ అమలు నెరవేర్చబడవచ్చును.

## వ్యాఖ్య

ప్రతివాదికిగాను జప్తు ఆస్తికి జామీను యిచ్చిన జామీనుదారు జప్తు ఆస్తిని కోర్టుకు హాజరుపరచమన్నపుడు హాజరుపరచకతప్పిపోయిన యెడల జప్తుఆస్తి కిమ్మతు అతనివద్దనుండి వసూలు చేయవచ్చును. అతను యిచ్చే జామీను బాండుకు స్టాంపు అవసరమని మద్రాస్ హైకోర్టువారు యీా క్రింది తీర్పులో తీర్మానించిరి.

తీర్పు.

**52 మ. లా. జ. 153 = 1927 ఆ. ఇ. రి. మద్రాస్ 377 = 1927 మ. వీ. నో. 281.**

జడ్జీలు:— క్రిష్ణన్, రామేశం, బీస్లీ గార్లు.

బీడెల్ల చెంచయ్య — పిటీషనరు (వాది)

అన్నరెడ్డి పిచ్చిరెడ్డి — రెస్పాండెంటు (ప్రతివాది)

జప్తు కాబడిన చరాస్తి హాజరు పెట్టెదనని లేక ఆస్తి కిమ్మతు రు 40-0-0 లు యిచ్చెదనని వ్రాయబడిన బాండుకు, స్టాంపు ఆక్టు ప్రకారము స్టాంపు కావలసియుండునా యను అంశమును తేల్చుటకు కావలి డిస్ట్రిక్టు మునసబు హైకోర్టువారికి డిస్ట్రిక్టు జడ్జీద్వారా స్టాంపు ఆక్టు సె 60 క్రింద రిఫరెన్సుచేయగా హైకోర్టువారు:—

(1) సదరు బాండుకు స్టాంపు ఆక్టులో చెప్పబడిన బాలమతీ బాండుకువలె రు 0-6-0 స్టాంపు అవసరమనిన్నీ, అందువల్ల దాని పైన యివ్వవలసిన స్టాంపున్నూ పెనాల్టీయున్నూ వసూలు చేసినయెడల సాక్ష్యముగా అంగీకరించవచ్చుననిన్నీ.

(2) కోర్టుఫీజు ఆక్టు ఆర్టికిల్ 6 క్రి॥ ప్రొ॥ కో॥ క్రిందగాని, సి॥ ప్రొ॥ కో॥ క్రిందగాని తీసికొన్న బాండులకే వర్తించవచ్చుననియు, సి॥ ప్రొ॥ కో॥ గ్రామకోర్టులకు వర్తించనందున సదరు ఆర్టికిల్ గ్రామకోర్టులలో తీసికొన్న బాండులకు వర్తించదనియు తీర్మానించిరి.

సి॥ ప్రొ॥ కో॥ గ్రామకోర్టులకు వర్తించదని, ఇ॥ లా॥ రి॥ 46 మద్రాస్ 374 = 44 మ॥ లా॥ జ॥ 643 = ఆ. ఇ. ర. 1923 మద్రాస్ 751 వ తీర్పు ననుసరించి తీర్మానించిరి.

జప్తు చేయబడిన తరువాత పంటలను లేదా కుప్ప వేయబడని ఫలసాయమును పరిష్కరించు విధము.

"53 A. 53 సెక్షను ననుసరించి ఏ భూమి తాలూకు పంటనైనను లేదా కుప్ప వేయబడని ఫలసాయమైనను జప్తు చేయబడిన సందర్భములో అవి కోయబడి కుప్ప వేయబడుటకు తగిన స్థితిలో నున్నపుడు అవి విక్రయింపబడునట్లు గ్రామకోర్టువారు చేయవచ్చును. లేదా వారి యిష్టానుసారము సరియైన ఋతువులలో అవి కోయబడి కుప్ప వేయబడి విక్రయింపబడునంతవరకు తగిన స్థలములలో నిల్వయుంచ బడునట్లు చేయవచ్చును. చివర చెప్పబడినట్లు చేయుటలో అట్టి పంటలను లేదా ఫలసాయములను కోసి లేదా కుప్పచేసి నిల్వ చేయుటకు అగు ఖర్చు తీర్పు ఋణస్థుడు సదరు ఆస్తిని విడుదల చేయునపుడు అతనివలన లేదా అవి విక్రయింపబడుసందర్భములో విక్రయధనమునుండి చెల్లింపబడవలెను."

తీర్పుఋణస్థుని వశమందు లేనియెడల యెట్లా జప్తుచెయ్యవలసినది.

54. సొత్తు తీర్పుఋణస్థుని స్వాధీనమందు వుండని పక్షమునకు, ఆ సొత్తు యెవ్వరి స్వాధీనమందు వున్నదో ఆ మనిషి దానిని తీర్పుఋణస్థుని వగయిరా చెయ్యకూడదని లిఖితమూలమైన వుత్తరువు ద్వారా జప్తు చెయ్యవలసినది.

వ్యాఖ్య.

జప్తు చేయవలసిన ఆస్తి తీర్పుఋణస్థుని (అనగా యెవనిమీద డిక్రీ అగునో

అతడు) స్వాధీనమందు లేక యితరుల స్వాధీనములో యుండేయెడల ఆ స్తి యెవరి స్వాధీనమందున్నదో వారికి సదరాస్తిని తీర్పుఋణస్థునికి వప్పగింత చేయకూడదని అతనికి లిఖితరూపకమైన ఆర్డరును అందజేయుటమూలముగా జప్తు చేయవలెను.

ఋణములు ఎట్లా జప్తు చెయ్యబడవలసినది.

55. తీర్పుఋణస్థునికి బాకీ వుండే ఋణములున్న పైకపు మొత్తములున్న గ్రామకోర్టువారు మరు వుత్తరువు చేసేవరకు తీర్పుఋణస్థుడు ఆఋణమును వసూలు చేయకూడదనిన్ని, లేక పైకపు మొత్తమును పుచ్చుకోకూడదనిన్ని, ఋణస్థుడు దాన్ని చెల్లించకూడదనిన్ని ఆజ్ఞాపించునట్టి లిఖితమూలమైనవుత్తరువుచేత జప్తు చెయ్యబడవలసినది; స్థిరాస్తిమీద హమీకలిగివున్న ఋణమును జప్తు చేయుటను గాని విక్రయించుటకుగాని గ్రామకోర్టువారికి యీ సెక్షన్‌లో వుండేది యేదిన్ని అధికారము కలుగచేసినట్లు యెంచబడకూడదు.

వ్యాఖ్య.

తీర్పుఋణస్థునికి రావలసిన బాకీలనుగాని, సొమ్మునుగాని, జప్తుచేయవలసివచ్చినప్పుడు సదరు సొమ్మునుగాని, బాకీనిగాని గ్రామకోర్టు ఉత్తరువులపొందనిదే వసూలు చేసుకొనకూడదని తీర్పుఋణస్థునికిన్ని, తీర్పుఋణస్థునికి యివ్వకూడదని అతనికి బాకీయున్న ఋణస్థునికిన్ని లిఖితపూర్వకమైన ఆర్డర్లను జారీచేయవలెను.

గ్రామకోర్టులకు స్థిరాస్తి హామీగాయున్న బాకీలను అనగా స్థిరాస్తి తాకట్టుగా యున్న బాకీలనుగాని, స్థిరాస్తి తనఖా పత్రములపైన యివ్వవలసిన బాకీలనుగాని జప్తు చేయుట అధికారములేదు.

జప్తుచేసిన తర్వాత సొత్తును లోలోగా పరాధీనము చెయ్యడము రద్దుకావలసినది.

56. వాస్తవముగా పట్టుకొనిగాని లిఖితమూలమైన వుత్తరువు ద్వారాగాని జప్తు చెయ్యబడ్డ తర్వాత, జప్తులోవుండేవరకు ఆజప్తుసొత్తు విక్రయము, దానము, తాకట్టు, మరి యే విధముగానయినా లోలోగా పరాధీనము చెయ్యడమున్ను తీర్పు ఋణస్థునికి ఆ ఋణము చెల్లించడమున్ను – జప్తును అనుసరించి అమలు చలాయించబడ్డ అన్నిదావాలకు విరోధముగా రద్దుకావలసినది.

## వ్యాఖ్య

సె 53, 54 ల ప్రకారము ఆ స్తిని జప్తుచేసిన తరువాత సదరు ఆ స్తిని విక్రయము తనఖా లేక దానము వగైరా యెట్టి అన్యాక్రాంతము చేసినను అట్టి అన్యాక్రాంతములు, సదరు జప్తు అమలులోయుండి. సదరు జప్తుప్రకారము ఏర్పడిన హక్కులకు భంగముగా చెల్లనేరవు. సె 55 ప్రకారము తీర్పుఋణస్థునికి రావలసినబాకీ జప్తుచేయబడిన తరువాత తీర్పుఋణస్థుని ఋణస్థుడు, తీర్పుఋణస్థునికి యెట్టివసూలున్నూ యివ్వకూడదు. అట్లు యేదైనా వసూలు యిచ్చినను సదరు జప్తు అమలులోయుండి సదరు జప్తుప్రకారము యేర్పడిన హక్కులకు భంగముగా సదరు వసూలు యిచ్చినట్లు యెంచబడదు.

జప్తుఅయిన తరువాత అనగా 53, 54, 55 సెక్షనులలో చెప్పిన చర్యలన్నియు పూర్తిగా జరిగినప్పటినుండి జప్తుఅయినట్లు యెంచబడును. అంతేకాని జప్తు ఆర్డరుకు యిచ్చిన తేదీనుండి జప్తుఅయినట్లు యెంచుటకు వీలులేదు.

ఈ సెక్షనులలో చెప్పిన అన్యాక్రాంతములు పార్టీలు చేసిననే చెల్లకపోవును. అనగా గ్రామకోర్టువారివల్ల జప్తుఅయిన ఆ స్తిని డి॥ ము॥ కోర్టువారు వేలంవేయించిన యెడల సదరు వేలం చెల్లును. ఏలనన అది పార్టీలవల్ల చేయబడనందున. అట్లు వేలం అయిన తరువాత సదరాస్తిపైన గ్రామకోర్టువల్ల చేయబడిన జప్తు చెల్లనేరదు. అట్లే భూమిశిస్తుకు రెవిన్యూ వేలంజరిగిన అట్టివేలంకూడ చెల్లును.

పార్టీలు చేసిన అన్యాక్రాంతములుకూడ యెవరైతే జప్తు చేయించినారో వారి బాకీ పూర్తిగా చెల్లించినయెడల, సదరు జప్తు అమలులోయుండగా చేసిన అన్యాక్రాంతమైనను చెల్లును. దానిని సదరు అన్యాక్రాంతమైన తరువాత జప్తు చేయించిన యింకొక బాకీదారు, అదివరలో యింకొక బాకీదారు జప్తులోయుండగా అన్యాక్రాంతము చేయబడినందున అట్టి అన్యాక్రాంతము చెల్లదని వాదించుటకు హక్కుయుండదు. తాను చేయించిన జప్తు అమలులోనుండగా జరిగిన అన్యాక్రాంతములు మాత్రమే చెల్లనేరవు.

జప్తు చెయ్యబడ్డ సొత్తుకు గలదావాలను విచారించడము.

57. ఒక డిక్రీని అమలు నెరవేర్చడముకొరకు జప్తుచెయ్యబడ్డ సొత్తుకు యేదయినా దావా చెయ్యబడ్డ యెడల గ్రామకోర్టువారు ఆ దావాగురించి విచారణచేయవలసినది. తీర్పుఋణస్థునికి అంకులో విక్రయించే బాధ్యతలేదని కనుపడ్డయెడల ఆ సొత్తును జప్తులోనుండి విడుదలచేయవలసినది.

## వ్యాఖ్య

ఇతరుల ఆస్తి యేదైనా ప్రతివాదిదైనట్లు గ్రామకోర్టువారు జప్తు చేసినట్లయిన ఆ ఆస్తికి హక్కుగలవారు సదరు ఆస్తియందు ప్రతివాదికి యెవ్విధమైన హక్కు లేదని దానిని జప్తులోనుంచి విడుదల చేయవలసినదని యీ సెక్షన్ ప్రకారము క్లెయిము పిటీషను పెట్టవచ్చును. ఆ పిటీషనును కోర్టువారు విచారించి ప్రతివాదికి జప్తు ఆస్తిలో యెట్టిహక్కు లేదని యెంచినయెడల సదరు ఆస్తిని జప్తులోనుంచి విడుదలచేయవలెను.

ఈ సెక్షను క్రింద పెట్టబడిన క్లెయిము పిటీషనును గ్రామ కోర్టువారు పరిహరించేయెడల సదరు పిటీషనరు సదరు ఆర్డరును సె. 73 ప్రకారము డిస్ట్రిక్టు మునసబు కోర్టులో పిటీషను పెట్టి రద్దు చేయించుకోవచ్చును.

జప్తు ఆస్తియందు హక్కుగలవారు యీ సెక్షనుక్రింద క్లెయిము పిటీషను పెట్టకుండాగాని, పెట్టి అపజయము పొందినగాని తమఆస్తిని అక్రమముగా జప్తుచేయించినందులకు జప్తు చేయించినవారిపై సివిల్ కోర్టులో జప్తువల్ల తమకు కలిగిన నష్టమునకు దావా తేవచ్చును.

జప్తున తర్వాత పదిహేను దినములకు తక్కువ కాకుండా సొత్తు విక్రయించి విక్రయమును ప్రకటించవలసినది.

58. జప్తుచేసిన తర్వాత సాధ్యమైనంత త్వరలో, గ్రామకోర్టువారు జప్తుచెయ్యబడ్డసొత్తును విక్రయించుటకుగాను జప్తుచేసిన తేదీ మొదలు పదిహేను రోజులకు తక్కువ కాకుండా నొక రోజు నిర్ణయించి వుద్దేశించిన విక్రయమును గురించి తమ కోర్టుకు వెలపల వ్రాతమూలమైన ప్రకటనను అంటించేటట్లు చెయ్యవలసినది మరిన్ని అట్టి విక్రయమునకు ముందు దాన్నిగురించి దండోరావేసి యింకా ప్రకటించవలసినది.

మినహాయింపు నిబంధన.

అయితే (1) తీర్పు ఋణస్థుని యొక్క లిఖిత మూలమయిన సమ్మతిమీద, లేక (2) పట్టుకోబడ్డ సొత్తు తనంతట శీఘ్రముగా చెడిపోవ తగ్గదిగా వుండేయెడల, లేక (3) దాన్ని కాపుదలలోవుంచుటకు పట్టునట్టి ఖర్చు దానివెలను మించేయెడల, కోర్టువారు దండోరావేసి క్రమమయిన నోటీసు యిచ్చినతర్వాత జప్తు చెయ్యబడ్డ తేదీమొదలు పదిహేను రోజులలోగా యే కాలమందైనా, జప్తుసొత్తును విక్రయించవచ్చును.

అట్టి సంగతిలో విక్రయ పైకమును, డిక్రీలు అమలు నెరవేర్చడమందు జప్తు చెయ్యబడ్డ మొత్తములను చెల్లించే నిమిత్తము యిందులో యీ దిగువ చెప్పివున్న నిబంధనలకు లోబడి కోర్టువారు వుంచుకోవలసినది.

## వ్యాఖ్య.

గ్రామకోర్టువారు ఆస్తి జప్తుఅయిన తరువాత సాధ్యమైనంతత్వరలో జప్తు తేదీ నుండి 15 దినములు తక్కువకాకుండా సదరా స్తిని వేలం వేయుటకు ఒక వాయిదా నిర్ణయించి, సదరు విక్రయమును గురించి వ్రాతమూలకమైన నోటీసును తమ కోర్టు వెలుపల అంటించవలెను. మరియు సదరు వేలము సంగతి టముకు వేయించి కూడ ప్రచురణ చేయవలెను.

ఈ సెII క్రింద జప్తు తేదీ మొదలు 15దినముల తరువాత ఆ స్తి వేలం కావలెను. కాని యీ సెIIలో విధింపబడిన కోర్టులో అంటించవలసిన వ్రాతమూలకమైన నోటీసు అంటించిన లేక టముకు వేసిన తేదీనుండి 15 దినముల వ్యవధి అవసరము లేదు.

ప్రతివాది వ్రాతమూలకముగా వప్పుకొన్నయెడల, లేక జప్తుకాబడిన చరాస్తి జప్తు తేదీనుండి 15 దినముల వరకు వుండక చెడిపోయే స్వభావముగల పండ్లు, కూరలు చేపలు వగైరా మాదిరివైన లేక యే కొద్ది ఖరీదుగల పశువో జప్తుకాబడి దానికి 15 దినములవరకు మేత, కాపుకూలి వగైరాఖర్చులు దాని కిమ్మతుకంటె మించేపరిస్థితులలో పైనచెప్పిన 15 దినముల గడువును గ్రామకోర్టువారు గమనించక జప్తుఅయిన వెంటనే అట్టి ఆ స్తిని వేలం వేయవచ్చును. అట్లు వేలం వేయుటకు పూర్వము సదరు వేలము సంగతిని సాధ్యమైనంత వ్యవధితో బహిరంగముగా టముకు వేయించి ప్రచురణ చేయవలెను.

విక్రయములో చర్య.

59. విక్రయించుటకుగాను నిర్ణయించినరోజున గ్రామమునసబు యొక్క సమక్షమందు ఆ సొత్తు బహిరంగమైన వేలము వేయబడి యెక్కువ ధర అడిగినమనిషికి విక్రయించబడవలసినది. ఆధర ఆలస్యములేకుండా చెల్లించవలసినది. అట్లు చెల్లించక తప్పిపొయ్యే పక్షమునకు ఆసొత్తును మళ్ళీ వేలముద్వారా విక్రయించవలసినది.

ఖరీదు పైకమును చెల్లించినమీాదట, కోర్టువారు అందుకుగాను రశీదు యివ్వవలసినది. అప్పట్లో ఆ విక్రయము పూర్తికావలసినది.

మళ్ళీ వేలము వేసేటప్పుడు యేదయినా నష్టము సంభవించిన యెడల, అది ఋణమునకు తీర్పుపొందినవాడు గాని, తీర్పు ఋణస్థుడు గాని అడుగుకొన్న మీాదట, పైకము కట్టుటకు తప్పిపోయిన మనిషి మీాద అందుకుగాను డిక్రీ చేసినప్పుడు యెట్లాగో అట్లాగే అతనివద్ద నుండి వసూలుచేయబడ తగియుండ వలసినది.

## వ్యాఖ్య.

జప్తు ఆస్తి వేలం అయినవెంటనే ఖరీదుదారు యావత్తు పైకమును వెంటనే చెల్లించవలెను. పైకముచెల్లించక ఖరీదుదారు తప్పిపోయినయెడల ఆస్తిని తిరిగి అప్పుడే వేలం వేయించవలసియుండును. ఖరీదుదారు సొమ్ము చెల్లించినయెడల దానికి గ్రామ కోర్టువారు రశీదు యివ్వవలెను. ఖరీదుదారు సొమ్ము చెల్లించిన తరువాత వేలము ఖాయమగును.

ఈ సె॥ క్రింద వేయబడిన వేలములో ఖరీదుదారు వేలముమొత్తము చెల్లించక తప్పిపోయిన యెడల సదరు ఆస్తిని అప్పుడే వేలము వేయవలెను. రెండవసారి వేయబడిన వేలములో మొదటిసారివచ్చిన కిమ్మతు రానియెడల వాదిగాని, ప్రతివాది గాని తక్కువఅయిన మొత్తమును, వేంమొత్తమును చెల్లించక తప్పిపోయిన మొదటి ఖరీదుదారువద్దనుండి రాబట్టవలసినదని పిటీషను పెట్టవచ్చును. అట్టి పిటీషనుపైన గ్రామ కోర్టువారు పైకము చెల్లించక తప్పిపోయిన ఖరీదుదారుపైన డిక్రీ చేసినట్లు యెంచి తక్కువఅయిన మొత్తమును అతని వద్దనుండి వసూలు చేయవచ్చును. కాని వాదిగాని, ప్రతివాదిగాని, కోరనప్పుడు గ్రామకోర్టువారు తమంతట తామే సొమ్ము చెల్లించక తప్పిపోయిన ఖరీదుదారు వద్దనుండి యెట్టి సొమ్మున్నూ రాబట్టుటకు అధి కారము లేదు.

విక్రయమునకు నిలిపిపెట్టు టకు అధికారము.

60. ఈ ఆక్టు ప్రకారము ప్రకటించబడ్డ యేదయినా విక్రయ మును కోర్టువారి యిష్టానుసారము ఫలాని దినమునకు అని నిలిపెట్టి దాన్ని గురించి 58 వ సెక్షనులో నిర్ణయించియున్న విధమున జనులకు ప్రకటించవలసినది.

## వ్యాఖ్య.

ఈ సె॥లో గ్రామకోర్టువారికి వేలమును నిలిపి వాయిదా వేయుటకు అధికార మివ్వబడినది. కాని తిరిగి వేలం వేయుటకు పూర్వము సె॥ 58 లో చెప్పినప్రకారము నోటీసు అంటించడమున్నూ, టముకు వేయుటయున్నూ జరుగవలెను.

విక్రయించిన సొత్తును గ్రామ మునసబును యితర వుద్యోగస్థులున్ను వేలములో పాడనూకూడదు, లేక కొనుక్కోనూ కూడదు.

61. ఈ ఆక్టులో యేదయినా వేలం విక్రయ సంబంధముగా ఏపని అయినను చేయవలసివున్న గ్రామ మునసబుగాని యితర ఉద్యోగస్థుడు గాని అట్టి వేలములో విక్రయించబడు యేదయినా సొత్తును ప్రత్యక్షముగానయినను సరే పరోక్షముగా నయిననుసరే వేలములో పాడనూగూడదు లేక అందుల్లో బాధ్యతయున్నా పొందనూ కూడదు.

వ్యాఖ్య.

గ్రామకోర్టువారివల్ల వేయబడు వేలములో సదరు వేలం చర్యలతో సంబంధముగల గ్రామమునసబుగాని, లేక యితర ఉద్యోగస్థులుగాని, సదరు వేలంలో స్వయముగాగాని యితరులద్వారాగాని, వేలంలో పాడుటగాని లేక ఆ ఆస్తిని ఖరీదు చేయుటగాని కూడదు. వాది సదరు వేలంలో ఆ ఆస్తిని ఖరీదు చేయవచ్చును.

ఋణమున్ను ఖర్చులనున్ను యివ్వచూపిన మీదట విక్రయము నిలపడము.

62. సొత్తును వేలములో కొట్టివేయుటకుముందు, డిక్రీప్రకారం బాకీగావున్న మొత్తమునున్ను విక్రయ ఖర్చునున్ను గ్రామమునసబు వద్ద యివ్వవచ్చే యెడల, యీ ఆక్టు ప్రకారము జరిగించే సొత్తుయొక్క ప్రతివిక్రయమున్ను నిలిపి వేయబడవలసినది.

విక్రయమువల్ల వచ్చిన పైకము పంచిపెట్టడము.

63. అమలు నెరవేర్చడములో వసూలు చెయ్యబడ్డ పైకములో నుండి, అమలు నెరవేర్చడమునకు తగిలిన ఖర్చును మొదట చెల్లించవలసినది. అటు తర్వాత డిక్రీదారునికి బాకీవున్న మొత్తమును చెల్లించవలసినది. మిగత యేదయినా యున్న యెడల అది తీర్పు ఋణస్థునికి చెల్లించబడవలసినది.

వాస్తవముగా పట్టుకోబడ్డ సొత్తు ఖరీదుదారునికి అప్పగింత చేయబడవలసినది.

64. విక్రయించబడ్డ సొత్తు వాస్తవముగా పట్టుకోబడ్డ సొత్తు అయిన యెడల ఆ సొత్తును ఖరీదుదారునికి అప్పగింత చేయవలసినది.

వ్యాఖ్య.

వేలం వేయబడిన ఆ స్తిని గ్రామకోర్టువారు స్వాధీనపరచుకొని వేలం వేసినయెడల సదరుఆ స్తిని వేలం ఖాయము అయిన వెంటనే ఖరీదుదారునికి స్వాధీనముచేయవలెను.

ఇతర సంగతులలో సొత్తు యేలాగు ఖరీదుదారునికి అప్పగింత చేయబడవలసినది.

65. విక్రయించబడ్డ సొత్తు తీర్పు ఋణస్థుడుకాని యెవరయినా యితర మనిషియొక్క స్వాధీనములో వున్న యెడల, లేక యే మనిషి అయినను తీర్పు ఋణస్థునికి బాకీవుండే ఋణముగా వున్న యెడల, ఖరీదుదారుడు తప్ప మరి యెవరికిన్ని ఆ సొత్తును స్వాధీనపరచకూడదని, లేక ఋణమును చెల్లించకూడదని అట్టి మనిషికి లిఖితమూలముగా నోటీసు యివ్వడమువల్ల ఆ సొత్తు ఖరీదుదారునికి అప్పగింత చేయవలసినది. జప్తు చేసే కాలమందు తీర్పు ఋణస్తునికి అట్టి సొత్తులో, లేక ఋణములో యే బాధ్యత వుండినదో ఆ బాధ్యత ఖరీదుదారునికి సిద్ధించ వలసినది.

వ్యాఖ్య.

జప్తుఆ స్తి తీర్పుఋణస్థుడు (ఎవనిమీదైన డిక్రీ అయినదో అతడు) కాకుండా యితరుల స్వాధీనములో యున్నయెడల, లేక తీర్పు ఋణస్థునికి రావలసిన బాకీని దేనినైనా జప్తు చేసినయెడల ఆ ఆ స్తి యెవరి స్వాధీనములో యున్నదో అతనికి, లేక తీర్పుఋణస్థుని బాకీదారునికి, సదరా స్తిని ఖరీదుదారునికి స్వాధీనము చేయవలసినదనియు, తీర్పుఋణస్థునికిగాని మరియెవ్వరికిగాని స్వాధీనము చేయకూడదనియు, లేక బాకీ అయినయెడల సదరు బాకీ ఖరీదుదారునకు మాత్రమే యివ్వవలెనని తీర్పు ఋణస్థునికిగాని మరి యే యితరులకుగాని యివ్వకూడదని లిఖితరూపకమైన నోటీసు యివ్వడము మూలముగా ఖరీదుదారునికి స్వాధీనము చేయవలెను. అంతట ఖరీదుదారునికి సదరు ఆ స్తియందుగాని, బాకీయందుగాని జప్తునాటికి తీర్పు ఋణస్థునికి యెట్టి హక్కులున్నవో అవిఅన్నియు సంక్రమించును. దరమిలా ఖరీదుదారు సదరు ఆ స్తినిగాని బాకీనిగాని రాబట్టుకొనుటకు చర్య తీసుకొనవచ్చును.

డిక్రీని పంపుటయును, పంపబడిన డిక్రీని అమలు జరిపించుటయును.

66. (1) డిక్రీహోల్డరు దరఖాస్తు పెట్టుకొన్నమీదట ఒక కోర్టువారిచే సాదరు చేయబడిన యే డిక్రీ అయినను అమలు జరుపబడ గలందులకు డిస్ట్రిక్టు మునసబుగారికి పంపబడవచ్చును, మరిన్ని ఆయన

(ఎ) అది తనచే సాదరు చేయబడిన డిక్రీయై యుండిన నెట్లో అట్లే ఆ డిక్రీని అమలు జరిపించవచ్చును. లేదా,

(బి) ప్రతివాదికి చరాస్తి వున్నట్లు చెప్పబడు తన విచారణాధికారమునకు లోగానుండు ఏ యితర గ్రామ కోర్టుకైనను అమలు జరుపుటకొరకు దానిని పంపవచ్చును.

(సి) ఎవరి విచారణాధికారములోగా ప్రతివాది కాపురముండు నట్లు లేదా ఆ స్తిని కలిగివుండునట్లు చెప్పబడునో అట్టి ఏఇతర డిస్ట్రిక్టు మునసబు కోర్టుకైనను దానిని పంపవచ్చును.

(2) 1వ సబు సెక్షనులో "సి" క్లాజు ననుసరించి డిక్రీ పంపబడిన డిస్ట్రిక్టుమునసబు అది తనచే సాదరు చేయబడిన డిక్రీయైయుండిన నెట్లో అట్లే ఆడిక్రీని అమలుజరిపించవచ్చును. లేదా ప్రతివాదికి చరాస్తి వున్నట్లు చెప్పబడు తన విచారణాధికారమునకు లోగానుండు యేదైన ఇతర గ్రామకోర్టునకు అమలు జరుపుటకొరకు దానిని పంపవచ్చును.

(3) 1వ సబు సెక్షనులోని (బి) క్లాజుననుసరించిగాని 2వ సబు సెక్షను ననుసరించిగాని డిక్రీ పంపబడిన గ్రామకోర్టువారు ఆ డిక్రీ తనచే సాదరు చేయబడియుండిన నెట్లో అట్లే చర్య తీసుకొనవలెను.

## వ్యాఖ్య

**1929** లో మదరాసు గవర్నమెంటు వల్ల ప్యాసు చేయబడిన **15** వ ఆక్టువల్ల అదివరకు వున్న సెక్షను తీసివేయబడి ఈ సెక్షను వుంచబడినది. అదివరలో వున్న సెక్షను ప్రకారము ఒక గ్రామకోర్టు డిక్రీ డిస్ట్రిక్టుమునసబుకోర్టుకు పంపబడినపుడు సదరు డిస్ట్రిక్టు మునసబుకు సదరు డిక్రీని మరియొక డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు పంపుటకు అధికారములేదని **1927** ఆ. ఇ. రి. మ్యద్రాస్ **1186, 1923** ఆ. ఇ. రి. మ్యద్రాస్ **651** లోను మ్యద్రాస్ హైకోర్టువారు తీర్మానించిరి. కాని ఆతీర్పులు, యీ సెక్షన్ పూర్తిగా సవరణ చేయబడినందున యిపుడు వర్తించవు. ఇప్పుడువున్న సెక్షను ప్రకారము డిస్ట్రిక్టు మునసబు గ్రామకోర్టు డిక్రీలను మరియొకడిస్ట్రిక్టుమునసబుకోర్టుకు పంపుటకు అధికారం యివ్వబడినది.

గ్రామకోర్టులలో యివ్వబడిన డిక్రీలను గ్రామకోర్టువారు తమపై అధికారము గల డిస్ట్రిక్టు మునసబు కోర్టునకు మాత్రము అమలు జరుపుటకు పంపవచ్చును. కాని

యితర డిస్ట్రిక్టు మునసబు కోర్టులకుగాని లేక యితర గ్రామకోర్టులకుగాని పంపుటకు అధికారములేదు.

ఇతర డిస్ట్రిక్టు మునసబు కోర్టులకు పంపుటగాని అదే డిస్ట్రిక్టు మునసబుకోర్టు అధికారములోనున్న యితర గ్రామ కోర్టులకు పంపుటగాని డిక్రీ యిచ్చిన గ్రామ కోర్టుపైన అధికారము గల డిస్ట్రిక్టు మునసబుకు మాత్రమే అధికారము గలదు.

డిస్ట్రిక్టు మునసబు యేదైనా డిక్రీని అమలు నెరవేర్చడమును తీసివేసుకోవచ్చును.

**67.** ఏదయినా డిక్రీని అమలునెరవేర్చేపనిని యేగ్రామకోర్టులో నుండిఅయినా తీసివేసుకొనుటకున్ను అది తానే చేసిన డిక్రీవలె తానుగా దాన్ని అమలు నెరవేర్చుటకున్ను డిస్ట్రిక్టు మునసబుకు అధికారము కలదు.

### వ్యాఖ్య

66 సె. ప్రకారము ఒక గ్రామకోర్టులోని డిక్రీని అమలు నిమిత్తము డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు పంపమని గ్రామకోర్టులో పిటీషను పెట్టవచ్చును. ఈ సెక్షనుప్రకారము డిస్ట్రిక్టు మునసబుకోర్టులో గ్రామకోర్టులోనుంచి ఒక డిక్రీని డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు తెప్పించి అమలు చర్య జరిపించగలందులకు డిస్ట్రిక్టుమునసబుకోర్టులో పిటీషను దాఖలుచేయవచ్చును.

చరాస్తిజప్తునకు లేదా విక్రయమునకుసంబంధించిన డిస్ట్రిక్టు మునసబుగారి ఉత్తరువు పైని అప్పీ. ఉండకూడదు.

**67. A.** 1908 వ సం॥పు సివిల్ ప్రొసీజరుకోడులో ఏమిచెప్ప బడియున్నను, దానితో నిమిత్తములేకుండా ఒక గ్రామకోర్టుచే సాదరు చేయబడిన యేదైనా డిక్రీని అమలు జరిపించునపుడు చరాస్తి జప్తుకు లేదా విక్రయమునకు సంబంధించి ఒక డిస్ట్రిక్టు మునసబుగారిచే చేయబడు యేదైనా వుత్తరువుపైన యెట్టి అప్పీలును వుండకూడదు.

### వ్యాఖ్య.

డిస్ట్రిక్టుమునసబు గ్రామకోర్టులవల్ల చేయబడిన డిక్రీలనుఅమలుజరుపుచూ సదరు అమలులో జరిపించిన జప్తువేలం చర్యలలో యిచ్చిన ఆర్డరుపై సి. ప్రొ. కో. నింబంధ వల ప్రకారము అప్పీలుయున్నప్పటికి యీ సెక్షనువల్ల అట్టిహక్కు తీసివేయబడినది. అందువల్ల అట్టి ఆర్డరుపై యెట్టి అప్పీలును వుండదు.

## 7 వ అధ్యాయము

### నానావిధ విషయములు.

68. వ్యాజ్యములో డిక్రీ చేయబడుటకు ముందు వాదిగాని ప్రతివాదిగాని చనిపోయిన పక్షమందు న్యాయశాస్త్రసమ్మతుడైన అతని ప్రతినిధి పేరును, ఎదుటి కక్షిదారుడైనను న్యాయశాస్త్రసమ్మతుడయిన అట్టి ప్రతినిధి అయినను దరఖాస్తు చేసుకొన్నమీదట, చనిపోయినవానికిబదులు రికార్డులో వ్రాసుకోవచ్చును. అయితే చనిపోయిన ప్రతివాదివద్దనుండి పొందబడి క్రమపరిశారము లెక్క చెప్పబడని ఆస్తియొక్క విలువనకుమించి ఆ ప్రతివాదియొక్క న్యాయశాస్త్ర సమ్మతుడయిన ప్రతినిధిమీద డిక్రీ చెయ్యబడగూడదు.

వ్యాజ్యముతో సంబంధించిన కక్షిదారుడు చనిపోయిన మీదట దరఖాస్తు చేసుకోబడ్డ యెడల చనిపోయిన వాని యొక్క న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధిపేరును రికార్డులో వ్రాసుకోవచ్చును.

### వ్యాఖ్య.

దావా డిక్రీ కాకపూర్వము వాదిగాని, ప్రతివాదిగాని చనిపోవుట తటస్థించే యెడల అతని న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధిపేరున అతనిస్థానే చేర్చవచ్చును. అట్లు చేర్చుటకు అట్టి ప్రతినిధిగాని లేక ఎదుటి కక్షిదారుడుగాని పిటీషను దాఖలు చేయవచ్చును.

ఒక వాదిగాని ప్రతివాదిగాని చనిపోయినప్పుడు అతని న్యాయశాస్త్ర ప్రతినిధి మైనరైనను దావాలో పార్టీగా జేర్చవచ్చును. సె 13 లో మైనర్లపైనిగాని మైనర్లవల్లగాని గ్రామకోర్టుల దావా తేబడకూడదన్న నిషేధము వారిసులను జేర్చుటకువర్తించదు. సె 13 క్రింది వ్యాఖ్యానములో పూర్తిగా యివ్వబడిన 1942 (2) మ. లా. జ. 272 కేసును చూడవలెను.

న్యాయశాస్త్రసమ్మతుడైన ప్రతినిధి అనగా చనిపోయినవాని వారిసులేగాక అతని ఆస్తి విల్లుద్వారా అతని తదనంతరము ఎవరికి సంక్రమించినదో వారుకూడ ప్రతినిధులగుదురు.

చనిపోయిన కక్షిదారుడు ప్రతివాది అయియుండి అతని ప్రతినిధిని చేర్చినపుడు గ్రామకోర్టువారు ఆ ప్రతినిధికి ప్రతివాదితాలూకు డిక్రీ మొత్తమునకు సరిపడు కిమ్మతు గల ఆస్తి సంక్రమించి అట్టి ఆస్తి అతని స్వాధీనములో యున్న, లేక అతనికి

చెందిన ఆస్తికి అతడు సరియైన లెక్క చెప్పనియెడల, ఆ సందర్భములో లెక్క చెప్పని ఆస్తికిమ్మతు డిక్రీమొత్తమునకు సరిపోయేయెడల దావాలో యావత్తుమొత్తమునకు ప్రతినిధిపైన డిక్రీయివ్వవచ్చును. కాని అతనికిచెందిన అతని స్వాధీనములోయున్న ఆస్తి దావామొత్తముకంటె తక్కువ కిమ్మతు అయిన, అట్టి ఆస్తియొక్క కిమ్మతు మొత్తమునకే ప్రతినిధిమీద డిక్రీయివ్వవలెను. అంతకంటె హెచ్చుమొత్తము యిచ్చుటకు అతడుబాధ్యుడుకాడు. ఉ॥:-ప్రతివాది "ఎ"అనువానికి "బి"అనువాడుప్రతినిధి అనుకొందము. "ఏ"తాలూకు రు 100 ల కిమ్మతుచేసే ఆస్తి ప్రతినిధికి సంక్రమించినది. ఏ పైన వాది రు 50-0-0 లకు దావా తెచ్చెను. అప్పుడు "బి" పైన దావా మొత్తము యావత్తు రు 50-0-0 లకు డిక్రీ యివ్వవచ్చును. కాని "బి" తనకు సంక్రమించిన రు 100-0-0 ల ఆస్తిలో నుంచి రు 60-0-0 లు ఆ స్తితో "ఏ" తాలూకు సరియైన యితర బాకీలు తీర్చెననుకొందము. అట్టి సందర్భములో గ్రామకోర్టువారు "బి" వద్ద నిలవయున్న ఆస్తి కిమ్మతు రు 40-0-0 లకు మాత్రమే డిక్రీ యివ్వవలెను.

దరఖాస్తు చేసుకోబడని యెడల వ్యాజ్యము త్రోసివేయ బడవలసినది.

69. వాదిగాని ప్రతివాదిగాని చనిపోయిన తేదీ మొదలు అరవై రోజులలోగా అట్టి దరఖాస్తు చేసుకోబడని పక్షమునకు, వ్యాజ్యము త్రోసివేయబడవలసినది. మరిన్ని అదే వ్యాజ్యకారణమును బట్టి మళ్ళీ వ్యాజ్యము తెచ్చేటట్లు సెలవు యివ్వబడకూడదు.

## వ్యాఖ్య.

ఈ సె॥ ప్రకారము వాదిగాని, ప్రతివాదిగాని చనిపోయిన 60 దినములలోగా ప్రతినిధిని చేర్చుటకు పిటీషను దాఖలు చేయవలెను. అట్లు పిటీషను దాఖలు చేయని యెడల దావా పరిహరింపబడును. 60 దినములు దాటిన తరువాత దాఖలు చేసిన పిటీషనును అంగీకరించుటకు గ్రామకోర్టువారికి అధికారములేదు. మరియు యీ సె. క్రింద దావా పరిహరింపబడిన యెడల తిరిగి సదరు వ్యాజ్యకారణమును బట్టి మరియొక దావా తెచ్చుటకు హక్కు యుండదు.

కాని వాదిగాని, ప్రతివాదిగాని చనిపోయిన తరువాత 60 దినములు దాటకుండా దావాను పరిహరించుటకు గ్రామకోర్టులకు అధికారములేదు. అట్టి ఆర్డరు చెల్లదు.

సె॥ 13 క్రింద వ్యాఖ్యానములో పూర్తిగా యివ్వబడిన 1942 (2) మ.లా.జ. 272 కేసు చూడవలెను.

70 ఒకనికంటె యెక్కువమంది వాదులుగాని ప్రతివాదులుగాని వుండి, వారిలో యొకడయినను చనిపోయి, అతని ప్రతినిధి పైన చెప్పబడ్డ ప్రకారము చేర్చబడని పక్షమందు, శేషించిన వాది లేక వాదులు కోరుకొన్న మీదటగాని శేషించిన ప్రతివాది, లేదా ప్రతివాదుల మీదగాని వ్యాజ్యము జరుగవలసినది.

ఒకవాది లేక ప్రతివాదికంటె యెక్కువమంది వున్న యెడల శేషించిన వారు కోరిన మీదట అతనిమీద వ్యాజ్యము జరుగవలసినది.

## వ్యాఖ్య.

ఒక దావాలో వాదులు గాని, ప్రతివాదులు గాని ఒకరికంటె యెక్కువమంది యుండి వారిలో ఒకవాదిగాని, ఒక ప్రతివాదిగాని చనిపోయిన సందర్భములో, సదరు వాదియొక్కగాని, ప్రతివాదియొక్కగాని ప్రతినిధులను చేర్చుటకు సె॥ 69 ప్రకారము పిటీషను దాఖలుచేయబడనప్పటికి దావాను పరిహరించకూడదు. ఒకవాది చనిపోయిన యెడల తక్కిన వాదులు దావాను నడుపవచ్చును. ఒక ప్రతివాది చనిపోయిన తక్కిన ప్రతివాదులపైన దావాను నడుప వచ్చును.

71. డిక్రీపూర్తిగా అమలు నెరవేర్చబడుటకు ముందు డిక్రీ పొందినవాడు చనిపోయిన పక్షమునకు న్యాయశాస్త్ర సమ్మతుడయిన అతని ప్రతినిధి చనిపోయినమనిషికి బదులు తనపేరు డిక్రీపొందిన వాడుగా వుంచుమని గ్రామ కోర్టువారికి దరఖాస్తు చేసుకోవచ్చును. తీర్పుఋణస్థునికి నోటీసు యిచ్చిన తరువాత ఆ దరఖాస్తుదారుడు చనిపోయినమనిషి యొక్క న్యాయశాస్త్ర సమ్మతుడయిన ప్రతినిధి అని కోర్టువారికి తృప్తిగా తోచినయెడల, వారు అతనిపేరును రికార్డులో డిక్రీపొందిన వాడ్నిగా వ్రాసుకోవలసినది.

డిక్రీదారుడు చనిపోయిన పక్షమందు న్యాయశాస్త్రసమ్మతుడైన అతని ప్రతినిధిని ఆతని బదులు వుంచుకోవచ్చును.

## వ్యాఖ్య.

గ్రామకోర్టులలోని ఒకదావా డిక్రీ అయిన తరువాత డిక్రీ సొమ్ము వసూలు కాకపూర్వమే డిక్రీ పొందినవాడు చనిపోయినయెడల అతని న్యాయశాస్త్ర సమ్మతుడు

దైన ప్రతినిధి డిక్రీ పొందిన వానిస్థానే తన పేరును చేర్పించవలెనని పిటీషను దాఖలు చేయవచ్చును. అట్టి పిటీషనుపైన గ్రామకోర్టువారు తీర్పు ఋణస్థునికి నోటీసు నిచ్చి ఆ ప్రతినిధి డిక్రీ పొందినవానియొక్క న్యాయశాస్త్ర సమ్మతుడైన ప్రతినిధి అగునా కాదా అను అంశమును విచారించి అతడు సరియైన ప్రతినిధి యని యెంచే యెడల మొదట డిక్రీపొందినవాని స్థానే అట్టి ప్రతినిధిని డిక్రీదారునిగా చేర్పవచ్చును.

ఈ సె|| క్రింద పెట్టవలసిన పిటీషను 69 సె||లోని పిటీషనువలె డిక్రీదారుడు చనిపోయిన 60 దినములలోగా పెట్టవలసిన అగత్యము లేదు. డిక్రీ లిమిటేషను పట్టక పూర్వము పెట్టవచ్చును.

ఈ సె|| క్రింద దాఖలు చేయవలసిన పిటీషను డిక్రీ యిచ్చిన గ్రామకోర్టులోనే దాఖలు చేయవలసియుండును. కాని డిక్రీని అసలు జరుపుచున్న ఏ డిస్ట్రిక్టు మునసబుకోర్టులోగాని లేక ఏయితర గ్రామకోర్టులోగాని దాఖలు చేయుటకు వీలులేదు.

తీర్పు ఋణస్థుడు చనిపోయిన పక్షమునకు న్యాయశాస్త్ర సమ్మతుడైన అతని ప్రతినిధి మీద డిక్రీ అసలు నెరవేర్చబడవచ్చును.

72. డిక్రీ పూర్తిగా అమలు నెరవేర్చబడుటకు ముందు తీర్పు ఋణస్థుడు చనిపోయిన పక్షమునకు, డిక్రీ పొందినవాడు దరఖాస్తు చేసుకొన్న మీదట తీర్పుఋణస్థునివద్ద పొందబడి క్రమప్రకారము లెక్క చెప్పబడని ఆస్తి యెంతో అంత న్యాయశాస్త్రసమ్మతుడైన అతని ప్రతినిధి మీద అది అమలు నెరవేర్చబడవచ్చును.

## వ్యాఖ్య.

తీర్పుఋణస్థుడు డిక్రీ బాకీని పూర్తిగా చెల్లించకపూర్వము చనిపోయిన యెడల అతని న్యాయశాస్త్రసమ్మతుడైన ప్రతినిధిమీద సదరు డిక్రిని అసలు జరుపుటకు డిక్రీదారుడు దరఖాస్తు చేయవచ్చును. కాని అట్టి ప్రతినిధి 68 సె|| లో చెప్పినట్లు చనిపోయిన తీర్పుఋణస్థుని తాలూకు తనకు సంక్రమించిన ఆస్తి యొక్క కిమ్మతు వరకే బాధ్యుడగును.

ఈ సెక్షను ప్రకారము చేర్చనెంచిన ప్రతినిధి తీర్పుఋణస్థుని ప్రతినిధి కాడనిగాని అతనికి సంక్రమించిన ఆస్తి కిమ్మతును గురించిగాని తగాదాలున్న యెడల ఆ సంగతులను గ్రామకోర్టువారు విచారించి తీర్మానించవలెను.

గ్రామకోర్టువారి చర్యలను డిస్ట్రిక్టుమునసబు పునర్విమర్శ చేయవలెడము.

73. గ్రామ కోర్టువారు చేసిన యేదయినా డిక్రీవల్లగాని వుత్తరువువల్లగాని అన్యాయము పొందినట్లు యెంచే యే కక్షిదారుడయినను అట్టి డిక్రీ లేక వుత్తరువుచేసిన తారీఖు మొదలు కొని అరవై రోజులలోగా అర్జీయిచ్చు కొన్నమీాదట, డిస్ట్రిక్టు మునసబు—

గ్రామకోర్టువారు లంచము పుచ్చుకొన్నారనే, విశేషముగా పక్షపాతము జరిగించినారనే, లేక దుర్నడతగా ప్రవర్తించినారనే కారణముమీాద; లేక

చట్టప్రకారము తమకు యేర్పడివుండని అధికారము తాము చలాయించినారనే, లేక మరియొక విధమున చట్టమునకు విరుద్ధముగా గాని బహు అక్రమముగా గాని ప్రవర్తించినారనే కారణముమీాద; లేక

ఆ డిక్రీ అయినను వుత్తరువు అయినను పరిష్కారముగా అన్యాయముగా, వున్నగనే కారణముమీాద సదరు డిక్రీని వుత్తరువును గాని రద్దుచేయవచ్చును.

మరిన్ని ఆయనకు యుక్తమని తోచే యితర డిక్రీగాని వుత్తరువుగాని చెయ్యవచ్చును; అయితే యెదుటి కక్షిదారునికి నోటీసు యివ్వకుండా ఒక గ్రామకోర్టుయొక్క డిక్రీగాని వుత్తరువుగాని రద్దు చేయబడ కూడదు. ఎవైనా అట్టి అర్జీని ఫైసల్ చేసేవరకు డిస్ట్రిక్టు మునసబు ఆ డిక్రీనిగాని వుత్తరువునుగాని అమలు చెలాయించకుండా నిలుపవచ్చును.

అరవై దినములకు తర్వాత ఈ సెక్షను ప్రకారము అర్జీ యిచ్చు కొబడ్డ యెడల ఆలస్యమైనందుకు తెలియచేసిన కారణము విని డిస్ట్రిక్టు మునసబు తృప్తిచెందిన అది ఆయనవల్ల అంగీకరించబడవచ్చును.

ఈ సెక్షనులో నిబంధన కలుగ చేసియున్న ప్రకారము తప్ప, గ్రామ కోర్టువారు చేసే ప్రతి డిక్రీయున్ను ఉత్తరువున్ను ఆఖరుదిగా వుండవలసినది.

## వ్యాఖ్య.

1. గ్రామ కోర్టువారు యిచ్చిన యే డిక్రీనిగాని, ఆర్డరునుగాని రద్దు పరిపించు కొనుటకు, సదరు డిక్రీలేక ఆర్డరు తేదీలగాయితు అరవైదినములలోగా డిస్ట్రిక్టుమునసబు కోర్టులో యీ సె॥ ప్రకారము పిటీషను దాఖలు చేయవచ్చును.

2. అట్టి పిటీషనులో పిటీషనరు గ్రామకోర్టువారు లంచము పుచ్చుకొన్నట్లుగాని లేక విశేషముగా పక్షపాతము వహించినారనిగాని, లేక యితరవిధముగా దుర్నడతగా ప్రవర్తించినారనిగాని, లేక యీ ఆక్టు నిబంధనలకు వ్యతిరేకముగా, అక్రమముగా ప్రవర్తించిరనిగాని, తమకులేని అధికారమును చెలాయించినారనిగాని, లేక ఉన్న అధికారమును చెలాయించుటకు నిరాకరించిరనిగాని ఋజువుచేసిన యెడల గ్రామకోర్టువారి వల్ల యివ్వబడిన యే డిక్రీనిగానీ, ఆర్డరునుగాని, డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు రద్దు చేయవచ్చును.

ఒక గ్రామకోర్టువారు యిచ్చిన డిక్రీని డి॥ ము॥ ఆ దావాను విచారించుటకు గ్రామకోర్టుకు అధికారములేదనే కారణముపై రద్దుపరచినప్పుడు, ఆడిక్రీని రద్దుపరచి నట్లు మాత్రము ఆర్డరు యిచ్చిన చాలదు. సె॥ 73 క్రింద సదరు దావా గ్రంథము జరుగుటకు మరియొక యుక్తమైనఆర్డరు జారీచేయవలసి యుండును. అట్టి సందర్భము లలో సదరు దావాను అధికారముగల కోర్టులో దాఖలు చేసుకొనుటకు వాదికి స్లయిం టును వాపసు యివ్వవలసినదిగా గ్రామకోర్టుకు ఆర్డరు పంపవచ్చును.

కొన్ని సందర్భములలో గ్రామకోర్టువారు యీ ఆక్టునిబంధనల ప్రకారము సరిగా ప్రవర్తించక పోయినను, తీర్పు మొత్తముమీద న్యాయముగాను సరిగా యుండిన యెడల డిస్ట్రిక్టు మునసబుగారు అట్టి తీర్పును రద్దుచేయవలసిన అగత్యములేదు. డిస్ట్రిక్టు మునసబు యీ సె॥ క్రింద పెట్టిన పిటీషనును యీ సె॥లో ఉదహరించిన కారణము లుండిననే రద్దు చేయవలసియుండును. కాని అప్పీలుకోర్టువలె గ్రామకోర్టువారు ఒక సాక్ష్యమును నమ్మి కేసును తీర్మానించినపుడు, తాను ఆ సాక్ష్యమును నమ్మలేదని గ్రామకోర్టు తీర్పును రద్దు చేయుటకు అధికారము యుండదు.

3. ఈ సె॥ క్రింద ఒక గ్రామకోర్టువారిచే యివ్వబడిన డిక్రీగాని, ఆర్డరుగాని ఎటిదు కక్షిదారునికి నోటీసులేకుండా రద్దుపరచుటకు వీలులేదు.

4. యీ సె॥ క్రింద పెట్టవలసిన పిటీషను డిక్రీగాని, ఆర్డరుగాని, యిచ్చిన తేదీనుండి 60 దినములలోగా దాఖలు చేయవలెను. కాని 60 దినములు తరువాత దాఖలు చేయబడినను ఆలస్యమునకు తగిన కారణమున్నయెడల డిస్ట్రిక్టుమునసబు ఆ పిటీషనును స్వీకరించి తీర్మానించవచ్చును. సె 32 వ్యాఖ్యానములో యివ్వబడిన 1940 (2) మ. లా. జ. 780 తీర్పును చూడవలెను.

ఈ సెక్షను ప్రకారము 60 దినములు లెక్కించుటలో, యే ఆర్డరు లేదా డిక్రి నుండి రివిజన్ పిటీషను పెట్టబడినదో అట్టి ఆర్డరు నకలును తీసికొనుటకు పిటీషనరుకు పట్టినకాలము మినహాయించవలెను. గ్రామకోర్టు ఆర్డర్లు లేదా డిక్రీలనుండి పెట్టబడు పిటీషనులతో గ్రామకోర్టు ఆర్డరు లేదా డిక్రీ నకలు దాఖలు చేయవలెననే నిబంధన యెచ్చట లేనప్పటికి ఆ నకళ్ళను తీసికొనుటకు పట్టినకాలమును ముజరాకోరవచ్చునని హైకోర్టువారు 1941 మ.వీ.నో. 249 = 1941 (1) మ.లా.జ 540 కేసులో తీర్మానించిరి. ఆ తీర్పు సె 20 క్రింద వ్యాఖ్యానములో పూర్తిగా యివ్వబడినది.

ఆలస్యమునకు తగిన కారణము లెవ్వని నిర్ణయించుటకు ఆయాకేసు సందర్భములను గమనించవలెను. కాని ఈ కారణములు సరియైనవి, యివి సరియైనవికావు అని నిర్దిష్టముగా చెప్పుటకు వీలులేదు. అయినను సాధారణముగా న్యాయసంరక్షణార్థము అవసరమైనయెడల కోర్టువారు ఆలస్యమును క్షమించవలెను. పిటీషనరు జబ్బుగా యుండి లేవలేనిస్థితిలో యుండుట, లేక జైలులోయుండుట, లేక ఎదుటికక్షిదారుడు చేసిన దగావల్ల అట్టి డిక్రీ లేక ఆర్డరు సంగతి పిటీషనరుకు తెలియక యుండుట మొదలగునవి సామాన్యముగా పిటీషను ఆలస్యముగా దాఖలుచేయుటకు తగిన కారణములని యెంచవచ్చును. కాని పిటీషనరు బీదవాడగుటవల్ల, లేక 60 దినములలో పిటీషను దాఖలుచేయవలెనన్న సంగతి తెలియనందున పెట్టకయుండుట మొదలగునవి సరియైన కారణములుగా యెంచబడవు.

5. ఈ సెక్షను ప్రకారము డిస్ట్రిక్టు మునసబు ఆర్డరు ఆఖరు తీర్పుగా యుండవలెనని తీర్మానింపబడినప్పటికిన్ని, డిస్ట్రిక్టుమునసబు ఆర్డరు న్యాయశాస్త్రవిరుద్ధముగా యున్నగాని, అన్యాయముగా యున్నగాని, అట్టి ఆర్డరును రద్దుపరుచుటకు హైకోర్టు వారికి సంపూర్ణ అధికారము కలదు.

6. యీ సెక్షను ప్రకారము పెట్టే పిటీషనులలో గ్రామమునసబునుగాని, పంచాయతీకోర్టు మెంబర్లనుగాని కవుంటరు పిటీషనర్లుగా చేర్చుటకు వీలులేదు. వారిపైన యెట్టి పరిహారమున్ను కోరుటకున్ను హక్కుయుండదు.

7. ఈ సెక్షను ప్రకారము డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దాఖలగు రివిజన్ పిటీషనుల విచారణకు సివిల్ ప్రొసీజరు కోడు నిబంధనలు వర్తించవు. అట్టి పిటీషనులు పిటీషనర్లు హాజరు లేరని కొట్టివేయబడినవాటిని తిరిగి విచారణ చేయమని సి.ప్రొ.కో. సె. 151 ప్రకారముగాని ఆ. 9 రూ. 9 ప్రకారముగాని పిటీషనులు పెట్టుటకు హక్కుయుండదు.

ఈ సెక్షను క్రింద హైకోర్టు తీర్పులు

(1) 50 వ లా. జ. నో. ఆ. క్రి. కే. పేజీ 3.

జడ్జి:—న్యాట్సుప్రాటాటర్ గారు.

గ్రామకోర్టులో వాది ఖాతానుబట్టి ప్రతివాదిపైన దావా దాఖలు చేయగా గ్రామకోర్టువారు వాది సాక్ష్యమును నమ్మక దావానుకొట్టివేసిరి. వాది మ. గ్రా. కో. ఆ. సె. 73 క్రింద రివిజన్ పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు వాది సాక్ష్యము సరిగా యున్నదనియు, నమ్మదగినదనిన్నీ యెంచి గ్రామకోర్టు తీర్పు న్యాయమైనదికాదని రద్దుపరచిరి. అందుపైన ప్రతివాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు, డిస్ట్రిక్టు మునసబులకు రివిజన్ పిటీషనులలో గ్రామకోర్టువారు యిచ్చిన తీర్పును, అప్పీలు కోర్టువలె, సాక్ష్యమును నమ్మిగాని, నమ్మకగాని రద్దుచేయు అధికారము లేదని తీర్మానించి వాదికి యిచ్చిన డిక్రీని రద్దు పరచిరి. ఈ కేసులో 21 ఇ. లా. రి. మద్రాస్ 363 పేజీలోని తీర్పు ననుసరించిరి.

(2) 21 ఇ. లా. రి. మద్రాస్ 363.

జడ్జీలు:— డేవిస్, బోడామ్ గార్లు.

గిడ్డయ్య —(వాది) పిటీషనరు.

జగన్నాథరాజు — (ప్రతివాది) రెస్పాండెంటు

వాది గ్రామకోర్టులో ప్రతివాదిపైన రు 9-10 7 లకు ఖాతానుబట్టి దావా చేయగా గ్రామకోర్టువారు డిక్రీ యిచ్చిరి. ప్రతివాది డిస్ట్రిక్టు మునసబుకోర్టులో డిక్రీ రద్దునిమిత్తము సె. 73 క్రింద పిటీషను దాఖలుచేయగా డిస్ట్రిక్టుమునసబు వాది లెక్క అనుమానముగా యున్నదనిన్నీ. వాది తన లెక్క విషయమై చెప్పిన సమాధానము తృప్తిగాలేదనియు, ఉభయవాదుల వాదనలలో వాదివాదన యెక్కువ నిజముగా యున్నదని భావించి గ్రామకోర్టువారు డిక్రీయిచ్చిరనియు, అట్లు గ్రామకోర్టువారు చేయుట సరికాదని డిక్రీని రద్దు పరచిరి. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు.

డిస్ట్రిక్టు మునసబుకు సె. 73 క్రింద ప్రతివాది దాఖలు చేసిన పిటీషనును అప్పీలువలె భావించి తీర్మానించెననియు, అట్లు భావించుటకు సె. 73 ప్రకారము వీలులేదనియు, సదరు సెక్షనులో చెప్పిన కారణములపైని మాత్రమే గ్రామ కోర్టు డిక్రీలను రద్దుచేయవలెనుగాని, యితరకారణములవల్ల రద్దుచేయు అధికారములేదనిన్నీ తీర్మానించిరి.

(3) 68 వ. లా. జ. నో ఆ. క్రి. కే. 10 పేజీ.

జడ్జి:— కింగుగారు

గ్రామకోర్టువారు తమయెదుట యివ్వబడిన సాక్ష్యమును నమ్మిగాని నమ్మకగాని తీర్పుయిచ్చినయెడల, అట్టి తీర్పును సె॥ 73 క్రింద పెట్టిన పిటీషనుపైన డిస్ట్రిక్టు మునసబు అప్పీలు కోర్టువలె భావించి తీర్పును రదుచేయుటకు అధికారము లేదని తీర్మానించిరి.

(4) 51 మ. లా. జ. నో. ఆ. క్రి. కే. 43

జడ్జి:— క్రిష్ణన్ గారు.

ప్రతివాది డిస్ట్రిక్టు మునసబుకోర్టులో సె॥ 73 ప్రకారము పెట్టిన పిటీషనులో తనకు గ్రామకోర్టులో దావా సమను అందలేదనిన్ని, గ్రామకోర్టువారు తనకు సమను ముట్టినట్లు రికార్డులను సృష్టించినారని వ్రాసిన సంగతులు సె॥ 73లో చెప్పిన దుర్నడత అగునని తీర్మానించిరి.

(5) 51 మ. లా. జ. 561 = 1927 ఆ. ఇ. రి. మద్రాస్ 192=50 ఇ. లా. రి. మద్రాస్ 494 = 24 మ లా. వీ. 611 = 1926 మ. వీ. నో. 953.

జడ్జి:— జాక్సన్ గారు.

సుందరనాయకర్ — పిటీషనరు (ప్రతివాది)
పొట్టినాయకర్ — రెస్పాండెంటు (వాది)

గ్రామకోర్టుల తీర్పులపైనవచ్చిన రివిజన్ పిటీషనులు విచారించునపుడు డిస్ట్రిక్టు మునసబు గ్రామకోర్టు తీర్పులో సె॥ 73 నులో చెప్పిన లోపము లేవైన యున్నను, తీర్పు 'ము త్తమమీద న్యాయముగా యున్నదని యెంచినయెడల సదరు తీర్పును రద్దు చేయవలసిన అగత్యము లేదని తీర్మానించిరి.

(6) 53 మ॥ లా॥ జ॥ 131 = 1927 ఆ. ఇ. రి. మద్రాస్ 786 = 1927 మ॥ వీ॥ నో॥ 420 = 104 ఇం॥ కే॥ 415.

జడ్జి:— రామేశం గారు.

కొనకళ్ళ రామారావు — పిటీషనరు (వాది)
నల్లూరి పిచ్చయ్య — రెస్పాండెంటు (ప్రతివాది)

పిటీషనరు స్టాంపులు అంటించని రెండు దస్తావేజులను బట్టి పంచాయతీ కోర్టులో దావా దాఖలు చేసెను. పంచాయతీకోర్టు సదరు రెండు దస్తావేజులకు పినాల్టీ స్టాంపు డ్యూటీలక్రింద రు 5-3-0 ల చొప్పున వసూలుచేసి డిక్రీ యిచ్చెను. రెస్పాండెంటు ఆ డిక్రీని రద్దుపరచ వలసినదిగా డిస్ట్రిక్టు మునసబు కోర్టులో పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు సదరుదస్తావేజులు ప్రోనోట్లుక్రింద వచ్చునవనియు

చీట్లులేని ప్రోనోట్లు చెల్లవనిన్నీ, వాటిని బట్టి దావాచేయ వీలు లేదనిన్నీ, స్టాంపు ఆక్టు ప్రకారము ప్రోనోట్లకు పినాల్టీ వసూలు చేయుటకు అధికారము లేదనిన్నీ చెప్పుచూ డిక్రీని రద్దుపరచెను. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు

(1) స్టాంపు ఆక్టు సె 36 ప్రకారము ఏ దస్తావేజునైన్గా పినాల్టీ వసూలు చేసి సాక్ష్యముగా అంగీకరించిన తరువాత, పినాల్టీ వసూలు చేయుటలో లోపమున్నను, వాటిని సాక్ష్యముగా అంగీకరించుటకు వీలులేదనే వాదన చెల్లదని చెప్పుచూ డిస్ట్రిక్టు మునసబు ఆర్డరును రద్దుపరచి పంచాయతీకోర్టు డిక్రీని ఖాయపరచిరి.

(2) మరియు, మ|| గ్రా|| కో|| ఆ|| సె 73 క్రింద డిస్ట్రిక్టు మునసబు యిచ్చే ఆర్డరును రద్దుపరచుటకు హైకోర్టుకు అధికారము కలదనిన్నీ.

(3) సె 73 లో యిదివరలో యున్న "లాకు వ్యతిరేకమైన" అను మాటలను 1920 సం||లో సవరణ చేసినపుడు తీసివేయబడినందున గ్రామకోర్టు డిక్రీలు "లా"కు విరుద్ధముగా యున్నప్పటికిన్నీ, డిక్రీమొత్తమువిూద న్యాయసమ్మతముగా యున్నయెడల చెల్లవచ్చుననిన్నీ, దానిని రద్దుచేయవలసిన అవసరము లేదనిన్నీ తీర్మానించిరి.

(7) 54 మ||లా||జ నో||ఆ||కి||కే 26

జడ్జి:- జాక్సన్‌గారు

డిస్ట్రిక్టుమునసబు ఒక గ్రామకోర్టు డిక్రీ న్యాయముగా యున్నప్పటికిన్నీ, 'లా'కు వ్యతిరేకముగా యున్నందున రద్దుచేసెను. హైకోర్టువారు అట్టి సందర్భములో డిక్రీని రద్దుచేయుటకు డిస్ట్రిక్టు మునసబుకు అధికారము కలదనిన్నీ, అట్టి తీర్పులో హైకోర్టు వారు యెట్టి జోక్యమును కలుగజేసుకొనరనిన్నీ తీర్మానించిరి.

(8) 1933 మ|| పి|| నో|| 1370=1934 ఆ|| ఇ|| రి|| మద్రాస్ 7.

జడ్జి:—బ్రాడ్స్‌వెల్ గారు.

వి. యన్. ఆర్. యస్. లింగయ్యరు — పిటీషనరు.

రామకృష్ణయ్యరు — రెస్పాండెంటు.

ఒక గ్రామకోర్టు డిక్రీపైన డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దాఖలు కాబడిన రివిజన్ పిటీషనులో ఉభయవాదుల వకీళ్ళవాదనలను విని డిస్ట్రిక్టు మునసబు "క్రిందికోర్టు తీర్పును మార్చుటకు యెట్టి కారణములు లేనందున పిటీషను పరిహరింపబడినది" అని ఆర్డరును వ్రాసెను.

అందుపైన పిటీషనరు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేసి డిస్ట్రిక్టు మునసబు ఆర్డరు సరియైనది కాదనియు, సదరు ఆర్డరులో తీర్పునకుగల కారణములు

నమోదు చేయబడనందున చెల్లదనియు వాదించెను. హైకోర్టువారు డిస్ట్రిక్టు మునసబు వ్రాసిన ఆర్డరు సరియైనదనియు, సి. ప్రొ. కో. విధులు మ. గ్రా. కో. ఆక్టుకు వర్తించనందున సి. ప్రొ. కో. లో చెప్పిన విధుల ప్రకారము తీర్పు వ్రాయనగత్యము లేదనియు తీర్మానించిరి.

(9) 32 ఇం. కే. 527.

జడ్జీ:— కుమారస్వామిశాస్త్రిగారు.

పరమశివన్ — పిటీషనరు

పెరియ నాయగతమ్మాళ్ — రెస్పాండెంటు

మ॥ గ్రా॥ కో॥ సె. 73 క్రింద డిస్ట్రిక్టు మునసబు పొరబాటునగాని, పార్టీలు చేసిన దగావల్లగాని యిచ్చిన పొరబాటు తీర్పులను మార్చుకొనుటకు సె. 73 క్రింద అధికారము యివ్వబడినప్పటికిన్నీ, ప్రతికోర్టుకున్నూ పొరబాటున యిచ్చిన తీర్పులను సవరించుకొనుటకు స్వతస్సిద్ధముగా అధికారము కలదని తీర్మానించిరి.

(10) 1928 ఆ. ఇ రి. మద్రాస్ 980 (2) III ఇం. కే. 304.

జడ్జీలు:— కుమారస్వామిశాస్త్రి, వాలెస్ గార్లు.

చిన్నమరాజు రఘునాధరాజు — పిటీషనరు

బుర్రా మెరియమ్మ వగైరా — రెస్పాండెంట్లు

గ్రామ కోర్టు డిక్రీపైన ప్రతివాదులు డిస్ట్రిక్టు మునసబు కోర్టులో పిటీషను దాఖలుచేసి వాని దావాకు కాలదోషము పట్టినదని వాదించిరి. కాని గ్రామకోర్టులో ప్రతివాదులు కాలదోషము పట్టినదని వాదనచేసి యుండలేదు. అయినను, డిస్ట్రిక్టు మునసబు సాక్ష్యమునుబట్టి దావాకు కాలదోషము పట్టినట్లు కనుపడుచున్నదని గ్రామ కోర్టు డిక్రీని రద్దుపరచెను. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు గ్రామకోర్టు తీర్పు "లా" ప్రకారము లేకున్నను న్యాయము తమ మీద న్యాయముగా యున్నయెడల దానిని రద్దుచేయవలసిన అగత్యములేదని, డిస్ట్రిక్టు మునసబు ఆర్డరును రద్దుపరచి గ్రామకోర్టు డిక్రీని ఖాయపరచిరి.

(11) 1928 ఆ.ఇ.రి. మద్రాస్ నోట్సు 62 (c)

వాసుదేవపానభాగ్ — పిటీషనరు

దామోదరపానభాగ్ — రెస్పాండెంటు

పంచాయతీ కోర్టులో దావా విచారణ జరుగుచున్నప్పుడు కక్షిదారునకు పంచాయతీ కోర్టువారు పక్షపాతముగా యున్నట్లున్ను, లంచము పుచ్చుకొన్నట్లున్ను, కనుపడినను, ఆతడు వెంటనే సదరు దావాను ట్రాన్స్ఫరు చేయవలసినదిగా డిస్ట్రిక్టు

మునసబుకోర్టులో పిటీషను దాఖలుచేయవలసిన అవసరములేదు. దావా తీర్పు అయిన తరువాత 60 దినములలోగా సె 73 క్రింద పిటీషను దాఖలు చేయవచ్చును. సదరు పిటీషనును డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు లోగడనే పక్షపాతము వగైరాలు కనుపడి నప్పుడు ట్రాన్స్ఫరు నిమిత్తము పిటీషను పెట్టలేదనే కారణముతో పరిహరింప వీలు లేదని తీర్మానించిరి.

(12) 24 ఇ లా. రి. మద్రాస్ 335.

జడ్జీలు:— సర్ ఆర్నాల్డువైట్, సుబ్రహ్మణ్య అయ్యర్ గార్లు.

పలనిగౌండన్ — పిటీషనరు

కుప్పానందగౌండన్ — రెస్పాండెంటు

"ఏ" అనువానిమీద ఒక గ్రామకోర్టులో "బి" అనువాడు తాను "ఏ" అనువానికి అపును అమ్మినట్లు చెప్పుచూ దానికిగాను యివ్వవలసిన కొంత బాకీకి దావా వేయగా అప్పట్లో గ్రామ మునసబుగా యున్న పిటీషనరు తండ్రి డిక్రీ యిచ్చెను. దరిమిలా పిటీషనరు తండ్రి చనిపోయిన తరువాత పిటీషనరు గ్రామమునసబు అయి "ఏ" అనువానికి "బి" పొందిన డిక్రీము త్తమును యివ్వవలసినదిగా నోటీసులిచ్చి "ఏ" యొక్క ఒక పశువును జప్తుచేయగా, "ఏ" పైకమును చెల్లించి డిస్ట్రిక్టుమునసబుకోర్టులో గ్రామ మునసబు అయిన పిటీషనరును "బి"ని పార్టీలుగాజేర్చి, ఆ దావాలో పిటీషనరు తండ్రి "బి"తో లాలూచీఅయి డిక్రీ యిచ్చినందున సదరు డిక్రీని రద్దుపరపించి తనవద్దనుంచి వసూలు చేసిన పైకమును గ్రామ మునసబు వద్దనుండి యిప్పించవలసినదిగా కోరుచూ సె. 73 ప్రకారము పిటీషను దాఖలు చేసెను. "బి" తాను డిక్రీని అమలు చెయ్య లేదనిన్ని తాను యెట్టి పైకమున్ను తీసుకొనలేదనిన్ని కవుంటరు దాఖలుచేసెను.

అందుపైన డిస్ట్రిక్టు మునసబు గ్రామ కోర్టు డిక్రీని, అమలు చర్యను రద్దుపరిచి "ఏ" వద్దనుండి గ్రామమునసబు వసూలుచేసినాడనేచెప్పే సొమ్మును గ్రామమునసబు "ఏ" కు యివ్వవలసినదిగా ఆర్డరు యిచ్చెను. సదరు ఆర్డరుపైన గ్రామమునసబు హైకోర్టులో పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు—

(1) సె. 73 క్రింద పార్టీలు పెట్టిన పిటీషనులో గ్రామమునసబును పార్టీగా చేర్చుటకు వీలులేదనిన్ని

(2) సె. 73 లో చెప్పబడిన కారణము ఉన్ననే గ్రామకోర్టు డిక్రీలను రద్దు పరచవలసియుండుననిన్ని

(3) సె. 73 క్రింద డిస్ట్రిక్టు మునసబు గ్రామకోర్టు డిక్రీలను రద్దుపరచవచ్చును. గాని, గ్రామమునసబువల్ల పార్టీలకు యెట్టి పరిహారమున్ను యిప్పించుటకు అధికారము లేదనిన్ని

(4) గ్రామమునసబు యేమైనా అక్రమపుపనులు చేసియుండిన సె. 74 క్రింద అతనిపై చర్య తీసుకొనవలెననిన్నీ.

(5) యీ కేసులో డిస్ట్రిక్టు మునసబు 'బి' తన డిక్రీని అమలు జరిపి 'ఏ' అను వాని యొద్దనుండి సొమ్ము వసూలు చేసినాడా లేదా అను అంశమును మాత్రమే తీర్మానించి యుండవలసినదనిన్నీ తీర్మానించిరి.

(13) 30 మ॥ లా॥ వీ॥ 499

జడ్జీ:— కర్టన్‌వన్‌గారు.

మహమ్మద్ ఖాసింసాహెబు — పిటీషనరు.

ఒక గ్రామకోర్టులో దాఖలైన దావాలో యివ్వబడిన డిక్రీ రద్దునిమిత్తము ప్రతివాది డి॥ ము॥ కోర్టులో పిటీషను పెట్టి ఆ దావాలో దాఖలైన ప్లయింటుపైన సంతకములేదని చూచి డి॥ ము॥ కోర్టులోగాని, రివిజన్ పిటీషనుపైన హైకోర్టులోగాని వాదనచేయుటకు వీలులేదని వాది దావా వాది యెరుక సమ్మతులతో దాఖలు అయి తీర్మానింపబడినప్పుడు దానిపైన సంతకములేదనే వాదనను డి॥ ము॥ గాని, హైకోర్టువారుగాని అంగీకరించ వలసిన అగత్యములేదని తీర్మానించిరి.

(14.) 5 మ॥ లా॥ వీ॥ నో॥ ఆ॥ రి॥ కే॥ 43

జడ్జీ:— శ్రీనివాస అయ్యంగారు.

ఒక గ్రామకోర్టువారు యిచ్చిన డిక్రీని డి॥ ము॥ కోర్టువారు గ్రామకోర్టుకు సదరు దావాను విచారించుటకు అధికారము లేదనే కారణముమీద రద్దుపరచినపుడు, సదరు దావా ముందు గ్రంథము జరుగుటకు యుక్తమగు ఆర్డరును సె. 73 క్రింద జారీ చేయవలెనని తీర్మానించిరి.

(15) 1944 (2) మ. లా. జ. 335=1944 మ. వీ. నో. 678

మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి హార్విల్‌గారు

C. R. P. 1091 of 1943 (9-8-1944)

జొన్నకూటి అమ్మన్న—పిటీషనరు

ఎదిరి

కండవల్లి కనకమ్మ

మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 73 పంచాయితీ కోర్టువారు దావాకు లిమిటేషను పట్టలేదని నిర్ణయించుట — సె 73 క్రింద పెట్టబడిన పిటీషనుపైన డిస్ట్రిక్టు మునసబు క్రిందికోర్టు సాక్ష్యమును చూచి ఆ నిర్ణయమును రద్దుపరచకూడదు.

కేసు సంగతులు

పిటీషనరు ఏలూరు పంచాయతీ కోర్టులో ప్రతివాది తనవద్దనుండి తీసుకున్న నాగరము ఖరీదు రు 50 లు యివ్వవలెనని దావా తెచ్చెను. ప్రతివాది వాది దావాకు లిమిటేషను పట్టినదని వాదన చేసెను. పంచాయితీ కోర్టువారు సాక్ష్యమును విచారించి పిటీషనరు దావాకు లిమిటేషను దోషము లేదని తీర్మానించిరి. ఆ తీర్పునుండి ప్రతివాది డిస్ట్రిక్టు మునసబుకోర్టులో సె 73 ప్రకారము రివిజన్ పిటీషను దాఖలు చేసెను. డిస్ట్రిక్టు మునసబు లిమిటేషను విషయమై యివ్వబడిన సాక్ష్యమునుచూచి ఆ సాక్ష్యమును బట్టి పిటీషనరు దావాకు లిమిటేషను పటినట్లు కనుపడుచున్నదనియు, అందువల్ల పంచాయితీకోర్టు తీర్పు న్యాయశాస్త్రవిరుద్ధమైనదని డిక్రీ అన్యాయముగా యివ్వబడినదని తీర్మానించి డిక్రీని రద్దుపరచెను. ఆ తీర్పునుండి పిటీషనరు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు డిస్ట్రిక్టు మునసబు అప్పీలు కోర్టువలె క్రింది కోర్టు సాక్ష్యమునుబట్టి పంచాయతీకోర్టు తీర్పు తప్పు అని రద్దుచేయ వీలులేదు. పంచాయితీకోర్టు తీర్పును సె 73 లో చెప్పబడిన కారణములున్ననే రద్దుచేయవలెననియు ఈ కేసులో అట్టి కారణములు లేవని డిస్ట్రిక్టుమునసబు తీర్పును రద్దుపరచి పంచాయితీ కోర్టు డిక్రీని ఖాయపరచిరి.

(16) 1941 (2) మ. లా. జ. నో. ఆ. రి. కే. 53.

మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి వాడ్స్వర్తుగారు

## C. R. P. 2423 of 1939 (9-9-41)

వెంకటాచల అయ్యర్ ఎగెరి మాధవన్

మద్రాసు గ్రామకోర్టు ఆక్టు సె 73.

ఒక గ్రామకోర్టు ఆర్డరు చట్ట విరుద్ధముగా యున్నంతమాత్రముననే అట్టి ఆర్డరును రద్దుచేయుటకు డిస్ట్రిక్టు మునసబుకు అధికారము లేదనియు వాస్తవముగా చట్ట విరుద్ధముగా యున్న ఆర్డరును అన్యాయముగా యున్నదని చెప్పి అధికారము చెలాయించి రద్దు పరిపించుటకు అధికారము లేదని తీర్మానించిరి.

(17) 1937 మ. వీ. నో. 894 మద్రాస్ హైకోర్టులో

## C. R. P. 64 of 1936 (24-2-37)

కదమూల పెరుమాళ్ చెట్టి — పిటీషనరు

ఎరుకుమురికొల్లి పెరుమాళచెట్టి — రెస్పాండెంటు

వాది ప్రతివాదుల మధ్య జరిగిన వ్యవహారసందర్భములలో వానికి ప్రతివాది రు 72-0-0 లు బాకీపడినాడని ఆ మొత్తములో కొంత వసూలు యివ్వగా యింకా రు 50-0 0 లు బాకీ యున్నాడని గ్రామకోర్టులో దావా దాఖలు చేయబడెను.

ప్రతివాది వాది దావాకు లిమిటేషను పట్టినదని ఆన్సరు దాఖలుచేసెను. గాని విచారణదినమున కోర్టుకు హాజరుకాలేదు. ప్రతివాదిపైన యక్సుపార్టి డిక్రీ యివ్వబడెను. గ్రామకోర్టువారు లిమిటేషను విషయమై తీర్పులో ప్రత్యేకముగా ఏమియు వ్రాయలేదు. వాది ప్లయింటులో దావాబాకీ తేదీనుండి మూడు సంవత్సరములలోగా ప్రతివాది కొంత వసూలు యిచ్చినట్లు వ్రాసెను.

ప్రతివాది యక్సుపార్టి డిక్రీని రద్దుపరిపించుకొనుటకు గ్రామకోర్టుల ఆక్టు సె 33 క్రింద పిటీషను దాఖలుచేసి యుండలేదు. కాని సె 73 క్రింద డిస్ట్రిక్టు మునసబుకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేసెను. డిస్ట్రిక్టు మునసబు వాదిదావాకు లిమిటేషను పట్టినదని తీర్మానించెను.

ఆ తీర్పునుండి వాది హైకోర్టులో రివిజను పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు డిస్ట్రిక్టు మునసబుకు గ్రామకోర్టుల తీర్పులపైన అప్పీలు అధికారములు లేవని, గ్రామకోర్టుల డిక్రీ చాలా అన్యాయముగా యున్నగాని రద్దుచేయుటకు అధికారము యుండదని, యీ కేసులో ప్లయింటునుబట్టి చూడగా వాది దావాకు లిమిటేషను పట్టినట్లు కనుపడుటలేదని, ఆ. ఇ. రి. 1928 మద్రాస్ 980 (2) కేసు ననుసరించుచూ డిస్ట్రిక్టు మునసబు తీర్పును రద్దుపరచి గ్రామకోర్టు డిక్రీని నిలిపిరి.

(18) 1943 (1) మ. లా. జ. 318 = 1943 మ. వీ. నో. 270

మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి మాకెట్ గారు

## C. R. P. 769 of 1942 (17-2-43)

పి. మహమ్మద్ సాహెబు రౌథర్ — పిటీషనరు

ముత్తు సాంబన్ వగైరా — రెస్పాండెంట్లు

పిటీషనరు ఔంకాళి పంచాయతీ కోర్టులో రెస్పాండెంట్లపై 241, 242 of 1938 నంబర్లుగా రెండు దావాలు దాఖలు చేసెను. 241 నంబరు దావాలో యక్సుపార్టి డిక్రీ నిచ్చిరి. ప్రతివాదులు యక్సుపార్టి డిక్రీ రద్దుపరచమని దాఖలు చేసిన పిటీషను కూడ పరిహరింపబడినది. 242 నంబరు దావా 30-1-1939 తేదీన డిక్రీచేయబడెను. పైరెండు దావాలు పంచాయతీకోర్టులో చాలాసార్లు ఒకే తేదీన వాయిదాలువేయబడి యున్నవి. అయినను ప్రతివాదులు సదరు డిక్రీ తేదీనుండి 3 సంవత్సరముల రెండు మాసములు గడచిన తరువాత 23-3-1942 తేదీన ఆ దావాలో తమకు సమనులు ముట్టియుండలేదని యక్సుపార్టి డిక్రీని రద్దుపరచమని పంచాయితీ కోర్టులో పిటీషను దాఖలు చేసిరి. పంచాయితీకోర్టు యెట్టి కారణములను ఉదహరించకయే యక్సుపార్టి డిక్రీని రద్దుపరచెను.

ఆతీర్పునుండి పిటీషనరు తెంకాశీ డిస్ట్రిక్టు మునసబుకోరులో మద్రాసు గ్రామ కోర్టుల ఆక్టు సె 73 ప్రకారము రివిజన్ పిటీషను దాఖలు చేయగా డిస్ట్రిక్టు మునసబు పిటీషను పరిహరించుచూ ఆర్డరులో ఈ క్రింది విధముగా వ్రాసెను. " ఈ దావా వాయిదాల తేదీలలో చాలావరకు ప్రతివాదులు హాజరైనటుల రికార్డువల్ల కనుపడు చున్నది. బహుశా పొరబాటున రికార్డులో అటుల వ్రాయబడి యుండవచ్చును. ఏలనన పిటీషనరు రెస్పాండెంట్లు 241 నంబరున మరియొక దావా దాఖలుచేసినట్లున్న వాయిదాల తేదీలను రెండు దావాలు పిలువబడుచున్నవని చెప్పుచున్నాడు. పంచాయితీ కోర్టువారు యక్సుపార్టీ డిక్రీని రద్దుచేయుటకుగల కారణములను ఆర్డరులో ఉదహరించి యుండలేదు. పంచాయతీకోర్టు రెస్పాండెంట్లకు సమను సర్వీగాలేదని రికార్డుపైన పొరబాటున వ్రాయబడినట్లు నమ్మి యుండవచ్చును.

రికార్డునుబట్టి ప్రతివాది హాజరైనటుల కనుపడుచున్నను, సమనులపై ప్రతి వాదుల సంతకములు కనుపడుచున్ననూ డిస్ట్రిక్టు మునసబు పంచాయితీ కోర్టు తీర్పును రద్దుచేయుటకు నిరాకరించెను. అందుకుకారణము రికార్డులపైన వ్రాతలు పొరబాటున వ్రాయబడియుండవచ్చునని యెంచెను. దానికి ఆధారం మెచ్చోటను కనుపడదు. సాధారణముగ కోర్టురికార్డులు సరిగా వ్రాయబడినట్లు యెంచవలెనన్న న్యాయసూత్ర మునుబట్టియే గాక ఈ కేసుసంగతులనుబట్టి ప్రతివాదులు వాయిదాలకు హాజరై దావాలో యెట్టివాదన చేయనటుల స్పష్టముగా కనుపడుచున్నది. వారు కోర్టులో యున్నప్పటికి వారికి దావాసంగతి తెలిసినప్పటికి డిక్రీ దరిమిలా 3 సంవత్సరములు దాటిన తరువాత పంచాయతీకోర్టు యక్సుపార్టీ డిక్రీని రద్దుపరచినది. అటుల చేయు టకు పంచాయతీకోర్టుకు అధికారములేదు. మరిన్ని ఆ తీర్పు సె 73 లో చెప్పబడి నటుల అన్యాయముగా యున్నది.

డిస్ట్రిక్టు మునసబుకు పంచాయతీకోర్టు తీర్పులను విమర్శించుటకు సె 73 ప్రకా రము యివ్వబడిన తీర్పును హైకోర్టువారు రద్దుచేయుటకు అధికారములేదని రెస్పాం డెంట్లతరఫు వాదన చేయబడినది. దానికి ఆధారముగా 51 మ. లా. జ. 561 లోని తీర్పు చూపబడినది. కాని ఆ తీర్పులో ఈ విషయము తీర్మానించబడియుండలేదు. డిస్ట్రిక్టు మునసబు ఈ కేసులో తనకుగల అధికారమును అక్రమముగా చెలాయించి యున్నారు. అందువల్ల పార్టీలకు జరిగిన అన్యాయమును తొలగించుటకు హైకోర్టుకు సంపూర్ణ అధికారము కలదు. అందువల్ల డిస్ట్రిక్టు మునసబు ఆర్డరును రద్దుపరచి పంచా యితీకోర్టు యక్సుపార్టీ డిక్రీని రద్దుపరచుచూ యిచ్చిన ఆర్డరును రద్దుపరచి అదివరలో ఆ పిటీషనరుకు యివ్వబడిన డిక్రీని నిలుపదలైనది.

**(19) 1944 (2) మ. లా. జ. 390**

మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తి బయర్సుగారు

**Crps. 42 & 43 of 1944 (25-10-1944)**

పిచిక సోమన్న వగైరా — పిటీషనర్లు
ఎదిరి పుచ్చల చిన్నయ్య — రెస్పాండెంటు.

మద్రాసు గ్రామకోర్టు ఆక్టు సె. 73 సి. ప్రో. కో. సె. 151 ఆ. 9 రూ. 9

కేసు సంగతులు

గ్రామ కోర్టుల ఆక్టు సె. 73 ప్రకారము డిస్ట్రిక్టు మునసబు కోర్టులో గ్రామ కోర్టు తీర్పులను రద్దుపరచమని దాఖలుచేసిన పిటీషనులను పిటీషనర్ల ప్లీడరు హాజరు లేదనే కారణముపై పరిహరింపబడెను. ఆ పిటీషనులను మరల తిరిగి విచారించమని సి. ప్రొ. కో. ఆ. 9 రూ. 9 ప్రకారము పిటీషనులు పెట్టగా సి. ప్రొ. కో. ఆ. 9 రూ 9. గాని సె. 151 గాని వర్తించదని ఆ పిటీషనులు "లా" ప్రకారము నిల్వనేరవని హైకోర్టువారు తీర్మానించిరి. 1944 (2) మ.లా.జ. 390

(20) 1940 (2) మ. లా. జ. 238=1940 మ. వీ. నో. 881

మద్రాస్ హైకోర్టు

చరపొట్టకారర్ కేశవన్ నాయర్ — పిటీషనరు (వాది)
యర్ఘవన్ కుంచికుమార్డువేలు — రెస్పాండెంటు

ఈ దావాలో గ్రామకోర్టు దావానోటుపైన యున్న సంతకమును, ప్రతివాది తన సంతకమని ఒప్పుకొన్న మరియొక దస్తావేజుపైన యున్న సంతకముతో పోల్చి సరి చూచిన్ని కేసు యితర సందర్భములనుబట్టిన్ని దావానోటు ప్రతివాదిచే వ్రాయబడిన దని డిక్రీ యిచ్చిరి. ప్రతివాది డిస్ట్రిక్టుమునసబు కోర్టులో దావానోటు తాను వ్రాసి నట్లుగా ప్రత్యక్షసాక్ష్యము లేకుండా గ్రామకోర్టు తీర్పు చెల్లదని వాదించెను. అందు పైన డిస్ట్రిక్టు మునసబు అట్టి సాక్ష్యము లేకుండా గ్రామకోర్టుకు డిక్రీ యిచ్చుటకు అధికారము లేదని డిక్రీ రద్దుపరచెను. అందుపైన వాది హైకోర్టులో రివిజను పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు, డిస్ట్రిక్టు మునసబు కోర్టువారు కోరు ఋజువుకంటె తక్కువ ఋజువైన గ్రామకోర్టు డిక్రీ యిచ్చినంతమాత్రమున, వారు సె. 73 లో చెప్పబడిన ప్రకారము "లా"కు విరుద్ధముగా గాని లేదా బహు అక్రమముగా గాని ప్రవర్తించిరనుటకు వీలులేదని ఈకేసులో ప్రతివాదికి యెట్టి అన్యాయము జరుగలేదని చెప్పుచూ డిస్ట్రిక్టు మునసబు ఆర్డరును రద్దుపరచి గ్రామ కోర్టువారు యిచ్చిన డిక్రీ నిలిపిరి.

(21) 1940 (1) మ. లా. జ. నో. ఆ. రి. కే. 18

మద్రాస్ హైకోర్టు

మహమ్మద్ ఇబ్రాహీం ఎదిరి పిల్లి వీరాస్వామి

గ్రామకోర్టువారు దావాకు పూర్వము 5 సంవత్సరములక్రింద వ్యాజ్యకారణము కలిగినట్టియు, లిమిటేషను పట్టిన ఒకబాకీకి డిక్రీయిచ్చిరి ప్రతివాది దావాలో యక్సు పార్టీఅయ్యెను. అతడు సె 73 ప్రకారము డిస్ట్రిక్టు మునసబు కోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేసి వాది ప్లయింటునుబట్టియే వాదిదావాకు లిమిటేషనుపట్టినదని గ్రామకోర్టు వారు యిచ్చిన డిక్రీ చెల్లదని వాదించెను. డిస్ట్రిక్టు మునసబు వాదనను అంగీకరించి డిక్రీ రద్దుపరచెను. అందుపైన వాది హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టు వారు వ్యాజ్యకారణము వాది సాక్ష్యముపై ఆధారపడియుండి ఆసాక్ష్యముకు వ్యతిరేకముగా ప్రతివాది సాక్ష్యము లేకున్నతప్పు, వాది ప్లయింటునుబట్టియే స్పష్టముగా దావాకు లిమిటేషనుబట్టినట్లు కనుబడుచున్నప్పుడు ప్రతివాది హాజరుకాకపోయినను లిమిటేషను ఆక్టు నిబంధనలకు వ్యతిరేకముగా డిక్రీయిచ్చుటకు గ్రామకోర్టుకు అధికారము యుండదని డిస్ట్రిక్టు మునసబుతీర్పు సరియైనదని వాది రివిజన్ పిటీషన్ పరిహరించిరి.

(22) 55 మ. లా. వీ. స. ఆ. రి కే. 7

మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి బరిన్‌గారు.

C. R. P. 1584 of 1940 (5-1-42)

రాఘవన్          ఎదిరి          మాలు

మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె 73. గ్రామ కోర్టువారు తాము విచారించ వలసిన అంశముపై పొరబాటు అభిప్రాయపడుట. అంతమాత్రముచే ఆతీర్పును డిస్ట్రిక్టు మునసబు రద్దుపరచవచ్చునా ?

కేసు సంగతులు.

ఒక గ్రామకోర్టువారు తాము విచారించిన అంశములను గురించి ఒక అభిప్రాయమునకు వచ్చినపుడు ఆ అభిప్రాయము సరియైనది కాదనే కారణముచే డిస్ట్రిక్టు మునసబు ఆ తీర్పును రద్దుచేయుటకు అధికారముయుండదని తీర్మానించిరి.

డిస్ట్రిక్టు మునసబు డిస్ట్రిక్టు జడ్జీకి రిపోర్టు చెయ్యవచ్చును. కొన్ని సంగతులలో డిస్ట్రిక్టు జడ్జీకి రిపోర్టు చెయ్యవలసినది.

74. 73 వ సెక్షను ప్రకారము డిస్ట్రిక్టు మునసబు డిక్రీగాని వుత్తరువునుగానిరద్దుచేసేటప్పుడెల్లా ఆయన ఆ సంగతిని డిస్ట్రిక్టు జడ్జీకి రిపోర్టు చెయ్య వచ్చును. మరిన్ని లంచము, విశేష పక్షపాతము, లేక దుర్నడత జరిగినదనే హేతువును పట్టి డిక్రీని గాని, వుత్తరువును గాని ఆయన రద్దుచేసిన ప్రతి సంగతిన్ని రిపోర్టు చెయ్యవలసినది.

వ్యాఖ్య.

డిస్ట్రిక్టు మునసబు ఒక గ్రామకోర్టు డిక్రీనిగాని, ఆర్డరునుగాని గ్రామకోర్టువారు లంచము పుచ్చుకొన్నారనిగాని, లేక విశేష పక్షపాతముతో తీర్పునిచ్చినారనిగాని, లేక యే ఇతర దుర్నడతతో ప్రవర్తించినారనిగాని రద్దు చేసినయెడల ఆ సంగతిని డిస్ట్రిక్టు మునసబు జిల్లాజడ్జీగారికి తప్పక తెలియజేయుట విధియైయున్నది. అట్టి సందర్భములలో గ్రామకోర్టువారిని శిక్షించుటకు యీ ఆక్టు, సె॥ 8 ప్రకారము జిల్లా కలెక్టరుగారికి వ్రాయగలందులకు జిల్లాజడ్జీగారికి డిస్ట్రిక్టు మునసబుగారు రిపోర్టు చేయవలసినదిగా విధించబడినది.

ఈ సెక్షను ప్రకారము డిస్ట్రిక్టుమునసబు వద్దనుండి రిపోర్టు వచ్చినపుడు డిస్ట్రిక్టు జడ్జి గ్రామకోర్టుల ఆక్టు సె 8 ప్రకారము సంబంధముగల గ్రామమునసబునుగాని, పంచాయితీకోర్టు మెంబరునుగాని శిక్షించమని జిల్లాకలెక్టరుకు వ్రాయవచ్చును. కాని డిస్ట్రిక్టుజడ్జి కలెక్టరుకు వ్రాయుటకు పూర్వము సంబంధముగల గ్రామమునసబు లేదా పంచాయితీకోర్టు మెంబరుకు అతనిపై యేల చర్యతీసికొనకూడదో, తగినసమాధాన మిచ్చుటకు అవకాశమిచ్చి అతనిని అతని సాక్ష్యమును విచారించి తరువాత కలెక్టరుకు రిపోర్టు చేయవలెను. కలెక్టరు ఆర్డరునుండి ఆ ఆర్డరుచే బాధింపబడిన వారికి సె 8 ప్రకారము ఆయా సందర్భమునుబట్టి రెవెన్యూబోర్డునకుగాని, హైకోర్టునకుగాని అప్పీలు చేయు హక్కు యున్నది. అందువల్ల జిల్లాజడ్జి న్యాయబద్ధముగా విచారణజేసి తరువాత రిపోర్టుచేయవలెను.

సె 8 క్రింద వ్యాఖ్యానములో యివ్వబడిన 1941 (2) మ. లా. జ. 428=1941 మ. వీ. నో. 1020 తీర్పును చూడవలెను.

నమూనాలు నిర్ణయించుటకు హైకోర్టు వారికిన్ని రికార్డు పరిశీలించుటకు డిస్ట్రిక్టుజడ్జికిన్ని డిస్ట్రిక్టు మునసబుకున్ను గల అధికారము.

75. గ్రామ కోర్టులలో వుపయోగించడమునకు గాను నమూనాలనున్ను ఆకోర్టులవారు పంపవలసివున్న లెక్కలను హైకోర్టువారు అప్పుడప్పుడు నిర్ణయించ వచ్చును. డిస్ట్రిక్టు జడ్జిగాని డిస్ట్రిక్టుమునసబుగాని గ్రామకోర్టుల రిజిష్టరుగికార్డులు వీటిని ఏకాలమందైనా తెప్పించి పరిశీలింపవచ్చును.

# 8 వ అధ్యాయము

## క్రిమినల్ విచారణాధికారము.

76. (1) ఒక పంచాయతీ కోర్టుయొక్క విచారణాధికారము యొక్క ప్రదేశ హద్దులకు లోపల ఈక్రింది నేరములన్నియునుగాని వానిలో ఏవైనగాని చేయబడినపుడు వాటిని విచారణకుతీసికొని విచారణచేయుటకు ఆ ఆ కోర్టుకు రాజ్య గవర్నమెంటు వారు డిస్ట్రిక్టు గెజెటులో ప్రకటింపబడిన వుత్తరువు మూలకముగా అధికార మీయవచ్చును:—

కొన్ని నేరములను విచారణకు తీసికొని విచారించుటకు పంచాయతీ కోర్టులకు రాజ్య గవర్నమెంటువారు అధికార మియ్యవచ్చును.

(a) ఇండియన్ పీనలు కోడుయొక్క 160 వ, 277 వ, 283 వ, 290 వ, 323 వ, 334 వ, 352 వ, 358 వ, 504 వ, 510 వ సెక్షన్ల ననుసరించి శిక్షింపదగిన నేరములు.

(b) నేరస్థుడు చోరీకై తత్పూర్వము నేరస్థాపన చేయుబడకుండిన యెడల పది రూపాయల విలువకు మించకుండునట్టి ఆస్తి విషయములో ఇండియన్ పీనలు కోడుయొక్క 379 సెక్షను ననుసరించి శిక్షింపదగు నేరములు.

(c) ఇండియన్ పీనలుకోడుయొక్క 426 వ సెక్షను ననుసరించి శిక్షింపదగిన నేరమువలన కలిగిన నష్టముగాని, హానిగాని, పది రూపాయలకు మించనప్పుడు అట్టి నేరములు.

(d) 1889 వ సంవత్సరపు షహరుల న్యూసెన్సు (ఉపద్రవముల) ఆక్టు తాలూకు 3 వ సెక్షను (9)వ, (11)వ, (12)వ క్లాజుల ననుసరించి శిక్షింపబడదగు నేరములు.

(e) జుల్మానాచే మాత్రముగాని ఆరు నెలలకు మించనట్టి కాలమునకు ఖయిదుచే మాత్రముగాని, యీ రెంటిచేగాని శిక్షింపబడదగు ఇండియన్ పీనలు కోడు ననుసరించినట్టి లేదా వేరే యేదేని

విశేషమైనట్టి చట్టముగాని ప్రదేశపు చట్టముగాని అనుసరించినట్టి వేరే యేదేని వివరింపబడిన నేరము.

కాని, (b) (c) క్లాజులలో చెప్పబడి యుండు నేరముల విషయములో రాజ్య గవర్నమెంటువారు దొంగిలింపబడిన ఆస్తియొక్క విలువగాని, కలుగజేయబడిన నష్టమో హానియో గాని, యిరువది రూపాయలకు మించని కేసులకు ఒక పంచాయతీ కోర్టు యొక్క విచారణాధికారమును వ్యాపింపచేయవచ్చును.

వివరణము :— ఈ సెక్షనులో చెప్పబడియుండు నేరములలో అట్టి నేరముల కుమ్మకులు కూడ చేరును.

(2) ఒక నేరస్థుడు పైనచెప్పబడిన నేరములలో దేనినైన చేసినట్లు ఒక పంచాయతీకోర్టు కనుగొన్న యెడల, అది అతనికి,

(a) ఇండియాదేశపు శిక్షాస్మృతియొక్క 510వ సెక్షను క్రిందికి వచ్చు ఒక నేరమువిషయములో పదిరూపాయలకుమించని జరిమానాను మఱిన్ని,

(b) ఇతర నేరములలో దేని విషయమునైన పదునైదు రూపాయలకు మించని జరిమానాను విధించవచ్చును.

అయినను 1వ సబు సెక్షనుయొక్క (b), (c) క్లాజుల క్రింద నేరముచేసినట్లు నేరస్థాపనచేయబడిన సందర్భములో జుల్మానా, చోరీ చేయబడిన ఆస్తియొక్క విలువకుగాని కలుగజేయబడిన హాని (లోటు) యొక్క మొత్తమునకుగాని రెండింతలవరకు వ్యాపించవచ్చును.

జుల్మానా చెల్లించుటయును చెల్లించక తప్పినందుకు శిక్షయును.

(3) జుల్మానా చెల్లించుటకు న్యాయమైన కాలమును పంచాయతీ కోర్టువారు ఈయవచ్చును. లేదా ఆ జుల్మానా వాయిదాలుగా చెల్లింపబడవలెనని ఉత్తరువు చేయవచ్చును. కాని ఆజ్ఞాపించునట్లుగా జుల్మానాచెల్లింపబడనియెడల అది యీ ఆక్టుక్రింది డిక్రీ ననుసరించి చెల్లింపబడవలసియుండిన సెట్లో

అదేవిధముగా కోర్టువారు దానిని రాబట్టుకోవలెను. విధింపబడిన జుల్మానాపైనిజెప్పినట్లురాబట్టుకొనుటకువీలులేదని కోర్టువారికి ఏకేసులో నైనను కనుబడినయెడల, వారు ఆకేసును సబ్‌డివిజనల్ మేజిస్ట్రేటు నకు పంపవలెను. అట్లు తప్పిపోయిన సందర్భములో, ఆ మేజిస్ట్రేటు చట్టముచే అధికారమీయబడినంతకాలము ఖయిదుకు తీర్పు యీయ వచ్చును; కాని అట్లు తీర్పు ఈయబడినకాలము ఏ సందర్భములో గాని ఒక వారమునకు మించగూడదు.

నేరముల విచారణలో చర్యాక్రమము.

(4) ఈ విషయమై రాష్ట్రీయ గవర్నమెంటువారు చేయునట్టి విధులకు లోబడి, నేరముల విచారణలలో పంచాయతీ కోర్టులవారు అవలంబింప వలసిన చర్యాక్రమము ఈక్రిందివిధముగా నుండవలెను.

కోర్టువారు సాక్షుల సాక్ష్యమును వ్రాసియుంచ నక్కరలేదు. లేక శాస్త్రీయముగా చార్జి (నేరము) ఇట్టిదని నిర్ణయముచేయనక్కర లేదు. కాని నిర్దేశింపబడిన నమూనాలో ఈ క్రింది తఫ్సీళ్ళను వారు నమూదు చేయవలెను:—

(a) వరుస నెంబరు.

(b) నేరము చేసిన తారీఖు.

(c) రిపోర్టుగాని ఫిర్యాదుగాని చేసినతారీఖు.

(d) విచారింపబడిన ఫిర్యాదియొక్కయు, ముద్దాయి (నేర పెట్టబడినవాని)యొక్కయు, సాక్షులయొక్కయు పేర్లును, తల్లిదండ్రుల పేర్లును, వాస స్థలములును.

(e) ఫిర్యాదుచేయబడిన నేరమును ఋజువుపడిన నేరము (ఏదైన నున్నయెడల అదియు)ను, 1 వ సబ్ సెక్షను (b), (c) క్లాజుల క్రిందవచ్చు కేసులలో చోరీచేయబడిన ఆస్తియొక్కవిలువయును లేదా కలుగచేయబడిన నష్టము లేదా హాని (లోటు)యొక్క మొత్తమును.

(f) నేరపెట్టబడినవాడు చెప్పుకొను సమాధానము అతని స్టేటుమెంటు (వాజ్మూలము) ఏదైన నున్నయెడల అదియును.

(g) నేరమును గురించిన నిర్ధారణమును, నేర స్థాపన చేయబడు సందర్భములో అందుకుగల కారణముల సంగ్రహమైన వివరణమును.

(h) విధించిన జుల్మానా మొత్తమును.

(i) చర్యలు ముగిసిన తాకీఖును.

ఫిర్యాదికి బదులు లేదా ముద్దాయికి బదులు ఏ న్యాయవాది వృత్తిదారుడైనను హాజరు కాకూడదు.

(5) రాజ్య గవర్నమెంటుచే ఏర్పరుపబడిన విధుల ప్రకారము తప్ప, ఏ న్యాయవాది వృత్తిదారుడయినను అర్హుడైనను కాకున్నను ఫిర్యాదికి బదులుగా నైనను, ముద్దాయికి బదులుగా నైనను హాజరగుటకు అనుమతింపబడకూడదు.

పంచాయతీ కోర్టునుండి ఎప్పుడు వ్యాజ్యములు ట్రాన్స్ఫరు చేయబడును.

(6) చర్యయొక్క యే దశలోనైనను ఆ కేసు ఒక మేజిస్ట్రేటు విచారించబడతగినదని కోర్టువారికి కనబడిన యెడల లేదా విచారణ ముగియునపుడు నేరముపెట్టబడినవాడు (ముద్దాయి) నేరము చేసెనని మరియు తాము విధించుటకు అధికారము కలిగియుండు శిక్షవంటి దానికంటె వేరే మోస్తరు శిక్షగాని అంతకంటె కఠినమైన శిక్షగాని అతడు పొందవలయునని కోర్టువారు అభిప్రాయులైన యెడల వారు ఆ కేసును సబ్ డివిజనల్ మేజిస్ట్రేటునకు పంపవలెను. ఆయన ఆ కేసును తన కోర్టుకుగాని లేదా తనకు తాబేదైన ఒక మేజిస్ట్రేటు కోర్టుకుగాని ట్రాన్స్ఫరు చేయవచ్చును.

(7) (a) డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగాని సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు గాని న్యాయసంరక్షణార్థము అగత్యమని తలచునపుడెల్ల పంచాయితీ

కోర్టు వారి యెదుటనున్న యే వ్యాజ్యమునైనను తన కోర్టుకయినగాని తనకు తాబేగా నున్న యే మేజిస్ట్రేటుయొక్క కోర్టుకైనగాని తన యధికార ప్రదేశములో నున్న వేరే యే పంచాయతీ కోర్టుకుగాని ట్రాన్స్ఫరు చేయవచ్చును.

(b) కాని ఒక పంచాయతీకోర్టు తీసివేయబడి దానికి బదులుగా ఒక క్రొత్త పంచాయతీకోర్టు ఏర్పాటు చేయబడని సందర్భములో జిల్లామేజిస్ట్రేటు లేదా సబ్ డివిజనల్ మేజిస్ట్రేటు అట్టి కోర్టులోనున్న యావత్తు క్రిమినల్ కేసులను చర్యలను తన సొంతకోర్టుకు లేదా తనకు తాబేదారుగానుండు ఏమేజిస్ట్రేటు కోర్టుకైనా లేదా దన విచారణాధికార ప్రదేశములో నుండు ఏ పంచాయతీ ర్టుకైన మార్చవలెను.

అప్పీలు

(8) ఈ సెక్షను ననుసరించి ఒక పంచాయతీకోర్టువారిచే జారీ చేయబడిన యేదేని తీర్పుమీాదగాని ఉత్తరవు మీాదగాని అప్పీలులేదు. కాని లంచము పుచ్చుకొనుట, అధికమైన పక్షపాతము లేదా అక్రమవర్తనము ఆ కోర్టు వారు చేసిన కారణముమీాద గాని న్యాయ నిర్ణయము కేవలము విపరీతముగా చేయబడినదను కారణముమీాదగాని ఏ నేరస్థాపననైనను డిస్ట్రిక్టు మేజిస్ట్రేటయినను సబ్ డివిజనల్ మేజిస్ట్రేటయినను రద్దు పరచవచ్చును.

పంచాయతీ కోర్టువారు విచారింపదగిన వ్యాజ్యముల ట్రాన్స్ఫరు.

(9) 1898 వ సంవత్సరపు క్రిమినల్ ప్రొసీజరుకోడులో ఏమి చెప్పియున్నను దానితో నిమిత్తము లేకుండగా పంచాయతీ కోర్టువారు విచారింపదగిన నేరమును గురించిన ఒక ఫిర్యాదు మీాదగాని పోలీసు రిపోర్టుమీాద గాని విచారణకు తీసికొను మేజిస్ట్రేటు అందుకు వ్యతిరిక్తముగా చాలినంత కారణము లుండిననేతప్ప విచారణాధికముగల పంచాయతీ కోర్టుకు ఆ కేసును ట్రాన్స్ఫరు చేయవచ్చును.

## వ్యాఖ్య.

మ॥ గ్రా॥ కో॥ ఆక్టుక్రింద నేరములను విచారించు అధికారము పంచాయతీ కోర్టులకు మాత్రమే కలదు. యీ ఆక్టుక్రింద స్థాపించబడిన అన్ని పంచాయతీ కోర్టులకు వెంటనే యీ సెక్షనులో చెప్పబడిన నేరములను విచారించుటకు అధికారము యుండదు. యీ సె 76 (1) ప్రకారము యీ సెక్షనులో చెప్పబడిన నేరములలో యే నేరములకు సంబంధించిన కేసులు విచారించవచ్చునో వాటిని ఉదహరించుచూ ప్రతి పంచాయతీ కోర్టు విషయములో రాజ్య ప్రభుత్వమువారు పంచాయతీ కోర్టు యున్న జిల్లా గెజెటులో ప్రకటన చేయుటమూలముగా అధికారమును కలుగజేయ వలెను అంతేగాని పంచాయతీకోర్టు యేర్పడినంతనే క్రిమినల్ కేసులను విచారించు అధికారము కలుగదు.

అదివరలో యున్న పంచాయతీ కోర్టు స్థానే క్రొత్త పంచాయతీకోర్టు స్థాపించబడిన సందర్భములో అదివరకు పంచాయతీకోర్టుకు క్రిమినల్ విచారణాధికారము యివ్వబడిన ఆ అధికారము దరిమిలా అట్టి పంచాయతీకోర్టు స్థానే యేర్పాటు చేయబడిన పంచాయతీ కోర్టుకు సంక్రమించును. అదివరలో పంచాయతీ కోర్టులో నిల్వయున్న క్రిమినల్ కేసులను నూతనముగా యేర్పడిన పంచాయతీ కోర్టులు తీర్మానించవచ్చునని సె 9 B లో నిబంధన చేయబడినది. కాని క్రొత్తగా ఒక ప్రదేశమునకు పంచాయతీ కోర్టు యేర్పాటు చేయబడిన అట్టి కోర్టుకు యీ సెక్షను సబ్ క్లాజు (1) లో చెప్పబడిన ప్రకటనయున్న గాని క్రిమినల్ కేసుల విచారణకు అధికారము యేర్పడదు. యీ సెక్షనులో చెప్పబడిన నేరములన్నిటిని విచారించుటకు రాజ్య ప్రభుత్వమువారు ఒక పంచాయతీకి. అధికారము కలుగజేయక కొన్ని నేరములను మాత్రమే విచారించుటకు అధికారముయివ్వవచ్చును. ప్రభుత్వమువారి పై చెప్పబడిన ప్రకటన లేనిదే ఒక పంచాయతీ కోర్టుకు యే నేరములు విచారించవచ్చునో తెలియదు.

**1-4-1951** నుండి అమలులోనికి వచ్చిన మద్రాస్ గ్రామ పంచాయతీల ఆక్టు ప్రకారము గ్రామపంచాయతీలన్నియు మద్రాస్ గ్రామ కోర్టుల ఆక్టు క్రింద స్థాపించబడిన పంచాయతీ కోర్టులుగా భావించబడును. అయితే అట్టి పంచాయతీ అధికార హద్దులలో అదివరకు ఒక పంచాయతీకోర్టు యుండి దానికి ఏదైనా క్రిమినల్ కేసులను విచారించుటకు అధికారమున్న, అట్టి కోర్టుస్థానే పంచాయతీ, పంచాయతీ కోర్టుగా భావింపబడును, గాన అదివరలోని పంచాయతీ కోర్టుకుగల క్రిమినల్ విచారణాధికారము పంచాయతీకి ఏర్పడును. అంతేనేగాని ఒక ప్రదేశమునకు క్రొత్తగా పంచాయతీ యేర్పడిన ఆ ప్రదేశములో అదివరకు పంచాయతీ కోర్టు యుండనప్పుడు అట్టి పంచాయతీ, పంచాయతీ కోర్టుగా క్రిమినల్ విచారణాధికారమును కలిగియుండుటకు సె 76 (1) లో చెప్పబడిన రాజ్య ప్రభుత్వమువారిచే జిల్లా గెజెటులో ప్రకటన చేయబడవలెను.

పంచాయతీకోర్టులు గావ్యవహరించుచున్న పంచాయతీలకు క్రిమినల్ విచారణాధికారము యున్నదా లేదా అను విషయముపై మునిసిపల్ కౌన్సిళ్ళ లోకల్ బోర్డుల ఇన్‌స్పెక్టరు ఆఫీసునుండి కొన్ని నోటిఫికేషనులు వెలువడినవి. వాటిలో గ్రామ పంచాయతీలన్నిటికి మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు క్రింద యేర్పడిన పంచాయతీ కోర్టులకుగల క్రిమినల్ విచారణాధికారము యున్నదని చెప్పబడినవి. కాని గ్రామకోర్టుల ఆక్టు క్రింద స్థాపించబడిన పంచాయతీ కోర్టులకు యీ సె. సబ్ క్లాజు (1) లో చెప్పబడిన ప్రకటన చేయబడినగాని ఆ ప్రకటనలో చెప్పబడు నేరములను విచారించుటకు అధికారము యుండదు. ఆ విధముగనే నూతనముగా పంచాయతీలు యేర్పడిన సందర్భములలో అదివరలో ఆ ప్రదేశములో పంచాయతీ కోర్టు లేని యెడల అట్టి నూతనపంచాయతీకి ఏయే కేసులను విచారించవచ్చునో తెలుపుచూ రాజ్య ప్రభుత్వమువారు ఆ కోర్టుయున్న జిల్లాగెజెటులో ప్రకటించుట ద్వారా క్రిమినల్ విచారణాధికారమును కలుగజేయవలెను.

ఈ ఆక్టు సె 7 క్రింద నియమింపబడిన గ్రామమునసబుకు క్రిమినల్ అధికారము లేదు. అయితే గ్రామమునసబు కొద్ది నేరములను విచారించుటకు 1816వ సం॥ 11 రెగ్యులేషను సె. 10, 1821వ సం॥ 4 రెగ్యులేషను సె. 6 వల్ల అధికారము యివ్వబడినది. ఆ రెగ్యులేషనుల విధులు యీ క్రింద నమోదుచేయబడినవి.

1816 వ సం॥పు 11 వ రెగ్యులేషను.

సె. 10 క్లాజు (1) తిట్లు, స్వల్ప దౌర్జన్యములు లేక కలహములు, అట్టి స్వల్పతర స్వభావము గల కేసులలో గ్రామాధికారులు నోటిమాటల మూలముగా విచారణ చేసినమీదట పార్టీలను (కక్షిదారులను) పంపివేయుటకుగాని, దేనినిగురించి ఫిర్యాదు చేయబడినదో ఆ నేరము మోపబడిన మనుష్యులు అదిచేసినట్లు నిరూపింపబడి, శిక్షార్హులైనట్లు తోచినపక్షమున, అట్లు నేరము చేసినవారిని 12 గంటలకు మించని కాలము వరకు గ్రామ చావడిలో కావలిలో యుంచుటకు వారు అధికారము కలిగి యుండవలెను.

నోటు:— గవర్నమెంటువారి కాపుదలలో యుండి, గవర్నమెంటు ఆఫీసర్ల వల్ల గవర్నమెంటు పనులు చేయబడుచున్న సత్రము లేక గ్రామ చావడి మాత్రమే యీ సెక్షనులో చెప్పబడిన "గ్రామచావడి" యగును. [యీనోటు జి.ఓ. నెం 205 (ఎల్. జనరల్) ది 23-1-34 వల్ల యీ సెక్షను 1వ క్లాజుకు చేర్చబడినది. ఇదివరలో యీ సె. క్రింద నేరస్థులకు బొండకొయ్యవేయు అధికారముకూడ యుండినది. ఇప్పుడు అట్టి శిక్షనువేయు అధికారము 1920 వ సం॥పు 2 వ మదరాసు ఆక్టు సె. 27 వల్ల రద్దు చేయబడినవి.]

క్లాజు (2) గ్రామాధికార్లు యీ సెక్షనుయొక్క 1టవ క్లాజువల్ల తమ కియ్యబడిన శిక్షాధికారమును ఏయే కేసులతో తాము చెలాయించి యున్నారో ఆకేసులన్నిటిని వారు లూతాకా మాజిస్ట్రేటునకు రిపోర్టుచేయవలెను. కాని పార్టీలను పంపివేసిన కేసునుగురించి యే రిపోర్టును చేయ నగత్యములేదు.

1821 వ సం॥పు 4వ రెగ్యులేషను.

సె. 4 క్లాజు (1) 1816 వ సం॥పు 11 వ రెగ్యులేషనులోని 10వ సె. యొక్క 1వ క్లాజు ననుసరించి స్వల్పమైన నేరములకు శిక్ష విధించుటకు గ్రామహెడ్డుల కియ్యబడిన అధికారములు, అందు నిబంధింపబడిన విధులనున్; హద్దులను అనుసరించి, నేరమును బలపరచు స్థితిగతులు కలిగియుండనట్టియు, దుర్మార్గులని ప్రసిద్ధిచెందిన మనుష్యులచే చేయబడినట్టియు, చోరీ చేయబడిన సొత్తు విలువ ఒక రూపాయిను మించనపుడు స్వల్ప చోరీలను శిక్షించు విషయమునకుకూడ ప్రయోగించునట్లు చేయబడినవి.

హైకోర్టు తీర్పులు.

(1) ఇ.లా.రి. 44 మదరాసు 113.

జడ్జి:— అబ్దుల్ రహీంగారు

పొన్నుస్వామిపిళ్లే — పిటీషనరు

పిటీషనరు దుర్భాష లాడినాడనే నేరమునకు గ్రామమునసబు పిటీషనరుకు దేవాలయము యెదుట 5 గంటలు విడిఖైదు విధించెను. అందుపైన పిటీషనరు హైకోర్టులో పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు 1816 వ సం॥పు 11 వ రెగ్యులేషను 10 వ సెక్షనుక్రింద గ్రామ మునసబుకు గ్రామ సత్రములోమాత్రమే విడిఖైదు విధించుటకు అధికారము కలదనియు, యింకొకచోట విడిఖైదు వేయుటకు అధికారము లేదనియు తీర్మానించిరి.

(2) ఆ. ఇ. రి. 1927 మద్రాస్ 1022 = 53 మ. లా. జ. 526 = 1927 మ. వీ. నో. 786 = 26 మ. లా. వీ. 555 = 105 ఇం. కే. 801.

జడ్జి:— కర్గన్ వన్ గారు.

సుప్పన్ చెట్టి వగైరా — పిటీషనర్లు (ముద్దాయిలు)

ఎదిరి — గవర్నమెంటువారు

ఈ కేసులోని పిటీషనర్లను పక్షోరీమనై గ్రామ మునసబు, ఇం॥ పీ॥ కో॥ సె. 352 క్రింద దౌర్జన్యమునకు గ్రామసాముదాయక స్థలములో మధ్యాహ్నము ఒంటిగంట మొదలు మూడుగంటలవరకు విడిఖైదును విధించెను. సదరు తీర్పుపైన ముద్దాయిలు హైకోర్టులో రివిజన్ పిటీషన్ దాఖలుచేసి గ్రామమునసబుకు మద్రాస్ గ్రామకోర్టు

ఆక్టు క్రింద విడిఖైదు వేయుటకు అధికారము లేదనిన్ని, జుల్మానా మాత్రము వేయు అధికారమున్నదనే మొదలగు వాదనలు చేయగా హైకోర్టువారు:—

(1) గ్రామమునసబుకు మ॥ గ్రా॥కో॥ ఆక్టు క్రింద క్రిమినల్ కేసులను విచారించు అధికారము లేదనిన్ని, సదరు ఆక్టు క్రింద పంచాయతీ కోర్టులు మాత్రమే క్రిమినల్ కేసులను విచారించుటకు అధికారము కలిగియున్నవనిన్ని,

(2) గ్రామమునసబుకు 1816 వ సం॥ పు 11 వ రెగ్యులేషను సె. 10 క్రింద కొన్ని నేరములను విచారించు అధికారము కలదనియు, సదరు అధికారము ప్రకారము గ్రామసత్రములో 12 గంటలకు మించకుండా విడిఖైదు వేయవచ్చుననియు కాని ఆ ఖైదును గ్రామసత్రములో మాత్రమే వేయవలెననిన్ని, గ్రామసత్రము లేని యెడల ఖైదు విధించుటకు అధికారమే లేదనిన్ని, ఆ॥ ఇ॥ రి॥ 1921 మద్రాస్ 410 = ఇ. లా. రి. 44 మద్రాస్ పేజీ 113 లోని తీర్పును ఆమోదించుచూ తీర్మానించిరి.

1935 మ॥ వీ॥ నో॥ 1344

జడ్జీ:— కింగుగారు

వెలాయుదు పడయాచీ — పిటీషనరు

ఎదిరి—గవర్నమెంటువారు

ఒక గ్రామమునసబు పిటీషనరు చేసిన ఒక నేరముకు గ్రామచావడిలో 2 గంటల కాలము విడిఖైదు విధించెను. కాని సదరు తీర్పు 9-1-35 తేదీన యివ్వబడి నప్పటికిన్ని 22-11-35 తేదీవరకు (ఈ హైకోర్టు తీర్పువరకు) సదరు గ్రామములో గ్రామచావడి లేనందున పిటీషనరును సదరు శిక్ష అనుభవింపజేయలేదు. కాని దరిమిలా మరియొక గ్రామముయొక్క గ్రామచావడిలో సదరు శిక్షను పిటీషనరుచే అనుభవింపజేయవలెనని గ్రామమునసబు ప్రయత్నించుచుండగా పిటీషనరు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోరువారు, గ్రామమునసబు తన గ్రామము లోని గ్రామ చావడిలోనే విడిఖైదు విధించుటకు అధికారము కలదుగాని మరియొక గ్రామచావడిలో శిక్షను విధించుటకు వీలులేదని (1) ఇ॥ లా॥ రి॥ 44 మద్రాస్ 113 (2) 1927 మ॥ వీ॥ నో॥ 786 లోని తీర్పులను ఆమోదించుచూ గ్రామమునసబు వేసిన శిక్షను రద్దుపరచిరి.

సె. 76, క్లాజు (1) సబ్ క్లాజులు బి, సి, లు ప్రకారము ఇం. పీ. కో. సె. 379, 426 ల క్రింద నేరములను పంచాయతీ కోర్టులు విచారించుటకు, చోరీ చేయ బడిన ఆస్తి కిమ్మతు లేక చెరుపుచేయబడిన నష్టము లేక హానియొక్క కిమ్మతు రు 10 లకు మించి యుండకూడదు. కాని రాజ్య గవర్నమెంటువారు పై నేరము లలో విలువ రు 20 ల వరకు యున్నను, అట్టి కేసులను విచారించుటకు పంచాయతీ కోర్టులకు అధికారమివ్వవచ్చును. అడివరిలో చోరీ నేరముకు శిక్షపడిన పాత నేరస్థుని పైన వచ్చిన చోరీ నేరమును పంచాయతీ కోర్టువారు విచారించకూడదు.

పంచాయతీకోర్టువారు ఇం. పీ. కో. సె. 379, 426 ల క్రింద నేరములను విచారించినపుడు చోరీచేయబడిన ఆస్తియొక్క విలువను లేక చేయబడిన చెరుపు యొక్క నష్టమును లేక హానియొక్క విలువను, యీ సె. 4 క్లాజు సబ్ క్లాజు "ఇ" ప్రకారము తీర్పులో ఉదహరించవలసిన విధియైయున్నదని 4వ క్లాజు సబ్ క్లాజు (ఇ) క్రింద నమోదుచేయబడిన 1925 ఆ. ఇ. రి. మద్రాస్ 1144 లో తీర్మానించబడినది. ఏలనన రు. 10 లకు మించి విలువ యున్నయెడల అట్టికేసులను విచారించుటకు పంచాయతీకోర్టులకు అధికారముండదు.

సె. 76 3 క్లాజు:— పంచాయతీకోర్టువారు జుల్మానా విధించినపుడు ఆ యా కేసుల సందర్భమునుబట్టి జుల్మానా చెల్లించుచుటకు ముద్దాయికి కొంతవ్యవధిని యివ్వ వచ్చును. లేక వాయిదాలమీద చెల్లించమనికూడ ఉత్తరువు యివ్వవచ్చును. ఒక ముద్దాయి పంచాయతీకోర్టు ఉత్తరువుల ప్రకారము జుల్మానా చెల్లించక తప్పిపోయిన యెడల అతనిమీద అట్టి మొత్తమునకు డిక్రీ యిచ్చినట్లు యెంచి పంచాయతీకోర్టు వారు అతనివద్దనుండి సదరు మొత్తమును రాబట్టవచ్చును. ముద్దాయివద్దనుండి యేవిధ ముగాను జుల్మానా వసూలయ్యే మార్గము కనుపించనియెడల పంచాయతీ కోర్టువారు ఆ కేసును సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుకు పంపవలెను. అట్టి మాజిస్ట్రేటు జుల్మానా చెల్లించక తప్పిపోయినందుకు ముద్దాయికి ఒక వారముకు మించకుండా ఖైదును విధించవచ్చును.

4 క్లాజు, సబ్ క్లాజు (ఇ)—చోరీచేయబడిన ఆస్తియొక్క విలువ లేదా కలుగ జేయబడిన నష్టము లేదా హానియొక్క మొత్తమును గ్రామకోర్టువారు నమోదు చేయ వలెను. అట్లు నమోదు చేయనియెడల ఆ తీర్పు చెల్లదని యీ క్రింది తీర్పులో తీర్మా నించబడినది.

## తీర్పు

1925 ఆ॥ ఇ॥ రి॥ మద్రాస్ 1144 = 1925 మ॥ వీ॥ నో॥ 600.

జడ్జి:— దేవదాసుగారు

మునిగాడు — పిటీషనరు ఎదిరి — గవర్నమెంటు

ఈ కేసులో పిటీషనరుకు పంచాయితీకోర్టువారు ఇం॥ పీ॥ కో॥ సె. 426 క్రింద చెరుపు నేరమునకు రెండురూపాయలు జుల్మానా విధించిరి. అందుపై ముద్దాయి హైకో ర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేసి పంచాయితీకోర్టు తీర్పులో ముద్దాయి చేసిన చెరుపు కిమ్మతు వేయబడి యుండలేదనిన్ని, ముద్దాయి చేసిన నష్టము విలువ రు 10 ల పైన యుండినయెడల, సదరు కేసును పంచాయతీ కోర్టువారు విచారించుటకు అధికారము యుండదనిన్ని, పంచాయతీకోర్టువారు నష్టము విలువ నిర్ణయించనందున సదరు తీర్పు చెల్లకూడదనిన్ని వాదించెను. హైకోర్టువారు (1) సె. 426 క్రింద ముద్దాయి చేసిన

నష్టము విలువను పంచాయతీకోర్టువారు నిర్ణయించి యుండితీరవలెననిన్నీ, అట్లు చేయనందున సదరు తీర్పు చెల్లదనిన్నీ (2) పంచాయతీ కోర్టులుయిచ్చు తీర్పులను హైకోర్టువారు క్రి.ప్రొ.కోడు క్రింద రద్దుపరచుటకు వీలులేదనిన్నీ, కాని పంచాయతీ కోర్టు తీర్పులలోని పొరపాటు తీర్పులను గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టు సె. 107 ప్రకారము రద్దుచేయుటకు అధికారము కలదనిన్నీ తీర్మానించిరి.

సె. 76 సబ్ క్లాజు 7:— జిల్లా కలెక్టరుగాని, సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుగాని (డిప్యూటీకలెక్టరు) న్యాయ సంరక్షణార్థము అవసరమని యెంచే యెడల పంచాయతీ కోర్టులో యున్న యే కేసునైనా తమకోర్టుకు గాని, లేక తమ అధికారములో యున్న మరి యే యితర మాజిస్ట్రేటు కోర్టుకుగాని, లేక తమ అధికారములోయున్న ఏ యితర పంచాయతీ కోర్టుకుగాని ట్రాన్స్ఫరు చేయవచ్చును. హైకోర్టువారికి ఒక పంచాయతీకోర్టులోని క్రిమినల్ కేసు మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరుచేయుటకు లెటరు పేటెంటు 29 కు ఈ ప్రకారము అధికార మున్నదని 1949 (1) మ. లా. జ. నో. ఆ. కే. కే. 12 లో తీర్మానించిరి.

కేసులను ట్రాన్స్ఫరు చేయుటకు తగిన కొన్ని కారణములు.

ఒక కేసులో పంచాయతీ కోర్టువారు లంచము పుచ్చుకొన్నారని గాని, లేక విశేష పక్షపాతముతో కేసును విచారించుచున్నారని గాని, లేక కేసు విచారణలో యితర దుర్న డతగా ప్రవర్తించుచున్నారనిగాని యెంచినయెడల ఆ కేసును మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును. ఒక కేసులోని కక్షీదారులలో యెవరైనను పంచాయతీకోర్టు మెంబర్లకు సన్నిహిత బంధువులైన గాని, లేక స్నేహితులైన గాని లేక ఒక కేసులోని ఒక కక్షీదారునితో పంచాయతీ మెంబర్లకు ఏదైన విరోధముండి కేసును నిష్పక్షపాతబుద్ధితో విచారింతురని నమ్మకము లేనప్పుడుగాని లేక పంచాయతీ మెంబర్లకు ఒకే కేసులో స్వయముగా సంబంధమున్నగాని, లేక పంచాయతీ మెంబర్లు ఒకే కేసులో కక్షీదారులుగాయున్న గాని ఆ కేసును మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును. పంచాయతీదార్లు ఒకే కేసులో ముఖ్యసాక్షులుగాయున్నగాని, లేక ఆ కేసువ్యవహారములో అదివరలో మధ్యవర్తులుగాయుండి వ్యవహరించినగాని, ఆకేసును మరియొకకోర్టుకు ట్రాన్స్ఫరుచేయవచ్చును. పంచాయతీకోర్టువారు ఒకకేసులో అనేక మాసములవరకు యెట్టి చర్యను బుద్ధిపూర్వకముగా పుచ్చుకొనకయుండిన అట్టి కేసును మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరు చేయవచ్చును. పంచాయతీకోర్టువారు ఒక కక్షీదారుని రెండవకక్షీదారుని సాక్షులను అడ్డుసవాళ్ళు వేయకుండా అక్రమముగా ఆటంకముకలుగ జేయుట, కేసులోని దస్తావేజులకు నకళ్ళుయిచ్చుటకు నిరాకరించుట, సాక్ష్యము హాజరు పరచుటకు తగిన అవకాశము యివ్వకుండుట మొదలగు సంగతులను బట్టి పంచాయతీ కోర్టువారు పక్షపాతబుద్ధితో వ్యవహరించుచున్నట్లు యెంచవచ్చును. ఆసందర్భములల్లో అట్టి కేసులను యితర కోరులకు ట్రాన్స్ఫరు చేయుట న్యాయరక్షకొరకు ముఖ్యావసరమైయున్నది.

ఈ క్లాజు ప్రకారము 1816 సం॥పు 11వ రెగ్యులేషను ప్రకారముగాని, 1821 సం॥ 4 వ రెగ్యులేషను ప్రకారముగాని క్రిమినల్ కేసులను విచారించు గ్రామమునసబు వద్దనున్న క్రిమినల్ కేసులను యితర కోర్టులకు ట్రాన్సఫర్ చేయుటకు వీలులేదు. కాని అట్టి కేసులను ట్రాన్సఫరు చేయుటకు క్రిమినల్ ప్రొసీజరు కోడు సె 528 లో యేర్పాటు చేయబడినది.

సె. 76, 8 క్లాజు:- పంచాయతీ కోర్టుయొక్క యే శిక్ష లేక యే ఇతర ఆర్డర్ల నుండి అప్పీలు యుండదు. కాని జిల్లాకలెక్టరుగారుగాని, డిప్యూటీ కలెక్టరుగారుగాని, పంచాయతీ కోర్టువారు విధించిన శిక్షను

(1) పంచాయతీకోర్టువారు లంచము పుచ్చుకొన్నారనిగాని, లేక

(2) అధికమైన పక్షపాతముతోగాని, లేక

(3) ఇతర అక్రమప్రవర్తనతో తీర్పు యిచ్చిరనిగాని, లేక

(4) వారు యిచ్చిన తీర్పు కేవలము న్యాయవిరుద్ధముగా యున్నదనిగాని, యెంచేయెడల రద్దుచేయవచ్చును.

పైన చెప్పబడిన కారణములుతప్ప మరి యే యితర కారణములపైన పంచాయతీ కోర్టు శిక్షను రద్దుచేయ వీలులేదు. పంచాయతీ కోర్టువారు తమకు లేని అధికారమును చెలాయించు ఈ సె.లో చెప్పబడిన అక్రమ ప్రవర్తన అగును. అధికారము లేకుండా విధించబడిన శిక్షను రద్దు చేయవచ్చును. పంచాయతీ కోర్టువారు ఫిర్యాది కేసును యే కారణము చేతనైనా త్రోసివేసిన యెడల, అట్టి ఆర్డరుతో జోక్యము కలుగ జేసికొనుటకు జిల్లా కలెక్టరుకు గాని, డివిజనల్ ఆఫీసరుకు గాని యెట్టి అధికారమున్ను లేదు. పంచాయతీ కోర్టువారు శిక్ష విధించినపుడే, ఈ సెక్షనులో చెప్పబడిన కారణములున్న అట్టిశిక్షను రద్దుచేయవచ్చును. పంచాయతీ కోర్టువారు విధించే శిక్షను మాత్రము యీ క్లాజులో ఉదహరించిన కారణము లున్న రద్దు చేయుటకు అధికారము గలదుగాని, అట్టిశిక్షను రద్దుచేసి కేసును తిరిగి విచారణ నిమిత్తము పంచాయతీ కోర్టుకు పంపుటకు సబు డివిజనల్ మాజిస్ట్రేటు గాని, జిల్లా కలెక్టరుకు గాని యెట్టి అధికారమున్ను లేదు. పంచాయతీ కోర్టు తీర్పులు అన్యాయముగాను, కేవలము న్యాయవిరుద్ధముగాను యున్నపుడు అట్టి తీర్పులను రద్దు చేయుటకు హైకోర్టువారికి సంపూర్ణ అధికారము కలదు.

తీర్పులు.

(1) 1925 ఆ. ఇ. రి. మద్రాస్ 1144=1925 మ॥ వీ॥ నో॥ 600

జడ్జి:— దేవదాస్‌గారు.

మునిగాడు — పిటీషనరు.

ఎదిరి — గవర్నమెంటువారు.

పంచాయతీకోర్టు తీర్పులను హైకోర్టువారు క్రి॥ ప్రొ॥ కో॥ క్రింద రద్దుపరుచుటకు అధికారము లేనప్పటికి పంచాయతీకోర్టు తీర్పులలోని పొరపాటు తీర్పులను గవర్నమెంటు ఆఫ్ యిండియా ఆక్టు సె. 107 క్రింద రద్దుచేయుటకు అధికారము యున్నదని తీర్మానించిరి.

(2) 1931 మ॥ వీ॥ నో 713.

జడ్జి:— జాక్సన్ గారు.

అన్నపల్లె వెంకటరెడ్డి — పిటీషనరు.

ఎదిరి — గవర్నమెంటువారు.

గ్రామకోర్టు తీర్పులతో హైకోర్టువారు యెక్కువ అన్యాయము జరిగినపుడుగాని జోక్యము కలుగజేసికొనరనియు, ఒక గ్రామకోర్టు ఇం. పీ. కో. సె. 355 క్రింద నేరమును సె. 323 క్రింద నేరముగా యెంచినందువల్ల సదరుకోర్టు న్యాయవిరుద్ధముగా ప్రవర్తించినట్లుగాని, పార్టీలకు అన్యాయము జరిగినట్లుగాని యెంచవీలులేదని తీర్మానించిరి.

(3) 1932 మ. వీ. నో. 648.

జడ్జి:— వాల్లుగారు.

టి. కె. ఆర్. శ్రీనివాసాచారియార్ వగైరా—పిటీషనర్లు.

ఎదిరి — గవర్నమెంటువారు.

ఒక పంచాయతీకోర్టు ప్రెసిడెంటు ఒక క్రిమినల్ కేసు విచారణ పూర్తికాకపూర్వమే 20-4-31 తేదీన తీర్పు వ్రాసి కొందరి మెంబర్లచేత సంతకము చేయించెను. కొందరు మెంబర్లు సంతకము చేయుటకు నిరాకరించిరి. ఆ మరునాడు సదరుకేసులో మరికొంతసాక్ష్యము తీసికోబడి ముద్దాయిలకు జుల్మానా విధించబడెను. అందుపైన ముద్దాయిలు సబ్‌డివిజనల్ మాజిస్ట్రేటుకు రివిజన్‌పిటీషను దాఖలుచేయగా వారు 20-4-31 తేదీ తీర్పు సరియైనదనిన్ని 21-4-31 తేదీన వ్రాసిన తీర్పు వెనుకటి తీర్పులోని సంగతులను స్పష్టముగా విశదము చేయుచున్నదనియు తీర్పు నొసంగిరి. పిటీషనర్లు ఆ ఆర్డరుపైన హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు విచారణ పూర్తికాక పూర్వము యిచ్చినతీర్పు చెల్లనేరదని ముద్దాయిలకు విధించిన జుల్మానాను తీసివేసిరి.

(4) 1934 మ. వీ. నో 1022.

జడ్జి:— వాల్లుగారు.

నారాయణస్వామి వన్నియర్ — పిటీషనరు.

కరంబాయి రామ [illegible] గారి — రెస్పాండెంటు.

జ్యూరిస్ డిక్షన్ (అధికారము) లేకుండా పంచాయతీకోర్టు తీర్పు యిచ్చుట సె. 76 (8) చెప్పబడిన దుర్నడత అగునని తీర్మానించిరి.

(5) 1933 మ. పి. నో. 720.

జడ్జి:— బరన్ గారు.

అరులప్ప చెట్టివగైరా — పిటీషనర్లు.

ఎదిరి — గవర్నమెంటువారు.

పుంగంపల్లె గ్రామకోర్టువారు పిటీషనరును శిక్షించినమీదట పిటీషనరు గోబి చెట్టిపాలెయము సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా సదరు కోర్టువారు దానిని పరిహరించిరి. పంచాయతీ కోర్టువారు ఆ కేసును విచారించకుండా సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుగారు ఆపుదల ఆర్డరును యిచ్చియున్నారని చెప్పినప్పటికిన్నీ, ఆగక కేసును విచారించి తీర్పు చెప్పిరి. కేసు రికార్డు మెంబరుకాని వానిచే తయారుచేయబడినది. ముద్దాయి హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు పై సందర్భములలో ముద్దాయి పంచాయతీకోర్టులో తనకు న్యాయము కలుగదని భయపడుటకు తగిన కారణము లున్నవనియు, పంచాయతీకోర్టు చర్య న్యాయసమ్మతముగా లేనందున ముద్దాయికి వేసిన శిక్షను రద్దుపరచిరి.

(6) 1935 మ. పి. నో. 1040.

జడ్జి:— కింగ్ గారు.

స్వర్ణమ్మాళ్ — పిటీషనరు
పొన్నమ్మాళ్ — రెస్పాండెంటు.

పిటీషనరున్నూ, మరియొకరున్నూ తిరువన్నామలై సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు వారి యెదుట 14-12-34 తేదీన మొదయూరు పంచాయతీకోర్టు ఫయిలు 9, 10 నంబర్ల కేసులను సదరు కోర్టునుండి మరియొక కోర్టుకు ట్రాన్స్ఫర్ చేయవలసినదిగా కోరుచూ పిటీషను దాఖలుచేసినమీదట, సదరు కోర్టువారు ఆపిటీషనులను 21-12-34 తేదీకి వాయిదా వేసి ఆనాడు సదరు కేసులను మందకోలతూరు పంచాయతీ కోర్టుకు విచారణనిమిత్తము ట్రాన్స్ఫరు చేసిరి. కాని మొదయూరు పంచాయతీ కోర్టువారు 10వనంబరు కేసును 26-12-34 తేదీకి వాయిదా వేసి ఆ తేదీన ఫిర్యాదీ హాజరుకాలేదనే కారణముపైన కేసును కొట్టివేసిరి.

కాని తిరువన్నామలై సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుగారు మొదయూరు పంచాయతీకోర్టువారు తాము కేసును యితర కోర్టుకు ట్రాన్స్ఫర్ చేయుచూ ఆర్డరు యిచ్చిన తరువాత సదరు ఆర్డరు పంచాయతీకోర్టుకు అందనప్పటికిన్నీ, సదరు దావాను తీర్మానించుటకు అధికారములేదనిన్నీ, అందువల్ల ముద్దాయిని విడుదలచేయుటకు అధికారము

లేదనిన్ని చెప్పుచూ, సదరు కేసును మండలోలతూరు పంచాయతీకోర్టువారు విచారించవలసినదిగా ఆర్డరు యిచ్చిరి. ఆ ఆర్డరుపైన ముద్దాయి హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు—

(1) మ. గ్రా. కో. ఆ. సె. 76 క్రింద చేయబడిన 31 వ విధి ననుసరించి ఫిర్యాది హాజరులేనప్పుడు కేసును కొట్టివేయుటకు పంచాయతీ కోర్టుకు సంపూర్ణ అధికారము కలదనియు,

(2) సదరు కేసును ట్రాన్స్ఫరు చేసినట్లు ఆర్డరు పంచాయతీ కోర్టుకు అందనంతవరకు సదరు కేసును తీర్మానించుటకు పంచాయతీకోర్టుకు అధికారము కలదనియు సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు ట్రాన్స్ఫరు ఆర్డరు యిచ్చినందువల్లనే పంచాయతీకోర్టు అధికారము పోదనియు, సదరు ఆర్డరు పంచాయతీ కోర్టుకు అందనలేదనియు,

(3) సబ్ డివిజనల్ మాజిస్ట్రేటునకు మ. గ్రా. కో. ఆక్టు సె. 76 (8) క్లాజు క్రింద ముద్దాయికి శిక్షపడినప్పుడు మాత్రమే పంచాయతీకోర్టుల తీర్పులతో జోక్యము కలుగజేసుకొనుటకు అధికారము కలదు గాని, ముద్దాయిని వదలి వేసినప్పుడు అట్టి అధికారములేదనియు చెప్పుచూ సబ్ డివిజనల్ మాజిస్ట్రేటుగారి ఆర్డరును రద్దుపరచిరి.

(7) 21 మ. లా. జ. నో. ఆ. క్రి. కే. 65.

జడ్జి— దేవదాసుగారు

పంచాయతీ కోర్టులో దాఖలు అయిన రెండు కప్పంటకు క్రిమినల్ కేసులను కలిపి పంచాయతీకోర్టువారు విచారించిరి. ఒక కేసులోని ముద్దాయి రెండవ కేసులో ఫిర్యాదిగాయుండెను. రెండు కేసులకు ఒకే సాక్షులను విచారించి శిక్ష విధించెను: అందుపైన సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు కోర్టులో సదరు శిక్షను రద్దుచేయవలసినదిగా పిటీషను దాఖలుచేయగా సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు రెండుకేసులనుకలిపి విచారించుట న్యాయవిరుద్ధమనియు, అందువల్ల శిక్ష నిల్వనేరదనియు చెప్పుచూ శిక్షను రద్దుచేసి కేసును తిరిగి విచారించవలసినదిగా పంచాయతీ కోర్టుకు పంపెను. అందుపైన హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు: —

(1) రెండు కేసులను కలిపి విచారించుట న్యాయవిరుద్ధమనియు, అట్టివిచారణపైన విధించిన శిక్ష చెల్లదనియు,

(2) సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు శిక్షను రద్దుచేసిన తరువాత కేసును తిరిగి విచారించుటకు పంచాయతీ కోర్టుకు పంపుటకు గ్రామకోర్టు ఆక్టులో యెట్టి అధికారమున్ను యివ్వబడలేదని సబ్ డివిజనల్ మాజిస్ట్రేటు కేసును తిరిగి విచారించవలసినదని జారీచేసిన ఆర్డరును రద్దుపరచిరి.

(8) 1955 వ॥ వీ॥ నో॥ 1341.

జడ్జి:— కింగు గారు.

నారాయణ పడయాచీ వగైరా — పిటీషనర్లు

గవర్నమెంటువారు — రెస్పాండెంట్సు

పిటీషనర్లు ఒక నేరమునకు సదరు నేరము ఏ గ్రామములో జరిగినదో ఆపంచాయతీ కోర్టువల్ల గాక, మరియొక పంచాయతీ కోర్టువల్ల కేసు విచారించబడి శిక్షింపబడిరి. అందుపైన పిటీషనర్లు సబ్‌డివిజనల్ మాజిస్ట్రేటు కోర్టులో సె. 76 (8) ప్రకారము రివిజన్‌పిటీషను దాఖలుచేయగా ఆయన సదరు పిటీషనును పరిహరించెను. అందుపైన పిటీషనర్లు హైకోర్టులో రివిజన్‌పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు పంచాయతీకోర్టు తన అధికారప్రదేశహద్దులకు వెలపలయున్న గ్రామములో జరిగిన నేరములను విచారించుటకు అధికారము లేదనియు అట్టి సందర్భములో పంచాయతీ కోర్టు చర్య సె. 76 (8)లో చెప్పబడిన ప్రకారము న్యాయనిర్ణయము కేవలము విపరీతముగా చేయబడినట్లు యెంచవచ్చుననియు చెప్పుచూ పంచాయతీకోర్టువారి శిక్షను రద్దుపరచిరి.

సె 76 (9) క్లాజు:— ఈ క్లాజు ప్రకారము ఒకపంచాయతీకోర్టులో దాఖలు కావలసిన కేసు మాజిస్ట్రేటు కోర్టులో దాఖలుకాబడి, అట్లు దాఖలు కాబడుటకు తగిన కారణములు లేనియెడల ఆకేసును సదరు మాజిస్ట్రేటు, యేపంచాయతీకోర్టులో దాఖలుచేయవలసి యుండెనో ఆ పంచాయతీ కోర్టుకు ట్రాన్స్‌ఫర్ చేయవచ్చును. కాని తన అధికారములో యున్న యే యితర పంచాయతీ కోర్టుకూ ట్రాన్స్ఫరు చేయుటకు అధికారము లేదు.

ఒక గ్రామకోర్టు క్రిమినలు ప్రొసీజరుకోడు వర్తించుట.

77. (1) 1898 వ సంవత్సరపు క్రిమినలు ప్రొసీజరు కోడు యొక్క 403, 476, 476A, మరియు 476B సెక్షనుల తాలూకు నిబంధనలు గ్రామకోర్టుకు వర్తించవలెను.

(2) 1 వ సబ్ సెక్షనులో నిబంధింపబడినట్లు తప్ప సదరు కోడులోనున్న దేదియును గ్రామకోర్టుకు వర్తించగూడదు.

i. క్రి. ప్రొ. కో. సె॥ 403, 476, 476 A & 476 B లు మాత్రము గ్రామ కోర్టులకు వర్తించును.

మిగతా క్రి. ప్రొ. కోడు విధులు గ్రామకోర్టులకు వర్తించవు.

క్రి. ప్రొ. కో. సె. 403 లో యీ క్రింది విధముగా విధించబడినది.

(1) ఒకరు అధికారముగల ఒక క్రిమినలు కోర్టువల్ల యే నేరమునకైనను విచారింపబడి అట్టి కేసులో శిక్షను పొందినగాని, లేక నిర్దోషి యని విడుదలై అయిన గాని

అతనిమీద ఆ సంగతులు పైననే మరల ఆ నేరము మోపబడుగాని, ఆ సంగతుల పైన యేర్పడు నట్టియు, మొదట విచారించతగినట్టియు మరి యే ఇతర నేరము మోపబడుగాని ఏ క్రిమినల్ కోర్టువారు విచారించకూడదు.

(2) కాని ఆ సవరణలో విచారించిన కోర్టుకు రెండవసారి మోపబడిన నేరమును విచారించుటకు అధికారము లేనియెడల రెండవ కేసును విచారించవచ్చును. మొదటి కేసును విచారించిన కోర్టుకు సదరు కేసును విచారించుటకు అధికారము లేదని కేసు కొట్టివేయబడిన యెడల రెండవసారి ఆ నేరమునకే అధికారము కలిగిన కోర్టు విచారించవచ్చును. అట్టి కేసును విచారించుటకు సె. 403 ప్రకారము యెట్టి అభ్యంతరము యుండదు.

(3) ఆ సవరణలో జరిగిన కేసులో ముద్దాయి శిక్షపడియైన యుండవలెను. లేదా నిర్దోషి యనియైన స్థిరపడియుండవలెను. మొదటికేసును కోర్టువారు ఫిర్యాది ప్రమాణ వాఙ్మూలము తీసికొన్నతరువాత నమ్మ లేదని యితర సాక్షులను విచారించకుండా కొట్టివేసిన సందర్భములో, లేక వారంటు కేసులలో ఫిర్యాది తరఫున సాక్ష్యమును మాత్రము విని కేసు బుజువుకాలేదని ముద్దాయిని విడుదల చేసినపుడు ముద్దాయి నిర్దోషత్వము స్థిరపడినట్లు యెంచవీలులేదు. ఆ సందర్భములలో ఆ నేరములకు మరల కేసును దాఖలు చేయవచ్చును కాని సమన్సు కేసులలో కొంత సాక్ష్యము వినిగాని లేక ఫిర్యాది హాజరులేదనిగాని ముద్దాయిని విడుదల చేసినయెడల అట్టి విడుదలవల్ల ముద్దాయి నిర్దోషిత్వము స్థిరపడినట్లు యెంచబడును. అట్టి సందర్భములలో ముద్దాయిపైన నేరమునకు తిరిగి కేసును పెట్టుటకు వీలులేదు. మ. గ్రా కో. ఆ. క్రింద చేయబడిన విధులలో రూ 29, 39, 31 లు క్రింద ఫిర్యాదును త్రోసివేసినయెడల ముద్దాయి నిర్దోషత్వము స్థిరపడినట్లు యెంచ వీలులేదు.

**ii.** ఈ సెక్షను 1937 సం॥పు 2వ మదరాసు గ్రామకోర్టుల సవరణ ఆక్టువల్ల సవరణ చేయబడినది. ఆ సవరణలో గ్రామకోర్టులకు క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 403 మాత్రము వర్తించునని యున్నది.

అందువల్ల యీ సెక్షను క్రింద యిటు తరువాత యివ్వబడిన 1935 మ. వీ. నో 946 కేసులో పంచాయతీ కోర్టువారు ఒక దావాలో దాఖలు చేయబడిన ప్రోనోటు ఫోర్జరీచేయబడినదని తీర్మానించిరి. అందుపైన నోటు ఫోర్జరీ చేసినవారిపై క్రిమినల్ కేసు పెట్టబడగా, హైకోర్టువారు ఆ నేరమునకు క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 195 (1) (b) ప్రకారము పంచాయతీ కోర్టువారే ఫిర్యాదు చేయవలెనని, కాని గ్రామకోర్టులకు క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 476 వర్తించనందున వారు ఫిర్యాదుచేయుటకు వీలులేదని ఆ నేరమునకు యెవరున్నూ ఫిర్యాదు దాఖలుచేయ వీలులేదని తీర్మానించిరి.

అటులనే ఒక పంచాయతీకోర్టు ప్రెసిడెంటును తిరస్కరించినందుకు ఇండియన్ పీనల్ కోడు సె 228 ప్రకారము పంచాయతీకోర్టువారి ఫిర్యాదుపైన కేసుపెట్టి

బడగా గ్రామకోర్టులకు క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 476 వ ర్తించనకదున పంచాయతీ కోర్టువారు ఫిర్యాదు పంపుటకు అధికారము లేదని తీర్మానించిరి.

ఆ పరిస్థితులను తొలగించుటకు గవర్నమెంటువారు 1937 సం॥ ౨ 77 వ సవరణజేసి క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 476, 476 A మరియు 476 B లు గ్రామ కోర్టులకు వర్తించునని యీ సెక్షనును సవరణజేసిరి.

## క్రిమినల్ ప్రొసీజరుకోడు.

సె 195లో చెప్పబడిన విషయములలో చర్య.

సె 476 ఏ సివిల్ రివెన్యూ లేదా క్రిమినలుకోర్టు అయిననను, యీ విషయమై దానికి ఒక దరఖాస్తు పెట్టబడిన మీదట లేదా యితర విధముగాను, సె 195 (1) (b) (c) లో చెప్పబడిన నేరములు, అట్టి కోర్టులో లేదా కోర్టుకు సంబంధించిన చర్యలలో జరిగినట్లు కనుపడి, న్యాయసిద్ధికొరకు అట్టి నేరము విషయమై విచారణ జరుపబడవలెనని అభిప్రాయపడు నెడల, అట్టికోర్టు అట్టి నేరముల విషయములో ఏదైనా ముందు విచారణ అవసరమని తలచునెడల అట్టి ముందువిచారణజరిపి ఆ విధముగా తీర్మానమును యిచ్చి ఆ కోర్టు అధికారిచే సంతకము చేయబడిన ఒక ఫిర్యాదును తయారుచేసి దానిని అధికారము గల ఒకటవ తరగతి మాజిస్ట్రేటుకు పంపవలెను.

మరిన్ని ముద్దాయి ఆమాజిస్ట్రేటునద్ద హాజరయ్యేలాగున పూచీకత్తును తీసుకొనవలెను. లేదా ఆ నేరము జామీను యిచ్చుటకు వీలు లేని నేరమైన మరియు ఆకోర్టు అటుచేయుట అవసరమని తలచు నెడల ముద్దాయిని అరెస్టుచేసి ఆ మాజిస్ట్రేటునద్దకు పంపవలెను. మరిన్ని ఆ మాజిస్ట్రేటువద్ద హాజరై సాక్ష్యమిచ్చుటకు ఏమనిషివద్దనుండియైనను పూచీకత్తును తీసుకొననచ్చును.

*  *  *  *

(2) అటుతరువాత ఆమాజిస్ట్రేటు ఆఫిర్యాదు సె 200 ప్రకారము తనవద్ద దాఖలు కాబడినట్లు యెంచి చర్య తీసుకొనవలెను.

(3) ఆమాజిస్ట్రేటుగాని ఆ కేసు మరియొక మాజిస్ట్రేటుకు ట్రాన్స్ఫరు చేయబడిన అట్టి మాజిస్ట్రేటుకుగాని, యే న్యాయసంబంధమైన

చర్యల సందర్భములలో ఈ ఫిర్యాదువచ్చినదో ఆ చర్యలలోని తీర్మానమునుండి అప్పీలు చేయబడినదని తెలియవచ్చిన ఆయన అవసరమని తలచునెడల ఆ అప్పీలు పర్యవసానమునకు కేసు విచారణవాయిదా వేయవచ్చును.

క్రింది కోర్టు ఫిర్యాదు చేయనప్పుడు హైకోర్టు చేయవచ్చును.

సె 476 A, సె 476 (1) న సబ్ సెక్షను క్రింద ఒక సివిల్ రెవెన్యూ మరియు క్రిమినల్ కోర్టులకు సదరు సెక్షనులో సూచించిన అట్టి కోర్టులలో లేదా ఆ కోర్టులకు సంబంధించిన చర్యలలో జరిగినవో ఆ నేరముల విషయములో యివ్వబడిన అధికారములు అట్టి కోర్టులకు సె 195 (3) ప్రకారము పై కోర్టులుగా భావింపబడతగని కోర్టులవల్ల అట్టి కోర్టులు ఫిర్యాదుచేయని సందర్భములలో లేక అట్టి ఫిర్యాదు చేయమని పెట్టిన పిటీషనును నిరాకరించిన చెలాయింపబడవచ్చును. పై కోర్టు ఫిర్యాదు చేసినప్పుడు దానికి సె 476 నిబంధనలు వర్తించును.

అప్పీళ్లు.

సె 476 B. ఏమనిషి దాఖాస్తుపైనగాని యే సివిల్ రెవిన్యూ లేదా క్రిమినల్ కోర్టు సె 476, 476A క్రింద ఫిర్యాదు చేయుటకు నిరాకరించిన లేదా ఏ మనిషిపైనైనా ఫిర్యాదుచేసిన అట్టిమనిషి సె 195 (3) ప్రకారము అట్టి కోర్టుకు పై కోర్టుగా భావింపబడతగిన కోర్టుకు అప్పీలు చేసుకొనవచ్చును. అందుపైన ఆ పైకోర్టు సంబంధముగల పార్టీలకు నోటీసునిచ్చి ఆ యా సందర్భములను తగినట్లు ఫిర్యాదును ఉపసంహరించుటగాని, తానే క్రింది కోర్టు సె 476 క్రింద పంపవలసి యుండిన ఫిర్యాదును పంపుటగాని చేయవచ్చును. తానే ఫిర్యాదును పంపిన సదరు సెక్షను నిబంధనలు వర్తించును.

సె 195 (1) ఏ కోర్టున్నూ,

(b) ఇండియన్ పీనల్ కోడు సె 193, 194, 195, 196, 199 200, 205, 206, 207, 208, 209, 210, 211 మరియు 228. క్రింది నేరములను గురించిన ఫిర్యాదును అట్టి నేరము యేకోర్టులో లేదా యే

కోర్టుచర్యలకు సంబంధించి జరిగినదో, అట్టి కోర్టుయొక్క గాని ఆకోర్టు యేకోర్టుకు (తాబేదారు) క్రింది కోర్టుగా యుండునో అట్టి పై కోర్టు యొక్క గాని వ్రాతమూలకమైన ఫిర్యాదు యున్నగాని,

(c) ఇండియన్ పీనల్‌కోడు సె 463, 471, 475 లేక 476ల క్రింద నేరములు ఏ కోర్టు చర్యలోనైనా పార్టీగాయున్న వానిచే ఆ చర్యలలో దాఖలు చేయబడిగాని, సాక్ష్యములో దాఖలు చేయబడి గాని యున్న సందర్భములలో ఆ కోర్టుయొక్క లేదా ఆకోర్టు యేకోర్టుకు (తాబేదారు) క్రింది కోర్టుగా యుండునో అట్టి పై కోర్టుయొక్క వ్రాత మూలకమైన ఫిర్యాదుయున్నగాని విచారించకూడదు.

(2) 1వ సెక్షను (b) (c) క్లాజులలో కోర్టు అనేమాటలో సివిల్ రివెన్యూ, క్రిమినల్ కోర్టులు చేరును. గాని ఇండియన్ రిజిస్ట్రేషను ఆక్టు క్రింద నియమించబడిన రిజిస్ట్రారుగాని, సబ్ రిజిస్ట్రారుగాని చేరరు.

(3) ఈ సెక్షను కార్యముల నిమిత్తము ఒక కోర్టునుండి మరియొక కోర్టుకు అప్పీలు చేయతగిన డిక్రీలనుండి శిక్షలనుండి సాధారణముగా అప్పీలు చేయు హక్కు యున్నదో అట్టి కోర్టుకు మొదటకోర్టు క్రిందికోర్టుగా (తాబేదారు) యెంచబడును. లేదా సివిల్‌కోర్టు విషయములో దేని డిక్రీలనుండి అప్పీలు చేయుహక్కుయుండదో అట్టి సివిల్ కోర్టులున్న ప్రదేశములో సాధారణ అసలు సివిలు అధికారములను చెలాయించునో ఆకోర్టు పైకోర్టుగా యెంచబడును.

* * * *

(4) 1 వ సబ్ సెక్షనులో చెప్పబడిన నేరముల విషయముకు సంబంధించిన, నిబంధనలు, అట్టి నేరములకుమ్మక్కున్నూ, అట్టి నేరములు చేయుటకు పన్నుకుట్రలకు, ప్రయత్నములకూడ వర్తించును.

సె 195 (1) (B) (C) లో చెప్పబడిన ఇండియన్ పీనలుకోడు సెక్షనులు యీా దిగువ యివ్వబడినవి.

తప్పుసాక్ష్యమును గురించిన్ని న్యాయవిచారణకు విరోధముగా వుండే నేరముల గురించిన్ని.

తప్పుసాక్ష్యము చెప్పడము

191. న్యాయశాస్త్రరీత్యా ప్రమాణమువల్లగాని న్యాయశాస్త్రముతాలూకు స్పష్టమయిన నిబంధనలవల్ల గాని యథార్థము చెప్పేలాగున బద్ధుడై వుండి, లేక ఏ సంగతినిగురించియైనా కయిఫియ్యత్తు యిచ్చేలాగున న్యాయశాస్త్రమువల్ల బద్ధుడయివుండి అవాస్తవముగా వుండేటటువంటిన్ని, అవాస్తవముగావుండేటట్లు తానుఎరిగియుండే, లేక నమ్మే, లేక వాస్తవముగా వుండేటట్లు తాను నమ్మనటువంటిన్ని ఏదయినా కయిఫియత్తుయిచ్చేయే మనిషి అయినా, తప్పుసాక్ష్యము చెప్పినట్లు చెప్పబడుతున్నాడు.

వివరణము 1:— నోటిమాటలుగాగాని మరిఒక తరహానుగాని యివ్వబడ్డ కయిఫియ్యతు ఈ సెక్షనుయొక్క అర్థముక్రిందికి వస్తున్నది.

వివరణము 2:— సాక్ష్యముచెప్పే మనిషి, తనకు కలిగివుండే నమ్మకమునుగురించి యిచ్చే తప్పు కయిఫియ్యతు ఈ సెక్షనుయొక్క అర్థముక్రిందికి వస్తున్నది. ఒకమనిషి, తాను నమ్మకుండావుండేసంగతి తాను నమ్మినట్లు చెప్పడమువల్లనున్ను తానుఎరగనిసంగతి ఎరిగినట్లు చెప్పడమువల్లనున్ను తప్పుసాక్ష్యముచెప్పడము అనే నేరమునుగురించి నేరస్థుడు కావచ్చును.

దృష్టాంతములు.

(a) వెయ్యిరూపాయలకు "జడ్" అనే మనిషిమీద "బీ" అనే మనిషికి కలిగివుండే న్యాయమయిన దావాకు ఆధారముగా "బీ" అనే మనిషియొక్క దావా నిజమయినదని "జడ్" అనే మనిషి తాను వినగా ఒప్పుకొన్నట్టు "ఏ" అనే మనిషి విచారణకాలమందు ప్రమాణముమీద తప్పుసాక్ష్యము చెప్పుతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి, తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(b) "ఏ" అనే మనిషి, యథార్థము చెప్పేలాగున ప్రమాణమువల్ల బద్ధుడయివుండి "జడ్" అనే మనిషియొక్క దస్కతుగా వున్నట్టు తాను నమ్మకుండావుండే ఒకానొక దస్కతు "జడ్" అనే మనిషియొక్క దస్తూరిగావున్నట్టు తాను నమ్ముతున్నానని చెప్పుతున్నాడు - ఇందులో "ఏ" అనే మనిషి అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే సంగతి చెప్పినాడు గనుక తప్పు సాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు

(c) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషియొక్క సాధారణమయినదస్తూరి యెరిగివుండి ఒకానొక దస్కతుచూచి అది "జడ్" అనే మనిషియొక్క దస్తూరి అని

కృత్రిమము లేకుండా నమ్మి ఆ దస్తూరి "జడ్" అనే మనిషిదిగా వున్నట్టు తాను నమ్ముతున్నానని చెప్పుతున్నాడు-ఇందులో "ఏ" అనే మనిషి చెప్పినసంగతి అతను నమ్మే సంగతినిగురించి మాత్రము అయివుండి వాస్తవముగాకూడా వున్నదిగనుక ఆ దస్కతు "జడ్" అనే మనిషియొక్క దస్కతు కాకపోయినా "ఏ" అనే మనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడు కాడు.

(d) "ఏ" అనే మనిషి, యధార్థము చెప్పేలాగున ప్రమాణముమీద బద్ధుడయి వుండి యేమీయెరిగివుండకనే ఒకానొకస్థలమందు ఒకానొకగోజున "జడ్" అనేమనిషి వున్నట్టు తాను యెరుగుదునని చెప్పుతున్నాడు. "జడ్" అనే మనిషి, ఆ ప్రకారము చెప్పబడ్డ స్థలమందు ఆరోజున వున్నాసరే లేకపోయినాసరే "ఏ" అనేమనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(e) ద్విభాషిగా, లేక తర్జుమాచేసే మనిషిగావుండే "ఏ" అనే మనిషి యథార్థమయిన అర్థముగా లేక తర్జుమాగా వుందని, లేక వుండేటటు తాను నమ్మనిదాన్ని, యథార్థముగా అర్థము తెలియచేసేలాగున, లేక తర్జుమాచేసేలాగున ప్రమాణముమీద తాను బద్ధుడయివుండే వకకయిఫియ్యతుయొక్క, లేక దస్తావేజుయొక్క యథార్థమయిన అర్థముగా లేక తరుమాగా వుండేటట్టు చెప్పుతున్నాడు, లేక నిజపరుస్తాడు. ఇందులో "ఏ" అనే మనిషి తప్పుసాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

తప్పుసాక్ష్యము సృష్టిచెయ్యడము.

192. న్యాయ విచారణ సంబంధమయిన చర్యలో నయినా వుద్యోగ ధర్మమునుబట్టి న్యాయశాస్త్ర ప్రకారము ఒకవుద్యోగస్థునియెదుట లేక ఒకపంచాయతీదారుని యెదుట జరుగుతూవుండే చర్యలోనయినా సాక్ష్యముగా కనపడవలెననిగాని ఆప్రకారము సాక్ష్యముగా కనపడడమువల్ల యే మనిషిఅయితే అట్టి చర్యలో ఆ సాక్ష్యము మీద అభిప్రాయము యేర్పాటు చెయ్యవలసివున్నదో ఆమనిషి అట్టి చర్యయొక్క ఫయిసలాకు ముఖ్యముగావుండే యే అంశమునుగురించి అయినా తప్పు అభిప్రాయము పొందేలాగున చెయ్యవలెననిగాని యత్నించి యేదయినా సంగతిఉండేటట్టుచేస్తే, లేక ఏదయినాపుస్తకములో లేక గ్రంథములో తప్పు దాఖలుచేస్తే, లేక ఏదయినా తప్పుసంగతి కలిగివుండే దస్తావేజు సృష్టిచేస్తే, యే మనిషి యైనా, "తప్పు సాక్ష్యము సృష్టించినట్లు" చెప్పబడుతున్నాడు.

## దృష్టాంతములు.

(a) "ఏ" అనేమనిషి, "జడ్" అనేమనిషి తాలూకు పెట్టెలో కనపడేలాగున నున్ను అందువల్ల "జడ్" అనేమనిషిమీద చోరీనిగురించిన నేరస్థాపనచెయ్యబడేలాగు ననున్ను చెయ్యవలెననే యత్నముతోటి అతని పెట్టెలో కొన్ని ఆభరణములు వుంచుతున్నాడు- ఇందులో "ఏ"అనేమనిషి, తప్పుసాక్ష్యము సృష్టించినవాడవుతున్నాడు.

(b) "ఏ"అనేమనిషి, ఒక కోర్టు ఆఫ్ జస్టిసులో వుపబలముగావుండే సాక్ష్యముగా వుపయోగపరచడముకొరకు తన దుకాణపు లెక్కపుస్తకములో తప్పు దాఖలు చేస్తున్నాడు. "ఏ" అనే మనిషి, తప్పు సాక్ష్యము సృష్టించిన వాడవుతున్నాడు.

(c) "ఏ" అనేమనిషి నేరముగల కుట్రనుగురించి "జడ్" అనే మనిషిమీద నేరస్థాపన చేయించవలెననే యత్నముతో అట్టి నేరముగల కుట్రలో సహకారిఅయిన ఒక మనిషికి వ్రాసినట్టు అర్థమయ్యేలాగున "జడ్" అనే మనిషియొక్క దస్తూరీని అనుకరించే వక ఉత్తరము వ్రాసి ఆ వుత్తరము పోలీసు ఆఫీసర్లు సోదా చేస్తారని తాను యెరిగివుండే స్థలమందు వుంచుతున్నాడు. "ఏ" అనే మనిషి, తప్పు సాక్ష్యము సృష్టించిన వాడవుతున్నాడు.

తప్పు సాక్ష్యమునకు శిక్ష.

193. న్యాయవిచారణ సంబంధమైన ఒక చర్య యే దశలో వున్నపుడు అయినా మనఃపూర్వకముగా తప్పు సాక్ష్యముచెప్పే, లేక న్యాయవిచారణ సంబంధమైన ఒకచర్య యే దశలో వున్నప్పుడైనా అందులో వుపయోగ పరచబడగలందులకుగాను తప్పుసాక్ష్యము సృష్టించే యే మనిషైనా ఏడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమే కాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది. మరి యే యితర సంగతిలోనైనా మనఃపూర్వకముగా తప్పు సాక్ష్యముచెప్పే, లేక సృష్టించే యేమనిషైనా మూడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖైదువల్ల శిక్షించబడడమే కాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

వివరణము 1:—ఒక కోర్టుమార్షియల్ యెదుట జరిగేవిచారణ న్యాయవిచారణ సంబంధమైన చర్యగా వుంటున్నది.

వివరణము 2:— ఒక కోర్టు ఆఫ్ జస్టీసుయెదుట జరుగబొయ్యే చర్యకు ముందు న్యాయశాస్త్రమునల్ల ఆజ్ఞాపించబడ్డ విచారణ అనేది ఆ కోర్టు ఆఫ్ జస్టీసు యెదుట జరుగకపోయినా, న్యాయ విచారణ సంబంధమైన చర్యతాలూకు ఒక దశగా వుంటున్నది.

దృష్టాంతము.

"ఏ"అనే మనిషి, విచారణకుగాను "జడ్"అనే మనిషి పంపించబడవలసినదా లేదా అని నిర్ణయించగలందుకై వక మేజిస్ట్రీటుగారి యెదుట జరుగుతూవుండే విచారణలో ప్రమాణముమీద అవాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే వక కయిఫియ్యతు యిస్తున్నాడు. ఈ విచారణ అనేది, న్యాయవిచారణ సంబంధమయిన చర్య తాలూకు వక దశగావున్నందున "ఏ" అనే మనిషి తప్పు సాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

వివరణము 3:— న్యాయశాస్త్ర ప్రకారము ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారినల్ల ఆజ్ఞాపించబడేటువంటిన్నీ, ఒక కోర్టు ఆఫ్ జస్టీసువారి అధికారముక్రింద జరిపించబడేటువంటిన్నీ ఒక విచారణ, అది ఒకకోర్టు ఆఫ్ జస్టీసువారి యెదుట జరుగకపోయినప్పటికిన్నీ న్యాయ విచారణ సంబంధమైన ఒక చర్యతాలూకు దశగా వుంటున్నది.

దృష్టాంతము.

"ఏ" అనే మనిషి, వక పొలము తాలూకు సరిహద్దులు అక్కడనే నిశ్చయపరచగలందుకు గాను వక కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల అధికారము యిచ్చి పంపించబడ్డ వక ఆఫీసరు యెదుట జరిగే విచారణలో అవాస్తముగా వున్నట్టు తాను యెరిగివుండే సంగతి ప్రమాణముమీద చెప్పుతున్నాడు. ఈ విచారణ అనేది న్యాయవిచారణ సంబధమయిన చర్య తాలూకు వక దశగా వున్నందున "ఏ" అనే మనిషి తప్పు సాక్ష్యము చెప్పినవాడవుతున్నాడు.

(కాగ్నిజిబిల్ నేరముగాదు - వారంటు - జామీను కలదు. రాజీ లేదు. సెషన్ కోర్టువారుగాని, ప్రెసి. మేజి. గాని, 1వ క్లాసు మేజి. గాని విచారణ చేయవలెను.)

194. బ్రిటిషు ఇండియాయొక్క, లేక ఇంగ్లండుదేశపు న్యాయశాస్త్రమును బట్టి మరణదండనకు తగివుండేదేదైనా నేరమునుగురించి యే మనిషిమీదనైనా నేరస్థాపన అయ్యేటట్లు చెయ్యవలెనని యత్నించి, లేక అందువల్ల నేరస్థాపనకావచ్చునని యెరిగివుండి తప్పు సాక్ష్యముచెప్పే, లేక సృష్టించే యే మనిషి అయినా యావజ్జీవము ద్వీపాంతర వాసము వల్లగాని పది సంవత్సరములకు వ్యాపించ గూడ్డిన కాలము వరకు కఠినమైన ఖైదు వల్లగాని శిక్షించబడటమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడుకావలసినది. మరిన్ని అట్టి తప్పు సాక్ష్యమువల్ల నిర్దోషియైన ఒక మనిషిమీద నేరస్థాపన చెయ్యబడి మరణదండన జరిగించబడివున్న పక్షమును అట్టి తప్పుసాక్ష్యము చెప్పిన మనిషి, మరణమువల్లగాని యిందులో యింతకుముందు నిర్ణయించబడ్డ శిక్షవల్లగాని శిక్షించబడవలసినది.

మరణదండనకు తగివుండే ఒక నేరమును గురించిన నేరస్థాపన కలగచెయ్యవలెననే యత్నముతో తప్పు సాక్ష్యము చెప్పడము. లేక సృష్టించడము.

అందువల్ల నిర్దోషి అయిన ఒక మనిషిమీద నేరస్థాపన చెయ్యబడి మరణ దండన జరిగించబడివున్న పక్షమునకు

(కాగ్నిజిబిల్ నేరము కాదు. వారంటు. జామీను లేదు. రాజీ లేదు. సెషన్ కోర్టు విచారణ.)

195. బ్రిటిషు ఇండియాయొక్క, లేక ఇంగ్లండుదేశపు న్యాయశాస్త్రమును బట్టి మరణదండన కానటువంటిన్నీ యావజ్జీవము ద్వీపాంతర వాసము వల్లగాని యేడు సంవత్సరములవరకు, లేక అంతకంటే యెక్కువ కాలమువరకు ఖయిదు వల్లగాని శిక్షించబడతగినటువంటిన్నీ యేదయినా నేరమును గురించి యే మనిషిమీదనయినా నేరస్థాపన అయ్యేటట్లు చెయ్యవలెనని యత్నించి, లేక అట్లా నేరస్థాపన కావచ్చునని యెరిగివుండి తప్పు సాక్ష్యము చెప్పే, లేక సృష్టించే యే మనిషిఅయినా, ఆ నేరమునుగురించి నేరస్థాపన చెయ్యబడ్డ మనిషి యేశిక్షకు అర్హుడవుతున్నాడో అదేశిక్ష పొందవలసినది.

ద్వీపాంతర వాసము వల్లగాని ఖైదు వల్లగాని శిక్షించబడతగ్గ నేరమునుగురించి నేరస్థాపన కలగ చెయ్యవలెననే యత్నముతో తప్పుసాక్ష్యము చెప్పడము లేక సృష్టించడము

దృష్టాంతము.

"ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషిమీద బందిపోటును గురించిన నేరస్థాపనఅర్యేటట్టు చెయ్యవలెనని యత్నించి ఒక కోర్టు ఆఫ్ జస్టీసుయెదుట తప్పు సాక్ష్యము చెప్పుతున్నాడు. బందిపోటును గురించిన నేరముకుగాను యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని, జుల్మానాతోటి, లేక జుల్మానా లేకుండా పది సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు కఠినమయిన ఖయిదువల్లగాని శిక్షించబడవలసి వుంటున్నది. గనుక "ఏ" అనే మనిషి, ఆ ప్రకారము, ద్వీపాంతరవాసముకుగాని జుల్మానాతోటి, లేక జుల్మానా లేకుండా ఖయిదుకుగాని పాత్రుడవుతున్నాడు.

(కాగ్నిజిబిల్ నేరము కాదు. వారంటు, జామీను లేదు. రాజీ లేదు. సెషన్ కోర్టు విచారణ.)

అవాస్తవముగా వున్నట్టు యెరిగివుండే సాక్ష్యము వుపయోగపరచడము.

196. అవాస్తవముగాగాని సృష్టించబడ్డదిగాగాని వున్నట్టు తాను యెరిగివుండే యే సాక్ష్యమునయినా యథార్థమయిన, లేక అకల్పితమయిన సాక్ష్యముక్రింద దురాగతముగా వుపయోగపరచే లేక వుపయోగపరచవలెనని యత్నించే యే మనిషిఅయినా, తాను తప్పు సాక్ష్యము చెప్పివుంటే, లేక సృష్టించివుంటే యెలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

(కాగ్నిజిబిల్ నేరముకాదు - వారంటు - తప్పు సాక్ష్యము చెప్పడము అనే నేరము ఏలాగో అలాగే జామీనుకలదు. లేదని చెప్పవలెను - రాజీ లేదు - సెషన్ కోర్టువారు, ప్రెపి. మేజి. లేక, 1-వ క్లాసు మేజి. విచారించవచ్చును.)

న్యాయశాస్త్రమును పట్టి సాక్ష్యముగా పుచ్చుకోబడగూడిన యే కయిఫీయ్యత్తులోనయినా వ్రాయబడ్డ తప్పు సంగతి.

199. ఏదైనా కోర్టు ఆఫ్ జస్టీసువారు, పబ్లికు ఉద్యోగస్థులు, లేక ఇతర మనిషి యేదయినా సంగతిని గురించి సాక్ష్యముగా పుచ్చుకొనేలాగున న్యాయశాస్త్రమునుపట్టి బద్ధులయి లేక అధికారము కలుగచెయ్యబడివుండే టటువంటివిన్ని తనవల్లయివ్వబడ్డ, లేక దస్కతు చెయ్యబడ్డటువంటివిన్ని యేకయిఫీయ్యతులోనైనా దేన్నిగురించి ఆ కయిఫీయ్యతు యివ్వబడ్డదో, లేక వుపయోగపరచబడ్డదో అట్టి వుద్దేశమునకు ముఖ్యముగావుండే యేదయినా అంశమును గురించి అవాస్తవముగా వుండే

టటువంటిన్ని అవాస్తవముగావున్నట్లు తాను యెరిగివుండే లేక నమ్మే టటువంటిన్ని, యథార్థముగా వున్నట్లు తాను నమ్మనటువంటిన్ని ఏదైనా సంగతి నమోదుచేసే ఏ మనిషియైనా తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

(కాగ్నిజిబిల్ నేరము కాదు - వారెంటు - జామీను కలదు - రాజీ లేదు - సెషన్ కోర్టువారు, ప్రెసిడెన్సి మేజి. లేక 1-వ క్లాసు మేజి. విచారించవలెను.)

వాస్తవముగా వున్నట్టు తాను యెరిగివుండే అట్టి యే కయిఫియ్యతుఅయినా వాస్తవముగావున్నట్టు ఉపయోగపరచడము.

200. ఏదైనా ముఖ్యమైన అంశమందు అవాస్తవముగా వున్నట్లు తాను యెరిగివుండే యేదైనా అట్టి కయిఫియ్యతు వాస్తవముగా వున్నట్లు దురాగతముగా వుపయోగపరచే, లేక వుపయోగపరచవలెనని యత్నించే యే మనిషియైనా తాను తప్పుసాక్ష్యము చెప్పివుంటే ఏలాగో అలాగే శిక్షింపబడవలసినది.

వివరణము:-ఏదో ఒక క్రమలోపమునేకారణమునుపట్టిమాత్రము సాక్ష్యముగా అంగీకరించబడగూడనిదిగావుండే ఒకకయిఫియ్యతు, 199 200 సెక్షన్లయొక్క అర్థమందలి కయిఫియ్యతుగా వుంటున్నది.

(కాగ్నిజిబిల్ నేరముకాదు - వారంటు - జామీను కలదు - రాజీ లేదు - సెషన్ కోర్టువారు, ప్రెసి. మేజి. లేక 1-వ క్లాసు మేజి. విచారించవలెను.)

ఒక వ్యాజ్యములో ఏదైనా కార్యమును గురించిగాని చర్యనుగురించిగాని ఒక మనిషికి ప్రత్యామ్నాయము మాయగా ప్రవర్తించడము.

205. మరిఒకమనిషికి ప్రత్యామ్నాయము మాయగా ప్రవర్తించి అట్టి మాయ మనిషిగా యేదైనా వ్యాజ్యములో, లేక ఒక క్రిమినల్ విచారణలో యేదైనా ఎకరారుచేసే లేక కయిఫియ్యతు యిచ్చే, లేక సంగతి ఒప్పుకొనే లేక ఏదైనా చర్య సాదరయ్యేటట్టు చేసే, లేక తానే హామీపడే లేక పూటపడే, లేక మరిఏదైనా కార్యముజరిగించే ఏ మనిషి అయినా, మూడు సంవత్సరములకు వ్యాపించ కూడిన

కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని, జుల్మానా వల్లగాని యీ రెంటి వల్లగాని శిక్షింపబడ వలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—వారంటు—జామీను కలదు—రాజీలేదు—సెషన్‌కోర్టువారు, ప్రెసిడెన్సి మేజి. లేక 1-వ క్లాసు మేజి. విచారించవలెను.]

దండుగక్రింద పుచ్చుకోబడకుండాగాని తీర్పు అమలులోకి తేబడకుండా గాని ఆస్తి దగా మీద మరివక చోటికి తీసికొని వెళ్లడము, లేక దాచడము.

206. కోర్టు ఆఫ్ జస్టిస్‌వారివల్ల లేక యుక్తమైన యితర అధికారస్థునివల్ల విధించబడ్డ, లేక విధించబడబోతున్నదని తాను యెరిగివుండే తీర్పుక్రింద దండుగగాగాని, జుల్మానాకు చెల్లుగాగాని పుచ్చుకోబడకుండా, లేక ఒకసివిల్ వ్యాజ్యములో కోర్టుఆఫ్ జజస్టీసువారివల్ల చెయ్యబడ్డ లేక చెయ్యబడ పోతున్నదని తాను యెరిగివుండే ఒకతీర్పుక్రింద, లేక హుకుముక్రింద అమలులోకి తేబడకుండా ఆపవలెనని యత్నించే ఏదయినా ఆస్తి, లేక అందులో కలిగే ఏదైనా హక్కు దగాగా మరి ఒకస్థలముకు తీసుకొనివెళ్ళే, దాచే, మరియొకమనిషి పరముచేసే లేక అప్పగింతపెట్టే యే మనిషియైనా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్ల గాని, జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించ బడవలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—వారంటు—జామీనుకలదు—రాజీలేదు.—ప్రెసి. మేజి. గాని, 1-వ, లేక 2-వ క్లాజు మేజి. గాని విచారించవచ్చును.

దండుగకింద పుచ్చుకోబడకుండాగాని తీర్పు అమలులోకి తేబడకుండా గాని ఆపడము కొరకు ఆస్తిని గురించి దగా దావా చెయ్యడము.

207. ఒక కోర్టుఆఫ్ జస్టీసువారివల్ల, లేక యుక్తమయిన ఇతర అధికారస్థుని వల్ల, విధించబడ్డ, లేక విధించబడబోతున్నది. అని తాను ఎరిగివుండే తీర్పుక్రింద దండుగాగాని జుల్మానాకు చెల్లుగాగాని ఒక సివిల్ వ్యాజ్యములో కోర్టు ఆఫ్ జస్టీసువారివల్ల చెయ్యబడ్డ, లేక చెయ్యబడబోతున్నదని తాను యెరిగివుండే ఒక తీర్పుక్రింద, లేక హుకుముక్రింద అమలులోకి తేబడకుండా ఆపవలెనని యత్నించి యేదయినా ఆస్తికి

లేక అందులో కలిగే యేదైనా హక్కుకు తనకు బాధ్యతగాని న్యాయమైన యేదైనా దావాగాని లేదని యెరిగివుండి అట్టి ఆస్తి లేక అందులో కలిగే యేదైనా హక్కు దగాగా అంగీకరించే, పుచ్చుకొనే, లేక దావా చేసే, లేక యేదైనా ఆస్తియొక్క బాధ్యతను గురించి, లేక అందులో కలిగే హక్కును గురించి యేదైనా మోసము చేసే యే మనిషియైనా, రెండు సంవత్సరములకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని, జుల్మానా వల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—వారంటు—జామీనుకలదు—రాజీలేదు — ప్రెసిడెన్సీ మేజి. గాని 1-వ, లేక 2-వ క్లాసు మేజి. గాని విచారించవచ్చును.]

బాకీలేని మొత్తమును గురించి ఒక తీర్పు చెయ్యబడే లాగున దగాగా వప్పడము.

208. ఏ మనిషివల్లనైనా తేబడే వ్యాజ్యములో తాను బాకీలేని మొత్తముకుగాని అట్టి మనిషికి బాకీవుండేటంతకంటె, ఎక్కువ మొత్తముకుగాని అట్టి మనిషికి హక్కులేని యేదైనా ఆస్తికి, లేక ఆస్తిలో హక్కుగాని ఒక తీర్పు, లేక హుకుమే, తనమీద చెయ్యబడేలాగున దగాగా జరిగించే, లేక వప్పే లేక ఒకతీర్పుకుగాను, లేక హుకుముకుగాను పూరాగా చెల్లుయిచ్చిన తర్వాతగాని, యే వస్తువునుగురించి పూరా చెల్లు యివ్వబడ్డదో అట్టి వస్తువును గురించిగాని తనమీద ఆతీర్పు లేక హుకుము అమలులోకి తేబడేలాగున దగాగా జరిగించే లేక వప్పే యే మనిషియైనా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదు వల్లగాని, జుల్మానా వల్లగాని యీ రెంటి వల్లగాని శిక్షించబడవలసినవి.

## దృష్టాంతము.

"ఏ" అనేమనిషి, "జడ్" అనే మనిషి మీద వ్యాజ్యము దాఖలు చేస్తున్నాడు. "ఏ" అనేమనిషి తనమీద తీర్పుపొందబోతున్నాడని "జడ్" అనేమనిషియెరిగివుండిన "బి" అనేమనిషి తనకొరకుగాని "జడ్" అనేమనిషి యొక్క ప్రయోజనముకొరకుగాని "ఏ" అనేమనిషి పొందేతీర్పుక్రింద విక్రయించబడే "జడ్" అనేమనిషి తాలూకుఆస్తి

యొక్క విక్రయమువల్ల వచ్చే సొమ్ములో కొంత పుచ్చుకోవలెనని తనమీద న్యాయమయిన దావాలేని "బి" అనేమనిషియొక్క వ్యాజ్యములో అంతకంటె గొప్ప మొత్తమునకు తీర్పు జరిగించబడేలాగున దగాగా వప్పుకున్నాడు-"జడ్" అనేమనిషి, యీ సెక్షను ప్రకారము నేరము జరిగించినవాడవుతున్నాడు.

[కాగ్నిజిబిల్ నేరము కాదు—వారంటు—జామీను కలదు—రాజీలేదు—ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగాని, 1 వ క్లాజు మేజిస్ట్రేటుగాని విచారించవలెను.]

ఒక కోర్టు ఆఫ్ జస్టీసులో అయోగ్యముగా అవాస్తవమయిన దావా చెయ్యడము.

209. దగాగా, లేక అయోగ్యముగా, లేక యెవరికైనా హాని చెయ్యవలెననే, లేక బాధ కలగ చెయ్యవలెననే, యత్నముతో అవాస్తవముగా వుండేటట్టు తాను యెరిగివుండే యేదైనా దావా ఒక కోర్టు ఆఫ్ జస్టీసులో తెచ్చే యే మనిషియైనా రెండుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకు కూడా పాత్రుడు కావలసినది.

(కాగ్నిజిబిల్ నేరముగాదు - వారంటు - జామీను కలదు. రాజీ లేదు. ప్రెసి. మేజి. గాని, 1వ క్లాసు మేజి. గాని విచారించవలెను.]

బాకీలేకుండా వుండే మొత్తముకు దగాగా తీర్పు పొందడము.

210. బాకీలేనిమొత్తమునకుగాని బాకీవుండేటంతకంటే యెక్కువమొత్తమునకుగాని తనకు హక్కులేని ఏదైనా ఆస్తికి, లేక ఆస్తిలో హక్కునకు గాని యే మనిషిమీదనైనా ఒకతీర్పు, లేక హుకుము దగాగా పొందే, లేక తీర్పునకు, లేక హుకుమునకు చెల్లుయిచ్చిన తర్వాతగాని యే వస్తువుగురించి అట్లా చెల్లుయివ్వబడ్డదో అట్టి వస్తువునుగురించిగాని ఏ మనిషిమీదనైనా తీర్పు, లేక హుకుము అమలులోకి తేబడేలాగున దగాగాజరిగించే, లేక తన పేరట యేదైనా అట్టికార్యము జరిగించబడేలాగున దగాగావప్పే, లేక అంగీకరించే ఏ మనిషియైనా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—వారంటు—జామీను కలదు—రాజీలేదు—ప్రెసిడెన్సీ మేజి. గాని, 1వ క్లాసు, మేజి. గాని విచారించవలెను.]

హాని కలుగచెయ్యవలెననే యత్నముతో యేదైనా నేరమును గురించి అవాస్తవమైన ఫిర్యాదు చెయ్యడము.

211. ఏ మనిషికైనా హాని కలుగచెయ్యవలెనని యత్నించి ఆ మనిషిమీద ఏదైనా క్రిమినల్ సంబంధమైన చర్య, లేక ఫిర్యాదు తేవడమునకు న్యాయమయిన, లేక న్యాయశాస్త్ర సమ్మతమైన కారణము లేదని యెరిగివుండి, అతని మీద యేదయినా క్రిమినల్ చర్య తెచ్చే, లేక తెచ్చేటట్లు చేసే, లేక ఒక నేరముజరిగించినట్లు అవాస్తవమైన ఫిర్యాదు చేసే ఏ మనిషి అయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని, జుల్మానావల్లగాని ఈరెంటివల్లగాని శిక్షించబడవలసినది; మరిన్ని మరణమువల్లగాని, యావజ్జీవము ద్వీపాంతరవాసమువల్లగాని ఏడు సంవత్సరములకు లేక యెక్కువ కాలమువరకు ఖైదువల్లగాని శిక్షించబడతగ్గ నేరమును గురించి అవాస్తవమైన ఫిర్యాదు మీద అట్టి క్రిమినల్ చర్య తేబడి వున్నపక్షమునకు ఏడుసంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్ల శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—వారంటు—జామీను కలదు—రాజీలేదు—ప్రెసి. మేజి. గాని 1-వ క్లాసు మేజి. గాని విచారించవచ్చును. మోపబడిన నేరము 7 సం॥లకు గాని ఎక్కువ కాలమువరకుగాని ఖయిదువల్ల శిక్షింపబడ తగినదిగా వున్న యెడల, సెషన్‌కోర్టువారివల్లగాని, ప్రెసి. మేజి. వల్లగాని, 1-వ క్లాసు మేజి. వల్లగాని విచారింపబడవచ్చును. మోపబడిన నేరము మరణదండన వగైరాలవల్ల శిక్షించబడతగ్గదైన యెడల, సెషన్‌కోర్టువారు మాత్రమే విచారించవచ్చును.]

న్యాయవిచారణ సంబంధమైనచర్య తాలూకు యేదశలోనయినా పనిజరిగిస్తూవుండే ఒక పబ్లిక్ వుద్యోగస్థుణ్ణి మనఃపూర్వకముగా తిరస్కరించడము లేక ఆటంకపెట్టడము.

228. ఒక పబ్లిక్ ఉద్యోగస్థుడు న్యాయవిచారణ సంబంధమైన చర్య తాలూకు యే దశలో నయినా పని జరిగిస్తూ వుండేటప్పుడు అతన్ని మనఃపూర్వకముగా తిరస్కరించే, లేక ఆటంకపెట్టే యే మనిషి యైనా, ఆరు మాసములకు వ్యాపించ గూడిన కాలమువరకు సాధారణమైన ఖైదు వల్లగాని, వెయ్యి రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది.

[కాగ్నిజిబిల్ నేరముకాదు—సమను—జామీను కలదు—రాజీ కూడదు—ఏకోర్టులో నేరము జరిగించబడినదో ఆ కోర్టువారివల్ల క్రి. ప్రొ. కోడ్ 35-వ చాప్టరులో గల విషయములకు లోబడి విచారణ చేయబడవచ్చును. చూడు క్రి.ప్రొ.కో. 480 సె.]

దస్తావేజులతోటిన్ని, వర్తకులు వాడే గుర్తులతోటిన్ని వస్తువుల ఖామందు వేసికొనే గుర్తులతోటిన్ని యిలాకాగల నేరములనుగురించి.

తప్పు సృష్టి

463. లోకులకు, లేక యేమనిషికియైనా నష్టము, లేక చెరుపు జరిగించవలెననే, లేక యేదైనా దావాకు లేక హక్కుకు ఆధారము కలుగ చెయ్యవలెననే, లేక ఏమనిషి యైనా ఆస్తి వదలిపెట్టేటట్టు చెయ్యవలెననే లేక స్పష్టముగా గాని, భావద్యోతకముగా గాని జట్టీలో ప్రవేశించేలాగున చెయ్యవలెననే యత్నముతోటిగాని, దగా జరిగించవలెననే, లేక దగా జరిగించబడవలెననే యత్నముతోటిగాని, ఒక తప్పు దస్తావేజు, లేక దస్తావేజులో యేదైనా భాగము సృష్టించే యే మనిషి యైనా, తప్పు సృష్టి చేసినవాడు అవుతున్నాడు.

తప్పు దస్తావేజు. సృష్టించడము.

464. ఈక్రింద చెప్పబడే మనుష్యులు తప్పుదస్తావేజు సృష్టించినట్టు చెప్పబడుతున్నారు.—వారు యెవరంటే:—

మొదటిది:—ఒకదస్తావేజు తాలూకు భాగముగాని యెవరివల్ల లేక యెవరియొక్క అధికారముమీద వ్రాయబడ లేదు. దస్కతు చెయ్యబడలేదు. మొహరు చెయ్యబడ లేదు. లేక వ్రాసి యివ్వబడ లేదు. అని తాను యెరిగియున్నాడో అట్టి ఒక మనిషివల్ల, లేక అతని అధికారముమీదగాని అది వ్రాయబడలేదు. దస్కతు చెయ్యబడ లేదు. మొహరు చెయ్యబడలేదు. లేక వ్రాసియివ్వబడలేదు అని తాను ఎరిగి వుండే కాలమందుగాని, అట్టి దస్తావేజు తాలూకు భాగము వ్రాయ బడ్డది, దస్కతు చెయ్యబడ్డది, మొహరు చెయ్యబడ్డది, లేక వ్రాసి యివ్వబడ్డది అని నమ్మేలాగున చెయ్యవలెననే ప్రద్దేశముతో ఒక దస్తా వేజు, లేక దస్తావేజు తాలూకు భాగము అయోగ్యముగా, లేక దగాగా వ్రాసే దస్కతుచేసే, మొహరుచేసే, లేక వ్రాసియిచ్చే, లేక ఒక దస్తావేజు వ్రాసియివ్వబడ్డట్టు సూచించే యేదైనా గుర్తు కలుగ చేసే మనిషి, లేక

రెండోది:— ఒకదస్తావేజు, తనవల్లగాని మరియొక మనిషివల్ల. గాని వ్రాయబడ్డ తర్వాత లేక వ్రాసి యివ్వబడ్డ తర్వాత దిద్దే కాల మందు ఆ మరి ఒక మనిషి జీవించివున్నాసరే, చనిపోయివున్నాసరే న్యాయశాస్త్రసమ్మతమైన అధికారము లేకుండా అయోగ్యముగా, లేక దగామీద రద్దుచెయ్యడమువల్లగాని, మరిఒక తరహాగాగాని ఆ దస్తా వేజును ముఖ్యమైన ఒక అంశముగో దిద్దే మనిషి, లేక

మూడోది:— చిత్తభ్రమ, లేక మత్తు, వీటివల్ల గాని యేద యినా దగావల్లగాని దస్తావేజులో వ్రాయబడి వుండే సంగతులు లేక దిష్టుబాటు, యిటువంటివి అని యెరగని మనిషిగావున్నట్టు తెలిసివుండి అయోగ్యముగా, లేక దగాగా ఆ దస్తావేజుమీద అతడు దస్కతుచేసే లాగున, మోహరు చేసేలాగున, దాన్ని వ్రాసియిచ్చేలాగున, లేక దిద్దేలాగున చేసేమనిషి.

## దృష్టాంతములు.

(a) "ఏ" అనే మనిషివద్ద, "బీ" అనే మనిషిమీదికి 100,000 రూపాయీలకు "జడ్" అనే మనిషివల్ల వ్రాయబడ్డ ఒక హుండివున్నది. "ఏ" అనేమనిషి, 10,000 రూపాయీలు అనే అంకెలకు ఒక సున్న యెక్కువచేసి ఆ హుండి "జడ్" అనే మనిషి అట్లా వ్రాసినట్టు "బీ" అనే మనిషిని నమ్మించవలెనని యత్నించి ఆ మొబల్లగు 100,000 రూపాయీలు చేస్తున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(b) "ఏ" అనేమనిషి, "జడ్" అనే మనిషి తాలూకు భూస్థితి "బీ" అనే మనిషికి విక్రయించి అందువల్ల ఆవిక్రయ ప్రుపయికము "బీ" అనే మనిషివద్ద పుచ్చుకోవలెననే యత్నముతో "జడ్" అనే మనిషివల్ల తనకు ఆ స్థితి యిచ్చివెయ్యబడ్డట్టు అగుపయ్యే ఒక దస్తావేజుకు "జడ్" అనే మనిషియొక్క ముహరు అతని అధికారము లేకుండా వేస్తున్నాడు-ఇందులో "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(c) పట్టుకొనివచ్చే మనిషికి పయికము చెల్లించవలసినదటువంటిన్ని "బీ" అనే మనిషివల్ల దస్కతు చెయ్యబడ్డటువంటిన్ని ఒక హుండీ "ఏ" అనే మనిషికి దొరుకుతున్నది-ఆహుండీలో యే మొబల్లగున్ను నమోదు చెయ్యబడి వుండలేదు - అందులో "ఏ" అనేమనిషి, పదివేల రూపాయీల మొబల్లగు వ్రాసి అందువల్ల దగాగా ఆ హుండీలో అంకెలు భర్తీచేస్తున్నాడు- ఇందులో "ఏ" అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(d) "ఏ" అనేమనిషి చెల్లించబడవలసిన మొబల్లగు వ్రాయకుండా తనవల్ల దస్కతు చెయ్యబడ్డ ఒక హుండీ తన గుమాస్తా అయిన "బీ" అనే మనిషివద్ద యిచ్చి కొంతమందికి పయికము ఇయ్యగలందుకయి పదివేల రూపాయలకు మించని మొబల్లగు అందులో వ్రాసి ఆ హుండీ భర్తీ చేసేలాగున "బీ" అనేమనిషికి అధికారము కలుగ చేస్తున్నాడు. - "బీ" అనేమనిషి, యిరవయివేల రూపాయీల మొబల్లగు దగాగా వ్రాస్తున్నాడు-ఇందులో "బీ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(e) "ఏ" అనే మనిషి-హుండీ వాయిదాకాలము వచ్చినప్పుడు అందుల మొబల్లగు చెల్లించి వెయ్యవలెనన్ని సాహుకారు వద్దకి తీసికొనివెళ్ళి తోపుడుయిచ్చి మంచి హుండీక్రింద పయికము పుచ్చుకోవలెనన్ని వుద్దేశించి "బీ" అనేమనిషియొక్క అధికారము లేకుండా తన పేరట అతడు వ్రాసినట్టు ఒక హుండీ వ్రాస్తున్నాడు-ఇందులో "బీ" అనే మనిషియొక్క జామీను తనకు వుండినట్టు ఆ సాహుకారును నమ్మించి ఆ పయికము దగాచేసి పుచ్చుకోవలెననే యత్నముతో ఆ హుండీ వ్రాసినందున "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(f) "జడ్" అనేమనిషియొక్క మరణశాసనములో "శేషించివుండే నాదరో బస్తు ఆ స్తి "ఏ" అనే మనిషికిన్ని "బీ" అనే మనిషికిన్ని "సీ" అనే మనిషికిన్ని సమానముగా పంచిపెట్టబడ వలసినది అని నేను నిర్ణయించినాను," అనే మాటలున్న వి- "ఏ" అనే మనిషి యావదాస్తి తనకున్ను, "సీ" అనే మనిషికిన్ని వుంచబడ్డట్టు నమ్మించవలెనని యత్నించి "బీ" అనే మనిషియొక్క పేరు అయోగ్యముగా గీచి వేస్తున్నాడు-ఇందులో "ఏ" అనే మనిషి, తప్పు సృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(g) "ఏ" అనే మనిషి, ఒక గవర్నమెంటు పత్రముమీద "జడ్" అనే మనిషికిగాని అతని సెలవుపొందినవారికి గాని చెల్లించవలసినది అనే మాటలు వ్రాసి ఆ ఎండార్సుమెంటుమీద దస్కతు చెయ్యడమువల్ల "జడ్" అనే మనిషినిగాని అతని సెలవుపొందిన వారికి గాని చెల్లించబడేలాగున చేస్తున్నాడు. "బీ" అనే మనిషి, "జడ్" అనే మనిషికిగాని అతని సెలవుపొందినవారికి గాని చెల్లించవలసిన" అనే మాటలు అయోగ్యముగా గీచివేసి అందువల్ల విశేషమయిన ఎండార్సుమెంటునుపట్టి ఎండార్సుమెంటుగా చేస్తున్నాడు. అందులో "బి" అనే మనిషి, తప్పు సృష్టి చేసిన వాడు అవుతున్నాడు.

(h) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషికి ఒక భూస్థితి విక్రయించి అందుకు ఒక విక్రయపత్రము వ్రాసి యిస్తున్నాడు - "ఏ" అనే మనిషి, ఆదరిమిలాను ఆస్థితి "జడ్" అనే మనిషికి లేకుండా చెయ్యగలందులకయి అంతకుముందు అది "బీ" అనే మనిషికి విక్రయించబడి వున్నట్టు నమ్మించవలెనని యత్నించి "జడ్" అనే మనిషికి తాను సాధనము వ్రాసి యిచ్చిన తారీఖుకంటె ఆరు మాసములకుముందు తారీఖువేసి "బి" అనేమనిషి అదేస్థితిని గురించి ఒక సాధనము వ్రాసి యిస్తున్నాడు - ఇందులో "ఏ" అనేమనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(i) "జడ్" అనేమనిషి, తన మరణశాసనము "ఏ" అనే మనిషిచేత చెప్పి వ్రాయిస్తున్నాడు - "ఏ" అనేమనిషి, "జడ్" అనేమనిషివల్ల చెప్పబడ్డ ఆస్తి పొంద వలసిన మనిషికి బదలాగా ఆ ఆస్తి పొందేలాగున మరిఒకమనిషియొక్క పేరు మనః పూర్వకముగా అందులో వ్రాసి "జడ్" అనే మనిషియొక్క హుకుము ప్రకారము ఆ మరణశాసనము తాను తయారుచేసినట్టు అతనితో చెప్పి ఆ "జడ్" అనే మనిషి ఆ మరణశాసనముమీద దస్కతు చేసేలాగున చేస్తున్నాడు - ఇందులో "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(j) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషివద్దనున్న యితర మనుష్యుల వద్దనున్న బిక్షము యెత్తుకోవలెనని యత్నించి "ఏ" అనే మనిషి యోగ్యుడనిన్ని గ్రహచారవశాత్తు సంభవించిన శ్రమకరమయిన స్థితిలో వున్నాడనిన్ని" రూఢిగా తెలియచేసే ఒక వుత్తరము వ్రాసి "బీ" అనే మనిషియొక్క సెలవు లేకుండా

దానిమీద "బీ" అనే మనిషి పేరున సంతకము చేస్తున్నాడు. ఇందులో "ఏ"అనే మనిషి, "జడ్"అనే మనిషి తన సొమ్ము యిచ్చేటట్టు చెయ్యడము కొరకు తప్పు దస్తావేజు కలుగచేసినందున "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(k) "ఏ"అనేమనిషి "జడ్"అనే మనిషివద్ద వుద్యోగము పొందవలెనని యత్నించి "ఏ" అనే మనిషియొక్క యోగ్యత మంచిది అని తెలియచేసే ఒక వుత్తరము వ్రాసి "బీ" అనేమనిషియొక్క సెలవులేకుండా దానిమీద ఆ "బీ" అనే మనిషియొక్క పేరున దస్కతు చేస్తున్నాడు. ఇందులో తప్పుసృష్టి చెయ్యబడ్డ యోగ్యతా పత్రిక ద్వారా "జడ్" అనేమనిషిని దగా చెయ్యవలెనని‌న్ని అందువల్ల స్పష్టముగా తెలియచెయ్యబడ్డ, లేక భావద్యోతకమయ్యే వుద్యోగమును గురించిన ఖరారు "జడ్" అనే మనిషి కుదుర్చుకొనేలాగున చెయ్యవలెననిన్ని యత్నించినందున "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

వివరణము ౧:— ఒకమనిషి, తనపేరున దస్కతుచెయ్యడము కొన్ని సంగతులలో తప్పు సృష్టి అనే నేరము కావచ్చును.

దృష్టాంతము.

(a) "ఏ" అనే మనిషి, అదే పేరుగల మరిఒక మనిషివల్ల వ్రాయబడ్డట్టు నమ్మబడవలెనని యత్నించి బిల్ ఆఫ్ ఎక్స్చేంజ్ అనే ఒక పత్రముమీద తన పేరున దస్కతు చేస్తున్నాడు:- ఇందులో "ఏ" అనే మనిషి, తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(b) "ఏ" మనిషి, ఒక కట్టి కాగితముమీద "సహీ చెయ్యబడ్డది" అనేమాటలు వ్రాసి "జడ్" అనేమనిషి పేరున దస్కతు చేస్తున్నాడు. ఈ దస్కతు చెయ్యడములో అతని వుద్దేశము, ఆ కాగితముపయిని "జడ్" అనేమనిషిమీద "బీ"అనేమనిషి వ్రాసినట్టు ఒక బిల్ ఆఫ్ ఎక్స్చేంజ్ అనేపత్రము వ్రాసి అది "జడ్" అనేమనిషివల్ల సహీ చెయ్యబడ్డట్టు చెలాయించవలెనని వుంటూవచ్చినది. ఇందులో "ఏ" అనేమనిషి, తప్పుసృష్టిని గురించి నేరస్థుడుగా వుంటున్నాడు. మరిన్ని "బీ" అనేమనిషి, యీసంగతులు యెరిగివుండి "ఏ" అనే మనిషియొక్క యత్నమును అనుసరించి ఆ కాగితముమీద హుండీ వ్రాసినపక్షముకు "బీ"అనేమనిషికూడా తప్పుసృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(c) "ఏ" అనే మనిషికి, అదే పేరుగల మరిఒక మనిషియొక్క వుత్తరువుకు చెల్లించబడవలసిన ఒక బిల్ ఆఫ్ ఎక్స్చేంజ్ అనేపత్రము దొరుకుతున్నది. "ఏ" అనే మనిషి, యెవరివుత్తరువుకు అయితే అది చెల్లించబడవలసినదో ఆ మనిషివల్ల అది ఎండార్సు చెయ్యబడ్డట్టు నమ్మించవలెనని యత్నించి తనపేరును ఆ బిల్లుమీద ఎండార్సు చేసుకొంటున్నాడు. ఇందులో "ఏ"అనేమనిషి, తప్పుసృష్టిచేసినవాడు అవుతున్నాడు.

(d) "ఏ" అనేమనిషి, "బీ" అనేమనిషిమీద తీర్పు అమలులోకి తేవడమందు విక్రయించబడ్డ ఒక భూస్థితి ఖరీదుచేస్తున్నాడు - "బి" అనేమనిషి, ఆ భూస్థితి జప్తు చెయ్యబడ్డ తర్వాత "జడ్" అనే మనిషితోటి కుట్ర చెయ్యడమును కలిపి నామకార్థముమాత్రము నిర్ణయించబడ్డ కొద్ది అద్దెను చాలాకాలము వరకు ఆ భూస్థితినిగురించి ఒక కవులు వ్రాసి "ఏ" అనేమనిషిని దగా చెయ్యవలెననిన్ని జప్తుకుముందే ఆకవులు యివ్వబడ్డట్టు నమ్మించవలెననిన్ని వుద్దేశించి జప్తుకు ఆరుమాసము లకుముందు తారీఖు ఆ కవులులో వ్రాస్తున్నాడు-ఇందులో "బీ" అనే మనిషి ఆ కవులులో తాను దస్కతు చేసినప్పటికిన్ని అందులో ముందు తారీఖు వేసినందున తప్పు సృష్టి చేసినవాడు అవుతున్నాడు.

(e) వర్తకుడయిన "ఏ" అనేమనిషి, దివాలా తియ్యడముకుముందు తనప్రయోజనము కొరకు "బీ" అనే మనిషివద్ద తన తాలూకుఆస్తి కొంత దాచి తనకు ఋణము యిచ్చివుండేవారిని దగా చెయ్యవలెననే వుద్దేశముతోటిన్ని ఆ సంగతిలో మాయ జరిగించవలెననిన్ని ఋణముగా పుచ్చుకోబడ్డ ఒక మొబలగు "బీ" అనేమనిషికి చెల్లించే లాగున తాను బద్ధుడయినట్టు ఒక పత్రమువ్రాసి తాను దివాలాతీయడముకు ముందు అది వ్రాసి యివ్వబడ్డట్టు నమ్మించవలెనని వుద్దేశించి ఆ పత్రములో అంతకుముందు తారీఖు నామోదు చేస్తున్నాడు. "ఏ" అనే మనిషి, పయిన చెప్పబడ్డ నిర్ధారణలో మొదటి పద్ధతిని పట్టి తప్పు సృష్టి చేసినవాడు అవుతున్నాడు.

వివరణము ౧:— వాస్తవముయిన ఒక మనిషి వల్ల వ్రాయబడ్డట్టు నమ్మబడవలెననే వుద్దేశముతో, కల్పితుడైన ఒకమనిషి పేరట వ్రాసిగాని, ఒకమనిషి జీవించివుండగా అతనివల్ల వ్రాయబడ్డట్టు నమ్మవలెననే వుద్దేశముతో, చనిపోయిన ఒకమనిషి పేరట వ్రాసిగాని, ఒక తప్పుదస్తావేజు పుట్టించడము అనేది తప్పుసృష్టి కిందికి రావచ్చును.

## దృష్టాంతములు.

"ఏ" అనే మనిషి, కల్పితుడయిన ఒకమనిషి పేరట బిల్ ఆఫ్ ఎక్సచేంజ్ అనే ఒక పత్రము వ్రాసి అది చెలాయించవలెననే వుద్దేశముతోటి కల్పితుడయిన అట్టి మనిషి సహీచేసినట్టు ఆ బిల్లు సహీ చేస్తున్నాడు-అందులో "ఏ" అనే మనిషి, తప్పు సృష్టి చేసినవాడు అవుతున్నాడు.

471. తప్పుసృష్టి చెయ్యబడ్డ దస్తావేజుఅని తానుఎరిగివుండే లేక నమ్మడముకు కారణము కలిగివుండే యేదయినా దస్తావేజు దగాగా, లేక అయోగ్యముగా మంచి దస్తావేజుక్రింద వుపయోగపరచే యే మనిషి అయినా, అట్టి దస్తావేజు అతను తప్పుసృష్టి చేసివుంటే యేలాగో ఆలాగే శిక్షించబడవలసినది.

తప్పు సృష్టి చేయబడ్డ ఒక దస్తావేజును మంచి దస్తావేజు కింద వుపయోగపరచడము.

(కాగ్నిజిబిల్ కాదు - వారింటు - జామీనుకలదు - రాజీకూడదు - అసలు ఫోర్జరీ నేరము ఏ కోర్టువారివల్ల విచారణ చేయబడవచ్చునో వారివల్లనే యీ నేరమున్నూ విచారణ చేయబడవచ్చును.)

475. ఏదైనావస్తువుమీద, లేక వస్తువులో 467 డో సెక్షన్‌లో నమూదు చెయ్యబడ్డ యేదయినా దస్తావేజు యథార్థ పరచడముకొరకు వాడబడే ఏదైనా ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించి అట్టి వస్తువుమీద ఆ సమయమందు తప్పుగా సృష్టించబడ్డ లేక ఆదరిమిలాను సృష్టించబడబొయ్యే యేదైనా దస్తావేజుకు అది యథార్థ పరచబడ్డదిగావున్నట్టు కనబడేరూపము కలుగచెయ్యడముకొరకు యేదైనా అట్టి ఆనవాలు లేక గుర్తు వాడవలెనని వుద్దేశించే, లేక అట్టి వుద్దేశముతోటి దేనిమీద, లేక దేంట్లో అట్టి ఆనవాలు, లేక గురుతు తప్పుగా సృష్టించబడ్డదో యేదయినా అట్టి వస్తువు తనవద్ద వుంచుకొనివుండే యేమనిషియైనా, యావజ్జీవము ద్వీపాంతరవాసము వల్లగాని, యేడు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని, శిక్షించబడడమే గాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

467 డో సెక్షన్‌లో నమూదు చెయ్యబడి వుండే దస్తావేజులు యథార్థపరచడముకొరకు వుపయోగపరచబడ్డ ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించడము లేక తప్పుగా గుర్తు వెయ్యబడ్డ వస్తువులు వుంచుకోవడము.

(కాగ్నిజిబిల్ నేరము - వారంటు - జామీను కలదు - రాజీకూడదు - సెషన్ కోర్టు విచారణ.)

467 డో సెక్షన్‌లో నమూదు చెయ్యబడి వుండేవిగాక ఇతర దస్తావేజులు యథార్థపరచడము కొరకు ప్రయోగపరచబడ్డ ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించడము, లేక తప్పుగా గుర్తు చెయ్యబడ్డ వస్తువులు వుంచుకోవడము.

476. ఏదయినా వస్తువుమీద, లేక వస్తువులో 467 డో సెక్షన్‌లో నమూదు చెయ్యబడ్డ దస్తావేజులు గాక యేదైనా యితర దస్తావేజు యథార్థపరచడమునకు వాడబడే యేదైనా ఆనవాలు లేక గుర్తు తప్పుగా సృష్టించి అట్టివస్తువు మీద ఆ సమయమందు తప్పుగా సృష్టించబడ్డ, లేక ఆ దరిమిలాను సృష్టించబడబోయ్యే యేదయినా దస్తావేజుకు అది యథార్థపరచబడ్డదిగా వున్నట్లు కనపడే రూపము కలుగ చెయ్యడముకొరకు యేదయినా అట్టి ఆనవాలు, లేక గుర్తు తప్పుగా సృష్టించబడ్డదో యేదయినా అట్టి వస్తువు తనవద్ద వుంచుకొనివుండే యే మనిషైనా, ఏడుసంవత్సరములకు వ్యాపించ గూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖైదువల్ల శిక్షించబడడమేగాకుండా జుల్మానాకుకూడా పాత్రుడు కావలసినది.

[కాగ్నిజిబిల్ కాదు— వారంటు — జామీను లేదు — రాజీకూడదు — సెషన్సుకోర్టు విచారణ.

(1) పై పీనల్‌కోడు సెక్షనుల ప్రకారము యేర్పడిన యేదైనా నేరము యేకోర్టులోనైనా లేదా యేకోర్టు చర్యలకు సంబంధించియైన జరిగినదని యేకోర్టువారైనా యెంచిన యెడల, అట్టి నేరము విషయమై అవసరమని తలచేయెడల ముందుగా విచారణ జరిపి, నేరము జరిగినట్లు తేలిన, నేరము జరిగినట్లు ఆ నేరము విషయమై ఫిర్యాదు చేయుట న్యాయసిద్ధికొరకు అవసరమని ఆర్డరు వ్రాయవలెను. అటుతరువాత వ్రాతమూలకమైన ఫిర్యాదు నేరము జరిగిన ప్రదేశముపై అధికారముగల ఒక ఫస్టుక్లాసు మాజిస్ట్రేటుకు విచారణకు పంపవలెను.

(2) సాధారణముగా కోర్టులు ఒక ఫిర్యాదును చేయుటకు ముందు ఆ నేరము జరిగినదని దృఢముగా నమ్మవలయును. మరియు ఆ నేరస్థాపనకు తగిన సాక్ష్యమున్నదా లేదా యని విచారించవలెను అట్టి నేరముకు కేసుపెట్టుట న్యాయసిద్ధికి ముఖ్యావసరమని తలచవలెను. పై నేరములు జరిగినట్లు అభిప్రాయపడినంత మాత్రమునే కోర్టులు ఫిర్యాదు చేయరాదు. పై సెక్షనుల ప్రకారము యివ్వబడిన అధికారములను అతి జాగ్రతగా కోర్టులు చెలాయించవలసియుండును. లేనియెడల అనేకమంది వ్యయప్రయాసలకు లోనగుదురు.

(3) కోర్టువారు ఫిర్యాదులో నేరముయొక్క వివరములు వగైరాలు సాక్షుల పేర్లుగూడ నమోదు చేయవలసి యుండును.

(4) సె 476 క్రింద చర్య కోర్టులు సాధారణముగా తమ కోర్టులలో చర్యలు ముగిసిన తరువాత సాధ్యమైనంత త్వరలో చర్య తీసికొనవలెను. గాని చాలకాలము దాటిన తరువాత తీసికొనుట సరికాదు.

(5) ఒక నేరమునుగురించి క్రిందికోర్టులు ఫిర్యాదుచేయనప్పటికి హైకోర్టువారికి యేకేసులోనైనా ఫిర్యాదుచేయమని ఆర్డరుచేయుటకు అవసరమైన అధికారములున్నవి.

(6) గ్రామకోర్టువారు సె 476 క్రింద అధికారములను చెలాయించుచూ జారీ చేసిన ఆర్డరునుండి జిల్లాకోర్టుకు అప్పీలు కలదు. కాని డిస్ట్రిక్టుమునసబు కోర్టుకు ఆ ఆర్డర్లతో జోక్యము కలుగజేసికొనుటకు అధికారము యుండదు. జిల్లాకోర్టు ఆర్డరునుండి హైకోర్టుకు రివిజన్ హక్కుకూడ యుండును.

III పంచాయతీకోర్టువారు యే కేసులోనైనా జుల్మానా విధించినపుడు అట్టి జుల్మానాలోనుంచి ఫిర్యాదికి యెట్టి పరిహారమున్ను యిప్పించుటకు క్రి. ప్రొ కో. సె. 403, 476, 476A & 476B తప్ప యితర విధులు వర్తించనందున అధికారము యుండదు.

తీర్పులు.

(I) 1934 మ. వీ. నో. 1022

జడ్జీ:—వాల్షుగారు.

నారాయణస్వామి వన్నియర్ — పిటీషనరు.

కరంబాయి రామపెరియారి — రెస్పాండెంటు.

పిటీషనరున్ను మరిఒందరున్ను చేసిన నేరముకు ఒక గ్రామకోర్టువారు శిక్ష వేయగా ముద్దాయిలు జాయింటు మాజిస్ట్రేటువారి యెదుట మ. గ్రా. కో. అ. సె. 76 (8) ప్రకారము పిటీషను దాఖలుచేయగా వారు సదరు గ్రామకోర్టు శిక్ష విధించునప్పటికి యేర్పడి యుండలేదనిన్ని, అందువల్ల కోర్టులేనప్పుడు శిక్ష చెల్లదని శిక్షను రద్దుచేసిరి. దరిమిలా సదరు గ్రామకోర్టు శాస్త్రప్రకారము యేర్పడిన తరువాత లోగడ యిచ్చిన చార్జి సంగతులతోనే అదే నేరముకు మరల చార్జి దాఖలు చేయబడెను. పిటీషనరు క్రి. ప్రొ. కో. సె. 403 ప్రకారము సదరు కేసును విచారించుటకు అభ్యంతరము కలదని సబు డివిజనల్ మాజిస్ట్రేటు యెదుట పిటీషను దాఖలుచేయగా ఆయన కేసును విచారించుటకు సె. 403 ప్రకారము అభ్యంతరములేదని తీర్పుచేసిరి. ఆ ఆర్డరుపైన పిటీషనరు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు, మొదటిశిక్ష కోర్టుకు అధికారము లేనందున రద్దుచేయబడినదనియు, యిప్పుడు అధికారముయున్న కోర్టులో చార్జి దాఖలుచేయుటకు యెట్టి అభ్యంతరము యుండదనిన్ని తీర్మానించిరి.

మరియు, అధికారము లేకుండా తీర్పు యిచ్చుట సె. 76 (8) లో చెప్పిన దుర్నడత అగుననికూడ తీర్మానించిరి.

(2) 1935 మ. వీ. నో. 946=69 మ.లా.జ. 812

జడ్జీలు:— మాధవన్నాయర్, బరన్ గార్లు

అప్పాదొరై వగైరా — పిటీషనర్లు
ఎవరి — గవర్నమెంటువారు

1వ ముద్దాయి ఫిర్యాది తనపేర ఒక ప్రోనోటు వ్రాసియిచ్చినాడని చెప్పుచూ సదరు నోటునుబట్టి పంచాయతీ కోర్టులో దావా దాఖలుచేసెను. 2వ ముద్దాయి సదరు నోటును వ్రాసెను. 3, 4 ముద్దాయిలు ఆ నోటుపై సాక్షి సంతకములను చేసిరి. సదరునోటు ఫోర్జరీ చేయబడినదని పంచాయతీకోర్టువారు దావాను త్రోసివేసిరి. అందుపైన ఫిర్యాది ముద్దాయిలపైని ఇం. పీ. కో. 467 సె. క్రింద నేరమునకు చార్జి దాఖలుచేసెను. పంచాయతీకోర్టువారు చార్జి దాఖలు చేయలేదనిన్నీ క్రి. ప్రొ. కో. సె. 195 (1) (సి) ప్రకారము పంచాయతీకోర్టువల్ల చార్జి లేనిదే కేసు విచారించుటకు అధికారములేదని 1వ ముద్దాయి తరఫున వాదనచేయబడగా 1వ ముద్దాయిని కేసులోనుంచి తొలగించిరి. 2,3,4 ముద్దాయిలపైన విచారణ జరిగి సెషన్సు కోర్టుకు పంపబడిరి. అందుపైన ముద్దాయిలు హైకోర్టులో పిటీషను దాఖలు చేయగా క్రి. ప్రొ. కో. సె. 195 (1) "బి" ప్రకారము యీ ముద్దాయిలపైని కేసును కూడ విచారించుటకు అధికారము లేదనిన్నీ, యీ ముద్దాయిలు జరిగించిన నేరము ఇం. పీ. కో. సె. 193 క్రిందవచ్చుననియు, అందువల్ల పంచాయతీకోర్టువల్ల చార్జి దాఖలు చేయబడవలెననిన్నీ వాదనచేయగా హైకోర్టువారు ఈ నేరము ఇం. పీ. కో. సె 193 క్రిందవచ్చుననియు, క్రి. ప్రొ. కో. సె 476 పంచాయతీకోర్టులకు వర్తించనందున పంచాయతీకోర్టు దావాలసందర్భములలో జరిగిన యేనేరములకు యెవ్వరిపైనను కేసుపెట్టుటకు వీలులేదనిన్నీ, అట్టికేసులను విచారించుటకు అధికారము యుండవలెనన్న మ. గ్రా. కో. అ. సె. 77 లో క్రి. ప్రొ. కో. సె 476 కూడ గ్రామకోర్టులకు వర్తించునని సవరణచేయవలసియుండుననిన్నీ చెప్పుచూ పిటీషనర్లపైన చార్జి నిల్వనేరదని తీర్మానించిరి.

(3) 1934 మ.వీ.నో. 864=1934 ఆ.ఇ.రి. మద్రాస్ 676

జడ్జీ:— పాండురంగారావుగారు

కామాచీ అమ్మాళ్ వగైరా — పిటీషనర్లు
కరుప్పగౌండన్ — రెస్పాండెంటు

ఈ కేసులో రెస్పాండెంటు పిటీషనర్లపైని ఇం. పీ. కో. సె. 426 ప్రకారము పంచాయతీ కోర్టులో చార్జి దాఖలు చేయగా పంచాయతీకోర్టువారు ముద్దాయీలు

నేరస్థులని ముద్దాయిలు యిద్దరికి చెరియొక రు. 5-0-0 లు జుల్మానా విధించి, సదరు జుల్మానాలోనుంచి రు 2-0-0 ఫిర్యాదీకి నష్టపరిహారముక్రింద యిచ్చునట్లు ఆర్డరు చేసిరి.

అందుపైన జిల్లాకలెక్టరుగారు మ. గ్రా. కో. ఆక్టులో ఫిర్యాదికి యెట్టి పరిహారము యిప్పించుటకు పంచాయతీకోర్టుకు అధికారము యివ్వబడలేదనిన్ని, సదరు ఆక్టు సె. 77 ప్రకారము క్రి. ప్రొ. కో. సె. 403 తప్ప యితర సెక్షనులు పంచాయతీ కోర్టులకు వర్తించవనియు, అందువల్ల పంచాయతీకోర్టువారు ఫిర్యాదికి నష్టపరిహారము యిప్పించుట న్యాయవిరుద్ధమనియు వ్రాయగా హైకోర్టువారు కలెక్టరుగారి వాదనను అంగీకరించి ఫిర్యాదికి పరిహారము నొసంగుచూ పంచాయతీకోర్టువారు యిచ్చిన ఉత్తరువును రద్దుపరచిరి.

(4) 4 మద్రాస్ క్రిమినల్ కేసులు 317

జడ్జి:—జాక్సన్ గారు.

శ్రీనివాస అయ్యర్ వగైరా — పిటీషనర్లు

పిటీషనర్లకు ఇం|| పీ|| కో|| సె|| 228 న్యాయవిచారణ సంబంధమైన చర్య తాలూకు యేదశలోనైనా పని జరిగిస్తూవుండే ఒక పబ్లిక్ ఉద్యోగస్థుణ్ణి మనఃపూర్వకముగా తిరస్కరించడము లేక ఆటంకపెట్టడము ప్రకారము, పంచాయతీకోర్టు ప్రెసిడెంటు క్రి. ప్రొ. కో. సె. 476 క్రింద పంపిన రిపోర్టునుబట్టి కేసును విచారించి మాజిస్ట్రేటు జుల్మానా విధించెను. అందుపైన పిటీషనర్లు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె 77 ప్రకారము క్రి|| ప్రొ|| కో|| సె. 476 గ్రామకోర్టులకు వర్తించవనియు, అందువల్ల పంచాయతీ కోర్టువారు క్రి|| ప్రొ|| కో|| సె. 476 క్రింద యెట్టి ఫిర్యాదున్నూ చేయుటకు అధికారము లేదనిన్ని అట్టి కేసును పంచాయతీకోర్టువారుగాని లేక యేయితర మాజిస్ట్రేటుగాని విచారించుటకు అధికారము లేదనియు తీర్మానించిరి. ఒక పంచాయతీకోర్టు ప్రెసిడెంటుకుగాని మెంబర్లకుగాని ఆటంకము కలుగజేయుటగాని యితర విధముగా అవమానము కలుగజేసినగాని సదరు చర్య ఇం|| పీ|| కో|| ఇతర సెక్షనులక్రింద నేరమగునెడల, యితర వ్యక్తులవలె ఫిర్యాదు చేసికొనవలెనేగాని, క్రి. ప్రొ. కో. సె. 476 క్రింద ఎట్టి చర్య తీసికొనుటకు అధికారము లేదని సూచించిరి.

(5) 4 మద్రాస్ క్రిమినల్ కేసెస్ 399.

జడ్జి:—లక్ష్మణరావుగారు.

రంగప్పనాయకన్ — ముద్దాయి.

రంగోకానన్ — ఫిర్యాది.

ఒక పంచాయతీ కోర్టువారు ఫిర్యాది దాఖలు చేసిన ఫిర్యాదును ఫిర్యాది హాజరులేదని గ్రామకోర్టు ఆక్టుక్రింద చేయబడిన 13 వ విధి ననుసరించి త్రోసివేసిరి. దరిమిలా ఆ సంగతులతోనే అ నేరముకే ఫిర్యాది ముద్దాయిపై సబుడివిజనల్ మాజి స్ట్రేటుకోర్టులో ఫిర్యాదు దాఖలుచేసెను. అందుపైన ముద్దాయిలు హైకోర్టులోరివిజన్ పిటీషను దాఖలుచేసి అదివరిలో ఫిర్యాదు త్రోసివేయబడినందున తిరిగి యీ కేసు విచారించుటకు క్రి. ప్రొ. కో. సె. 403 ప్రకారము వీలులేదని వాదనచేయగా హైకోర్టువారు 31వ విధి ప్రకారము ఫిర్యాదును త్రోసివేయుటవల్ల ముద్దాయి నిర్దో షత్వము స్థిరపడినట్లు ఎంచ వీలులేదనియు, మరల చార్జీ దాఖలుచేయుటకు క్రి॥ప్రొ॥ కో॥ సె. 403 ప్రకారము ఎట్టి అభ్యంతరము లేదనియు తీర్మానించిరి.

(6) 1943 (1) మ.లా.జ 233=1943 మ.వీ.నో. 162=56 మ.లా.వీ. 156

మద్రాసు హైకోర్టు

ప్రధాన న్యాయమూర్తి,

న్యాయమూర్తి లక్ష్మణరావు గార్లు

## L. P. A. 25 of 1942 (6-1-1943)

రామస్వామినాయుడు — అప్పెలెంటు
(రెస్పాండెంటు)

ఎదిరి

చిన్నస్వామి నాయుడు — రెస్పాండెంటు
(అప్పెలెంటు)

మద్రాసు గ్రామకోర్టుల ఆక్టు సె. 73, 77

క్రిమినల్ ప్రొసీజరుకోడు సె. 195 (3)

కేసు సంగతులు.

అప్పెలెంటు కడయంపట్టి పంచాయతీకోర్టులో ఒక ప్రోనోటును బట్టి దావా తెచ్చెను. ఆ దావాలో ఉభయవాదులు హాజరులేనందున దావా పరిహరింపబడినది. ఆ దావా పరిహరింపబడిన తరువాత ప్రతివాది సంకరి డిస్ట్రిక్టుమునసబుకోర్టులో పంచా యతీ కోర్టులోని దావా ప్రోనోటు పైన వసూళ్ళు ఫోర్జరీ చేయబడినవనియు అందు వల్ల వాదిపైని క్రిమినల్ కేసును దాఖలు చేయమని పిటీషను దాఖలుచేసెను. డిస్ట్రిక్టు మునసబు ఆ పిటీషనును అంగీకరించుటకు తనకు అధికారము లేదని పరిహరించెను. ఆ ఆర్డరుమండి ప్రతివాది సేలం డిస్ట్రిక్టుకోర్టుకు అప్పీలు చేసెను. అంతేగాక జిల్లాకోర్టు వారిని వాదిపైన క్రిమినల్ కేసు దాఖలుచేయవలసినదని వేరే ఒక పిటీషను దాఖలు చేసెను. జిల్లాజడ్జి ప్రతివాది దాఖలుచేసిన అప్పీలును పిటీషనునుగూడ పరిహరించెను.

ఆ ఆర్డరునుండి ప్రతివాది హైకోర్టుకు అప్పీలు చేయగా న్యాయమూర్తి హాపెల్ గారు (1942 మ. లా. జ. 436) జిల్లాజడ్జి అప్పీలును పరిహరించుట సరికాదని, ప్రతివాది పెట్టిన పిటీషనును విచారించవలెనని క్రింది కోర్టుకు పంపెను. ఆ ఆర్డరునుండి వాది లెటర్సు పేటెంటు అప్పీలు చేయగా ప్రధాన న్యాయమూర్తి, న్యాయమూర్తి లక్ష్మణ రావుగార్లు ఈ క్రింది విధమున తీర్మానించిరి.

తీర్పు

ఒక గ్రామకోర్టు తీర్పునుండి అప్పీలు చేయు హక్కు లేదు. కాని సె 73 ప్రకారము డిస్ట్రిక్టు మునసబుకు ఒక గ్రామకోర్టు డిక్రీనిగాని, ఉత్తర్వునుగాని గ్రామకోర్టు వారు లంచమును పుచ్చుకున్నారనే, విశేషముగా పక్షపాతము జరిగించినారని లేక దుర్నడతగా ప్రవర్తించినారనే కారణము మీద లేదా చట్టప్రకారము తమకు యేర్పడి ఉండని అధికారము తాము చెలాయించినారనే, లేక మరియొక విధమున చట్టమునకు విరుద్ధముగా గాని బహు అక్రమముగా గాని ప్రవర్తించినారనే కారణముమీద లేక ఆడిక్రీ అయినను ఉత్తర్వు అయినను స్పష్టముగా అన్యాయముగా యుందనే కారణము మీద రద్దు చేయుటకు అధికారమివ్వబడినది. ఆ సెక్షనులో చెప్పబడినటుల తప్ప గ్రామకోర్టువారు చేసే ప్రతి డిక్రీ, ఉత్తర్వును ఆఖరుదిగా యుండవలెనని యున్నది. కాని ఈ సెక్షను ప్రకారము యివ్వబడిన హక్కు అప్పీలు హక్కు కాదు.

మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 77, 1937 సం॥పు సవరణ ఆక్టువల్ల సవరణ చేయబడినది. సె 77 లో క్రిమినల్ ప్రొసీజరుకోడు సె 403, 476, 476A, 476B గ్రామకోర్టులకు వర్తించును అని యున్నది. సె. 476 A లో ఇటులున్నది. సె. 476 (1) ప్రకారము సివిల్, రెవిన్యూ, క్రిమినల్ కోర్టులకు యివ్వబడిన అధికారములు నేరము యేకోర్టు చర్యలకు సంబంధించి యున్నదో ఆ కోర్టుకు క్రిమినల్ ప్రొసీజరు కోడు సె 195 (3) ప్రకారము పై కోర్టు అయిన కోర్టువల్ల చెలాయింపబడవచ్చును అనియున్నది.

క్రిమినల్ ప్రొసీజరు కోడు సె 195 (1) (c) లో ఇండియన్ పీనల్‌కోడు సె 471, 475, 476 ల క్రింద యే నేరమును యే కోర్టువారున్నూ యే కోర్టుకు సంబంధించిన చర్యలలో జరిగినదో ఆ కోర్టువారి వ్రాతమూలమైన ఫిర్యాదుగాని, లేదా ఆ కోర్టుకు పైకోర్టు అయిన కోర్టువారి వద్దనుండి వ్రాతమూలమైన ఫిర్యాదు లేనిదే విచారించకూడదని యున్నది.

సె 195 (3) లో ఈ సెక్షను పనుల నిమిత్తము ఒక కోర్టునుండి అప్పీళ్ళు చేయబడు కోర్టుకు మొదటికోర్టు క్రింది కోర్టుగా యెంచబడుననియు, లేదా అప్పీళ్ళులేని సివిల్ కోర్టుల విషయములో, ఆ కోర్టు అధికార హద్దులలో అసలు దావాలను విచారించుటకు అధికారముగల కోర్టు పైకోర్టుగా యెంచబడునని యున్నది.

పైన చెప్పబడినటుల గ్రామకోర్టుల తీర్పునుండి అప్పీలులేదు. అందువల్ల సె 195 (3) ప్రకారము హైకోర్టు జిల్లాకోర్టుగా యెంచవలెను. ప్రతివాది జిల్లాకోర్టులో దాఖలు చేసిన పిటీషను సరియైనది. దీనిని తిరిగి విచారించమని న్యాయమూర్తి హాపెల్ గారు యిచ్చిన తీర్పు సరియైనది. అందువల్ల ఈ అప్పీలును పరిహరించవలసినది.

(7) 1949 (1) మ|| లా|| జ|| నో|| ఆ|| క|| కే|| 12

మద్రాస్ హైకోర్టు న్యాయమూర్తి సోమసుందరంగారు

**Crl. M. P. 1627 of 1948 (3–1–49)**

భుజంగనాయుడు ఎదిరి క్రిష్ణమ్మనాయుడు

మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 77 గ్రామ కోర్టులలోని క్రిమినల్ కేసులను మరియొక కోర్టుకు ట్రాన్స్ఫరు చేయుటకు హైకోర్టుకు అధికారము యున్నదా ?

కే సు సం గ తు లు

ఒక పంచాయతీ కోర్టులోని ఒక క్రిమినల్ కేసును మరియొకకోర్టుకు ట్రాన్స్ఫరు చేయుటకు లెటర్సు పేటెంటు 29 క్లాజుక్రింద అధికారము యున్నదనియు, మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె 77 లో చెప్పబడిన క్రిమినల్ ప్రొసీజరుకోడు సెక్షన్లు తప్ప మిగతా క్రిమినల్ ప్రొసీజరుకోడు సెక్షనులు వర్తించవన్న మాటలనుబట్టి హైకోర్టుకు అధికారము యుండదని యెంచవీలులేదని తీర్మానించిరి.

## 9 వ అధ్యాయము

విధులు చేయుటకు అధికారము.

78. (1) రాజ్య గవర్నమెంటువారు ఆక్టుయొక్క కార్యములను యావత్తుగాని, ఏవైనాగాని నెరవేర్చుటకు గాను విధులు చేయవచ్చును.

(2) ముఖ్యముగాను పై సాధారణాధికారమునకు భంగము గాకుండను అట్టి విధులు;—

(a) 7 వ సెక్షను ననుసరించి గ్రామ మునసబుల నియామకములను క్రమపరుపవచ్చును;

(b) పంచాయతీ కోర్టుల ప్రెసిడెంట్ల యొక్కయు, వైస్ ప్రెసిడెంట్లయొక్కయు ఇతర మెంబర్లయొక్కయు నియామకములను గాని ఎలక్షనులనుగాని క్రమపరచి వారి అర్హతలను నిర్దేశింపవచ్చును;

(c) పంచాయతీ కోర్టుల మీటింగులను, చర్యలను వాటి మెంబర్లు హాజరగుటను క్రమపరుపవచ్చును;

(d) పంచాయతీ కోర్టుల నేరములను విచారణకు తీసుకోనలసిన విధానమును, నేరములను విచారించునపుడు అవలంబింపవలసిన చర్యను నిర్దేశింపవచ్చును;

(e) ఫిర్యాదులను దాఖలుచేయుట, ఉపసంహరించుకొనుట త్రోసివేయుటను గురించియును, నేరములను రాజీ చేసికోవడమును గురించియును నిబంధింపవచ్చును. మరియు ఒక ఫిర్యాదు చర్యను జరుపదగినట్టి లేదా నేర పెట్టబడినవానికి (ముద్దాయికి) ప్రతినిధిగా ఉండదగినట్టి నఫరులను నిర్దేశింప వచ్చును;

(f) క్రిమినల్ కేసులలో నేరపెట్టబడిన వానిని సమ్మను చేయడమును, అతడు హాజరు కావడమును గురించియును, సాక్షులను సమ్మను చేయడమును, విచారించడమును గురించియును నిబంధింప వచ్చును;

(g) క్రిమినల్ కేసుల విషయములో యావత్తు రిజిస్టర్ల యొక్కయు, రిటర్నులయొక్కయు, ప్రోసెస్‌లయొక్కయు నమూనాలను అట్టి రిజిస్టర్లు వ్రాసియుంచవలసిన విధమును, అట్టి రిటర్నులు తయారు చేయవలసిన తారీఖులను, అవి పంపబడవలసిన ఆఫీసరులను నిర్దేశింప వచ్చును;

(h) ప్రోసెసును అందజేయడమును, డిక్రీలను అమలు జరుపడమును, జుల్మానాలను వసూలు జేయడమునుగురించి నిబంధింప వచ్చును;

(i) పంచాయతీ కోర్టులవారు గాని, వారి తరఫున గాని యావత్తు దస్తావేజులను రికార్డులను పుచ్చుకొని వశములో నుంచుకొనడమును గురించియును, డిక్రీలయొక్కయు, ఇతర రికార్డులయొక్కయు నకళ్ళను యిచ్చుటను గురించియును నిబంధింపవచ్చును; మరియు

(j) ప్రోసెసును అందజేయడమును, డిక్రీలను అమలు జరుపడమును నకళ్ళను ఈయడమును గురించి రుసుములను విధించుట కొరకు నిబంధింపవచ్చును.

(3) ఈ సెక్షను ననుసరించి చేయబడిన విధులన్నియు అఫీషియల్ గెజెటులో ప్రకటింపబడవలెను. మరియు అట్లు ప్రకటింపబడిన మీాదట ఈ యాక్టులో చట్టముగా చేయబడిన నట్లో అట్లే అమలు కలిగి యుండవలెను.

# రెండవ భాగము

## గ్రామకోర్టుల ఆక్టు ననుసరించి చేయబడిన విధులు.

1. ఈ విధులలో:—

"ఆక్టు" అను మాటకు 1888 వ సంవత్సరపు మదరాసు గ్రామకోర్టుల ఆక్టు, అని అర్థము.

"ఫిర్యాదు" అను మాటకు ఆక్టును బట్టి కోర్టు చర్య తీసికొనవలెనని ఉద్దేశముతో తెలియబడిన, ఒక మనిషి ఒక నేరమును చేసినాడని మూజువాణిగాగాని లేదా వ్రాతమూలముగాగాని కోర్టుకు చేయబడిన ఫిర్యాదు, అని అర్థము. కాని దానిలో పోలీసు ఆఫీసరుయొక్క రిపోర్టు చేరదు.

"కోర్టు" అనగా ఆక్టుయొక్క 9 (1) వ సెక్షను ననుసరించి నిర్మాణము చేయబడిన పంచాయతీ కోర్టు అని అర్థము.

"ప్రెసిడెంటు" అనగా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు అని అర్థము. మరియు ఆ మాటలో ఏ యొక్క మీటింగుకు యెన్నుకొనబడిన ప్రెసిడెంటును, మరియు 23, 27, 28, 30, 34, 35, 50, 52, 53, 53 ఏ, 54 రూల్సు నిమిత్తము ఈ ఆక్టు యొక్క 9వ సెక్షను, 5వ సబ్ సెక్షను ప్రకారము ప్రెసిడెంటు, అధికారమును చెలాయించుచున్న వైస్ ప్రెసిడెంటు కూడా చేరును.

"రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు" "తహశీలుదారు" మరిన్నీ "డిప్యూటీ తహశీలుదారు" అనుమాటకు ఎవరి అధికార ప్రదేశపు స్థానిక సరిహద్దులలోపల పంచాయతీకోర్టు ఉంటున్నదో అట్టి రెవిన్యూ

డివిజనల్ ఆఫీసరు, తహశీలుదారు మరియు డిప్యూటీ తహశీలుదారు అని అర్థము.

వ్యాఖ్య.

ఫిర్యాదు:—

కోర్టువారు చర్య తీసికొనవలెనని ఉద్దేశించి ఒక నేరము సంగతి తెలియజేసినదే ఫిర్యాదు అగును. కాని చర్య తీసికొనవలెనని ఉద్దేశించకుండా, ఒక పిటీషను వ్రాయుటలో ఒకడు నేరము చేసినట్లు ఉదహరించినగాని లేక ముద్దాయిని మందలించవలసినదని పోలీసువారికి పంపిన రిపోర్టుగాని లేక ఒక వాఙ్మూలములో యెవరైనను నేరము చేసినట్లు చెప్పినగాని ఆ సందర్భములో అవి ఫిర్యాదులు కానేరవు. అట్టి సమాచారమును ఆధారపరచుకొని యే పంచాయతీకోర్టువారును యెవరిపైనను కేసులు పెట్టి విచారించుటకు అధికారము యుండదు.

## 1. ఆక్టుయొక్క 78 (2 a మొదలు c వరకు) వ సెక్షను ననుసరించి చేయబడిన విధులు.

### 7వ సెక్షనునుబట్టి గ్రామమునసబుల నియమనము.

2. ఎవరి అధికార ప్రదేశ హద్దుల లోపల గ్రామము ఉన్నదో ఆ రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుచే ప్రతి గ్రామ మునసబును నియమింపబడవలయును.

3. నియమనము చేయడములో, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు ఈ క్రింది విధిని గమనించవలయును:—

ఒక గ్రామ మునసబు కోర్టుయొక్క అధికార ప్రదేశమును గ్రామమును ఒకటే సరిహద్దులను గలిగి యున్నపుడు ఆ గ్రామపు హెడ్డుయొక్క పనులను నెరవేర్చుచుండు మనిషిని గ్రామమునసబుగా రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు నియమించవలయును. అట్టి మనిషే అట్టి పనులను చేయుచుండునట్టి కాలమునకు మాత్రమే ఆ నియమనము చేయబడినట్లు ప్రకటింపబడవలెను.

ఆక్టుననుసరించి గ్రామములను (గ్రూపుగా) ఒకటిగా కలపడము లేదా విభాగించడమునకు ఫలితముగా అధికార ప్రదేశములు (గ్రామ

ప్రదేశపు హద్దులును; కోర్టు అధికార ప్రదేశపు హద్దులును) ఏకమై యుండనపుడు, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు, గ్రామ కోర్టు యొక్క అధికార ప్రదేశముల లోపల నివసించు యే మనిషినైనను గ్రామ మునసబుగా నియమింపవలెను.

పంచాయతీదారుల అర్హతలు.

4. ఏ మనుష్యులయినను:—

(i) ఏ గ్రామమునకు కోర్టు స్థాపించడమైనదో అట్టి గ్రామ కాపురస్థులయిననే తప్ప,

(ii) అతనికి 25 సంవత్సరములవయస్సు కలిగియుండిననేతప్ప

(iii) ఆ గ్రామము యొక్క దేశ భాషను వారు చదువ వ్రాయ గలిగియున్న నే తప్ప,

(iv) (a) గవర్నమెంటువారికి శిస్తుగా 10 రూపాయలకు తక్కువ కాకుండా చెల్లించుచుండు పట్టాదారైననే తప్ప, లేదా

(b) 1908 వ సంవత్సరపు మదరాసు ఎస్టేట్ల లాండు ఆక్టుయొక్క 3 (5) వ సెక్షనులో నిర్వచింపబడిన భూస్వామికి 10 రూపాయలకు తక్కువ కాకుండా బాడుగ చెల్లించు రైతుగానున్న నే తప్ప, లేదా

(c) ఒక రిజిష్టరు చేయబడిన పత్రముననుసరించి పన్ను కింద రూ 50 కు తక్కువ కాకుండ చెల్లించుచుండు భూముల ఇజారా దారయిననే తప్ప, లేదా

(d) 1908 వ సంవత్సరపు మదరాసు ఎస్టేట్ల లాండు ఆక్టుయొక్క 3 (5)వ సెక్షనులో నిర్వచింపబడిన భూస్వామిగా ఉన్న నే తప్ప, లేదా

(e) 10 రూపాయలకు తక్కువ కాకుండ క్విట్ రెంటు చెల్లించునట్టి లేక 20 ఎకరములకు తక్కువకాని విస్తీర్ణము గల ఇనాం భూములను కలిగియుండునట్టి ఇనాందారయిననే తప్ప, లేదా

(f) ఇన్‌కంటాక్సు విధింపబడియున్న వారైననే తప్ప, లేదా

(g) 10 రూపాయలకుతక్కువకాని ఇంటిపన్ను చెల్లించే వారయిననే తప్ప, లేదా

(h) 10రూపాయలకు తక్కువకాని వృత్తిపన్ను చెల్లించే వారయిననే తప్ప,

(i) నెల 1కి 10 రూపాయలకు తక్కువ కాకుండా గవర్నమెంటునుంచి పెన్‌షన్ తీసికొనువారయిననే తప్ప,

(j) సంవత్సరవారీ అద్దె విలువ 10 రూపాయలకు తక్కువగాని భూమి లేదా భూములకు 1920 సంవత్సరపు మలబారు టెనెన్సీ ఆక్టుక్రింద కనందారు లేదా కుఝికనందారు లేదా కుడియురుప్పు లేదా కురుంపిట్టందారు అయిననే తప్ప,

(k) 10 రూపాయలకు తక్కువగాని నీటితీరువ చెల్లించు వాడైననే తప్ప,

(l) మదరాసు సాధారణవిక్రయముల పన్ను ఆక్టుక్రింద పన్నువిధింపబడిన వాడైననే తప్ప, పంచాయతీ కోర్టుకు మెంబరుగా నుండుటకు అర్హుడై యుండకూడదు. అయితే (iv) క్లాజులో విధించబడిన అర్హతలు హరిజనులకు వర్తించవు.

వివరణము:— ఈ విధి (a) క్లాజులో చెప్పబడిన శిస్తు అను మాటలో సెస్సు చేరదు.

వ్యాఖ్య.

ఇదివరలో స్త్రీలు పంచాయతీకోర్టు మెంబర్లుగా యుండుటకుగాని, పంచాయతీదార్ల ఎన్నికలలో ఓట్లు యిచ్చుటకుగాని అధికారముయుండెడిదికాదు. కాని 24-2-32 తేదీగల గవర్నమెంటు జీ.ఓ. నెం 750 రు వల్ల యీరూలున్నూ 8వ రూలున్నూ సవరణ చేయబడినవి అందువల్ల యిప్పుడు స్త్రీలుకూడా యీ విధిలో చెప్పిన అర్హతయున్న

యెడల పంచాయతీకోర్టు మెంబర్లుగా యుండవచ్చును. 8 వ రూలు ప్రకారము వయస్సు వచ్చిన ఆడువారుకూడా పంచాయతీదార్ల ఎన్నికలలో ఓట్లను యిచ్చు అధికారము గలదు.

5. ఒక సమిష్టి కుటుంబము యొక్క మెంబర్లుగాని, లేదా జాయింటు పట్టాదార్లుగాని సమష్టిగా ఆస్తినికలిగియున్న యెడల, పన్నులను చెల్లించుచున్న యెడల, లేదా రాబడిని సంపాదించుచున్న యెడల ఆ కుటుంబము లేక జాయింటు హోల్డింగు (భూమి) అర్హతను కలిగి యున్నట్లు ఎన్నబడవలెను. మరియు ఆకుటుంబములో లేక జాయింటు స్వాములలో ఎక్కువమందిచే అధికార మివ్వబడియున్న మెంబరుగాని లేదా హిందూ సమష్టి కుటుంబము విషయములో అట్లు అధికార మివ్వబడిన మెంబరుగాని, లేక దానియొక్క మానేజరుగాని ఒక కోర్టు తాలూకు మెంబరుగా నుండుటకు అర్హుడైన మనిషిగా ఉండవలెను.

6. ఎవరయినను:—

(a) దివాలాకోరు అగుటకు పిటీషను ధాఖలు చేసిన వాడైన, లేక విడుదల పొందని దివాలాకోరు అయిన యెడల,

(b) మనస్సు స్థిమితము లేనివాడైన యెడల,

(c) గ్రుడ్డివాడైనయెడల, చెవిటివాడైన యెడల, లేదా మూగవాడైన యెడల,

(d) గ్రామమునసబు లేక కరణము కాకుండ జీతము పుచ్చుకొనుచుండు గవర్నమెంటు ఆఫీసరు (సర్కారు ఉద్యోగస్థుడు) అయిన యెడల,

(e) కుష్ఠురోగి అయిన యెడల,

(f) యీ ఆక్టు 8 వ సె॥ ప్రకారము తీసివేయబడినవాడు గాని కోర్టుయొక్క సభ్యత్వమునకు (మెంబరుగా నుండుటకు) అట్టి మనిషి అర్హుడై యుండకూడదు.

(g) కోర్టు మెంబరు అయి యుండి, సరియైన విచారణ జరిపినమీాదట అసమర్థత, పనిలో అశ్రద్ధ, దుర్నడత, లేక తగుబాటి న్యాయమైన ఇతర కారణముల వల్ల మెంబరుగా తొలగించుటకు తగి యున్నట్లు కలెక్టరు తలచినవాడుగాని కోర్టు యొక్క సభ్యత్వమునకు (మెంబరుగా నుండుట) అట్టి మనిషి అర్హుడై యుండకూడదు.

" f, g క్లాజులలో చెప్పబడిన మెంబరుగా యుండుటకు యేర్ప డిన అనర్హత మధ్యకాలములో మెంబరుగా ఎన్నికలలో నిలుచుటకు జిల్లాకలెక్టరు అంగీకారము పొందినగాని, లేనియెడల ఆయాసందర్భము లకు తగినట్లు, కలెక్టరుగారు తొలగించుచూ జారీచేసిన ఆర్డరు తేదీ లగాయితు లేదా ఆ మెంబరు ఉద్యోగము ఖాళీచేసిన తేదీలగాయతు 3 సంవత్సరముల వరకు ఉండవలెను".

**6 (A)** (1) ఒక పంచాయతీకోర్టు క్రిమినల్ అధికారము చెలా యించు అధికార ప్రదేశమునకు 1920సం॥పు మదరాసు లోకల్ బోర్డుల ఆక్టు క్రింద స్థాపించబడిన క్రిమినల్ అధికారమును చెలాయించు ఒక పంచాయతీయొక్క (2) లేక 1920 సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మ్యునిసిపల్ ఆక్టు క్రింద స్థాపించబడిన మ్యునిసిపల్ సంఘము యొక్క మెంబరు ఆ ప్రదేశములోని పంచాయతీకోర్టు మెంబరుగా యుండుటకు అనర్హుడగును. మరియు 18 లేక యితర విధులలో ఏమి చెప్పబడి యున్నను దానితో నిమిత్తములేకుండా అట్టి పంచాయతీ మెంబరును పంచాయతీకోర్టు మెంబరుగా ఎన్నుకొనుట ఎన్నడూ చెల్లదు. మరియు ఎవ్విధముగాను ఉపయోగించదు.

(2) ఒక పంచాయతీ కోర్టు మెంబరు సదరు కోర్టు అధికార ప్రదేశమునకు 1920 సం॥పు మదరాసు లోకల్ బోర్డు ఆక్టు ప్రకారము స్థాపించబడిన పంచాయతీ మెంబరు అయినయెడల ఆతని పంచాయతీ కోర్టు సభ్యత్వము నిలచిపోవలెను.

**6. (B)** ఎవడైనను ఒక క్రిమినల్ కోర్టు వల్ల 6 మాసములకు మించి ద్వీపాంతరవాసము లేక ఖైదువల్లగాని శిక్షింపబడిన (అట్టి శిక్ష

రద్దుచేయబడిగాని లేక అట్టి నేరము క్షమింపబడిగాని యుండకయున్న), వాడు అట్టి శిక్ష అనుభవించు కాలములోను అట్టి శిక్ష అంతమైన తేదీ నుండి 5 సంవత్సరములవరకు పంచాయతీకోర్టు మెంబరుగా ఎన్నుకొను టకు అర్హుడుగా యుండడు.

ఎన్నికలు—సాధారణమైనవి.

7. కోర్టుపంచాయతీదార్లయొక్కయు, ప్రెసిడెంటు వైస్ ప్రెసి డెంటుయొక్కయు ఎలెక్షనులు కోర్టు అధికారప్రదేశము లోపల ఉండు నట్టి ఒకస్థలములో జరుపబడవలెను.

7–A రివిన్యూ డివిజనల్ ఆఫీసర్లకు నోటీసునిచ్చి ప్రెసిడెంటు గాని వైస్ ప్రెసిడెంటుగా ఏ మెంబరుగాని తన వుద్యోగమునకు రాజీ నామా యివ్వవచ్చును. మరిన్ని సదరు రాజీనామా, రివిన్యూడివిజనల్ ఆఫీసరుచే అది అంగీకరింపబడిన తేదీనుండి అమలులోనికి రావలెను.

"7–B వరుసగా ఒకకోర్టుయొక్క ఐదుమీటింగులకంటెఎక్కువ మీటింగులలో హాజరగుట తప్పిపోయిన లేక 4వరూలు 1వసబ్ క్లాజులో విధింపబడిన కాపురపు అర్హతపోయిన లేక 4వరూలు 4వసబ్ క్లాజులో విధింపబడిన ఆస్తిఅర్హతపోయిన మెంబరు సభ్యత్వమునుండి తొలగింప బడుటకు పాత్రుడు కావలెను."

అట్లు తొలగించుటకు వుత్తరువు చేయుటకు డిస్ట్రిక్టు కలెక్టరు అర్హమైన అధికారిగా నుండవలెను.

వివరణము:—ఈవిధియొక్క కార్యమునిమిత్తము(a)మీటింగు అనగా కోరములేనందున నిలిపిపెట్టిన మీటింగులుకూడచేరును.మరియు (b) విరామములేకుండా రోజునుండి రోజువరకుజరిగే(ఆదివారములును, గెజెటులో ప్రకటింపబడిన యితరసెలవుదినములును, జడ్జీలు కేసులను విచారించుటకు కూర్చుండని రోజులు) కోర్టు మీటింగు ఆ కోర్టు అట్లు కూర్చొనియుండు ప్రతిరోజును వేరేవేరే మీటింగుగాగాక ఒకే మీటింగుగా ఎన్నబడవలెను.

పంచాయతీదారుల ఎలెక్షను (ఎన్నిక)

8. పంచాయతీదారులఎలెక్షను గ్రామములోని వయస్సువచ్చిన యావన్మంది కాపురస్థుల చేతను చేయబడవలెను.

9. ఏదేని గ్రామములో ఒక పంచాయతీకోర్టు ఏర్పాటు చేయబడునని ప్రకటనచేయబడి యుండినపుడు లేదా పంచాయతీదారులలో యొకకాళీ తటస్థించియయుండునపుడు లేదా తటస్థించనున్నప్పుడు సంబంధము గల తహశీలుదారు లేక డిప్యూటీ తహశ్శీలుదారు ఆ కోర్టు ఉన్నటువంటి గ్రామముయొక్క హెడ్మనును, ఆకోర్టు మెంబరునుగాని మెంబర్లనుగాని ఎలెక్టుచేయు కార్యములకొరకు తనయుత్తరువుయొక్క తారీఖునుండి పదిరోజులకు తక్కువకాకుండగను మూడు వారములకు ఎక్కువ కాకుండగను, ఒక రోజున కోర్టుయొక్క అధికార ప్రదేశము లోపల కాపురమున్న గ్రామస్థులయొక్క మీటింగు (సభను) కూర్చవలసినదని ఆజ్ఞాపించవలయును.

10. గ్రామ హెడ్మను ఆయుత్తరువుచేసినమీదట ఆమీటింగు యొక్క తారీఖును, కాలమును, స్థలమును, ఉద్దేశమును, వరుసగా మూడు రోజులు దండోరా వేయించి తెలియపరచవలయును. మరియు సందర్భానుసారముగా ఆ గ్రామములోగాని, ఆ గ్రామములలోగాని బహిరంగమైన మూడు ప్రదేశములలో ఆ సభనుగురించిన నోటీసులను కూడ ప్రకటించవలయును.

11. మీటింగునుగురించి నిర్ణయింపబడిన రోజునను కాలమందును స్థలమందును సంబంధముగల తహశ్శీలుదారు లేక డిప్యూటీ తహశ్శీలుదారు; ఆ మీటింగులో అధ్యక్షత్వము వహించవలయును, మరియు అక్కడ కూడియున్న వారికి ఎలెక్టు చేయవలసిన పంచాయతీదార్ల సంఖ్యను తెలియబరుపవలయును.

కాని సంబంధముగల తహశీలుదారు లేక డిప్యూటీ తహశ్శీలుదారు అసాధారణమైన సందర్భములలో వ్రాత మూలకమైన ఆర్డరు

ద్వారా అధ్యక్షుడుగా చేయవలసిన అన్ని పనులను చేయుటకు ఒక రివిన్యూ ఇన్‌స్పెక్టరును నియోగించవచ్చును. అట్టిపనులను నెరవేర్చుటకు నియోగింపబడిన రివిన్యూ ఇన్‌స్పెక్టరుకు యీ విధుల ప్రకారము అధ్యక్షుడు చేయవలసిన అన్ని పనులను నెరవేర్చుటకు అధికారము కలిగి యుండును.

12. పంచాయతీదారుని ఉద్యోగము కొరకైన ఒక దరఖాస్తుదారుడు (కాండిడేటు) ఆ మీటింగులో హాజరైయున్న కాపురస్థులగు గ్రామస్థులలో ఇద్దరికంటె తక్కువకానంత సుందిచే పేరొక్కన బడవలయును. ఆ పేరొక్కనడము (నామినేషను) వ్రాతమూలముగా నైనను నోటిమాటగా నైనను చేయబడవచ్చును. ఈ రెండవ సందర్భములో అధ్యక్షత్వము వహించియుండు ఆఫీసరు ఆ పేరొక్కనడము (నామినేషను)ను గురించి యొక నమోదు చేయవలయును.

13. ఏ యెన్నికదారుని అర్హత విషయమై లేదా ఒక పంచాయతీదారుని నియామకము విషయమై అతడు అర్హుడు కాడను లేదా అనర్హుడను కారణమున ఆక్షేపణ చేయబడిన యెడల, ప్రిసైడు చేసే ఆఫీసరు అట్టి ఆక్షేపణమీద తీర్పుచెప్పవలెను. అట్టి తీర్పు 18, 18 A విధులలోని నిబంధనలకు లోబడి ఆఖరు తీర్పుగా యుండవలసినది.

14. పేరొక్కనబడిన అర్హులగు దరఖాస్తుదార్ల (కాండిడేట్ల యొక్క సంఖ్య ఎలెక్టుచేయబడవలసిన పంచాయతీదార్ల సంఖ్యకంటె తక్కువగా నున్న యెడల లేదా అందుకు సమానముగా నున్న యెడల వారు క్రమముగా ఎలెక్టుచేయబడినట్లు అధ్యక్షత్వము వహించియుండు అఫీసరు ప్రకటించవలయును. మరియు వారిపేర్లను రెవిన్యూడివిజనల్ ఆఫీసరుకు రిపోర్టు చేయవలయును. పేరొక్కనబడిన (నామినేటు చేయబడిన) వారి సంఖ్య ఎలెక్టుచేయవలసినవారి సంఖ్య కంటె తక్కువగా నుండునెడల విల్చియున్న కాళీలను భర్తీచేయుటకు ఒక తాజాఎలెక్షను గురించి, అధ్యక్షత్వము వహించు ఆఫీసరు నోటీసు యియ్యవలయును.

15. ఎలెక్టు చేయబడవలసిన పంచాయతీదార్ల సంఖ్య కంటె కాండిడేట్ల సంఖ్య యెక్కువ అయియుండు నెడల, అంటట 16 నుండి 18 వరకు గల విధులలో నిర్దేశింపబడియుండు ప్రకారము ఎలెక్షను జరుగవలయును.

ఎలెక్షను చేయు పద్ధతి.

16. ఎలెక్షను చేతులనెత్తుట మూలకముగా జరుగ వలయును.

వేరు వేరు కాండిడేట్లకు వచ్చిన ఓట్లు వేరు వేరుగా రికార్డు చేయబడవలెను. మరియు అత్యధిక సంఖ్య ఓట్లువచ్చిన దరఖాస్తుదార్లు (కాండిడేట్లు) యెలెక్టు చేయబడినట్లు ప్రకటింపబడవలయును. మరియు వారిపేర్లు రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుకు రిపోర్టు చేయవలయును. ఇద్దరు లేక ఎక్కువమంది కాండిడేట్లకు ఓట్లు సమముగా వచ్చియుండు సందర్భములో వారిలో ఎవరు ఎలెక్టు చేయబడినట్లు ప్రకటింపబడవలయునో లాటు (చీట్లు) మూలముగా నిర్ణయింపబడవలయును.

17. రెవిన్యూడివిజనల్ ఆఫీసరు ఎలెక్షనుయొక్క ఫలితములను డిస్ట్రిక్టు గెజెటులో ప్రకటింప బడునట్లు చేయవలయును మరియు పంచాయతీదార్ల యుద్యోగపు కాలము అట్టి ప్రకటన తారీఖు నుండి ప్రారంభించ వలయును.

17 (a) ఆక్టు 9 వ సెక్షను 3a సబు సెక్షను క్రింద కలెక్టరు పేర్కొనుటమూలముగా నియమింపబడిన మెంబర్లపేర్లు జిల్లాగెజెటులో ప్రచురించబడవలెను. మరియు అట్టి పంచాయతీదార్ల ఉద్యోగపరిమితి అట్టి ప్రచురణ తేదీ లగాయితు ప్రారంభము కావలెను.

18. (a) ఏపంచాయతీదారుని ఎలెక్షనుకైన ఆక్షేపణలు ఎలెక్షను తర్వాత ఏడు రోజుల లోపల రెవిన్యూ డివిజనలు అఫీసరుకు చేసికో బడవలయును. రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు సంబంధముగల పార్టీలకు నోటీసు యిచ్చినతరువాత ఆయాక్షేపణలను విచారించి, తమకు యుక్తమని తోచునట్టియు త్తరువులను జారీచేయవలయును. అయితే ఒకమనిషి

అనర్హుడు లేక అర్హుడు కాడను కారణముమీాద ఆక్షేపణ చేయబడిన యెడల, అట్టిఎలెక్షను జరుగునప్పుడే చేయబడిననేతప్ప ఆ యాక్షేపణ అంగీకరింపబడకూడదు.

(b) రివిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్క ఉత్తరువులు 18A విధియొక్క నిబంధనలకు లోబడి కడపటివిగా నుండవలెను.

18. A జిల్లాకలెక్టరు తన యిష్టానుసారముగా,

(i) తనంతట తాను, లేదా

(ii) 13 వ విధి ననుసరించి చేయబడిన తీర్పునల్లగాని, లేక 18 వ విధి ననుసరించి చేయబడిన ఒక వుత్తరువుచేగాని బాధింపబడిన ఏ పార్టీచేగాని అట్టి తీర్పు లేక ఉత్తరువు తేదీనుండి 30రోజుల లోపుగా ఒక అర్జీ ఆయనకు దాఖలుచేయబడినమీాదనుగాని, సంబంధముగల పార్టీలకు నోటీసునిచ్చి వారి ఆక్షేపణలు యేవేనివున్నయెడల వాటిని వినిన తరువాత,

(ఏ) ఎన్నికఫలితము యీావిధులను ఉల్లంఘించుటమూాలముగా లేదా తప్పుగా అర్థము చేయుటమూాలముగా వస్తుతః బాధింపబడినదని తాను అభిప్రాయపడునెడల, ఎన్నికను రద్దుచేసి ఒక క్రొత్త ఎన్నికను ఉత్తరువు చేయవచ్చును.

(బి) 13 వ విధి ననుసరించి యివ్వబడిన తీర్పు లేక 18 వ విధి ననుసరించి చేయబడిన ఒక ఉత్తరువుగాని, చట్టమునకు విరుద్ధముగా ప్రవర్తించుటవల్లగాని, లేక యీా విధులను తప్పుగా అర్థము చేయుట మూాలముగాగాని సరిగా లేదని తాను అభిప్రాయపడు నెడల, తనకు యుక్తమని తోచే ఆర్డరు జారీ చేయవచ్చును.

18 B. 13 లేక 18 లేక 18 A. విధులక్రింద యివ్వబడిన ఎట్టి తీర్పుగాని, జారీచేయబడిన యే వుత్తరువుగాని, యే సివిల్‌కోర్టులోను దావా మూాలమున గాని, లేదా యితరవిధముగా గాని నిరోధింపబడ తగినదిగా యుండకూడదు.

## వ్యాఖ్య.

ఈ రూలు ప్రకారము 13, లేక 18 లేక 18A రూలు క్రింద యివ్వబడిన తీర్పు లేక ఆర్డరు ఆఖరుదిగా యుండవలెను. అట్టి తీర్పునుగాని, ఆర్డరునుగాని సివిల్ కోర్టులో దావా వేసిగాని, మరియొక విధముగాగాని రద్దుచేయించుటకుగాని, ప్రశ్నించుటకుగాని వీలులేదు.

## హైకోర్టు తీర్పు.

50 మ॥ లా॥ జ॥ 148=1926 ఆ॥ ఇ॥ రి॥ మద్రాస్ 246 = 50 ఇ॥ లా॥ రి॥ మద్రాస్ 91=23 మ॥ లా॥ వీ॥ 103=92 యిం॥ కే॥ 790.

జడ్జీలు:— దేవదాసు, వాలర్ గార్లు.

కానూరి వేంకట శివరావు వగైరా—పిటీషనర్లు (ప్రతివాదులు)

చిట్టూరి రామకృష్ణయ్య—రెస్పాండెంటు (వాది)

మ॥ గ్రా॥ కో॥ ఆ॥ క్రింద జరుపబడిన పంచాయతీకోర్టు మెంబర్ల ఎలక్షన్లు చెల్లతగినవి కావని డిక్లేరు చెయ్యవలసినదనిన్నీ, అట్లు యెన్నుకొనబడిన ప్రతివాదులు అయిన పంచాయతీకోర్టు మెంబర్లు పంచాయతీకోర్టులో యెట్టిపని చెయ్యకుండా యింజంక్షను యివ్వవలసినదనిన్నీ కోరుచూ వాది డి॥ ము॥ కోర్టులో దావా దాఖలు చేయగా డి॥ ము॥ కోర్టువారు యింజక్షను యిచ్చిరి. అందుపైన ప్రతివాదులు హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలుచేయగా హైకోర్టువారు,

(1) డి॥ ము॥ కోర్టు యింజంక్షను యిచ్చుట పొరపాటనిన్నీ, గ్రా॥ కో॥ కోర్టు క్రింద చేయబడిన 64 విధి ప్రకారము పంచాయతీకోర్టు ఎన్నికలలో యెట్టిలోపము లున్నను పంచాయతీ మెంబర్లు కోర్టులో జరిగించే చర్యలు చెల్లుననిన్నీ, యింజంక్షను యిచ్చుటవల్ల గ్రామస్థులకు పంచాయతీకోర్టు యున్నలాభమును పొందుటకు ఆటంకముగా యుండుననిన్నీ,

(2) పంచాయతీకోర్టు ఎన్నికలు రద్దుపరచమని డి॥ ము॥ కోర్టులో దావా వేయుటకు 18 వ విధి ప్రకారము వీలులేదనిన్నీ, సదరు విధి ప్రకారము రివిన్యూ డివిజనల్ ఆఫీసరుయొక్కయు, జిల్లాకలెక్టరుయొక్కయు తీర్పులు ఆఖరు తీర్పులనిన్నీ, వాటిని దావావేసిగాని మరియొక్క విధముగాగాని రద్దుచేయించుటకు వీలులేదనిన్నీ డి॥ ము॥ కు యీ దావాను విచారించు అధికారములేదనిన్నీ,

(3) సె. 78 (3) క్రింద గవర్నమెంటువారు విధులను చేయుటకు అధికారము గలదనిన్నీ, అట్లు చేయబడిన విధులు సక్రమమైనవనిన్నీ తీర్మానించిరి.

19. (1) ఒక పంచాయతీ కోర్టు క్రొత్తగా యేర్పాటు చేయబడినప్పుడెల్ల, లేదా ఒక పంచాయతీకోర్టు తాలూకు ప్రెసిడెంటు లేదా వైస్ ప్రెసిడెంటు యొక్క ఉద్యోగము ఖాళీ యైనప్పుడెల్ల, రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు,

(a) పంచాయతీకోర్టు దానివి ప్రెసిడెంటును లేదా వైస్ ప్రెసిడెంటును లేదా ఇరువురను ఎన్నుకొనుటకు గాను సమావేశము కావలసిన తేదీని, గంటను, స్థలమును నిర్ణయించవలెను. మరిన్ని,

(b) ఇతర యావన్మంది మెంబర్లకు 5 దినములకు తక్కువకాని నోటీసునిచ్చిన తరువాత సభను సమావేశపరచుటకుగాను పంచాయతీ కోర్టుయొక్క ఒక మెంబరును నియమించవలెను.

అయితే ఎన్నిక ప్రెసిడెంటుది మాత్రమే యైనప్పుడు వైస్ ప్రెసిడెంటు అట్టి మీటింగును సమావేశపరచ వలసినదిగా అడుగబడవలెను. మరియు ఎన్నిక వైస్ ప్రెసిడెంటుది మాత్రమే యైనపుడు ప్రెసిడెంటు అట్టి మీటింగును సమావేశపరచ వలసినదిగా అడుగబడవలెను.

(2) అట్టి మీటింగునకు ఆక్టుయొక్క 9 వ సెక్షను 2 వ సబు సెక్షను క్రింద కోర్టునకు నిర్ణయింపబడిన మెంబర్ల సంఖ్యలో సగము కోరము (నిర్ణీతమగు అధమసంఖ్య)గా నుండవలెను.

(3) 1వ సబ్ రూలు క్రింద మీటింగు సమావేశపరచ వలసినదిగా నియమింపబడిన మెంబరు లేక ఆయా సందర్భమును బట్టి ప్రెసిడెంటు లేదా వైస్ ప్రెసిడెంటు ఆ మీటింగుకు చైర్మనుగా యుండవలెను. మరియు అట్టి మెంబరు లేదా ఆయా సందర్భమునుబట్టి ప్రెసిడెంటు లేదా వైస్ ప్రెసిడెంటు హాజరుగా లేనియెడల, హాజరైన మెంబర్లు తమలో నుండి యొకరిని చైర్మనుగా ఎన్నుకోవలెను.

20. ప్రెసిడెంటు లేక వైస్ ప్రెసిడెంటు ఉద్యోగమునకైన అభ్యర్థి, అతనిపేరు ఒక మెంబరుచే ప్రొపోజు చేయబడి యింకొకరిచే

సమర్థింపబడుట మూలముగా పేర్కొనబడవలెను. ఏ అభ్యర్థిగాని తన స్వంతపేరును ప్రొపోజు చేయకూడదు. లేదా తనపేరు విషయముగ జేయబడిన ప్రొపోజులును సమర్థించనూ కూడదు.

ఒక కాండిడేటు మాత్రమే పేర్కొబడునెడల, అతడు ఎలెక్టు చేయబడినట్లు ప్రకటింపబడవలయును.

ఒక కాండిడేటు కంటె యెక్కువమంది పేర్కొనబడు నెడల, చేర్మను (అగ్రాసనాధిపతి) మెంబర్లకు కాగితపు ముక్కలను పంచవలయును. మరియు ప్రతిమెంబరును తానుఎవరికొరకు ఓటుయిచ్చునో ఆ కాండిడేటు పేరును తన కాగితము ముక్కమీద వ్రాయవలయును.

అంతట చేర్మను (అగ్రాసనాధిపతి) ఆ కాగితపు ముక్కలను జమచేసి వోట్లను లెక్కపెట్టవలయును. అత్యధికవోట్లను సంపాదించు కాండిడేటు ఎలెక్టుచేయబడినట్లుప్రకటింపబడవలయును మరియు అతని పేరు రెవిన్యూడివిజనల్ ఆఫీసరుకు రిపోర్టు చేయబడవలయును.

ఇద్దరు లేక యెక్కువమంది కాండిడేట్లకు వోట్లు సమముగా వచ్చియుండు సందర్భములో వారిలో యెవరు ఎలెక్టు చేయబడినట్లు ప్రకటింపబడవలెనో లాటు (చీట్లువేయుట) మూలముగా నిర్ణయింపబడవలెను.

వివరణము:- ఈ విధియొక్క కార్యములనిమిత్తము 'సభ్యుడు' అనుమాట దానియొక్క వ్యాకరణ సంబంధమైన రూపభేదములతోడ చైర్మనుకు కూడ వర్తించును.

21. ప్రెసిడెంటు వైస్ ప్రెసిడెంటు ఎలెక్షనుపై ఆక్షేపణలు ఎలెక్షను తేదీ నుండి ఏడు రోజులలోగా రెవిన్యూడివిజనలు ఆఫీసరుకు చేయబడవలెను. రెవిన్యూడివిజనలు ఆఫీసరు ఆ యాక్షేపణలనుగూర్చి విచారించి తనకు యుక్తమని తోచు ఉత్తరువులను చేయవలయును. రెవిన్యూ డివిజనలు ఆఫీసరుయొక్క ఉత్తరువులు 21 A' విధి యొక్క నిబంధనలకు లోబడి కడపటివిగా నుండవలెను.

వ్యాఖ్య.

హైకోర్టు తీర్పు.

ఆ॥ ఇ॥ రి॥ 1931 మద్రాస్ 492

జడ్జి:—పాండలేగారు.

లక్ష్మినారాయణ అయ్యర్ వగైరా—(ముద్దాయిలు) పిటీషనర్లు.

చిన్నప్పగౌండన్—రెస్పాండెంటు.

ఈ కేసులో పిటీషనర్లు ఒక గ్రామ కరణమున్నూ గ్రామ మునసబున్నూ అయియున్నారు. పిటీషనర్లు యీ కేసులో ఫిర్యాది (అనగా రెస్పాండెంటు) యింక మరి యిద్దరున్నూ సదరు గ్రామ పంచాయతీ కోర్టు మెంబర్లుగా యెన్నుకొనబడిరి. డిప్యూటీ కలెక్టరుగారు సదరు మెంబర్లకు పంచాయతీకోర్టుకు ప్రెసిడెంటును యెన్నుకొనవలసినదని నోటీసు నిచ్చిరి. అందుపైన మీటింగు జరిగి, సదరు మీటింగులో రెస్పాండెంటు ప్రెసిడెంటుగా యెన్నుకొనబడెను. మీటింగు కార్యక్రమములు వగైరాలు ప్రెసిడెంటు వ్రాసి అందరి మెంబర్లచేత సంతకములు చేయించి, సదరురిపోర్టును డిప్యూటీ కలెక్టరుగారికి పంపవలసినదిగా గ్రామమునసబుకు యివ్వగా గ్రామమునసబు ప్రెసిడెంటు యిచ్చిన రికార్డును పంపక దానిస్థానే మరియొక తేదీన మీటింగులో ప్రెసిడెంటు ఎన్నిక జరిగినట్లున్నూ, ఆ యెన్నికలో కరణము ప్రెసిడెంటు అయినట్లున్నూ రికార్డు సృష్టించి పంపెను.

అందుపైన ఫిర్యాది తహశ్శీలుదారుగారికి రిపోర్టుచేయగా వారు డిప్యూటీ కలెక్టరుగారికి వ్రాయగా డిప్యూటీ కలెక్టరుగారు ఆ ఎన్నికను రద్దుచేసి తిరిగి ప్రెసిడెంటును ఎన్నుకొనవలసినదని ఉత్తరువు యిచ్చిరి.

ఫిర్యాది ముద్దాయిలపైన ఇం॥ పీ॥ కో॥ సె 193,204,407 ల ప్రకారము చార్జి యివ్వగా ముద్దాయిలు. (1) తహశ్శీలుదారు గారున్నూ, డిప్యూటీ కలెక్టరుగారున్నూ యీ కేసు సందర్భములను విచారించినపుడు వారి విచారణ రెవిన్యూకోర్టుగా జరిపినట్లు యెంచవలసి యున్నదనియు, అందువల్ల సదరుకోర్టువారే ఫిర్యాదు చేయవలసియున్నదనియు, (2) పిటీషనర్లు పంచాయతీకోర్టు జడ్జీలు అయినందున లోకల్ గవర్నమెంటు వారి అనుమతి లేనిదే చార్జిదాఖలుచేయ వీలులేదనే మొదలగు సంగతులతో హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా అందుపైన హైకోర్టువారు:— ఈకేసు సందర్భములను 21వ విధి ననుసరించి విచారించిన తహశ్శీలుదారుగారు కాని డిప్యూటీ కలెక్టరుగారు కాని "కోర్టు" కానేరరనియు వారు ఫిర్యాదు దాఖలు చేయవలసిన నిమిత్తము లేదనిన్నీ,

పంచాయతీకోర్టు మెంబర్లుకూడ ఆ. ఇ. రి. 1929 మద్రాస్ 172 లోని తీర్పు ప్రకారము జడ్జీలనిన్నీ, కాని యీ కేసులోని గ్రామకరణము, మునసబులు పంచాయతీ మెంబర్లుగా యెట్టిచర్య తీసికొని యుండలేదనిన్నీ, డిప్యూటీకలెక్టరుగారి క్రింది నౌకర్లు అయినందున రికార్డును పంపవలసి వచ్చినదనియు, వారు పంచాయతీ కోర్టు మెంబర్లు కానప్పటికిన్నీ రికార్డు పంపే బాధ్యతయున్నదనియు, అందువలన వారిపైన వ్యాజ్యె దాఖలుచేయుటకు లోకల్ గవర్నమెంటువారి అనుమతి అవసరము లేదనియు తీర్మానించిరి.

21. A. కలెక్టరు తన యిష్టానుసారముగా,

(1) తనంతట తాను, లేదా

(2) 21 వ విధి ననుసరించి చేయబడిన ఒకఉత్తరువుచే బాధింపబడిన ఏ పార్టీచేగాని, అట్టి ఉత్తరువు తేదీనుండి.30 రోజుల లోపుగా ఒక అర్జీ ఆయనకు దాఖలుచేయబడిన మీదట,

సంబంధించిన పార్టీలకు నోటీసునిచ్చి వారి ఆక్షేపణలు ఏ వేని వున్నయెడల వాటిని వినిన తరువాతను,

(ఎ) ఎన్నిక ఫలితము యీవిధులను ఉల్లంఘించుటమూలముగా లేదా తప్పుగా అర్థము చేయుటమూలముగా వస్తుతః బాధింపబడినదని తాను అభిప్రాయపడు నెడల, ఎన్నికను రద్దుచేసి ఒక క్రొత్త ఎన్నికను ఉత్తరువు చేయవచ్చును. లేక

(బి) 21 వ విధి ననుసరించి చేయబడిన యే ఉత్తరువు గాని, చట్టమునకు విరుద్ధముగా ప్రవర్తించుట వల్లగాని లేక యీ విధులను ఉల్లంఘించుటవల్ల లేదా తప్పుగా అర్థము చేయుటవల్ల గాని, సరిగా లేదని తాను అభిప్రాయపడు నెడల, తనకు యుక్తమని తోచే ఆర్డర్లు జారీ చేయవచ్చును.

21. (B) 21 వ లేదా 21 A విధి ననుసరించి జారీచేయబడిన యెట్టి వుత్తరువుగాని, వ్యాజ్యము మూలగా లేదా యితర విధముగా యెట్టి సివిల్ కోర్టులోగాని ప్రశ్నించబడ తగయుండకూడదు.

22. పంచాయతీకోర్టు ప్రెసిడెంటు లేక వైస్‌ప్రెసిడెంటుయొక్క ఉద్యోగకాలము, అతడు మెంబరుగా నుండక నిలచిపోయినప్పుడు అంతము కావలెను.

22. (A) 8వ సెక్షనుక్రింద పంచాయతీ కోర్టు ప్రెసిడెంటు తన పదవినుండి తొలగింపబడినపుడు అతడు ఆకోర్టు మెంబరుగా యుండుట నిలిచిపోవలెను.

23. కోర్టు మీటింగు లన్నియు అధ్యక్షుని (ప్రెసిడెంటు) చే, మరియు ఆ మీటింగును గురించిన నోటీసు ఆ మీటింగుకు పూర్తిగ 3 రోజుల పూర్వము మెంబర్ల కందరికిని పంపబడవలయును. అయితే అందరి మెంబర్ల యిష్టముమీద ఒక వారములోగాని, ఒక నెలలోగాని నిర్దేశింపబడిన దినములలో మీటింగులు జరుపునట్లు పంచాయతీకోర్టు తీర్మానించుటకు అధికారముయుండును. అట్టిసందర్భములలో నిర్దేశింప బడిన దినములలో పెట్టబడే మీటింగులవిషయములో పైవాక్యములో నిర్దేశింపబడిన నోటీసు అవసర ముండదు. అధ్యక్షుడు (ప్రెసిడెంటు) కోర్టుయెదుట పనులు చురుకుగా జరుపబడుటకొరకై అగత్యమైయుండు నంత తరుచుగా మీటింగులను కూర్పవలయును.

24. ఒక కేసు విచారణ లేక యితర ప్రొసీడింగు ప్రారంభించ బడినప్పుడు గైరుహాజరుగానుండు ఏ మెంబరును ఆ కేసు విచారణ యొక్క లేదా ఆ ప్రొసీడింగుయొక్క యే దరిమిలా దశలోగాని పాల్గొనకూడదు.

25. ఒక కేసు లేక ప్రొసీడింగుయొక్క విచారణ జరుగు కాల మందు తీర్పుకు పూర్వమెప్పుడైన ఆకేసును లేక ప్రొసిడింగును విచా రించుచున్నట్టి కోర్టుయొక్క ఏ మెంబరుగాని చనిపోయినయెడల లేదా యే విధమైన కారణమువల్లనైన హాజరు కానియెడల, పునర్విచారణ ప్రారంభమగునప్పుడు ఇతర మెంబర్లసంఖ్య ముగ్గురికంటె తక్కువగా ఉన్ననే తప్ప, ఆ విచారణ ఇతర మెంబర్లతో జరుగవలెను.

26. (విడిచి పెట్టబడినది.)

## II. ఆక్టుయొక్క 78 (2) వ సెక్షనులో (d), (e), (f) ల ననుసరించిన విధులు.

27. ఏ కోర్టుగాని అది విచారించ దగిన నేరమును, (a) అట్టి నేరము అగుటకు జరిగిన అంశములను గూర్చి ఫిర్యాదు చేయబడిన మీాదటనే తప్ప, లేదా (b) అట్టి హంశములను గూర్చి పోలీసు రిపోర్టును పంపినమీాదటనే తప్ప, విచారణకు తీసికొనకపోవచ్చును.

కోర్టు కూర్చుని యున్నయెడల కోర్టుకే ఫిర్యాదు చేయబడవచ్చును. లేదా రిపోర్టుదాఖలుచేయబడవచ్చును; కోర్టుకూర్చునియుండనప్పుడు ప్రెసిడెంటుకుగాని, లేదా అతడు లేనప్పుడు యిందునిమిత్తమై అతడు నియమించునట్టి యితర పంచాయతీదారునకు గాని, చేయబడవచ్చును.

28. ఫిర్యాదు నూాజువాణిగా చేయబడినప్పుడు, కోర్టుగాని, లేదా ప్రెసిడెంటుగాని, లేదా అతడులేనప్పుడు ఫిర్యాదును అందుకొనుటకు అధికారము యివ్వబడిన యితర పంచాయతీదారుని గాని దానిని సరిగా రెకార్డుచేసి, ఫిర్యాదీకి చదివివినిపించి, దానిమీాద వానియొక్క సంతకమును తీసికొనవలెను.

29. కోర్టుకు ఫిర్యాదుచేయబడినప్పుడు, కోర్టుఫిర్యాదిని ప్రమాణము చేయించి వెంటనే విచారించవలెను. ఫిర్యాదీని విచారించిన తరువాత చర్యతీసికొనుటకు తగినంతకారణము కోర్టుకుకనుపడనియెడల అది ఫిర్యాదును త్రోసివేయవలెను; చర్య తీసికొనుటకు తగినంత కారణము దానికి కనుపడిన యెడలను, మరియు పోలీసు రిపోర్టులమీాద విచారణకు తీసికొని కేసులలోను, కేసుహియరింగు(వినడము)కొరకు ఒకరోజును స్థిరపరచి, ముద్దాయియు ఫిర్యాదీ తరఫు సాక్షులును హాజరగుటకుగాను సమనులను అది జారీచేయవలెను.

వ్యాఖ్య.

ఈ విధి ప్రకారముగాని, 30వ విధి ప్రకారముగానిఫిర్యాదీని విచారించిన తరువాత చర్య తీసికొనుటకు తగిన కారణములేదని ఫిర్యాదు త్రోసివేసినగాని లేక ఫిర్యాది హాజరులేనందున 31వ విధి ప్రకారము ఫిర్యాదును త్రోసివేసినగాని, అట్లు త్రోసివేయ డమువల్ల ముద్దాయి నిర్దోషత్వము స్థిరపడినట్లు చెప్పుటకు వీలులేదు. ఆ సందర్భములో ముద్దాయిపైన అదే నేరముకు మరల ఫిర్యాదు చేయుటకు క్రి. ప్రొ. కో. సె. 408 ప్రకారము యెట్టి అభ్యంతరము యుండదు. సె 77 క్రింద వ్యాఖ్యానము చూడవలెను.

30. ఫిర్యాదు లేదా రిపోర్టు కోర్టుకు దాఖలు చేయబడనప్పుడు ఆయా సంగతికి తగినట్లు ప్రెసిడెంటుగాని, లేక ఇతర పంచాయతీదారు గాని, కోర్టువలన ఫిర్యాదీ విచారింపబడుటకు గాను, సాధారణముగా ఫిర్యాదు వచ్చినతరువాత ఏడు రోజులు దాటకుండునట్లు ఒక రోజును స్థిరపరచి, అట్లు స్థిరపరచబడినరోజుకు కోర్టు మీాటింగును సమను చేయ వలెను. ఆ నియమింపబడిన రోజున ఫిర్యాదీ హాజరైనయెడల వానిని ప్రమాణముచేయించి కోర్టు విచారించవలయును. ఫిర్యాదీని విచారిం చిన తరువాత, చర్య తీసికొనుటకు తగినంత కారణము కోర్టుకు కను పడని యెడల, లేదా ఫిర్యాదీ హాజరు కానియెడల అది ఫిర్యాదును త్రోసివేయవలెను; చర్యతీసికొనుటకు దానికితగినంతకారణముకనుపడిన యెడలను, మరియు పోలీసు రిపోర్టులమీాద విచారణకు తీసికొనబడిన కేసులలోను, కేసు హియరింగుకు ఒకరోజును నియమించి, ముద్దాయి యును, ఫిర్యాదీతరఫు సాక్షులును హాజరగుటకుగాను అది సమనులను జారీ చేయవలెను.

**30-A.** ఒకనికంటె ఎక్కువమంది మనుష్యులపై ఒకేవ్యాపార ములో చేయబడిన ఒకే నేరముగాని, వేర్వేరు నేరములుగాని మోప బడినప్పుడు, లేదా ఒక నేరమునుచేసినట్లు ఒకనిపైనను, అట్టి నేరమునకు మద్దతుచేసినట్లు మరియొకనిపైనను ఆరోపింపబడినప్పుడు, వారు కోర్టు వారు యుక్తమని తలంచునట్లు కలిపి గాని, వేర్వేరుగా గాని, ఛార్జి (దోషారోపణ) చేయబడి, విచారింపబడవచ్చును.

30-B. ఒకే వ్యాపారముగా ఏర్పడునట్లు ఒకదానితో నొకటి సంబంధము కలిగియున్న కార్యములయొక్క ఒకే సముదాయములో ఒకటికంటె ఎక్కువ నేరములను ఒకమనిషి చేసియున్నపుడు వాడు, ఒకవిచారణలోనే అట్టి ప్రతినేరమునకును ఛార్జిచేయబడిన, విచారింపబడవచ్చును.

30-C. ఒక మనిషి ఒక నేరమునకు ఛార్జిచేయబడి, దానిని ఒక స్వల్ప నేరముగా చేయుసంగతులు ఋజువుపరచబడినప్పుడు ఆ స్వల్ప నేరమునకు వాడు చార్జి చేయబడకపోయినను, వానిపై ఆ స్వల్ప నేరమే స్థాపింపబడవచ్చును.

30-D. ఏ మనిషి హాజరగుటకుగాను లేదా ఏమనిషిని అరెస్టు చేయుటకుగాను సమ్మనులను లేక వారంటును జారీచేయుటకు కోర్టువారికి అధికారము కలదో ఆ మనిషి కోర్టులో హాజరుగా నున్నప్పుడు కోర్టువారు అట్టి మనిషిని అట్టి కోర్టులో అతడు హాజరగుటకుగాను రు 5 లకు మించనట్టి కోర్టువారు యుక్తమని తలచునట్టి ఒక మొత్తమునకు ఒక జామీను పత్రము వ్రాసియివ్వమని కోరవచ్చును.

వ్యాఖ్య.

ఈ ఆక్టుననుసరించి చేయబడిన సమన్సు ప్రకారము ముద్దాయి కోర్టుకు హాజరైన తరువాత ముందు వాయిదాలకు హాజరగునట్లు ముద్దాయివద్దనుండి బాండు తీసికొనుటకు పంచాయతీకోర్టులకు అధికారము యుండదని 54 మ॥లా॥జ॥ నో॥కే॥కే॥ 47 పేజీలో జడ్జి దేవదాసుగారు తీర్మానించిరి.

31. హియరింగు స్థిరపరుపబడిన రోజునగాని, లేదా కేసు నిలిపి పెట్టబడిన యేయితర రోజునగాని, ఫిర్యాదీ హాజరగుటకు తప్పినయెడల ఫిర్యాదు క్రోసి వేయబడవచ్చును.

32. హియరింగు స్థిరపరుబడిన రోజున ముద్దాయి అగుపడని యెడలను, మరియు సమనులు అతనికి అందజేయబడినట్లు కనుపడని యెడలను, విచారణ మరియొకరోజుకు నిలిపిపెట్టబడవలెను. మరియు ఆ రోజున హాజరగుటకు ముద్దాయికి క్రొత్తసమనులు జారీచేయబడవలెను.

33. సమనులు అందజేయబడిన తరువాత ముద్దాయి హాజరగుటకు తప్పినయెడల లేదా అతడు సమనులు అందుకొనుటకు తప్పించుకొనుచున్నట్లు అగుపడినయెడల, అతనిని పట్టుకొనుటకు వారంటును జారీచేయవచ్చును. సాధారణముగా ప్రథమములో జామీను వారంటు జారీ చేయబడవలెను.

34. హియరింగుకు స్థిరపరచిన రోజున ముద్దాయి హాజరయిన యెడల, ప్రెసిడెంటు ఆయాసందర్భమును బట్టి ఫిర్యాదు లేక పోలీసు రిపోర్టు సారమును వానిపై ఆరోపించబడిన నేరము యొక్క లేక స్వభావమును ముద్దాయికి బోధపరచి, వాడు ఆ దోషారోపణము ఒప్పుకొనునో, నిరాకరించునో వానిని అడుగవలెను.

35. వాడు నేరముచేసినట్లు వాదించునెడల, కోర్టు వానిని నేరస్థునిగా స్థిరపరచి, చట్టమున కనుగుణముగా వానిని శిక్షింపవలెను.

36. వాడు నేరము చేయలేదని వాదించినయెడల గాని, లేదా వాదించుటకు నిరాకరించినయెడలగాని, ఫిర్యాదీ ఎవరైన ఉన్నయెడల వానినిన్ని, ఫిర్యాదీ తరఫు సాక్షులనున్ను, ముద్దాయి తరఫు సాక్షులనున్ను, కోర్టు పరీక్షించుటకు ప్రారంభించవలెను.

## వ్యాఖ్య.

ముద్దాయి తాను నేరము చేయలేదని చెప్పినను లేక యే సంగతి చెప్పుటకు నిరాకరించినను కోర్టువారు ఫిర్యాదినిన్నీ ఫిర్యాదితరఫు సాక్షులను విచారించి కేసును తీర్మానము చేయవలెను. కాని ముద్దాయి యే సంగతిని చెప్పుటకు నిరాకరించినను అతడు ఇం॥ పీ॥ కో॥ సె 179 (సవాలు వెయ్యడమునకు అధికారము గల పబ్లిక్ ఉద్యోగస్థునికి జవాబు చెప్పక తిరుగుబాటు చెయ్యడము) ప్రకారము నేరస్థుడు కానేరడు.

## హైకోర్టు తీర్పు

1924 మ॥ వీ॥ నో॥ 141. జడ్జీలు:—సాభీ, వాలర్ గార్లు

యస్. తిరుమలరెడ్డి — పిటీషనరు

గవర్నమెంటువారు — రెస్పాండెంటు.

పిటీషనరు పంచాయతీకోర్టు యెదుట నొక కేసులో ముద్దాయిగాయుండి సదరు పంచాయతీకోర్టువారు అడిగిన ప్రశ్నలకు జవాబుచెప్పుటకు నిరాకరించెను. అందుపైన

పంచాయతీకోర్టువారు పిటీషనరు ఇం॥ పీ॥ కో॥ సె 179 ప్రకారము నేరస్థుడని అతనిని సదరు నేరమునకు విచారించవలసినదని సబ్ మాజిస్ట్రేటుకోర్టుకు రిపోర్టుచేయగా సబ్ మాజిస్ట్రేటు కేసును విచారించి పిటీషనరు నేరస్థుడని రు 10 లు జుల్మానా విధించెను. అందుపైన ముద్దాయి హైకోర్టులో రివిజన్ పిటీషను దాఖలు చేయగా హైకోర్టువారు,

(1) ముద్దాయి పంచాయతీకోర్టువారు అడిగిన ప్రశ్నలకు జవాబుచెప్ప నగత్యము లేదనిన్ని,

(2) ముద్దాయి జవాబు చెప్పకపోవుట 36వ విధిలో చెప్పిన ప్రకారము వాదించుటకు నిరాకరించినట్లు యెంచవలసియుండునుగాని, అట్టి సందర్భములలో ముద్దాయి ఇం॥ పీ॥ కో॥ సె 179 ప్రకారము నేరస్థుడు కాజాలడనిన్ని,

(3) ముద్దాయి వాదించుటకు నిరాకరించినప్పుడు పంచాయతీకోర్టువారు కేసులో సాక్షులను విచారించి తీర్పు చెప్పవలసియుండునని చెప్పుచూ మేజిస్ట్రేటు విధించిన జుల్మానాను రద్దుపరచిరి.

37. ఫిర్యాది లేక ముద్దాయి యొక్క కోరికమీద, కోర్టు నిర్దేశింపబడిన నమూనాలో సాక్షులకు సమనులు జారీచేయవలెను.

38. ఏమనుష్యులసాక్ష్యము కేసుయొక్క న్యాయమైనతీర్పునకు అవసరమని కోర్టుకు కనపడునో అట్టి మనుష్యులను అది సమను చేసి, పరీక్ష చేయవచ్చును.

39. 36వ విధిలో చెప్పబడిన సాక్ష్యమునున్ను, ఇంకను ఏదైన ఉన్నయెడల, దానంతటది దాఖలు చేయించుకొనిన విశేష సాక్ష్యమునున్ను తీసికొని, తనకు యుక్తమని తోచినయెడల ముద్దాయిని పరీక్ష చేసినమీదట, కోర్టు ముద్దాయి నేరముచేయలేదని తీర్మానించేయెడల అది విడుదలకొరకైనా ఒకవుత్తరువును రికార్డుచేయవలెను. ముద్దాయి నేరముచేసినాడని కోర్టు తీర్మానించేయెడల, అది చట్టమున కనుగుణముగా వానికి శిక్ష విధించవలెను.

40. కోర్టు వ్రాత మూలకముగా రికార్డుచేయు కారణములను బట్టి కేసు కనుపరచబడలేదని అభిప్రాయపడే యెడల, ఏ పూర్వదశయందుకాని ముద్దాయిని విడుదల చేయుటకు పై విధిలోని దేదియు కోర్టును అాటంకపరుచునట్లు ఎన్నబడకూడదు.

41. సాక్ష్యములో ముద్దాయికి ప్రతికూలముగా కనుపడునట్టి యే సందర్భములను గురించియైనను ముద్దాయిని సముజాయిషీ చెప్పుకొననిచ్చుటకుగాను; విచారణయొక్క ఏ దశయందుగాని కోర్టు తనకు అవసరమని తోచే ప్రశ్నలను వానిని అడుగవచ్చును; మరియు పైన చెప్పిన కార్యము నిమిత్తము, ఫిర్యాదీ తరఫు సాక్షుల విచారణ అయినతరువాతనున్ను, ముద్దాయిని ప్రతివాదము పెట్టుకొనమని అడుగుటకు పూర్వమున్ను, కేసు విషయమై సామాన్యముగ వానిని ప్రశ్నించవలెను.

42. ముద్దాయి యిచ్చిన సమాధానములు అట్టి విచారణలో ఆలోచింపబడ వచ్చును.

43. అట్టి ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు నిరాకరించినందువలనగాని, లేదా వాటికి అబద్ధపు సమాధానముల నిచ్చినందువలనగాని, ముద్దాయి శిక్షార్హుడు కాకూడదు. కాని అట్టి నిరాకరణము లేక సమాధానములను బట్టి కోర్టు తనకు న్యాయమనితోచు ఊహను ఏర్పరచుకొనవచ్చును.

44. ముద్దాయిచే ప్రమాణము చేయించుకొనకూడదు.

45. కోర్టు ఏకాభిప్రాయము కలిగియుండని యెడల, అధిక సంఖ్యాకులైన కోర్టుమెంబర్ల అభిప్రాయము ననుసరించి తీర్పుఉండవలెను. కోర్టుయొక్క సగముభాగము ఒక అభిప్రాయమును, మరియొక సగము భిన్నాభిప్రాయమును కలిగియున్నపుడు, ప్రెసిడెంటుకు ఒకతీర్మానపు ఓటు వుండవలెను. కోర్టుయొక్క తీర్పును చెప్పుట ప్రెసిడెంటుయొక్క విధి. తీర్పు దానితో ఏకీభవించు కోర్టుమెంబర్లచే సంతకము చేయబడవలెను. భిన్నాభిప్రాయుడగు మెంబరు ఎవరైనను తీర్పునకు భిన్నాభిప్రాయమును పొందుటకుగల తన కారణములను రికార్డు చేయవచ్చును.

46. చాలినంత కారణమును బట్టి ఎప్పుడైనప్పుడు ఒక కేసును నిలిపిపెట్టుటకు కోర్టును అధికారముండవలెను.

47. ఆక్టుయొక్క 76 (1) (బి) (డి) సెక్షనులో నిరూపించబడిన నేరముల విషయములో తప్ప, ఏ దశయందుకాని తనఫిర్యాదును ఉతరాయించుకొనుటగాని లే దానష్టమునుపొందిన మనిషితో రాజీపడుటకుగాని ఫిర్యాది స్వేచ్ఛకలిగిఉండవలెను. ఒక నేరముయొక్క ఉతరాయింపుగాని లేక రాజీగాని ముద్దాయియొక్క విడుదలను ఫలితముగా గలిగి ఉండవలెను.

వ్యాఖ్య.

పంచాయతీ కోర్టులలో దాఖలు కాబడిన క్రిమినల్ కేసులలో ఇం. పీ. కో. సె. 379 క్రింద చోరీకేసులలోను, పహరుల న్యూసెన్సు ఆక్టుక్రింద నేరములకు పెట్టబడిన కేసులలోను ఫిర్యాది ముద్దాయితో రాజీపడుటకుగాని, ఫిర్యాదును ఉతరాయించుకొనుటకు (అనగా యెత్తివేసుకొనుటకు) గాని అధికారము యుండదు. పంచాయతీకోర్టులు విచారించదగిన తక్కిన నేరములకు పెట్టబడిన కేసులను రాజీచేసికొనవచ్చును. లేక ఉతరాయించుకొనవచ్చును. ఈ విధి ప్రకారము ఒక కేసులో రాజీపడినప్పుడుగాని, లేక కేసును ఉతరాయించుకొన్నప్పుడుగాని, ముద్దాయి నిర్దోషత్వము స్థిరపడినట్లు యెంచబడును. అట్టి సందర్భములలో ముద్దాయిపైన అదే నేరమునకు కేసు పెట్టుటకు క్రి.ప్రొ.కో. సె. 403 ప్రకారము వీలుయుండదు. కాని కోర్టువారు కేసును 29, 30, 31 విధులక్రింద త్రోసివేసినయెడల అదే నేరముకు మరల చార్జి దాఖలు చేయవచ్చును.

48. కోర్టు అంగీకరించిన యెడల, ఫిర్యాదితరఫున గాని, లేదా ముద్దాయి తరఫునగాని క్రమముగా అధికారమివ్వబడిన ఒక ఏజెంటు ప్రాతినిధ్యము వహించవచ్చును; కాని ఏ వకీలు గుమాస్తాగాని, లేక అర్జీల ముసద్దీగాని, లేక ప్లీడర్లకు పార్టీలనుచేయువాడుగాని హాజరగుటకు అంగీకరింపబడ కూడదు. ఒక పోలీసు రిపోర్టుమీాద విచారణకు తీసికొనబడిన కేసుయొక్క ఫిర్యాదు చర్యను హెడ్డు కానిస్టేబిలు హోదాకు తగ్గియుండని ఒక పోలీసు ఆఫీసరు అతడు కేసుయొక్క పరిశోధనలో ఏ విధముగను పాల్గొనియుండని యెడల జరిపించవచ్చును.

49. కోర్టు యొక్క స్థానిక అధికార ప్రదేశమునకు వెలుపలనుండు ఏ మనిషికిగాని ఒక ప్రోసెస్సును అందజేయుట లేదా అట్టి మనిషిమీాద దానిని అమలుజరిపించుట అవసరమగునప్పుడెల్ల, ఆమనిషి

ఎవరి అధికార ప్రదేశములో నివసించియుండునో అట్టి స్టేషనరీ సబు మేజిస్ట్రేటుకుగాని లేదా తాలూకా మేజిస్ట్రేటుకుగాని దానిని పంప వలెను. అట్టి మాజిస్ట్రేటు అది తనవలన జారీ చేయబడిన యెట్లో అట్లే దానిని అందచేయించి, లేదా అమలు జరిపించి, పిమ్మట ఆ ప్రోసెస్సును ఏసమయమున, ఏవిధముగా ఏమనిషివలన అందజేయబడి నదో లేదా అమలు జరిపించబడినదో ఆవైనమును తెలుపు ఒక లెక్క (రిటరన్)తో గూడా జారీచేసిన కోర్టుకు తిరిగి దానిని పంపించ వలెను. అట్టి లెక్క అందులో తెలుపబడిన సంగతులవిషయమై స్వతస్సిద్ధమగు సాక్ష్యముగా ఉండవలెను.

49–A. (i) ఒక పంచాయతీ కోర్టు వలన విచారింపబడ తగిన నేరము మోపబడిన యే మనిషినైన తన స్థానిక సరిహద్దుల లోగా పట్టుకొనుటకుగాను ఒక పంచాయతీ కోర్టునలన జారీచేయబడిన ప్రతి వారంటును మామూలుగా వార్తలనుతీసికొనిపోవు పనిచేయు గ్రామ నవుకరుకుగాని, ఈ కార్యము నిమిత్తము నియమింపబడిన ఇతర ఆఫీ సరుకుగాని అప్పగించబడవలెను.

(ii) జామీను వారంటు జారీచేయబడి, సదరు ఆఫీసరు చెప్పిన జామీను యివ్వబడిన సందర్భములలో గాక పట్టుకొనబడిన మనిషిని సాధ్యమైనంత శీఘ్రముగా కోర్టుయెదుటకు తీసికొని రావలసి నదిగా అది అప్పగించబడిన ఆఫీసరును అది ఆజ్ఞాపించ వలెను.

(iii) పట్టుకొన్నప్పుడు పట్టుకొను ఆఫీసరు, పట్టుకొనబడ వలసినమనిషి మాటలవలనగాని, క్రియవలనగాని ఆధీనమునందుండుటకు లొంగిననే తప్ప, వాని శరీరమును వాస్తవముగా తాకవలెను, లేదా బంధించ వలెను.

49 (B) ఒక బెయిలుబాండు లేదా ఒకరు హాజరగుటకైన, బాండుయొక్క షరతులు నిర్వర్తించబడలేదని కోర్టువారికగుపడినపుడు సదరు బాండువల్ల బద్ధుడై అపరాధము సొమ్ము చెల్లించవలసిన మని షిని అపరాధము మొత్తము చెల్లించవలసినదనిగాని లేక ఏల చెల్లించ

కూడదో కారణము చూపవలసినదని గాని అడుగవచ్చును. తగిన కారణము చూపబడక, అపరాధము చెల్లింపబడని యెడల కోర్టువారు అందులో వ్రాయబడిన అపరాధము మొత్తము యీ ఆక్టు ప్రకారము యివ్వబడిన డిక్రీనిబట్టి రావలసిన సొమ్మువలె వసూలుచేయవచ్చును.

50. ఏ కోర్టుయొక్క అధికార ప్రదేశములో తన గ్రామము ఉంటున్నదో ఆ కోర్టు ప్రెసిడెంటుచే కోరబడినప్పుడెల్ల, విచారణలో నున్న ఏ క్రిమినలు కేసుకుగాని సంబంధించిన సొత్తును పుచ్చుకొని దానిని భద్రముగా వుంచి, అవసరమైనప్పుడెల్ల, ఎప్పటికప్పుడు దాఖలు చేయించు చుండుట ఒక గ్రామ పెత్తనదారుయొక్క విధియై యుండవలెను.

51. దేశాచార వ్యవహారమునుబట్టి బయటకువచ్చి హాజరు కమ్మని బలవంతపెట్టకూడని స్త్రీలు కోర్టులోనికి స్వయముగా హాజరు కానక్కరలేకుండా మినహాయింపబడిన మనుష్యులు, వ్యాధి లేక శరీర అశక్తత కారణమువలన ప్రమాదకరమయిన యిబ్బందిలేకుండ హాజరు కాలేని యే మనిషియు కోర్టులో స్వయముగా హాజరు కానక్కర లేకుండ మినహాయింపబడవలెను; కాని అట్టి ఏ మనిషియొక్క సాక్ష్యమైనను అవసరమైనపుడు అట్టి మనిషిని కోర్టువారు వాని లేదా ఆమె ఇంటివద్ద విచారించవలెను.

## III. ఆక్టుయొక్క 78 (2) (h) సెక్షను ననుసరించిన విధులు.

52. పంచాయతీకోర్టుల డిక్రీలను అమలు జరిపించుటకొరకయిన దరఖాస్తు ప్రెసిడెంటుకుగాని లేదా అతడు ఈ కార్యము నిమిత్తము నియమించినట్టి యే యితర మెంబరుకుగాని చేయబడవలెను.

53. (a) ఒక పంచాయతీకోర్టువలన జారీచేయబడిన యావత్తు సమనులును నోటీసులును అమలు జరిపించుటకయిన ప్రోసెస్సులును ఆ ప్రెసిడెంటుచే సంతకము చేయబడవలెను, లేదా, అతడు అట్లు చేయుటకు అశక్తుడై యున్నప్పుడు, ఇందు నిమిత్తము అతడు నియమించిన ఏ యితర మెంబరుచేగాని సంతకము చేయబడవలెను.

(b) అమలు జరిపించుటకైన యానత్తు వుత్తరువులును అమలు జరిపించుట ఆయా సందర్భమునకు తగినట్లు గ్రామ మునసబుయొక్క లేదా ప్రెసిడెంటుయొక్క విధియై యుండవలెను.

నోటు:— యీ విధిలోని "గ్రామమునసబు" అను మాటలో "పంచాయతీ కోర్టు" ప్రెసిడెంటు చేరడు.

53. A. పంచాయతీకోర్టు ప్రెసిడెంటు పంచాయతీకోర్టుయొక్క ఒక డిక్రీ అమలులో సె 53 ననుసరించి నాస్తనముగా పట్టుకొని జప్తు చేయబడిన ఆస్తిని ఆ సెక్షను ననుసరించి తీర్పుఋణస్థుని ఆధీనములో నుంచుటకు గాని, లేక 58 సెక్షన్ లోని మినహాయింపు ననుసరించి అమ్ముటకుగాని వీలుకలుగని సందర్భములో, గ్రామమునసబు (గ్రామ పెత్తనదారు) ఆధీనములో ఉంచవచ్చును.

53. బి. (1) ఒక డిక్రీ ప్రకారము రావలసినసొమ్మును గ్రామ మునసబుగాని లేక పంచాయతీకోర్టు ప్రెసిడెంటుగాని పుచ్చుకున్నప్పుడు లేక వసూలుపరచినప్పుడు ఆసొమ్మును డిక్రీదారు సదరుసొమ్ము పుచ్చుకొనబడిన లేక వసూలుపరచబడిన తేదీనుండి వారముదినములలోగా యిప్పించమని కోరనియెడల గ్రామమునసబు లేక ప్రెసిడెంటు ఆ సొమ్మును తీసికొనవలసినదిగా డిక్రీదారుకు నోటీసు జారీచేయవలెను.

(2) పైచెప్పబడిన నోటీసు జారీచేయబడిన తేదీనుండి 15 దినములలోగా డిక్రీదారు సదరు సొమ్మును యిప్పించమని కోరనియెడల,

(ఏ) ఆ సొమ్ము మిక్కిలి సమీపములోనున్న సబ్ ట్రెజరీలో డిపాజిట్ చేయబడి ఆ యా సందర్భమునకు తగినట్లు గ్రామమునసబు కోర్టు లేక పంచాయతీకోర్టు సివిల్ డిపాజిట్టుకు జమకట్టవలెను; మరియు

(బి) డిక్రీదారు దరఖాస్తు చేసికొన్న మీాదట అతనికి చెల్లింపబడవలెను.

IV. ఆక్టుయొక్క 78 (2) (i) (j) సెక్షను ననుసరించిన విధులు.

54. పంచాయతీ కోర్టు రికార్డులు ప్రెసిడెంటు ఆధీనములో యుండవలెను. అతడు పరిష్కారమైన కేసుల తాలూకు రికార్డులను ఎవరి అనకారప్రదేశములో గ్రామకోర్టువుంటున్నదో ఆ సందర్భములనుబట్టి క్రిమినల్ కేసులలో సబ్ మాజిస్ట్రేటు కోర్టుకున్నూ, మార్జినులో ఉదహరింపబడిన సివిల్ కేసులకు సంబంధించిన రికార్డులను డిస్ట్రిక్టుమునసబు కోర్టుకున్నూ, ఆ కేసులు తీర్మానింపబడిన మరుసంవత్సరాంతములోగా పంపవలెను.

1. ప్లయింటు,
2. ఆన్సరు,
3. డిక్రీ,
4. దావా దస్తావేజులు,
5. యక్స్పార్టీ చర్యలలో,
6. జారీచేయబడిన సమనులు, వారంటు దరఖాస్తులు.

అయితే ఒక కేసు లేక వ్యాజ్యము తాలూకు పార్టీలవలన దాఖలుచేయబడిన దస్తావేజులు, కేసు లేక వ్యాజ్యము పరిష్కారమైన తరువాత 60 దినములు దాటిన పిదపగాని, లేదా విమర్శకయి అర్జీ దాఖలు చేసికొనబడిన సందర్భములో ఆ విమర్శ అర్జీ పరిష్కారమైన పిదపగాని, వారు దరఖాస్తు చేసికొన్న మీాదట వారికి యిచ్చి వేయబడవలెను.

55. విచారణ ముగిసినప్పుడు, కోర్టు తన యెదుట దాఖలు చేయబడిన, లేదా తన స్వాధీనమందు వున్న, లేదా దేని విషయమై ఏదైన నేరముచేయబడివున్నట్లు కనుబడుచున్నదో అట్టి, లేదా ఏదైన నేరమును చేయుటకు ఉపయోగించబడినట్టి యేదేని సొత్తు లేక దస్తావేజుయొక్క పరిష్కారమునకుగాను తనకు యుక్తమని తోచునట్టి ఉత్తరువును చేయవచ్చును. మరియు యీా విధి ననుసరించే జారీచేయబడిన యే ఉత్తరువునైన అమలుజరుపు నిమిత్తము కోర్టు వారంటును జారీచేయవచ్చును.

వివరణము:— ఈ విధిలోని 'సొత్తు' అనుమాటలో దేని విషయమై నేరము జరిగినట్లు కనుపడునో అట్టి సొత్తువిషయములో మొట్టమొదట ఎవరైన పార్టీయొక్క స్వాధీనము లేదా అధికారములో

ఉన్నట్టి సొత్తుమాత్రమే కాక అది ఏ సొత్తుగా మార్చబడినదో లేక యే సొత్తుకు ఫిరాయింపుగా యివ్వబడ్డదో అట్టి యేసొత్తు అయినను, మరియు అట్టి మార్పు లేక ఫిరాయింపుమూలమున వెంటనేకాని లేక తద్భిన్నముగాగాని సంపాదింపబడిన యేది అయినను కూడ చేరును.

**56.** ఒక గ్రామకోర్టుతాలూకు రికార్డుల నకళ్ళకొరకు ఆ గ్రామకోర్టుకు దరఖాస్తు చేసికొనవలెను. అయితే ఆ రికార్డులు సబు మేజిస్ట్రేటుయొక్క గాని లేదా డిస్ట్రిక్టు మునసబుయొక్క గాని ఆధీనమునందున్న సందర్భములో ఆయా సందర్భములనుబట్టి ఆ గ్రామకోర్టుకుగాని లేదా ఆ సబ్ మేజిస్ట్రేటుకుగాని, లేదా ఆ డిస్ట్రిక్టు మునసబుకుగాని దరఖాస్తు చేసికొనవచ్చును. గ్రామకోర్టుకు దరఖాస్తు చేయబడినపుడు, అది అవసరమైన స్టాంపులను దాఖలు చేయుమని అడిగి ఆ స్టాంపులతోను, తనఅధీనమందు రికార్డులున్న యెడల రికార్డులతోను ఆ దరఖాస్తును ఎవరి అధికార ప్రదేశములో ఆ గ్రామకోర్టు వుంటున్నదో ఆ యా సంగతికి దగినట్లు డిస్ట్రిక్టుమునసబునకుగాని లేదా సబ్ మేజిస్ట్రేటుకుగాని పంపవలెను. డిస్ట్రిక్టు మునసబు లేదా సబు మేజిస్ట్రేటు తమ సిబ్బందులచే ఆ నకళ్ళను తయారుచేయించి, ఆనకళ్లను ఏవిన్నైన రికార్డులు వచ్చియున్న యెడల రికార్డులతోసహా ఆ గ్రామకోర్టుకు తిరిగిపంపవలెను. మరియు, ఆ గ్రామకోర్టు నకళ్లను దరఖాస్తుదార్లకు పంపవలెను. అయితే, ఏ దరఖాస్తుదారుడుగాని కావలసిన నకళ్లను డిస్ట్రిక్టు మునసబు లేక సబ్ మేజిస్ట్రేటు సరిగా తనకు స్వాయముగా అందచేయమనిగాని, లేదా తన ఖర్చుమీద సాధారణపు పోస్టుద్వారాగాని లేక రిజిస్టరు పోస్టుద్వారాగాని తనకు పంపమని దరఖాస్తులో కోరిన పక్షమందు, అది అట్లు అందచేయబడవలెను. లేదా పంపబడవలెను.

## వ్యాఖ్య.

(I) గ్రామకోర్టులలోని రికార్డులకు యిచ్చే నకళ్ళను, సదరు రికార్డులు సివిల్ కేసులకు సంబంధించియున్న డిస్ట్రిక్టుమునసబుకోర్టువారున్నూ, లేక క్రిమినల్ కేసులకు

సంబంధించియున్న సబ్ మాజిస్ట్రేటు కోర్టువారైనన్నూ, వారి ఆఫీసులో తయారు చేయించి యివ్వవలసియుండును. కాని గ్రామకోర్టుకు సె. 46 ప్రకారము డిక్రీ అయిన వెంటనే ఉభయవాదులకు డిక్రీ కాపీ యిచ్చుటకుతప్ప వేరే నకళ్ళు యిచ్చుటకు అధికారములేదు. సె. 46 క్రింద యిచ్చే నకలుకు పార్టీలు కాపీ స్టాంపులు దాఖలు చేయవలసిన అవసరము లేదు.

(2) గ్రామకోర్టులలోచేయు నకళ్ళ దరఖాస్తులకు యెట్టి కోర్టుఫీజున్నూ యివ్వనక్కరలేదని గవర్నమెంటువారు కోర్టు ఫీజు ఆక్టు సె. 35 క్రింద చేసి, ఫోర్టు సెయింటు జార్జి గెజెటులో (౧11-10-21) 1008-1011 పేజీలలో ప్రకటించిన 365 నెంబరు నోటిఫికేషను (లా జనరల్) లోని 35 అయిటములో మినహాయించిరి. కాని నకళ్ళను వ్రాయుటకు అవసరమైన కాపీ స్టాంపులను మాత్రము దాఖలు చేయవలసియున్నది. ఒక్కొక్క కాపీ స్టాంపుపైన 175 మాటలు వ్రాయుదురు. కాపీస్టాంపు కిమ్మతు రు 0-5-0 లు అయియున్నది.

(3) కాని గ్రామకోర్టుల రికార్డులకు నకళ్ళనిమిత్తము దరఖాస్తు డి॥ము॥కోర్టులో గాని సబ్‌మాజిస్ట్రేటు కోర్టులోగాని దాఖలు చేయునెడల అట్టి దరఖాస్తులకు కోర్టు ఫీజు చీటి అంటించవలసి యుండును.

57. ఆక్టుయొక్క 27 వ సెక్షను ననుసరించి గ్రామకోర్టుయొక్క స్థానిక అధికార ప్రదేశమునకు వెలుపలనుండు ప్రతివాదుల మీాద సమను అమలు జరుపుటకు ఈ క్రింది రుసుములు విధింపబడ వలెను. అవి యేవనగా:—

ప్రతి సమనుకు—

(a) ఒక ప్రతివాదికి ... ... 12 అణాలు.

(b) అదే గ్రామమందు నివసించు ప్రతిజాస్తి ప్రతివాదికి, అదే కాలమందు ప్రాసెస్సుకొరకు దరఖాస్తు చేసుకొనబడేయెడల ... 6అణాలు.

## వ్యాఖ్య.

57, 58, 60,61 విధుల ననుసరించి గ్రామకోర్టులచే వసూలు చేయబడు రుసుముల లెక్కను వుంచుటకు అనుసరింపబడవలసిన చర్యకు అందుకు సంబంధించిన యితర సంగతులకు 4 వ భాగములోని గ్రామకోర్టుల ఆక్టు క్రింద జారీచేయబడిన గవర్నమెంటు ఆర్డర్లలో చూడవలెను.

58. ఆక్టు యొక్క 25, 40 సెక్షనుల ననుసరించి గ్రామ నౌకరుచే కాకుండ వేరువిధముగా అందచేయబడిన సమనుకు ఈక్రింది రుసుములను విధించవలెను:—

(i) కోర్టు స్థానిక అధికార ప్రదేశముయొక్క సరిహద్దుల లోగా నివసించుచుయుండు ప్రతి సాక్షికిని లేదా ప్రతివాదికిని ... $1\frac{1}{2}$ అణాలు.

(ii) కోర్టు స్థానిక అధికార ప్రదేశముయొక్క సరిహద్దులకు వెలుపల నివసించు ప్రతి సాక్షికిని ... ... 3 అణాలు.

నోటు:—సాక్షి, సమనును జారీచేయునట్టి లేదా సవాలును పంపునట్టి గ్రామ కోర్టుయొక్క అధికార ప్రదేశములకు వెలుపల నివసించు సందర్భములో పయి ii వ విధినిబట్టి మూడణాల రుసుము కట్టబడును. అందచేయవలసినదిగా సమను ఎవనికి పంపబడినదో లేదా సవాలు ఎవనికిపంపబడినదో ఆ గ్రామమునసబుకు ప్రాసెస్సులను అమలు జరిపించుటకుగాను ప్రత్యేకసిబ్బంది ఉన్నయెడల, సమనును అందచేయుటకు గాని లేదా సవాలు ఎవరి విలాసమునకు పంపబడినదో అట్టి సాక్షికి సమను జారీచేయుటకుగాని రుసుము (I) వ విధినిబట్టి ఒక అణన్నర సమనును జారీచేయునట్టి లేదా సవాలును పంపునట్టి గ్రామకోర్టు ఈ పయికమును ఏ గ్రామమునసబుకు సమను జారీ చేయబడినదో లేదా సవాలు పంపబడినదో ఆ గ్రామమునసబుకు చెల్లించవలెను. సమను లేక సవాలును పంపునట్టి గ్రామమునసబుకు ప్రత్యేక సిబ్బంది లేనియెడల, సమను యొక్క అమలు సాధారణ గ్రామసిబ్బందిచేత నుచితముగా జరిపించబడును. మరిన్ని సమను జారీచేసినట్టి లేదా సవాలును పంపినట్టి కోర్టు ఏ రుసుమును చెల్లించకూడదు.

59. క్రిమినలు కేసులలో, ఫిర్యాదుచేయబడిన నేరము ఇండియా దేశపు శిక్షాస్మృతి యొక్క 277, 283, 379 వ సెక్షనుల ననుసరించి యున్నప్పుడు కాని, లేదా మదరాసు పట్టణముల న్యూసెన్సు ఆక్టు ననుసరించియున్నప్పుడుకాని, లేదా సాక్షులు లేక ముద్దాయి కోర్టు అధికార ప్రదేశమునకు లోగా నివసించియున్నప్పుడుకాని, సాక్షులకు లేదా ముద్దాయికి సమనులు అందచేయు నిమిత్తము రుసుము విధింపబడకూడదు.

60. ఇతర కేసులలో:—

(a) ఒక ముద్దాయి లేక సాక్షికి ... ... 6 అణాలు.

(b) అదే గ్రామములో నివసించియుండు ప్రతి జాస్తి ముద్దాయికి లేక సాక్షికి, అదే సమయమందు సమను కొరకు దరఖాస్తు చేసి కొనబడు నెడల ... 3 అణాలు రుసుము విధించవలెను.

61. డిక్రీలను అమలు జరుపుటకు యీ క్రింది రుసుములను వసూలు చేయవలెను.

(ఏ) డిక్రీ మొత్తము రు 50 లకు మించినపుడు రు 1—0—0

(బి) డిక్రీ మొత్తము రు 50 లకు మించనపుడు రు 0—8—0

62. (రద్దు చేయబడినది)

63. రుసుములు యానత్తును రొక్క రూపముగా చెల్లించబడవలెను.

సాక్ష్యము.

64. పంచాయతీకోర్టు యొక్క ఏ చర్య (ప్రొసీడింగు) కాని, కోర్టు నిర్మాణములో ఏదయిన లోపమున్నదను కారణము మాత్రమునగాని, లేదా అట్టి కోర్టుయొక్క ఏ మెంబరయినను అట్టి ఉద్యోగమునకు అనర్హుడుగ నుండెననిగాని లేదా అట్టిచర్య కోర్టు ప్రెసిడెంటు వైస్ ప్రెసిడెంటు లేదా మెంబరు ఉద్యోగములో ఏదయిన ఖాళీవున్న సమయములో జరిగినదను కారణమునగాని, చెల్లతగనిదిగా ఎన్నబడకూడదు,

కాని జిల్లాకలెక్టరు అట్టిచర్యచే బాధింపబడినవారివల్ల దాఖలు చేయబడిన పిటీషనుపై అట్టి చర్యను రద్దుచేయవచ్చును.

వివరణము:— ఈ విధి నిమిత్తము (ప్రొసీడింగు) చర్య అను మాటలో తీర్పులు, డిక్రీలు; ఆర్డర్లు చేరును.

వ్యాఖ్య

పంచాయతీకోర్టుయొక్క యే చర్య (అనగా తీర్పులు, డిక్రీలు, ఆర్డర్లు వగైరాలు.)

(1) కోర్టు నిర్మాణములో లోపమున్నను, లేక

(2) ఏ మెంబరైనను అట్టి ఉద్యోగమునకు అనర్హుడై యున్నను, లేక

(3) ఏ చర్య అయినను కోర్టు ప్రెసిడెంటు లేదా మెంబరు ఉద్యోగములో యేదైనా ఖాళీయున్న సమయములో జరిగినను, ఆ కారణముల వల్లనే చెల్లతగనిదిగా

యెంచబడకూడదు. కాని పైన చెప్పిన లోపములున్నపుడు జరిగిన యేచర్యనైనను అట్టి చర్యచే బాధింపబడినవారు దాఖలుచేసికొన్న అర్జీపైన జిల్లాకలెక్టరు రద్దుచేయవచ్చును.

కాని ఒక పంచాయతీకోర్టు కాలపరిమితి "లా" ప్రకారము ముగిసిన తరువాత గాని, లేక పంచాయతీకోర్టు న్యాయశాస్త్ర ప్రకారము యేర్పడకయుండక పూర్వము గాని, జరుపబడిన యే చర్యయు, యీ విధి ప్రకారము చెల్లదగియుండదు.

హైకోర్టు తీర్పులు

(1) 50 మ. లా. జ. 148 = 1926 ఆ. ఇ. రి. మద్రాస్ 246.
జడ్జీలు:—దేవదాసు, వాలర్ గార్లు.
కానూరి వెంకటశివరావువగైరా—పిటీషనర్లు (ప్రతివాదులు)
చిట్టూరి రామకృష్ణయ్య—రెస్పాండెంటు (వాది)

ఈ తీర్పులో హైకోర్టువారు పంచాయతీకోర్టు మెంబర్ల ఎన్నికలలో ఎట్టి లోపములున్నను యీవిధిప్రకారము అట్టి మెంబర్లుజరిపే చర్య చెల్లునని తీర్మానించిరి.

షరా:—యీ తీర్పు 18 (బి) విధి క్రింద విపులముగా వ్రాయబడినది.

(2) 1934 మ. వీ. నో. 1022. జడ్జి:—వాల్ష్ గారు.
నారాయణస్వామి వన్నియర్—పిటీషనరు.
కరంబాయి శామ సెరియారి—రెస్పాండెంటు

ఒక పంచాయతీకోర్టు యేర్పడియుండకపూర్వము కేసును విచారించి శిక్షించుటకు అధికారములేదని అట్టి శిక్ష చెల్లదని యీ కేసులో తీర్మానించిరి.

షరా:—యీ తీర్పు సె. 77 క్రింద విపులముగా వ్రాయబడినది.

(3) 1930 ఆ. ఇ. రి. మద్రాస్ 1002 = 1930 మ. వీ. నో. 905
పల్లవల్లు కృష్ణయ్యవగైరా—పిటీషనర్లు (ముద్దాయి)
ఎదిరి గవర్నమెంటువారు,

పంచాయతీ మెంబర్ల కాలపరిమితి "లా" ప్రకారము ముగిసిన పిమ్మట వారు కేసులను విచారించుటకు అధికారము లేదనియు, అట్టి సందర్భములో వారు కేసులను విచారించి శిక్షలు వేసేయెడల అట్టి శిక్షలు చెల్లవనియు, అట్టి శిక్షలు చెల్లుటకు 64 వ విధి వర్తించదనియు తీర్మానించిరి.

## VI. ఆక్టుయొక్క 46 వ సెక్షను ననుసరించిన విధి.

65. 46 వ సెక్షనునుబట్టి డిక్రీ నకలును పార్టీ హాజరై ఉన్న యెడల ఆ పార్టీకి లేదా వాని ఏజెంటు ఎవరైన హాజరై ఉన్నయెడల ఆ యేజెంటుకు అందజేయవచ్చును. మరియు హాజరు కానియెడల, అది వాని ఖర్చుమీాద పోస్టుద్వారా వానికి పంపబడవలెను.

VII. ఆక్టుయొక్క 78 (2) (g) సెక్షను ననుసరించి యుంచబడవలసిన రిజిస్టరులయొక్కయు, రిటరన్లయొక్కయు, ప్రోసెస్సుల యొక్కయు నమూనాలు.

పంచాయతీకోర్టులు యీ క్రింది రిజిస్టరులను ఉంచవలెను:—

I. — కేసుల రిజిస్టరు.

| ...యొ వరుస ...రు | నేరము జరిగిన తేది | రిపోర్టు లేక ఫిర్యాదు చేయబడిన తేది. | పేరు, తల్లిదండ్రులవివరము, కాపురస్థలము | | | | ఫిర్యాదు చేయబడిన నేరమున్న్న, 76 (1) (b), (c) సెక్షను ననుసరించిన సందర్భములలో దొంగిలింపబడిన సొత్తుయొక్క లేదా కలుగ చేయబడిన నష్టము యొక్క కిమ్మతు | ఏదయిన ఉన్న యెడల ముద్దాయి యొక్క వాదమును వాని స్టేటుమెంటు | తీర్పును, నేరమును సాపించిన సందర్భములలో అందులకుగల కారణముల యొక్క సంక్షేప వివరణము. | విధించబడిన జుల్మానా. | కడపటి ఉత్తరువు యొక్క తేది. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | సాక్షులయొక్క | | | | | | |
| | | | ఫిర్యాదిల యొక్క | ముద్దాయి యొక్క | ఫిర్యాది తరఫు సాక్షుల యొక్క | ముద్దాయి తరఫు సాక్షుల యొక్క | | | | | |
| ) | (2) | (3) | (4) | (5) | (6a) | (6b) | (7) | (8) | (9) | (10) | (11) |
| | | | | | | | | | | | |

## II:—జుల్మానాల రిజిష్టరు.

జిల్లా        తాలూకా        పంచాయతీ కోర్టువారివలన విధింపబడి, వసూలు చేయబడిన జుల్మానాల రిజిష్టరు.

| జుల్మానా విధింపబడిన తేదీ. | కేసు నంబరు. | ముద్దాయి పేరు. | విధింపబడిన జుల్మానా మొత్తము | వసూలు చేయబడిన జుల్మానా మొత్తము. | వసూలు చేయబడిన తేదీ. | ట్రెజరీలో జమకట్టబడిన తేది (ఇచ్చట చలానా నంబరును, ట్రెజరి పేరునుకూడ నమూదు చేయుము. | జుల్మానా వసూలు చేయుటకు తీసుకొనబడిన చర్యలను, జుల్మానాను చెల్లించక తప్పిన పక్షమున, సబుడివిజనలు మాజిస్ట్రేటుకు రికార్టు దాఖలు చేయబడిన తేదియును. | సబుడివిజనలు మాజిస్ట్రేటువలన తీసుకొనబడిన చర్యలు. | రిమార్కు * |
|---|---|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) |
| | | | | | | | | | |

* జుల్మానాను చెల్లించుటకు అంగీకరింపబడిన కాలము లేదా దానిని వాయిదాలుగా చెల్లించుటకైన ఉత్తరువు నమూదు చేయబడవచ్చును.

## IV. పంచాయతీ కోర్టుయొక్క చర్యల (ప్రొసీడింగుల) రిజిష్టరు.

| తారీఖు. | హాజరైన పంచాయతీదారుల పేర్లు. | విచారణకు తీసుకొనబడిన కేసు నంబరు. | జరిగిన పనివిషయమై సంగ్రహముగ వివరణము. | షరాలు. |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| | | | | |

## V అందుకొనబడిన ఫిర్యాదులు మొదలగు యావత్తు కాగితములయొక్కయు, వాపసుచేయబడిన యావత్తు కాగితములయొక్కయు సామాన్య రిజిష్టరు.

| వరుస నెంబరు. | అందుకొన్న తేదీ. | సారాంశము. | ఎవరివద్దనుండి అందుకొనబడినదియు | ఏదయిన ఉన్నయెడల, వాపసు తేది | షరాలు. |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| | | | | | |

1.— అందుకొనబడినట్టిన్ని, పరిష్కరింపబడినట్టిన్ని కేసుల స్టేటుమెంటు.

[ ప్రతి సంవత్సరమునను జనవరి 15 వ తేదీనిన్ని, ప్రతి అర్ధవత్సరము ఆఖరయిన తరువాత 15 వ తేదీనిన్నీ సబు డివిజనలు మాజిస్ట్రేటు ద్వారా జిల్లా మాజిస్ట్రేటుకు పంపబడవలెను. ]

195 సంవత్సరమునకు / పాతిక వత్సరమునకు        జిల్లా        తాలూకా

పంచాయతీ కోర్టుచే చేయబడిన క్రిమినలు విచారణల సంఖ్యయును, సాధారణ ఫలితమును కనుబరచు స్టేటుమెంటు.

| | | | పరిష్కారముకొరకైన | | | | | | పరిష్కరించబడిన | | | నిలువవున్న | | జుల్మానాలు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | మనుష్యుల సంఖ్య | | | కేసుల సంఖ్య. | | | మనుష్యుల సంఖ్య | | | | | | | | |
| జిల్లా పేరు | తాలూకా పేరు. | కోర్టుపేరున్ను, దాని అధికార ప్రదేశములోని గ్రామములున్నూ. | కడచిన సంవత్సరము / పాతిక వత్సరము అంతము నుండి నిలువయున్నవి. | సంవత్సరము / పాతికవత్సరము లో వచ్చినవి. | మొత్తము. | కడచిన సంవత్సరము / పాతికవత్సరము అంతము నుండి నిలువయున్నది. | సంవత్సరము / పాతికవత్సరము లో వచ్చినవి. | మొత్తము. | నేరస్థాపన జేయబడినట్టి జుల్మానా విధించబడినట్టివి. | త్రోసివేయబడినవి. | మొత్తము. | కేసుల సంఖ్య. | మనుష్యుల సంఖ్య. | సంవత్సరము / పాతికవత్సరము లో విధించబడినది. | సంవత్సరము / పాతికవత్సరము లో పుగా వసూలు చేయబడినవి. | ట్రెజరీలో చెల్లించబడినవి. | షరాలు. |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (1) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) |
| | | | | | | | | | | | | | | | | | |

## II:— జుల్మానా స్టేటుమెంటు

### నెలకు కోర్టువారి జుల్మానాల స్టేటుమెంటు.

#### బాకీలు.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. | షరాలు. |
|---|---|---|---|---|---|---|---|
| 1. డిమాండు:— | | | | | | | |
| (a) గవర్నమెంటుకు జమ కట్టబడవలసిన జుల్మానాలు. | | | | | | | |
| (b) కడకు లోకలు లేదా మునిసిపలు ఫండులు మొదలైన వాటికి జమ కట్టబడ వలసిన జుల్మానాలు. | | | | | | | |
| 2. వసూళ్ళు ... | ... | | | | | | |
| 3. సబు ట్రెజరీలో జమ కట్టబడిన మొత్తము. | | | | | | | |
| (a) గవర్నమెంటుకు. | | | | | | | |
| (b) కడకు లోకలు లేదా మునిసిపలు ఫండులు | | | | | | | |

#### కరెంటు.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. | షరాలు |
|---|---|---|---|---|---|---|---|
| 1. డిమాండు:— | | | | | | | |
| (a) గవర్నమెంటుకు జమ కట్టబడ వలసిన జుల్మానాలు. | | | | | | | |
| (b) కడకు లోకలు లేదా మునిసిపల్ ఫండులు మొదలయిన వాటికి జమ కట్టబడ వలసిన జుల్మానాలు. | | | | | | | |
| 2. వసూళ్ళు ... | ... | | | | | | |
| 3. సబు ట్రెజరీలో జమ కట్టబడిన మొత్తం. | | | | | | | |
| (a) గవర్నమెంటుకు | | | | | | | |
| (b) కడకు లోకలు లేదా మునిసిపలు ఫండులు. | | | | | | | |

## 1. సాక్షి సమ్మన్సు నమూనా.

(ఇచ్చట ముద్దాయి పేరును నమూదుచేయుము)

పైన చే
ఫిర్యాదు చేయబడి యున్నందునను, ముఖ్యమైన సాక్ష్యమును బహుశః మీరు యివ్వ గలిగినట్లు కనుపడుచున్నందునను తేదీని
(ఇచ్చట గంటలను నమూదుచేయుము) అప్పుడు ఈ కోర్టు యెదురు హాజరగుటకును, కోర్టువారి సెలవు లేకుండ అక్కడనుండి వెడలిపోకుండుటకును ఇందుమూలముగా మీరు సమను చేయబడుచున్నారు.

తేది.

ప్రెసిడెంటు/వైస్ ప్రెసిడెంటు.

## 2. నేరపెట్టబడిన మనిషికి సమ్మన్సు.

యొక్క పంచాయతీ కోర్టులో

19 వ సంవత్సరము తాలూకు నంబరు కాలెండరు కేసు.

కి
సు

అనే ఫిర్యాదుకు జవాబు చెప్పడముకొఱకు నీవు హాజరు కావడము జరూరుగా వున్నందున, 19 వ సంవత్సరము

నెల తేదీని $\frac{\text{ఉదయము}}{\text{అపరాహ్ణము}}$ అప్పుడు

వద్ద యొక్క పంచాయతీ కోర్టుయెదుట ఖుద్దున హాజరగుటకు నీవు యిందుమూలముగా ఆజ్ఞాపించబడుచున్నావు.

19 వ సంవత్సరము తేది.

## 3. మనిషిని పట్టుటకు వారంటు

### A

(ఇక్కడ వారంటు అమలులోకి తేవలసిన పేర్లును, హోదాలును వ్రాయవలసినది.) కి

లో వుండే [illegible]

(ఇక్కడ నేరము వ్రాయవలసినది) అనే నేరము మోపబడి యున్నందున సదరు హీ అనే మనిషిని పట్టుకొని నాయెదుట హాజరు చేయగలందులకు ఇందువలన నీవు ఆజ్ఞాపించబడుచున్నావు. ఇందుకు తప్పవద్దు.

ఈ వారంటుమీద యీ క్రిందవచ్చే ప్రకారము ఎండార్సు చేయవచ్చును.

సదరు హీ అనే మనిషి మాసము తారీఖున నాయెదుట హాజరుకాగలందులకున్ను, నాచేత ఇతర ఉత్తరువు పొందునంతవరకు అట్లు హాజరయి వుండుటకున్ను

ముత్తముకు తానును, మొత్తముకు నొక జామీనుదారుడున్ను, (లేక చెరి ముత్తమునకు యిద్దరు జామీనులును) జామీను ఇచ్చిన పక్షమున అతనిని వదలిపెట్టవచ్చును.

19 వ సంవత్సరము మాసము తారీఖు.

(దస్కతు)

B

(ఇక్కడ వారంటును అమలులోనికి తేవలసిన మనిషియొక్క పేర్లును హోదాలును వ్రాయవలసినది) కి లో వుండే అనే మనిషిమీద (ఇక్కడ నేరము వ్రాయవలసినది) అనే నేరము మోపబడియున్నందున సదరు హీ అనే మనిషిని పట్టుకొని నాయెదుట హాజరు చేయగలందులకు యిందువల్ల నీవు ఆజ్ఞాపించబడుచున్నావు. ఇందుకు తప్పవద్దు.

19 వ సంవత్సరము మాసము తారీఖు.

(దస్కతు)

## 4. వారంటును అనుసరించి పట్టుబడినవెనుక వ్రాసియివ్వవలసిన పత్రమున్ను జామీను ఖత్తున్నూ.

లో వుండే అనే నేను అనే ఫిర్యాదుకు జవాబు చెప్పడమను కొరకు నన్ను హాజరయ్యేలాగున నిర్బంధపరచుటకు సాదరుచేసిన వారంటును అనుసరించి,

(లేక యే అధికారియొద్దకు తీసికొనిపోబడుచున్నాడో ఆ అధికారి వుద్యోగమును యిక్కడ వ్రాయవలసినది) వారియెదుట తేబడినందున రాగల మాసము తారీఖున సదరు హీ ఫిర్యాదుకు జవాబు చెప్పుటకు

పంచాయతీ కోర్టులో హాజరగుటకును, కోర్టువారివల్ల ఇతర ఉత్తరువు పొందు నంతవరకు అట్లు కోర్టులో హాజరయివుండుటకున్ను. ఇందువల్ల బద్ధుడనగుచున్నాను. మరిన్ని ఇందుకు అతిక్రమించినయెడల రాజ్య ప్రభుత్వమువారికి

రూపాయల మొత్తము అచ్చుకొనుటకు నేను బద్ధుడ నగుచున్నాను.

మాసము తారీఖు.

(దస్కతు)

లో వుండే పైన చెప్పబడిన అనే మనిషి గాగల మాసము తారీఖున ఏ ఫిర్యాదుమీద పట్టా బడినాడో ఆ ఫిర్యాదుకు జవాబు చెప్పుటకు పంచాయతీ కోర్టులో గారి యెదుట హాజరగుటకును కోర్టువారివల్ల యితర వుత్తరువు పొందునంతవరకు అట్లు కోర్టులో హాజరయియుండుటకును, నేను జామీనుదారుడనని యిందువల్ల రూఢిగా తెలియజేయుచున్నాను. మరిన్ని అందుకు ఆ మనిషి అతిక్రమించినయెడల రాజ్య ప్రభుత్వమువారికి

రూపాయలు మొత్తము అచ్చుకొనుటకు నేను బద్ధుడనగుచున్నాను.

మాసము తారీఖు.

(దస్కతు)

## 4 A నమూనా.

సాక్ష్యమిచ్చుటకుగాను లేదా ఒక ఫిర్యాదుకు జవాబు చెప్పుటకుగాను హాజరు కాగలందులకు వ్రాసి యివ్వవలసిన పత్రము.

.........(స్థలము) లో వుండే..........(పేరు).............అనే నేను.......... "ఏ,బీ" అనే ఒక మనిషిమీద.............అనే నేరము మోపబడిన విషయములో సాక్ష్యమిచ్చుటకు (లేదా.............అనే ఫిర్యాదుకు జవాబు యిచ్చుటకు) రాగల ......, ...మాసము.........తారీఖున $\frac{\text{ఉదయము}}{\text{సాయంకాలము}}$ ...గంటలకు...పంచాయతీ కోర్టులో హాజరగుటకున్నూ, కోర్టువారివల్ల యితర ఉత్తరువు పొందునంతవరకు అట్లు కోర్టులో హాజరగుచుండుటకున్నూ యింమవల్ల బద్ధుడ నగుచున్నాను. మరిన్ని యిందుకు అతిక్రమించినయెడల రాజ్య ప్రభుత్వమువారికి

రూపాయల మొత్తమును అచ్చుకొనుటకు నేను బద్ధుడనగుచున్నాను,

సం॥ మాసము తారీఖు

సంతకము.

5. జుల్మానా వసూలు కొరకు వారంటు.

గ్రామ మునసబునకు:—

దినమున

(ముద్దాయి పేరు) మీద నేరము స్థాపించబడినందునను, వాడు జుల్మానాను చెల్లించవలసినట్లు శిక్షింపబడినందునను, వాడు దానిని చెల్లించియుండనందునను, సదరు మొత్తమును డిమాండు చేయుటకును, అది చెల్లింపబడనియెడల, సదరు

యొక్క చరాస్తిలో జుల్మానా మొత్తమునకు చాలినంత భాగమును జప్తు చేయుటకును ఇందువలన నీవు ఆజ్ఞాపించబడుచున్నావు.

ప్రెసిడెంటు.

6. 55 వ విధి ననుసరించిన ఉత్తరువును అమలు జరుపుటకు వారంటు.

(ఇక్కడ వారంటును అమలు జరుపవలసిన మనిషి లేదా మనుష్యుల పేర్లను లేదా హోదాలను వ్రాయునది) కి.

55 వ విధి ననుసరించి (ఇచ్చట వుత్తరువుయొక్క ఫలితమును తెలుపునది) వుత్తరువు చేయబడియున్నందున (యేమి చేయబడవలెనో యిచ్చట స్పష్టముగా తెలుపునది) టకు నీవు యిందుమూలముగా ఆజ్ఞాపించబడుచున్నావు.

ఇందుకు తప్పవద్దు.

ఈ దినము తేది.

(సంతకము)

7. జుల్మానా చెల్లుబడికి రశీదు.(రెండు ప్రతులలో)

యొక్క పంచాయతీకోర్టు ఫైలులో, యొక్క నంబరు కాలెండరు కేసులో, జిల్లా తాలూకా గ్రామ కాపురస్థుడు కుమారుడైన మీద విధించబడిన జుల్మానాలో $\frac{\text{అంతయు}}{\text{భాగము}}$ అయిన అక్షరాల రూపాయల మొత్తమును పుచ్చుకొనడమైనది.

ప్రెసిడెంటు.

# అ ను బ ం ధ ము

## 1 వ నమూనా.

### నో టీ సు.

నెం ర దావాలో జామీనుదారులకు నోటీసు.

నీవు యీ కోర్టుయెదుట సం॥ నెల తారీఖున ఉదయం గంటలకు హాజరగుటకున్ను, మరియు నెం ర దావాలోని ప్రతివాదివద్దనుండి జప్తు చేయబడి నీ ఆధీనములో నుంచబడిన చరాస్తిని తీసికొనిరాగలందుకు యిందు మూలముగా ఆజ్ఞాపింపబడుచున్నావు.

ఇందుకు తప్పినయెడల నీపై చర్యతీసికొనబడునని తెలుసుకొనవలెను.

సం॥ నెల తేదీన నాచే యివ్వబడినది.

ప్రెసిడెంటు/వైస్ ప్రెసిడెంటు.

## 2 వ నమూనా.

### జప్తువారంటు.

| | రు. అ. పై. |
|---|---|
| డిక్రీ | |
| అసలు | |
| వడ్డీ | |
| ఖర్చులు | |
| వారంటు ఖర్చులు | |
| దరిమిలా వడ్డీ | |
| మొత్తం. | |

..................అనేవాడు యీ కోర్టువారు నెం ర దావాలో సం॥ నెల తేదీన యిచ్చిన డిక్రీవల్ల వారికి మార్జినులో ఉదహరించిన మొత్తమును యివ్వవలసినదిగా ఆజ్ఞాపించబడినందునయున్ను, వాది దాఖలు చేసిన దరఖాస్తువల్ల ఆసొమ్ము యివ్వబడనట్లు తెలియుచున్నందున, యిందుతో జతపరచిన షెడ్యూలులో కనుపరచిన లేక............చే చూపబడే చరాస్తిని (సి॥ ప్రొ॥ కో॥ సె. 60 ప్రకారము జప్తుచేయుటకు వీలులేదని మినహాయింపబడిన ఆస్తులు తప్ప) జప్తుచేయవలసినదిగాను, మరియు ............... అనేవాడు సదరు సొమ్ము రు లును. యీ జప్తుఖర్చులు రు లతో సహా నీకు చెల్లించనియెడల యీకోర్టు దిగువ ఉత్తరువులకు ఆ ఆస్తిని నీ వద్దవుంచగలందుకున్ను (లేక అడిగినప్పుడు హాజరుపరచుటకు తగినంత ప్రాతమూలకమైన జామీనుయిచ్చే యెడల ప్రతివాది ఆధీనములో విడిచివచ్చుటకున్ను) యిందుమూలముగా నీకు ఆజ్ఞాపించడమైనది.

ఇదిగాక నీవు    సం॥    నెల    తారీఖున గాని, అంతకు లోపుగాగాని, యీ వారంటు యే తేదీన యెట్లు అమలుజరుపబడినదో, లేక అమలుజరుగని యెడల యెందువల్ల అమలుజరుగలేదో తెలియజేయు రిపోర్టుతో యీ వారంటును వాపసుచేయ గలందుకు ఆజ్ఞాపింపబడుచున్నావు.

సం॥    నెల    తేదీన నాచే యివ్వబడినది.

ప్రెసిడెంటు వైస్ ప్రెసిడెంటు.

## షెడ్యూలు.

## 3 న నమూనా

## వేలము యిస్తిహారు.

సం॥    నెల    తేదీన    ఘంటలకు యీ కోర్టుయెదుట యిందుతో దిగువ జతపరచిన షెడ్యూలులో ఉదహరించ బడినట్టియు, మార్జనులో చెప్పబడిన    నెం    రు దావాలో డిక్రీ పొందిన వానికి యీ వేలం తేదీవరకు ఖర్చులు దగిమిలావడ్డీతోసహా రావలసిన రు    లు మొత్తము వసూలుపరచుటకు జప్తుచేయబడిన ఆస్తి బహిరంగముగా విక్రయించ బడునని యిందు మూలముగా నోటీసు నివ్వడ మైనది.

.........గ్రామకోర్టుఫయిల్
దావా నెం.    రు    సం॥
.......................వాది
.......................ప్రతివాది

కాని పైన చెప్పబడిన బాకీయున్ను, యీ వేలంఖర్చులున్ను యివ్వబడినగాని లేక వారంటు అమలు జరుపకయుండుటకు కోర్టువారు తృప్తిపడే కారణము చూపబడినగాని వేలము ఆపబడును.

ఈ వేలము పైన ఉదహరించబడిన ఆస్తులతో తీర్పు ఋణస్థుని హక్కులకు సంబంధిమాత్రము యుండునని తెలుసుకొనవలెను.

## కిమ్మతుల అంచనాలతో ఆస్తి షెడ్యూలు.

| ఆస్తి వివరము | కిమ్మతు | ఆస్తి వివరము | కిమ్మతు |
|---|---|---|---|
| | | | |

ప్రెసిడెంటు.

## అనుబంధము I

| తేదీ | కేసు లేక దావా నెంబరు | ఎందునిమిత్తము వసూలు చేయబడినది. | వసూలు చేయబడిన మొత్తం | సొమ్ము పంపిన తేదీ | తాకీఖుతో ప్రెసిడెంటు దస్కతు పొడి అక్షరములు | రిమార్కులు |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| | | | | | | |

## అనుబంధము II

రుసుములు చెల్లించినందుకు రశీదు (రెండు ప్రతులతో) .............. యొక్క పంచాయతీకోర్టు ఫయిలులో.........కాలెండరు కేసులో............ జిల్లా............తాలూకా............గ్రామ కాపురస్థుడు..........కుమారుడైన............వల్ల ప్రోసెస్ రుసుము రు...........లు అక్షరాల............ మొత్తము పుచ్చుకొనడమైనది.

ప్రెసిడెంటు/వైస్ ప్రెసిడెంటు.

[ మదరాసు గ్రామ కోర్టుల అక్టు యొక్క 10 వ సెక్షను. ]

జిల్లా తాలూకా గ్రామ కోర్టు తాలూకు వ సంవత్సరమునకు వ్యాజ్యెముల రెజిస్టరు

| వ్యాజ్యెపు నెంబరు. | ప్లెయింటు దాఖలు చేయబడి ఫైలు చేయబడిన తేదీ. | వాది పేరును వివరమును వాస స్థలమును. | ప్రతివాది పేరును వివరమును వాసస్థలమును | దావా వివరములు, తారీఖు, వ్యాజ్యెకు కారణము కలిగిన స్థలము, మొత్తము సహా. | హాజరయిన తారీఖులు. | | డిక్రీ (ఎవరిపక్షమందు ఎంత సొమ్మునకు) మరియు చెల్లించవలసిన తారీఖు సహా. | రాజీ డిక్రీ (32 వ సెక్షను) తారీఖు సహా. | రివిజను (పునర్విచారణ) మీద చేసిన ఉత్తరువు యేదైనా ఉన్నయెడల తేదీ సహా. | అమనులోకి తేవడము | | | రిమార్కులు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | వాది. | ప్రతివాది. | | | | మనవి యొక్క తారీఖు | ఎటువంటి అమలు జరిగినది లేదా అడ్డు పెట్టు చేసినది. | శిక్షలో (చెక్కు) చెల్లింపుగాని అడ్డుపెట్టుగాని చేయుటను గాని నమూదుచేసిన తేదీ. | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) |
| | | | | | | | | | | | | | |

సూచనలు—1. వాదుల యొక్క గాని ప్రతివాదుల యొక్క గాని చట్ట సమ్మతిమైన ప్రతినిధులు రెకార్డులో చేరినపుడు (అక్టుయొక్క 68, లేదా 71వ సెక్షను) వారి పేర్లను సందర్భానుసారముగా 3వ లేదా 4వ కలమునందు నమూదు చేయును.

2. వ్యాజ్యెమును ఒక గ్రామ కోర్టుయొక్క విచారణాధికారములోకి వచ్చునట్లు చేయుటకై వాది తన దావాలో ఏదైనా వదులుకొనిన యెడల దానిని 5వ కలములో వ్రాయును (అక్టు యొక్క 18వ సెక్షను).

3. వ్యాజ్యెముయొక్క మొత్తముగాని విలువగాని రూ. 50 ల కంటె ఎక్కువై రూ. 200 ల కంటె ఎక్కువ కానపుడు, కోర్టువారి యెదుట వ్రాయబడిన ఉభయ పార్టీల లిఖిత సమ్మతితో వ్యాజ్యెము దాఖలు చేసుకోబడినదని 14వ సెక్షను ననుసరించి ఆ కలములోనే వ్రాయును

4. వ్యాజ్యెము ప్రారంభింపబడినపుడు ప్రతివాది ఏ కోర్టుయొక్క అధికార ప్రదేశ హద్దులలో నివసించడములేదో లేక వ్యాపారము చేయడములేదో లేక లాభముకొఱకు స్వయముగా పనిచేయడములేదో (15వ సెక్షను) ఆ కోర్టులో వ్యాజ్యెము దాఖలు చేయడమునకుగల కారణములను ఆ కలములోనే వ్రాయును.

5. వేసిన అన్ని వాయిదాల (అడ్జర్న మెంట్ల) తారీఖులను 6, 7వ కలములలో వ్రాయవలెను.

## హాజర్తై జవాబు చెప్పుటకు సమ్మను.

[ మదరాసు గ్రామ కోర్టుల ఆక్టుయొక్క 25 వ సెక్షను. ]

లో వుండే గ్రామ కోర్టులో.

19 వ సంవత్సరపు నెంబరు వ్యాజ్యెము.

వాది.

ప్రతివాది

( పేరును, వివరమును, పై విలాసమును— )

( ఇక్కడ రెజిష్టరులో నున్నట్లు దావాలోని తప్పిన్లు వ్రాయవలెను ) నిమిత్తము (ఇక్కడ వాదియొక్క పేరును, వివరమును, పై విలాసమును వ్రాయవలెను) అనేవాడు నీ మీద యీ కోర్టులో వ్యాజ్యెము తెచ్చి యున్నాడు గనుక సదరు ప్రతివాది యొక్క ప్రశ్నలకు వుత్తరము చెప్పుటకై వద్ద రోజున పూర్వాహ్ణము నీవు యీ కోర్టులో హాజరగుటకు ప్రత్యేకముగా కోరబడనియెడల— "స్వయముగాగాని నీచే క్రమముగా అధికార మీయబడి సంగతులు క్రమముగా తెలుపబడి వ్యాజ్యెమునకు సంబంధించిన ముఖ్యమైన ప్రశ్నలన్నిటికి జవాబు యిచ్చుటకు శక్తి కలిగిన ఒక మనిషి ద్వారాగాని అట్టి ప్రశ్నలన్నిటికి జవాబు యియ్యగల మరియొక మనిషితో కూడ గాని హాజరగుటకు" అని (వ్రాయుము) ఇందుమూలముగా సమ్మను చేయడమైనది. పైని చెప్పిన రోజున నీవు హాజరు కాకుండ తప్పిపోయే యెడల నీ పరోక్షమందు ఆ వ్యాజ్యెము విచారణ చేసి తీర్మానించడమవునని తెలుసుకోవలసినదిగా యిందువలన నిన్ను కోరడమైనది; ఇది గాక వాది తనిఖీ చేయుటకు కోరునట్టి (హాజరు పెట్టించవలసినదని) వాది కోరే యే దస్తావేజులైనా యిక్కడ వుదాహరించవలెను) దస్తావేజునున్నూ నీవు డిఫెన్సుకు ఆధారముగ నుండునని నమ్ముటకు వుద్దేశించిన యేదైనా దస్తావేజునున్నూ నీవెంట తీసుకొని రావలసినది (లేదా నీ యేజెంటుద్వారా పంపవలసినది).

ఈ 19 వ సం నెల తారీఖున నా చేవ్రాలుతో సాదరు చేయబడ్డది.

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టు ప్రెసిడెంటు.

## అడ్జర్నమెంటు (వ్యాజ్యెము నిలిపి యుంచుట)కు నోటీసు.

[ మదరాసు గ్రామ కోర్టుల ఆక్టు యొక్క 28వ సెక్షను ]

లో వుండే గ్రామ కోర్టులో.

19 వ సంవత్సరపు నంబరు వ్యాజ్యెము.

వాది.

ప్రతివాది.

కి/ను.

పై వ్యాజ్యెమును గురించిన సమ్మనులో నిర్ణయించియున్న రోజున నీవు హాజరు ప్రశ్నలకు వుత్తరము చెప్పగల్గుటకు చాలినంత కాలములోగా సదరు సమ్మను

నీకు అందజేయబడలేదని కనుపడుచున్నది. గనుక సదరు వ్యాజ్యెముయొక్క విచారణ 19 వ సం॥ నెల

తేదీ వరకు నిలిపి పెట్టబడినదనిన్నీ ఆ రోజున నీవు ప్రశ్నలకు వుత్తరము చెప్పుటకై హాజరు కాకుండా తప్పిపోయే యెడల నీ పరోక్షమందు ఎక్స్‌పార్టీగా ఆ వ్యాజ్యెము విచారించి తీర్మానించడమవుననిన్నీ నీవు తెలుసుకోవలసినది.

ఈ 19 వ సం॥ నెల తారీఖున నా చేవ్రాలుతో సాదరు చేయబడ్డది.

ప్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు.

## హాజరై సాక్ష్యమిచ్చుటకు సమ్మను.

[ మదరాసు గ్రామ కోర్టుల ఆక్టు యొక్క 40, 41వ సెక్షనులు.]

19వ వ సంవత్సరపు నెంబరు వ్యాజ్యెము.

వాది.

ప్రతివాది.

కి/కు.

పై వ్యాజ్యెములో పక్షమున నీవు సాక్ష్యము యిచ్చుటకు హాజరు కావలసి యున్నందున 19 వ సం॥ నెల తారీఖున పూర్వాహ్ణమున గంటలకు యీ కోర్టువారి యెదుట నీవు స్వయముగా హాజరు కావలసినదిగా ఆజ్ఞాపించడమైనది.

ఈ 19 వ సం॥ నెల తారీఖున నా చేవ్రాలుతో సాదరు చేయజడినది.

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు.

## దస్తావేజులు హాజరు పెట్టుటకు సమ్మను.

[ మదరాసు గ్రామ కోర్టుల ఆక్టు యొక్క 40, 41వ సెక్షనులు. ]

లో వుండే గ్రామ కోర్టులో.

19 వ సంవత్సరపు నెంబరు వ్యాజ్యెము.

వాది.

ప్రతివాది.

కి/కు

పై వ్యాజ్యెములో పక్షమున సాక్ష్యము దిగువ వివరింపబడిన దస్తావేజులు కావలసి యున్నది గనుక 19 వ సం॥ నెల తారీఖున పూర్వాహ్ణమున గంటలకు యీ కోర్టువారి యెదుట నీవు హాజరగుటకున్నూ సదరు దస్తావేజులను

నీతోకూడ తీసుకొని వచ్చుటకున్ను ఇందుమూలముగా నిన్ను ఆజ్ఞాపించడమైనది. పైన చెప్పిన తారీఖుననున్నూ గంటలకున్నూ సదరు దస్తావేజులు యీ కోర్టులో హాజరు పెట్టబడునట్లు చేయుదువేని యీ సమ్మను ప్రకారము నీవు జరిపినట్లు భావింపబడును.

దస్తావేజుల వివరము.

ఈ 19 వ సం॥ నెల తారీఖున నా చే వ్రాలుతో సాదరు చేయబడినది.

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టు యొక్క ప్రెసిడెంటు.

జిల్లా తాలూకా

గ్రామ కోర్టులో.

19 వ సం॥ నెల తేది వారమున

హాజరు.

1. గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క మెంబర్లు.

2.

3.

19 వ సంవత్సరపు నంబరు వ్యాజ్యెములో డిక్రీ.

వాది.

ప్రతివాది.

దావా.

తీర్పు.

తీర్మానించిన పైకపు మొత్తము అప్పగించవలసిన చరాస్తి, అట్లు అప్పగించక తప్పినపుడు చెల్లించవలసిన మొత్తము, ఖర్చుల మొత్తము, ఏ కక్షిదారుల ఎంతెంత వంతులుగా అట్టి ఖర్చులను చెల్లించవలసినదిన్ని వడ్డి యివ్వవలసియున్న యెడల అదిన్ని తీర్పులో వివరించవలెను.

ఈ వ్యాజ్యెము నెల తేదీని వాది యెదుటను ప్రతివాది యెదుటను విచారణకు వచ్చి యిట్లని తీర్పు చెప్పబడినది.

24B

తీర్పువకు గల కారణములు.

ఈ 19     వ సం॥                    నెల        తేదిని నా/మా చేవ్రాలతో ఈయబడినది.

గ్రామ మునసబు లేదా పంచాయతీ
కోర్టుయొక్క ప్రెసిడెంటు.
కోర్టులో యేకీభవించని మెంబర్లు

విచారించిన సాక్షుల పట్టీ.

వాది తరపున—
1.
2.

ప్రతివాది తరపున—
1.
2.

చదివిన ఎగ్జిబిట్ల పేర్లు.

వాది తరపున—
1.
2.

ప్రతివాది తరపున—
1.
2.

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు.

ఈ డిక్రీని అనుసరించి (పైకము) చెల్లించుటను గురించిన లేదా అడ్జస్టుమెంటును గురించిన యెండార్సుమెంటు.

తేదీ

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు.

వ్యాజ్యెములనుగురించిన రెజిష్టరులో వ్రాయవలసిన నమూదులు ఈ రోజుననే వ్రాయబడినవి.

గ్రామ మునసబు లేదా పంచాయతీ కోర్టుయొక్క ప్రెసిడెంటు

సంవత్సరములో, తీర్పు చేయబడకుండనుండినట్టివిన్ని దాఖలు చేయ
పరిష్కరింపబడినట్టివిన్ని దావాల
(మదరాసు—1920 వ సం॥పు 2 వ ఆక్టువలన
75 వ సెక్షను ననుసరించి హైకోర్టు
ప్రతి సంవత్సరము జనవరి 5 వ తేదిన గ్రామ కోర్టులవలన

| దావాల తరగతి విభజన. | కోర్టుల సంఖ్య | | సంవత్సరములో వాస్తవముగా పని చేసిన కోర్టుల సంఖ్య | | క్రిందటి సంవత్సరమునుండి పరిష్కారము కాకుండ నిలిచి యున్న దావాల సంఖ్య | |
|---|---|---|---|---|---|---|
| | గ్రామ మునసబు కోర్టులు | పంచాయతీ కోర్టులు | గ్రామ మునసబు కోర్టులు | పంచాయతీ కోర్టులు | గ్రామ మునసబు కోర్టులు | పంచాయతీ కోర్టులు |
| గ్రామ కోర్టుల ఆక్టుయొక్క 13 వ సెక్షను ననుసరించి— | | | | | | |
| రూ॥ 10 లును అంతకు తక్కువయును కిమ్మతుగల దావాలు | | | | | | |
| రూ॥ 20 లును అంతకు తక్కువయును (కాని రూ॥ 10 లకు ఎక్కువ) కిమ్మతు గల దావాలు. | | | | | | |
| రూ॥ 50 లును అంతకు తక్కువయును (కాని రూ॥ 20 లకు ఎక్కువ) కిమ్మతు గల దావాలు. | | | | | | |
| గ్రామ కోర్టుల ఆక్టుయొక్క 14 వ సెక్షను ననుసరించి— | | | | | | |
| రూ॥ 100 లను అంతకు తక్కువయును (కాని రూ॥ 50 లకు ఎక్కువ కిమ్మతు గల) దావాలు. | | | | | | |
| రూ॥ 200 లును అంతకు తక్కువయును (కాని రూ॥ 100 లకు ఎక్కువ) గల దావాలు. | | | | | | |
| మొత్తము | | | | | | |

బడినట్టివిన్ని గ్రామ మునసబుల వలనను పంచాయతీ కోర్టులవలనను సంవత్సరవారీ రిటరను.

సవరింపబడినట్లుండు 1889 వ సం॥పు 1 వ ఆక్టుయొక్క—
వారివలన నిర్ణయింపబడిన నమూనా).
తహశీల్దారులద్వారా కలెక్టరులకు పంపబడవలసినది.

| సంవత్సరములో వచ్చిన దావాల సంఖ్య. | | సంవత్సరములో పరిష్కరింపబడిన దావాల సంఖ్య | | సంవత్సరము చివర పరిష్కారము గాకుండ నిలచియున్న దావాల సంఖ్య | | షరాలు. |
|---|---|---|---|---|---|---|
| గ్రామ మునసబు కోర్టులు | పంచాయితీ కోర్టులు | గ్రామ మునసబు కోర్టులు | పంచాయితీ కోర్టులు | గ్రామ మునసబు కోర్టులు | పంచాయితీ కోర్టులు | |
| | | | | | | |

1889వ సం॥పు 1టవదగు మదరాసు గ్రామ కోర్టుల ఆక్టు ననుసరించి జరిపిన అమలు చర్యల రిజిష్టరు.

| అమలు జరుపుటకు చేసికొనిన దరఖాస్తు తేది. | వ్యాజ్యము నంబరున్ను డిక్రీ తేదీన్ని | డిక్రీ మొత్తము లేక విషయము. | రాబట్టిన పైకపు మొత్తము లేక ఆస్తిన్ని, తే॥న్ని | తీర్పు ఋణదాతకు వాదికి (అతని) రశీదు పుచ్చుకొని ఎప్పుడు (పైకము) చెల్లించినది, లేక (సొత్తు) వశపరచినది. |
| --- | --- | --- | --- | --- |

# మూడవ భాగము

## పంచాయతీ కోర్టులచే విచారింపబడదగిన నేరములు

1—ఇండియన్ పీనల్ కోడు (ఇండియాదేశపు శిక్షాస్మృతి) క్రింద నేరములు.

గత్తర జరిగించినందుకు శిక్ష.

సె. 160. "గత్తర జరిగించే యేమనిషి అయినా, ఒక మాసమునకు వ్యాపించకూడిన కాలమువరకు, రెండు తరహాలలో ఒక తరహా ఖయిదు వల్లగాని, వంద రూపాయీలకు వ్యాపించకూడిన జుల్మానావల్లగాని, యీ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది."

"గత్తర" ఆ కోడుయొక్క 159 వ సెక్షన్‌లో ఈ ప్రకారము నిర్వచింపబడినది:—

"ఇద్దరుగాని, యెక్కువమందిగాని ఒక బహిరంగమయిన స్థలమునందు పోట్లాడడమువల్ల జనుల నెమ్మదికి భంగము కలుగజేసినప్పుడు వారు గత్తర జరిగించినట్లు చెప్పబడుతున్నారు.

### వ్యాఖ్య

ఈ సె॥ క్రింద ఋజువు చేయవలసిన అంశములు :—

1. ఇద్దరు లేక యెక్కువమంది మధ్యపోరాటము.
2. అట్టి పోట్లాట ఒక బహిరంగ స్థలములో జరిగినట్లున్నూ,
3. ఆ పోట్లాట ప్రజాశాంతికి భంగము కలుగజేసిన దనిన్నీ, ఋజువుచేయవలెను.

కేవలము మాటలు యెంత తీవ్రముగా యున్నను "గత్తర" కాజాలవు. బహిరంగ స్థలమనగా సాధారణముగా ప్రజలు వెళ్లేస్థలము. సదరు స్థలమునకు వెళ్లుటకు ప్రజలకు హక్కు యున్నను లేకున్నను సరే ఒకే స్థలము ఒకసారి బహిరంగస్థలమై వేరొకసారి కాకపోవచ్చును. కోర్టువారు నేరము జరిగినస్థలము నేరము జరిగినప్పుడు బహిరంగ స్థలముగా యుండెనా లేదా అను అంశమును తీర్మానించవలసి యుండును.

రైల్వేప్లాటుఫారము, రైల్వే గూడ్సుషెడ్సు, దేవాలయములు, ఓడరేవులు రహదారిలు బహిరంగ స్థలములుగా నెంచబడును. కాని ఒక ప్రయాణీకుతోటగాని, లేక యెట్టిరైళ్ళురానిసమయములో రైల్వేస్టేషను ప్లాటుఫారములుగాని బహిరంగస్థలములుగా యెంచబడవు.

సర్వజనోపయుక్తమైన పూటయొక్క లేక జలాశయముయొక్క నీరు అశుద్ధ పరచడము.

సె. 277 "సర్వజనోపయుక్తమైన పూటయొక్క, లేక జలాశయము యొక్క నీరు, అది సాధారణముగా వాడబడే కార్యమునకు అంత తగివుండకుండా పోయ్యేలాగున, స్వేచ్ఛగా అశుద్ధపరచే, లేక మురికిచేసే యేమనిషిఅయినా, మూడు మాసములకు వ్యాపించగూడని కాలమునకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని, అయిదు వందల రూపాయలకు వ్యాపించగూడని జుల్మానావల్లగాని, ఈ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది."

## వ్యాఖ్య

ఈ సె॥ క్రింద ఋజువు చేయవలసిన అంశములు:—

1. సర్వజనోపయుక్తమైనపూటయొక్క లేక జలాశయముయొక్క నీటిని,
2. అది సాధారణముగా వాడబడేకార్యమునకు తగనట్లుగా,
3. బుద్ధి పూర్వకముగా మురికిచేసినట్లుగాని, లేక అశుద్ధపరచినట్లుగాని ఋజువు చేయవలెను.

జలాశయము అనుమాట ఒకచెరువు కోనేరు లేక బావి మొదలగువాటికి వర్తించును. అశుద్ధపరచుట అనగా ముద్దాయిచర్యవల్ల నీటిలో వస్తుతః మార్పుగలిగిమురికిగాని అశుద్ధతగాని యేర్పడవలెను. ఒకహరిజన స్త్రీ ఒక చెరువులోనుండిగాని బావిలోనుండిగాని నీరు తీసుకొని వెళ్ళిన యెడల ఆమె ఆ నీరును మురికిచేసినట్లుగాని అశుద్ధపరచినట్లుగాని ఎంచవీలులేదు. ఏలనన, ఆమెచర్యవల్ల నీటిలో వస్తుతః యెట్టిమార్పునూ కలిగి యుండలేదు.

చెరువులు వగైరాలలో స్నానమాడుట, బట్టలు వగైరాలు వుతుకుట, బుట్టలతో చేపలను పట్టుట, నూతులలో ఉమియుట మొదలగు చర్యలుచేసిన నీటిని మురికిచేసినట్లుగాని, అశుద్ధపరచినట్లుగాని యెంచబడును. కాని పైనచెప్పిన పనులు నదులలో చేసినయెడల యీ సె. క్రింద నేరము చేసినట్లు యెంచవీలులేదు.

సర్వజనోపయుక్తమయిన దారిని లేక నీటిమీద వెళ్లే దారిలో ప్రమాదము, లేక అడ్డు కలుగ చెయ్యడము.

సె. 283. "ఒక కార్యము జరిగించడమువల్లగాని, తన స్వాధీనమందు లేక తన పరమందు వుండే యేదైనా ఆస్తినిగురించి బందోబస్తు చెయ్యకుండా పోవడమువల్లగాని, సర్వజనోపయుక్తమైన దారిని లేక నీటిమీద వెళ్ళేదోవలో యేమనిషికైనా ప్రమాదము, అడ్డు లేక హాని కలుగజేసే యేమనిషిఅయినా రెండువందలరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల శిక్షింపబడవలసినది."

## వ్యాఖ్య.

ఈ సెక్షను క్రింద ఋజువు చేయవలసిన అంశములు:—

1. ముద్దాయి చేసిన ఒక పనివల్లగాని, లేక ముద్దాయి స్వాధీనములోయుండే యేదైనా ఆ స్తిని తగిన బందోబస్తు చేయకపోవడము వల్లగాని,

2. సర్వజనోపయుక్తమైన దారిని, లేక నీటిమీద వెళ్ళేదోవలో (అనగా పడవలు వగైరాలమీద వెళ్ళేవారికి) వెళ్ళే యేమనిషికైనా ప్రమాదముగాని, అడ్డుగాని లేక హానిగాని కలుగజేసినట్లు ఋజువు చేయవలెను.

సర్వజనోపయుక్తమగు రహదారి (రోడ్డువగైరాలు) లో గుంటలు త్రవ్వుట అడ్డుగా రాళ్లకుప్పలు వేయడము, లేక బండ్లు వగైరాలు అడ్డుగా నిలుపుట, మగ్గములు నేయుట లేక యితర విధముగా రోడ్లపైనిపోవు ప్రయాణీకుల సౌకర్యమునకు యేదైనా ఆటంకము కలుగజేయుట మొదలగు చర్యలు యీ సెక్షన్ క్రింద నేరములగును. ఇవన్నీగాక, ఎవరైనను తమ స్వాధీనములోయున్న, విషవస్తువులు, గడ్డి, కిరసనాయిలు, తుపాకిమందు మొదలగువాటివల్ల యితరులకు యెట్టి అపాయము కలుగకుండా తగు జాగ్రత్త పుచ్చుకొనక రహదారి వెంటగాని, లేక ఒక పడవ పైనగాని, ప్రయాణముచేయువారికి హాని కలుగజేసిన యీ సెక్షను క్రింద నేరస్థులగుదురు. ఈ సె॥ లో చెప్పినఆస్తి పైనచెప్పినట్లు చరాస్తికావచ్చును. లేక స్థిరాస్తికూడ కావచ్చును. ఉ॥ ఒకడు ఒకరహదారిని అనుకొనియున్న తనస్థలములో పెద్దగొయ్య త్రవ్వి దానికి అడ్డముకట్టకుండా రహదారిని పోవువారికి అపాయము కలుగజేసిన, లేక రహదారిని అనుకొనియున్న తనగోడ విరిగిపడినందున ప్రయాణీకులకు హాని కలుగజేసిన యీ సె. ప్రకారము నేరస్థుడగును. ఒక దొడ్డిలో పెరుగుచున్న కంచె అతని స్థలము దాటి రోడ్డుమీదకు పోవువారికి ఆటంకము కలుగుచున్నట్లు పెరుగుచున్నపుడు అట్టి దానిని రోడ్డుమీదకు పెరగకుండా చర్యతీసికొనని యెడల యీ సెక్షను క్రింద నేరస్థుడగును.

ఇతర విధమున యేర్పాటు చేయబడియుండని సందర్భములలో జనోపద్రవమునకు శిక్ష.

సె. 290. "ఈ శాసనమువల్ల మరియొక తరహాగా శిక్షించబడగూడని యేదైనాసంగతిలో జనోపద్రవము కలుగజేసే యేమనిషి అయినా రెండువందల రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానావల్ల శిక్షించబడవలసినది.

"జనోపద్రవము" ఇండియన్ పీనల్ కోడుయొక్క 268 వ సెక్షనులో ఇట్లు నిర్వచింపబడియున్నది:—

"268. సమీపమందువాసముచేసే లేక యేదయినా స్థితివుంచుకొనివుండే ప్రజలకు సాధారణముగా లేక సర్వజనులకు, యేదయినా సాధారణమయిన హాని, ప్రమాదము, లేక ఉపద్రవముకలుగచేసే లేక ఏదయినా సర్వసాధారణమైనహక్కు చెలాయించుకొనే మనుష్యులకు హాని, ఆటంకము, ప్రమాదము లేక ఉపద్రవము అవశ్యకముగా కలుగచెయ్యవలసిన యేదయినా కార్యము జరిగించే, లేక న్యాయశాస్త్ర విరోధమయిన లోపము జరిగించే యే మనిషిఅయినా, జనోపద్రవము జరిగించిన నేరమునుగురించి నేరస్థుడు అవుతున్నాడు."

## వ్యాఖ్య

ఈ సెక్షనుక్రింద ఋజువుచేయనలసిన అంశములు:—

1. ముద్దాయి తన చర్యలవల్ల లేక శాస్త్ర విరోధమైన తన లోపమువల్ల,

2. సమీపమందు వాసముచేసే లేక యేదైనా ఆస్తిని స్వాధీనము కలిగియున్న ప్రజలకు యేదైనా హాని లేక ప్రమాదము లేక ఉపద్రవము కలుగజేసినట్లుగాని, లేక తప్పక కలుగజేయు కార్యము చేసినట్లుగాని ఋజువు చేయవలెను.

సాధారణముగా యేపనులవల్ల జనులయొక్క ఆరోగ్యమునకుగాని, సౌకర్యమునకుగాని, నీతికిగాని భంగము కలుగునో అట్టిపనులన్నియు జనోపద్రవమైన పనులుగా యెంచబడును.

ఎవరైనా యితరుల యిండ్ల సమీపములో దుర్వాసనగల వస్తువులు అనగా తోళ్ళు, పెంటలు, నగైరాలు నిల్వచేయుచూగాని సదరు వస్తువులతో వ్యాపారము చేయుచూ దుర్వాసనలు కలుగజేయుచుండినగాని, లేక ప్రక్కన నివసించు జనుల సౌఖ్యమునకు భంగకరముగా రాత్రులయందు చాలసేపటివరకు యెక్కువ ధ్వనులు వగైరాలు కలుగజేయుటగాని యీ సెక్షను ప్రకారము నేరము లగును.

స్వేచ్ఛగా ఘాతచేసినందుకు శిక్ష.

సె. 323. "334న సెక్షనులో నమూదు చెయ్యబడ్డ సంగతిలో తప్ప, స్వేచ్ఛగా ఘాత కలుగజేసే యేమనిషి అయినా, ఒక సంవత్సరముకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహాఖయిదు వల్లగాని, వెయ్యిరూపాయలకు వ్యాపించగూడిన జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది."

అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహకారణముమీద స్వేచ్ఛగా ఘాత కలుగజేసినందుకు, 334న సెక్షను (శిక్షను) ఏర్పాటు చేయుచున్నది.

"ఘాత" అనగా ఏ మనిషికయినా దేహశ్రమ, రోగము లేక అశక్తత కలుగజేయుట అని ఇండియన్ పీనలుకోడుయొక్క 319 వ సెక్షనులోను, మరియు స్వేచ్ఛగా ఘాతను కలుగజేయుట. అనగా ఏమనిషికయినా ఘాత కలుగజేయవలెననే యత్నముతోటి లేక ఘాత కలుగవచ్చుననే జ్ఞానముతోటి యేదైనా కార్యము జరిగించి ఆ కార్యము వల్ల ఎవరికైనా ఘాత కలుగజేయుట అని ఇండియన్ పీనలుకోడు 321 వ సెక్షనులో నిర్వచింపబడియున్నది.

## వ్యాఖ్య

ఈ సెక్షను క్రింద ఋజువుచేయవలసిన అంశములు.

1. ముద్దాయి అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహకారణము లేకుండా.
2. స్వేచ్ఛగా ఘాతను కలుగజేసినట్లు ఋజువుచేయవలెను.

ఈ సె. క్రింద దెబ్బలుకొట్టి శరీరమునకు బాధకలుగచేసిన సందర్భములలోనే గాక విషప్రయోగము వల్ల బాధ కలుగజేసినను నేరమగును.

ఆగ్రహ కారణముమీద స్వేచ్ఛగా ఘాత కలుగ జేయుట.

సె. 334 "అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహ కారణముమీద స్వేచ్ఛగా ఘాతకలుగజేసే యే మనిషియైన, ఆగ్రహముకలుగజేసిన మనిషికి గాక మరి యే యితర మనిషికి అయినా ఘాత కలుగజేయవలెనని అతడు వుద్దేశించక పోయిన పక్షముకు, లేక అట్టిఘాత కలుగవచ్చునని ఎరిగివుండని పక్ష

ముకు ఒకమాసముకు వ్యాపించకూడిన కాలమువరకు రెండుతరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని అయిదువందల రూపాయలకు వ్యాపించ గూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షింపబడవలసినది."

## వ్యాఖ్య

ఈ సెక్షన్ క్రింద ఋజువుచేయవలసిన అంశములు:—

1. అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహాకారణము వల్ల,
2. స్వేచ్ఛగా ముద్దాయి ఘాత కలుగజేసినాడని ఋజువు చేయవలెను.

323 సె.క్రింద ఆగ్రహాకారణము లేనిదే ఘాతకలుగజేసినయెడల 1 సం॥ వరకు రెండు తరహాల ఖైదుగాని, లేక జుల్మానాగాని విధించవచ్చును. కాని యీ సె.క్రింద అకస్మాత్తుగా సంభవించిన ఆగ్రహాకారమువల్ల ఘాత కలుగజేసిన ఒక మాసమువరకు మాత్రము రెండుతరహాల ఖైదుగాని, లేక జుల్మానా విధించవచ్చును.

గొప్ప ఆగ్రహా కారణము మీదగాక యితరవిధమైనదగు దొమ్మిలేక నేరముగల బలవంత మునకు శిక్ష.

సె. 352. "అకస్మాత్తుగా సంభవించిన గొప్ప ఆగ్రహా కారణము కలుగజేసిన మనిషిమీదనైతేనే తప్ప ఏ మనిషిమీదనైనా దొమ్మిచేసే లేక అత నికి నేరముగల బలవంతము జరిగించే యే మనిషినైనా మూడుమాసములకు వ్యాపించకూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని అయిదువందల రూపాయలకు వ్యాపించ కూడిన జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది."

వివరణము:—అకస్మాత్తుగా సంభవించే గొప్ప ఆగ్రహాకార ణము యీ సెక్షనుబట్టి ఒక నేరముకు విధించబడ్డ శిక్షను మితపరచ నేరదు. ఆ సంగతులు యేవంటే,

ఆ ఆగ్రహాకారణము అనేది నేరము జరిగించడముకు నిమిత్త ముగా నేరస్థునివల్ల స్వేచ్ఛగా యేర్పాటు చెయ్యబడ్డ పక్షమునకు లేక కలుగజెయ్యబడ్డ పక్షముకు, లేక

ఆ ఆగ్రహా కారణము అనేది న్యాయశాస్త్రమును అనుసరించి గాని పబ్లిక్ ఉద్యోగస్థునియొక్క అధికారములు న్యాయశాస్త్ర రీత్యా

చెలాయించడమందు అట్టి పబ్లిక్ వుద్యోగస్తునివల్లగాని జరిగించబడ్డ దేని వల్లనయినా కలుగచెయ్యబడ్డ పక్షముకు, లేక

ఆ ఆగ్రహకారణము అనేది ఆత్మసంరక్షణనుగురించిన హక్కు-న్యాయశాస్త్ర సమ్మతముగా చెలాయించడములో జరిగించబడ్డ దేని వల్లనయినా కలుగ చెయ్యబడ్డపక్షముకు

ఆ ఆగ్రహకారణము అనేది నేరమును మితపరచడముకు చాలినంత గొప్పదిగానున్ను అకస్మాత్తుగా సంభవించినదిగానున్ను వున్నదా లేదా అని నిర్ణయించడము సంగతియొక్క అంశముగా వుంటున్నది.

'దొమ్మి' ఇండియన్ పీనలుకోడుయొక్క 351 వ సెక్షనులో యిట్లు నిర్వచింపబడియున్నది:—

సె. 351. "హాజరుగావుండే ఏమనిషి అయినా తనకు నేరము గల బలవంతము జరిగించబడుచున్నది అని యెంచుకోవలెననే యత్నముతో లేక యెంచుకొంటాడని ఎరిగివుండి ఏదయినా సైగ, లేక సన్నాహముచేసే యే మనిషియయినా, దొమ్మిచేసినట్లు చెప్పబడుతున్నాడు.

వివరణము:— వట్టిమాటలు దొమ్మికానేరవు. అయితే ఒక మనిషి చెప్పేమాటలు, తన సైగలు, లేక సన్నాహములు దొమ్మికి వ్యాపించే భావమును సూచింపజేయవచ్చును.

## దృ ష్టాం త ర ము లు

1. "ఏ" అనేమనిషి, తాను "జడ్" అనే మనిషిని కొట్టబోతున్నానని ఎంచుకొనేలాగున చెయ్యవలెనని యత్నించి, లేక యెరిగివుండి "జడ్" అనే మనిషిమీకి తన పిడికిలి కనపరుస్తున్నాడు—"ఏ" అనేమనిషి, దొమ్మి జరిగించినవాడు అవుతున్నాడు.

2. "ఏ" అనే మనిషి, ఒకకుక్క "జడ్" అనే మనిషిమీద పడేటట్టు తాను చెయ్యబోతున్నాడని "జడ్" అనేమనిషి యెంచుకొనేలాగున చెయ్యవలెనని యత్నించి లేక యెంచుకోవచ్చునని యెరిగివుండి క్రూరమైన ఒకకుక్కయొక్క మూతి చిక్కము వదలించడముకు ఆరంభిస్తున్నాడు—"ఏ" అనేమనిషి, "జడ్" అనే మనిషిమీద దొమ్మి జరిగించినవాడు అవుతున్నాడు.

3. "ఏ" అనేమనిషి, "జడ్" అనే మనిషితో "నిన్ను కొట్టుతాను" అని చెప్పి ఒక కర్ర పుచ్చుకొంటున్నాడు— ఇందులో "ఏ" అనే మనిషి చెప్పిన యీ వట్టి

మాటలు యెంతమాత్రము దొమ్మికి వ్యాపించబోయినప్పటికిన్ని, ఆ కర్త పుచ్చుకోవడమువల్ల కలిగిన సయిగ దొమ్మికి వ్యాపించక పోయినప్పటికిన్ని. ఆ మాటవల్ల ఆ సయిగ దొమ్మి కావచ్చును.

"బలవంతము" 349 వ సెక్షనులో యిట్లు నిర్వచింపబడి యున్నది:—

సె. 309 "ఒకమనిషి, మరియొక మనిషికి చలనము, చలనభేదము, లేక చలననివృత్తి కలుగజేసిన పక్షమునకుగాని అతడు అట్టిమనిషి యొక్క శరీరము తాలూకు ఏభాగముతోటి అయినా లేక అట్టి మనిషి ధరించికొని వుండే లేక పట్టుకొని వెళ్లుతూవుండే దేనితోటియయినా, లేక ఆమనిషియొక్క స్పర్శేంద్రియమునకు తాకే దేనితోటియయినా వస్తువు తగిలేటట్టు అట్టి వస్తువునకు చలనము,. చలనభేదము, లేక చలన నివృత్తి కలుగజేసిన పక్షమునకుగాని, ఆమనిషిని బలవంతపెట్టినట్టు చెప్పబడుతున్నాడు. అయితే అట్టిచలనము, చలనభేదము, లేక చలన నివృత్తి యిందులో యికముందు చెప్పబడే మూడు తరహాలలో ఒక తరహాను జరిగించబడి వుండవలసినది. అవి యేవంటే:

మొదటిది:—ఆ మనిషియొక్క స్వకీయమైన శరీరబలమువల్ల.

రెండవది:—ఆ మనిషివల్లగాని యితర మనిషివల్లగాని మరి యే కార్యమును జరిగించబడకుండా, చలనము, చలనభేదము, లేక చలన నివృత్తి సంభవించేలాగున యేదైనా వస్తువు వుంచడమువల్ల,

మూడవది:—ఏదైనా జంతువు చలించేలాగున చలనభేదము జరిగించేలాగున లేక చలననివృత్తి చేసేలాగున చేయడమువల్ల."

"నేరముగలబలవంతము" ఇండియన్ పీనలు కోడుయొక్క 350వ సెక్షనులో యిట్లు నిర్వచింపబడియున్నది:—

సె. 350. "ఏదైనానేరము జరిగించగలందులకు ఏమనిషియొక్క అయినా సమ్మతి లేకుండా అతనిని మనఃపూర్వకముగా బలవంతపెట్టే లేక అట్లా బలవంత పెట్టటమువల్ల బలవంతపెట్టబడ్డ ఆమనిషికి కీడు' భయము, లేక వుపద్రవము కలుగవలెనని యత్నించి, లేక అట్టిబలవం

తమువల్ల కీడు, భయము, లేక వుపద్రవము కలుగవచ్చునని ఎరిగివుండి అట్టి యితర మనిషికి బలవంతము కలుగచేసే ఏమనిషియైనా ఆయితర మనిషికి నేరముగల బలవంతమును జరిగించినట్లు చెప్పబడుతున్నాడు”

## దృష్టాంతములు.

(1) “జడ్“ అనేమనిషి, ఒక నదియందు లంగరువేయబడ్డ పడవలోకూర్చుండి వుంటున్నాడు. “ఏ” అనేమనిషి, ఆ లంగరు తాళ్లు వదిలించి అందువల్ల ప్రయత్న పూర్వకముగా ఆ పడవ ప్రవాహపు నీళ్ళలో కొట్టుకొని పొయ్యేటట్టు చేస్తున్నాడు. ఇందులో “ఏ” అనే మనిషి “జడ్” అనేమనిషికి చలనము కలిగేటట్లు చేసినాడు. పయిగా అతడు తనవల్లగాని, యే మనిషివల్లనైనాగాని యే యితర కార్యమున్నూ జరిగించబడకుండానే ఆ చలనము కలిగేలాగున వస్తువులు వుంచటము వల్ల యీ చలనము కలుగజేస్తున్నాడు. గనుక “ఏ” అనేమనిషి, “జడ్” అనే మనిషికి ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు; మరిన్ని యేదయినా నేరము జరిగించడముకు, “జడ్” అనే మనిషియొక్క సమ్మతిలేకుండా ఆలాగునజరిగించిన పక్షముకు, లేక యీ బలవంతమువల్ల కీడు, భయము, లేక వుపద్రవము సంభవించవలెనని యత్నించి, లేక సంభవించవచ్చునని యెరిగి యుండి యీ బలవంతము జరిగించివున్న పక్షముకు “ఏ” అనేమనిషి, “జడ్” అనేమనిషికి నేరముగల బలవంతము జరిగించిన వాడు అవుతున్నాడు.

(2) “జడ్” అనే మనిషి, ఒక బండిమీద సవారీచేస్తున్నాడు. “ఏ” అనే మనిషి, “జడ్” అనేమనిషియొక్క గుర్రములను చవుకుతోకొట్టి అందువల్ల అవి మును పటికంటె వడిగా వెళ్ళేటట్లు చేస్తున్నాడు. ఇందులో ఆజంతువుల చలనముకు భేదము కలిగేలాగున చెయ్యడమువల్ల “జడ్” అనే మనిషికి చలనభేదము కలుగజేసినాడుగనుక “ఏ” అనేమనిషి “జడ్” అనేమనిషిని బలవంతపెట్టినవాడు అవుతున్నాడు; మరిన్ని “ఏ” అనేమనిషి, అందువల్ల “జడ్” అనేమనిషికి కీడు, భయము లేక వుపద్రవము కలుగచెయ్యవలెనని యత్నించి, లేక కలుగవచ్చునని యెరిగివుండి “జడ్” అనేమనిషి యొక్క సమ్మతిలేకుండా యీ చలనభేదము కలుగజేసివున్నయెడల “ఏ” అనేమనిషి “జడ్” అనే మనిషికి నేరముగల బలవంతము జరిపించినవాడు అవుతున్నాడు.

(3) “జడ్” అనే మనిషి పల్లకీలో సవారీ చేస్తున్నాడు. “ఏ” అనే మనిషి “జడ్” అనే మనిషిని దోచుకొనవలెనని యత్నించి దండె పట్టుకొని పల్లకీ ఆపుతున్నాడు. ఇందులో “ఏ” అనే మనిషి “జడ్” అనే మనిషికి చలననివృత్తి తన శరీరము వల్ల కలుగజేసినాడు గనుక “ఏ” అనే మనిషి “జడ్” అనే మనిషిని బలవంతము చేసినవాడు అవుతున్నాడు; మరిన్ని “ఏ” అనే మనిషి ఒక నేరము జరిగించడము కొరకు “జడ్” అనే మనిషియొక్క సమ్మతిలేకుండా ప్రయత్నపూర్వక

ముగా యీ ప్రకారము జరిగించినాడు. కాబట్టి "ఏ" అనేమనిషి "జడ్" అనేమనిషికి నేరము గల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(4) "జడ్" అనే మనిషి వీధిని వెళ్ళుతూవుండగా "ఏ" మనిషి ప్రయత్న పూర్వకముగా అతణ్ణి వొరుసుకొని పోతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి తన స్వకీయమైన శరీరబలమువల్ల "జడ్" అనే మనిషికి తగిలేటట్లు తన స్వకీయమైన శరీరముకు చలనముకలుగజేసినవాడు. గనుక అతడు ప్రయత్నపూర్వకముగా "జడ్" అనే మనిషికి బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు. మరిన్ని అందువల్ల "జడ్" అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలుగ జెయ్యవలెనని యత్నించి లేక కలుగ వచ్చునని యెరిగివుండి "జడ్" అనే మనిషియొక్క సమ్మతిలేకుండా జరిగించివున్న పక్షముకు అతడు "జడ్" అనే మనిషికి నేరము గల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(5) "ఏ" అనే మనిషి, ఒకరాయితీసి "జడ్" అనేమనిషికి లేక అతని బట్టలకు లేక అతను పట్టుకొని వెళ్ళుతూవుండే యేదో ఒక వస్తువుకు తగలవలసినదని లేక అది నీళ్ళమీద వెయ్యబడి ఆనీళ్ళు "జడ్" అనేమనిషియొక్క బట్టలమీదగాని "జడ్" అనే మనిషి పట్టుకొని వెళ్లుతూవుండే యేదో ఒక వస్తువు మీదగాని, యెగరవలెనని యత్నించి లేక యెరిగివుండి ఆ రాయి వేస్తున్నాడు. ఇందులో రాయివెయ్యడమువల్ల "జడ్" అనే మనిషికిగాని, "జడ్" అనే మనిషియొక్క బట్టలకుగాని, యేదయినా వస్తువు తగిలేటట్టు సంభవించిన పక్షముకు "ఏ" అనేమనిషి "జడ్" అనే మనిషికి బలవంతము చేసినవాడు అవుతున్నాడు; మరిన్ని అందువల్ల "జడ్" అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము కలుగచెయ్యవలెనని యత్నించి అతను ఆ ప్రకారముచేసిన పక్షముకు "జడ్డు" అనే మనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(6) "ఏ" అనేమనిషి, ఒక స్త్రీయొక్క ముసుకును ప్రయత్నపూర్వకముగా లాగివేస్తున్నాడు. ఇందులో "ఏ" అనేమనిషి, ఆమెకు ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు. మరిన్ని అతడు అందువల్ల ఆమెకు కీడు, భయము లేక వుపద్రవము కలుగ చెయ్యవలెనని యత్నించి, లేక యెరిగివుండి ఆమె సమ్మతి లేకుండా ఆ ప్రకారము జరిగించిన పక్షముకు అతను ఆమెకు నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(7) "జడ్" అనేమనిషి స్నానము చేస్తూవున్నాడు. "ఏ" అనేమనిషి, పొంగ కాగుతూవున్నట్టు తాను ఎరిగివుండే వుదకము స్నానముచేసే తొట్టిలో పోస్తున్నాడు. ఇందులో "ఏ" అనేమనిషి. తనస్వకీయమైన శరీరబలమువల్ల ప్రయత్నపూర్వకముగా ఆవుదకము "జడ్" అనే మనిషియొక్క దేహమునకుగాని "జడ్" అనేమనిషియొక్క స్పర్శేంద్రియముకుగాని హాని కలుగచెయ్యతగ్గ యితర వుదకముగాని తగిలేటట్టు పొంగ కాగుతూవుండే వుదకముకు చలనము కలుగ చేస్తున్నాడు. గనుక "ఏ" అనే మనిషి

"జడ్డు" అనేమనిషికి ప్రయత్నపూర్వకముగా బలవంతము జరిగిస్తున్నాడు; మరిన్ని అతడు, అందువల్ల తాను "జడ్డు" అనే మనిషికి కీడు, భయము, లేక వుపద్రవము జరిగించవలెనని వుద్దేశించి, లేక యెరిగివుండి "జడ్డు" అనేమనిషియొక్క సమ్మతిలేకుండా ఈ కార్యము చేసివున్న పక్షమును "ఏ" అనే మనిషి, నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

(8) "ఏ" అనే మనిషి, "జడ్డు" అనే మనిషియొక్క సమ్మతిలేకుండా "జడ్డు" అనేమనిషిమీదికి యెగిరేటట్టు ఒకకుక్కను యెగకొలుపుతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి, "జడ్డు" అనే మనిషికి కీడు, భయము లేక వుపద్రవము జరిగించవలెనని యత్నించిన పక్షమును అతడు "జడ్డు" అనేమనిషికి నేరముగల బలవంతము జరిగించినవాడు అవుతున్నాడు.

## వ్యాఖ్య.

ఈ సెక్షను క్రింద ఋజువు చేయవలసిన అంశములు.

(1) అకస్మాత్తుగా సంభవించిన యెట్టి ఆగ్రహకారణము లేకుండా,

(2) ముద్దాయి దౌర్జన్యం చేసినాడనిగాని లేక నేరముగల బలవంతము చేసినాడని గాని ఋజువు చేయవలెను.

'దౌర్జన్యం' లేక 'నేరముగల బలవంతము' యొక్క వివరములను చార్జిలో విపులముగావ్రాసి సాక్ష్యమువల్ల సదరు అంశములను ఋజువు చేయవలెను. సె. 350 క్రింద యివ్వబడిన దృష్టాంతమువల్ల యెట్టి చర్యలు నేరముగల బలవంతమగునో సులభముగా తెలియనగును. సె. 351 క్రింద యివ్వబడిన దృష్టాంతమువల్ల యే చర్యలు దౌర్జన్యమగునో సులభముగా గ్రహింపవచ్చును.

సె. 358. "ఒకమనిషివల్ల అకస్మాత్తుగా కలుగజేయబడు గొప్ప ఆగ్రహ కారణముమీద ఆ మనిషిపైని దౌర్జన్యం చేసే, లేక నేరముగల బలవంతము జరిగించే యే మనిషి యయినా ఒక మాసముకు వ్యాపించగూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదువల్లగాని, రెండువందల రూపాయలకు వ్యాపించగూడిన జుల్మానా వల్లగాని, యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది."

గొప్ప ఆగ్రహకారణము మీద దౌర్జన్యం లేక నేరముగల బలవంతము.

వివరణము:— ఈ సెక్షను, 352 సెక్షనులో చెప్పబడివుండే వివరణముకు లోబడి వుంటూవున్నది.

## వ్యాఖ్య

ఈ సెక్షన్ క్రింద ఋజువుచేయవలసిన అంశములు:—

(1) ఫిర్యాదివల్ల కలుగజేయబడిన అకస్మాత్తుగా సంభవించినట్టి గొప్ప ఆగ్రహ కారణమువల్ల,

(2) ముద్దాయి ఫిర్యాదిపైన దౌర్జన్యముగాని లేక నేరముగల బలవంతముగాని జరిగించినట్లు రుజువు చేయవలెను.

352 సెక్షన్‌లో ఆగ్రహకారణములేనిదే దౌర్జన్యముగాని లేక నేరముగల బలవంతముగాని జరిగించినయెడల 3 మాసములవరకు రెండుతరహాల ఖైదులో ఒక తరహా ఖైదువల్లగాని, రు 500 ల జుల్మానాగాని లేక యీరెండుగాని శిక్షగా విధించబడినది. కాని గొప్ప ఆగ్రహకారణమున్నపుడు అట్టి ఆగ్రహము కలుగజేసినవానిపై దౌర్జన్యముగాని, నేరముగల బలవంతముగాని జరిగించినయెడల యీ సెక్షను ప్రకారము తక్కువ శిక్ష (1 మాసమువరకు సాధారణఖైదుగాని, రు 200 ల జుల్మానాగాని లేక రెండుగాని) విధించబడినది.

చోరీకి శిక్ష.

సె. 379. "చోరీ జరిగించే యే మనిషియయినా మూడు సంవత్సరములకు వ్యాపించకూడని కాలము వరకు రెండు తరహాలలో ఒక తరహా ఖయిదువల్లగాని జుల్మానావల్లగాని యీ రెంటివల్లగాని శిక్షింపబడ వలసినది."

'చోరీ' ఇండియన్ పీనలు కోడుయొక్క 378 వ సెక్షనులో యిట్లు నిర్వచింపబడినది:—

సె. 378. "ఏమనిషియొక్కఅయినా చరాస్తి ఆమనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి అక్రమోద్యముగా పుచ్చుకోవలెనని యత్నించి ఆయాస్తి ఆ ప్రకారము పుచ్చుకోవడముకుగాను దానికి చలనము కలుగజేసే యే మనిషియయినా చోరీజరిగించునట్లు చెప్పబడివున్నాడు."

(1) వివరణము:— ఒక వస్తువు భూమితో అంటివుండే వరకు చరాస్తికానందున "చోరీ" జరిగించడముకు తగివుండనేరదు; అయితే అది భూమితో సంబంధములేకుండా విడతియ్యబడగానే "చోరీ" జరిగించడముకు తగివుంటున్నది.

(2) వివరణము:-భూమితో సంబంధము లేకుండా చెయ్యడముకు గాను యేకార్యము జరిగించబడుచున్నదో అదేకార్యమువల్ల జరిగించబడ్డ చలనము "చోరీ" కావచ్చును.

(3) వివరణము:—ఒకమనిషి, ఒక వస్తువుకు చలనము కలుగ చెయ్యడమువల్ల మాత్రమే కాకుండా దానికి చలనము కలుగ చెయ్యడముకు ఆటంకముగావుండే దేన్ని అయినా తీసివెయ్యడము వల్లగాని దాన్ని మరియొక వస్తువుతోటి సంబంధము లేకుండా పొయ్యేలాగున విడతియ్యడము వల్లగాని ఆవస్తువుకు చలనము కలుగ చేసినట్లు చెప్పబడి వున్నాడు.

(4) వివరణము:- ఏ సాధనము వల్లనయినా ఒక మృగముకు చలనము కలిగేలాగునచేసే యేమనిషి అయినా, ఆ మృగముకు చలనము కలుగచేసినట్టున్నూ, ఆప్రకారము కలుగచెయ్యబడ్డ చలనమును పట్టి ఆ మృగమువల్ల చలనము కలుగచెయ్యబడ్డ ప్రతి వస్తువుకు చలనము కలుగచేసినట్టున్నూ చెప్పబడివున్నాడు.

(5) వివరణము:- ఈ పై నిర్ధారణలో నమోదు చెయ్యబడ్డ అనుమతి అనేది, స్పష్టముగాగాని, భావద్యోతకముగాగాని వుండడమే కాకుండా అట్టి వస్తువు స్వాధీనమందు వుంచుకొనివుండే మనిషివల్లనైనా అనుమతి యివ్వడముకు స్పష్టముగాగాని భావద్యోతకముగాగాని అధికారము కలిగవుండే మనిషివల్ల నయినా యివ్వబడవచ్చును.

## దృ ష్టాం త ము లు.

(1) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి అయోగ్యముగా తీసికొని పోవలెననే యత్నముతో "జడ్" అనేమనిషియొక్క భూమిలోవుండే ఒకచెట్టు కొట్టుతున్నాడు.- ఇందులో "ఏ" అనే మనిషి, ఆ ప్రకారము తీసికొని పోగలందుకు అచెట్టు విడతియ్యగానే అతడు "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(2) "ఏ" అనే మనిషి తన జేబులో యెర వుంచుకొని "జడ్" అనేమనిషియొక్క కుక్క తనతోకూడా వచ్చేటట్టు చేస్తున్నాడు.- ఇందులో "ఏ" అనేమనిషి "జడ్" అనే మనిషియొక్క అనుమతిలేకుండా అతని స్వాధీనములోనుంచి అతని

నక్కును అయోగ్యముగా తీసికొని పోవలెనని యత్నించిన పక్షమున "జడ్డు" అనే మనిషియొక్క నక్క, "ఏ" అనే మనిషితో కూడా వెంబడించి వెళ్ళ డమును ఆరంభించగానే "ఏ" అనేమనిషి "చోరీ" అనే నేరము చేసినవాడు అవుతున్నాడు.

(3) "ఏ" అనే మనిషికి, ఖజానాపెట్టె మోసుకొనిపోయ్యే ఒకయెద్దు యెదురు పడుతున్నది. అతడు అయోగ్యముగా ఆఖజానా పెట్టెపుచ్చుకొనే కొరకు ఆ యెద్దును ఒక దిక్కుకు తోలుతున్నాడు. యెద్దు నడవడమును ఆరంభించగానే "ఏ" అనేమనిషి ఖజానాపెట్టె "చోరీ" చెయ్యడము అనే నేరము జరిగించినవాడు అవుతున్నాడు.

(4) జడ్" అనే మనిషియొక్క నౌకరుగాయుండి "జడ్" అనేమనిషివల్ల అతనితాలూకు వెండిపాత్రసామాను అప్పగింత చెయ్యబడ్డ "ఏ" అనేమనిషి "జడ్" అనేమనిషియొక్క అనుమతి లేకుండా ఆ పాత్రసామాను అయోగ్యముగా యెత్తుకొని పారిపోతున్నాడు. "ఏ" అనేమనిషి "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(5) "జడ్డు" అనే మనిషి, ప్రయాణము వెళ్ళ బొయ్యేటప్పుడు సరుకుల కొట్టువుంచుకొనివుండే "ఏ" అనేమనిషి పరముగా తాను తిరిగివచ్చేవరకు దాచివుంచ గలందులకు తన వెండిపాత్రసామాను అప్పగింతచేస్తున్నాడు. "ఏ" అనేమనిషి ఒక కంసాలివాని వద్దకు ఆ పాత్రసామాను పట్టుకొనివెళ్ళి విక్రయిస్తున్నాడు. ఇందులో పాత్ర సామాను "జడ్డు" అనేమనిషి స్వాధీనములోలేదు. గనుక అతని స్వాధీనము లోనుంచి అది పుచ్చుకోవడమును వల్లలేదు. "ఏ" అనే మనిషి, నేరముగల విశ్వాస ఘాతకము జరిగించినవాడేగాని "చోరీ" జరిగించలేదు.

(6) "జడ్డు" అనే మనిషి వాసము చేస్తూవుండే యింట్లో ఒక మేజామీద "జడ్డు" అనేమనిషి తాలూకు ఒక వుంగరము "ఏ" అనేమనిషికి దొరికినది. ఆవుంగ రము "జడ్డు" అనే మనిషి స్వాధీనములోవున్నది "ఏ" అనేమనిషి అయోగ్యముగా దానిని యెత్తుకొని పోయినపక్షమునకు అతడు "చోరీ" అనే నేరము చేసినవాడు అవుతున్నాడు.

(7) "ఏ" అనేమనిషికి యెవరి స్వాధీనములోనున్ను వుండకుండా రాజ బాటను పడివుండే ఒక ఉంగరము దొరకుతున్నది. "ఏ" అనేమనిషి ఆ వుంగరము తీసికొనిపోవడమువల్ల ఒకవేళ నేరముగల అపహరణము జరిగించినవాడు అవుతున్నాడే గాని "చోరీ" జరిగించినవాడు కానేరడు.

(8) "జడ్డు" అనే మనిషి యింట్లో ఒక మేజామీద వుండే "జడ్" అనే మనిషి తాలూకు ఒక వుంగరము "ఏ" అనేమనిషికి కనుపడుతున్నది. అది అప్పుడే తీసికొనిపోతే వెదుకుదురేమో అనేటటువంటిన్ని వెల్లడి కావచ్చునని నేటటువంటిన్ని భయమువల్ల తక్షణమే ఆ వుంగరము తీసికొనిపోకుండా అది యెప్పటికిన్ని కనుపడ కూడదని స్థలములో ముందు దాచి అది పోయినసంగతి మరుపువచ్చిన తర్వాత తీసికొని పోయి విక్రయించుకోవలెనని యత్నిస్తున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి

నుదట తాను ఆ వుంగరముకు చలనము కలుగజేసిన కాలమందు "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(9) "ఏ" అనే మనిషి ఆభరణములుచేసే "జడ్డు అనే మనిషివద్ద బాగు చెయ్యగలందుకయి తన గడియారము యిస్తున్నాడు. "జడ్" అనే మనిషి దానిని తన దుకాణముకు పట్టుకొని వెళ్ళుతున్నాడు. "ఏ" అనే మనిషి ఆ "జడ్" అనే మనిషి తాకట్టుక్రింద ఆ గడియారము న్యాయశాస్త్ర సమ్మతముగా వుంచుకోతగిన బాకీయేమిన్నీ లేకుండా బహిరంగముగా దుకాణములోకి ప్రవేశించి "జడ్" అనే మనిషి చేతిలోనుంచి తన గడియారమును బలవంతముగా పుచ్చుకొని వెళ్ళుతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి "నేరముగల ప్రవేశ" మున్నా "దొమ్మి" యున్నా జరిగించియుండవచ్చుగాని "చోరీ" జరిగించినవాడు కాలేదు. ఎందువల్లనంటే అతను గడియారము అయోగ్యముగా తీసికొనిపోలేదు.

(10) "ఏ" అనే మనిషి. గడియారము బాగు చేసినందుకు "జడ్" అనే మనిషికి బాకీవుండి ఆ బాకీక్రింద తాకట్టుగా "జడ్" అనే మనిషి ఆ గడియారము న్యాయశాస్త్ర సమ్మతముగా వుంచుకొని యుండగా "ఏ" అనే మనిషి తన బాకీకి తాకట్టుగా ఆవస్తువు "జడ్" అనే మనిషి వుంచుకోకుండా చెయ్యవలెననే యత్నముతో "జడ్" అనే మనిషివద్దనుంచి ఆ గడియారము తీసికొని పోయినయెడల "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు. ఎందువల్లనంటే, అతను అయోగ్యముగా దాన్ని తీసికొనిపోయినవాడు అవుతున్నాడు.

(11) "ఏ" అనే మనిషి, తన గడియారము "జడ్" అనేమనిషివద్ద తాకట్టు వుంచి ఆ గడియారముమీద తాను పుచ్చుకొన్న ఋణము చెల్లించకుండానున్నా "జడ్" అనే మనిషియొక్క అనుమతి లేకుండానున్నా "జడ్డు" అనే మనిషివద్దనుంచి దాన్ని తీసికొనిపోతున్నాడు. ఇందులో ఆ గడియారము తనసొమ్ముగా వున్నప్పటికిన్ని అతను "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(12) "ఏ" అనే మనిషి "జడ్" అనేమనిషి స్వాధీనమందు వుండే ఒకవస్తువు అది తిరిగి యిచ్చివెయ్యడమును గురించి బహుమానముగా "జడ్" అనేమనిషివద్ద తాను కొంత పైకము పుచ్చుకోవలెననే యత్నముతో అతని అనుమతి లేకుండా తీసికొని పోతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి, ఆ వస్తువు అయోగ్యముగా పుచ్చుకొంటున్నాడు గనుక "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(13) "ఏ" అనే మనిషి "జడ్" అనే మనిషితో స్నేహముగావుండి అతను లేనప్పుడు అతని పుస్తకములు వుండే గదిలోకి వెళ్ళి తిరిగి యిచ్చివెయ్యవలెననే వుద్దేశముతో చదవడముకొరకు ఒకపుస్తకము అతనిఅనుమతి స్పష్టముగాపొందకుండా పుచ్చుకుంటున్నాడు. ఇందులో "ఏ" అనేమనిషి "జడ్" అనే మనిషియొక్క పుస్తకమును చదివేలాగున భావద్యోతకమయిన అనుమతి పొందినట్టు యెంచుకొని వుండవచ్చును. "ఏ"అనేమనిషి యిట్లా నమ్మివున్నయెడల అతడు "చోరీ" జరిగించినవాడుకానేరడు.

(14) "ఏ" అనేమనిషి "జడ్" అనేమనిషి భార్యను ముష్టిఅడుగుతున్నాడు ఆమె "జడ్" అనే తన పెనిమిటికి అయినట్టు "ఏ" అనే మనిషి యెరిగివుండే పయికము, అన్నము, బట్టలు యిస్తున్నది. ఇందులో ముష్టి పెట్టడమునకు "జడ్" అనేమనిషి యొక్క భార్యకు అధికారము యివ్వబడివునట్టు "ఏ" అనే మనిషి యెంచుకొని వుండవచ్చును. ఇట్లా "ఏ" అనేమనిషి నమ్మివున్నయెడల ఆతడు, "చోరీ" జరిగించిన వాడు కానేరడు.

(15) "ఏ" అనే మనిషి "జడ్" అనేమనిషియొక్క భార్యకు జారపురుషుడుగా వున్నాడు. ఆమె పెనిమిటి అయిన "జడ్" అనే మనిషిని అయినట్టున్నూ ఆమె యివ్వడమునకు "జడ్" అనే మనిషివల్ల అధికారము పొందనిది అయినట్టున్నూ "ఏ" అనే మనిషి యెరిగివుండే విలువగల వస్తువులు ఆమె "ఏ" అనే మనిషికి యిస్తున్నది. "ఏ" అనే మనిషి ఆ వస్తువులు అయోగ్యముగా పుచ్చుకొన్న పక్షమునకు అతను "చోరీ" జరిగించినవాడు అవుతున్నాడు.

(16) "ఏ" అనేమనిషి "జడ్" అనే మనిషి తాలూకు యేదైనా వస్తువు తనది అని కృత్రిమములేకుండా నమ్మి "బి" అనే మనిషివద్దనుంచి ఆవస్తువు పట్టుకొని వెళ్ళుతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషి, ఆ వస్తువు అయోగ్యముగా పట్టుకొని వెళ్లనందున అతడు చోరీ జరిగించినవాడు కానేరడు.

## వ్యాఖ్య

ఈ సె|| క్రింద ఋజావుచేయవలసిన అంశములు:—

(1) కొంత చరాస్తిని,

(2) మరియొకని స్వాధీనములో యుండగా,

(3) వాని యనుమతి లేకుండా,

(4) సదరాస్తిని అయోగ్యముగా తీసికొనవలెననే దురుద్దేశముతో.

(5) ముద్దాయి సదరాస్తిని తీసికొనిపోయినట్లుగాని లేక,తీసికొనిపోవు నిమిత్తము సదరాస్తికి చలనము కలుగచేసినాడనిగాని ఋజావు చేయవలెను.

చరాస్తి అనగా ఇం|| పీ|| కో|| సె. 22 లో "చరాస్తి అనే మాటలు భూములున్నూ, భూమితో కలిసివుండే వస్తువులున్నూ, లేక భూమితో కలిసివుండే యేదైనా వస్తువుకు స్థిరముగా కట్టబడియుండే వస్తువులున్నూ తప్ప ఆకారముగల ప్రతి తరహా వారీ ఆస్తిని కలుపుకునేలాగున వుద్దేశించబడివున్నవి" అని నిర్వచన మీయబడినది.

రాళ్ళు, మన్ను, ఇసుక మొదలైనవి చరాస్తి కానప్పటికిన్ని వాటిని భూమి నుండి త్రవ్విన వెంటనే చరాస్తి అగుచున్నవి. అలాగుననే చెట్లకొమ్మలు కొట్టబడిన

వెంటనే చరాస్తి అగుచున్నవి. సె. 371 క్రింద 1, 2 వివరణములు చూడవలెను. పెంపుడు పావురములు, పెంపుడు నెమళ్లు వగైరా పక్షులుకూడ చరాస్తి అగును.

(2) చరాస్తి మరియొకని స్వాధీనములో యుండవలెను. కాని అట్టి చరాస్తిని స్వాధీనము కలిగియున్నవానికి ఆ ఆస్తియందు హక్కు లేనప్పటికిన్నీ దానిని అతని స్వాధీనమునుండి దురుద్దేశముతో తీసికొన్నయెడల చోరీ అగును. ఒకని పశువులు ఒక బీడులో మేయుచున్నను అవి యజమానుని స్వాధీనములో యున్నట్లే యెంచబడును. ఒకడు ఒక తివాసీని చెరువులో ఉతికి చెరువుగట్టున ఆరవేయును. ఆ తివాసీ దాని ఖామందు స్వాధీనములో యున్నట్లే యెంచబడును. యే ఆస్తియైనను సదరాస్తి ఖామందుయొక్క భార్యా లేక నౌకరు లేక గుమాస్తా స్వాధీనములో యున్నప్పటికి అది ఖామందు స్వాధీనములో యున్నట్లు యెంచబడును. కాని ఒకడు ఒక వస్తువును పారవేసుకొనుచు. అది బజారులో ముద్దాయికి దొరుకును. ముద్దాయి ఆ ఆస్తిని తీసికొనుటవల్ల చోరీ జరిగించినవాడు కానేరడు. ఏలనన ఆ సందర్భములో ఆ వస్తువు ఖామందు స్వాధీనములో యున్నట్టు యెంచవీలులేదు. సె. 378 క్రింద 7 వ ఉదాహరణము చూడవలెను.

కొన్ని సందర్భములలో ముద్దాయికి హక్కుగల ఆస్తిని ముద్దాయి యితరుల స్వాధీనములోనుండి వారి అనుమతిలేకుండ తీసికొన్నయెడల చోరీ జరిగించినవాడగుచున్నాడు. సె. 378 క్రింద 10, 11 ఉదాహరణములను చూడవలెను, ఒకప్పుడు ఒక ఆస్తి ముద్దాయియొక్కయు యితరులయొక్కయు జాయింటు స్వాధీనము హక్కుభుక్తములలో యున్నదానిని ముద్దాయి తక్కిన భాగస్వాములకు లేకుండాచేసి తానే అయోగ్యముగా తీసికొనవలెననే దురుద్దేశముతో ఆ వస్తువును తీసినయెడల చోరీ జరిగించినవాడు అవుతున్నాడు.

(3) చరాస్తిని ముద్దాయి ఆయాస్తి స్వాధీనముకలిగినవాని అనుమతి లేకుండా తీసుకొని వెళ్లవలెను. అట్టి అనుమతి స్పష్టముగాగాని భావద్యోతకముగాగాని వుండవచ్చును. సె. 378 క్రింద 13వ ఉదాహరణము చూడవలెను;

(4) ముద్దాయి ఆ స్తిని అయోగ్యముగా తీసికొని పోవలెననే దురుద్దేశముతో నున్నట్లు బుజువు చేయవలెను. యీ సె. క్రింద నేరమగుటకు ముద్దాయిరచ్య దురుద్దేశముతో కూడినదిగా యుండవలెను, కాని ముద్దాయి సదుద్దేశముతో జేసినపని చోరీ కానేరదు.

(1) ఉ॥ ఒక నౌకరు తన యజమానుని స్వాధీనహక్కుభుక్తములలో యున్న ఒక చెరువులో ముద్దాయి వలలువేసి దొంగతనముగా చేపలు పట్టుచుండగా చూచి నౌకరు ముద్దాయి వలలను తనయజమానికి చూపవలెననే యుద్దేశముతో లాక్కొనును. నౌకరు అప్పుడు చోరిచేసినట్టు యెంచవీలులేదు. ఎలనన నౌకరుకు ఆవలలను అయోగ్యముగా తీసికొనవలెననే దురుద్దేశము లేదు.

(2) ఉ॥ ఒకడు యెల్లప్పుడు అజాగ్రత్తగా యుండు తన స్నేహితునికి జాగ్రత నేర్పుటకుగాను స్నేహితుడు గదిలో పడవేసిన ఒక వస్తువును తరువాత యివ్వవలెనని దాచును. అప్పుడు అతనిచర్య చోరీ కానేరదు. యేలనన అతనికిస్నేహితుని వస్తువును అయోగ్యముగా తీసికొనవలెననే దురుద్దేశము లేదు. అటులనే ఒకడు తగాయిదాపడి ఒక ఆస్తి తనదనిచెప్పి మరియొకని స్వాధీనములోనుండి తీసికొన్నగాని, తనకుహక్కు కలదని నిజముగా నమ్మి తీసికొన్నగాని, లేక పొరపాటున తనవస్తువు అని తీసికొన్న గాని చోరీకానేరదు. ఆ సందర్భములో దురుద్దేశము యేమిన్ని లేదు.

కాని ముద్దాయి నేరమునుండి విడుదల అగుటకుగాను చోరీ ఆ స్తిలో తనకు హక్కుయున్నదని చెప్పిన జాలదు. అదివరలో ముద్దాయి చోరీ ఆ స్తిలో హక్కు యున్నట్లు చెప్పుచున్నట్లుగాని, ఆ ఆ స్తివిషయమై ముద్దాయి ఫిర్యాదీలు తగాయిదా పడుచున్నట్లుగాని ఋజువుచేయవలెను. కోర్టువారు ముద్దాయి శిక్ష తప్పించుకొనుటకు హక్కు యున్నదని చెప్పుచున్నాడా? లేక ఆ ఆ స్తి విషయమై పార్టీలమధ్య న్యాయ మైన నిజమైన తగాయిదా యున్నదా ? అను అంశమును విచారించవలశియుండును.

ఒక భూమిలో ఒకరైతు పైరును వేసినాడు. మరియొకరు ఆ భూమి ఖామందు పైన సివిల్ కోర్టులో దావాతెచ్చి భూమిని రైతుకు తెలియకుండా కోర్టుద్వారా స్వాధీనము చేసికొనును. దరిమిలా రైతు ఆ సంగతి తెలియక తాను వేసిన పైరును కోసికొనిపోవును. అప్పుడు రైతు చోరీ జరిగించినట్లు చెప్పవీలులేదు. ఏలనన రైతు సదరు పైరు తనదనే నమ్మి యెట్టి దురుద్దేశము లేకుండా తీసికొనిపొయినాడు

ఒక కోర్టు అమీనా ముద్దాయి తాలూకు ఒక వంటపాత్రను జప్తుచేయును. ఆ పాత్రను సి॥ ప్రొ॥ కో॥ సె. 60 ప్రకారము జప్తుచేయకూడదని చెప్పుచూ ముద్దాయి అమీనా చేతిలోనుండి ఆ పాత్రను లాక్కొనును. అప్పుడు ముద్దాయి చోరీచేసినట్లు యెంచ వీలులేదు. ఏలనన ముద్దాయి ఆ పాత్రను తాను వుంచుకోవచ్చునని, దానిజప్తు చేయుటకు "లా" ప్రకారము వీలులేదనినమ్మి అమీనా చేతులోనుండి సదుద్దేశముతో తీసుకొన్నందున.

**౭. ముద్దాయి ఆ స్తిని తీసికొనిపోయినాడనిగాని లేక తీసికొని పోవుటకు ఆ ఆ స్తికి చలనము కలుగజేసినాడనిగాని ఋజువుచేయవలెను.**

తీసికొని పోవుటఅనేది శాశ్వతముగా తీసికొని పోవలెననే ఉద్దేశము వుండ నక్కరలేదు. తాత్కాలికముగా దురుద్దేశముతో తీసుకొన్నను చోరీ అగును. సె 378 క్రింద 12వ ఉ॥ చూడవలెను.

ముద్దాయి చోరీ ఆ స్తిని తీసికొనిపోలేకపోయినప్పటికి ముద్దాయి సదరా స్తికి చలనము కలుగజేయుటవల్లనే చోరీ జరిగించినవాడగుచున్నాడు. సె. 378 క్రింద 1,2 3 ఉ॥ లను చూడవలెను.

అటులనే దొంగలు నగలనుగాని యితర వస్తువులనుగాని యెత్తుకొని పోవలెనని పెట్టెలోనుంచి తీసి యింటివాళ్లు లేదినందున వస్తువులు విడిచిపెట్టి పారిపోయినను సదరాస్తిని పెట్టెలోనుంచి తీయుటవల్లనే చోరీచేసినవా రగుదురు.

నోటు:— పంచాయతీకోర్టులు అధికారము చెలాయించుటకు చోరీ ఆస్తి రు 10-0-0 ల కంటె యెక్కువ కిమ్మతు యుండకూడదు. చార్జీలోను తీర్పులోను కూడ చోరీ ఆస్తి కిమ్మతు ఉదహరించవలెను.

కీడుకు శిక్ష.

సె. 424. "కీడుచేసే ఏమనిషియయినా మూడు మాసములకు వ్యాపించగూడిన కాలమువరకు రెండు తరహాలలో ఒక తరహా ఖైదువల్లగాని, జుల్మానావల్లగాని, యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది."

కీడు అనే నేరము ఇండియన్ పీనలుకోడుయొక్క 425 వ సెక్షనులో యిట్లు నిర్వచింపబడి యున్నది:—

సె. 425. "లోకులకుగాని ఏ మనిషికయినాగాని అక్రమమైన నష్టము లేక లోటు కలుగచేయవలెననే యత్నముతోటి, లేక తాను కలుగచేయవచ్చునని యెరిగివుండి యేదైన ఆస్తికి నశింపుగాని యేదైన ఆస్తిలో లేక అందులస్థితిలో దాని కిమ్మతుగాని, వుపయోగముగాని నశింపచేసేలాగున, లేక తక్కువచేసేలాగున, లేక దానికి హాని కలిగేటట్టు చేసేలాగున ఏదైనా మార్పుగాని కలుగజేసే ఏ మనిషిఅయినా 'కీడు' చేసినవాడు అవుతున్నాడు."

(1) వివరణము:- నేరస్థుడు, హానికలుగచెయ్యబడ్డ లేక నశింపు చెయ్యబడ్డ ఆ స్తియొక్క ఖామందుకు నష్టము, లేక లోటు కలుగ చెయ్యవలెనని ఉద్దేశించడము కీడును గురించిన నేరముకు ముఖ్యము కాదు. అది ఆమనిషిదిగా వున్నా సరే వుండకపోయినా సరే, యేఆస్తికి అయినా హానికలుగచెయ్యడమువల్ల యే మనిషికి అయినా నష్టము కలుగ చెయ్యవలెనని యత్నించిన పక్షముకు; లేక కలుగవచ్చునని యెరిగివున్న పక్షముకు అదే చాలును.

(2) వివరణము:- ఒకకార్యము జరిగించే మనిషికిగాని ఆ మనిషికిన్ని యితరులకున్నూ సమిష్టిగాగాని, సంబంధించే యేదైనా ఆస్తికి హానికలుగజేసే కార్యమువల్ల కీడు చెయ్యబడవచ్చును.

## దృష్టాంతములు.

(1) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషికి అక్రమమైన నష్టమును కలుగ చెయ్యవలెనని యత్నించి "జడ్డు" అనేమనిషి తాలూకు విలువగల ఒకపత్రముస్వేచ్ఛగా తగులబెట్టుచున్నాడు. "ఏ" అనే మనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(2) "ఏ" అనేమనిషి "జడ్" అనేమనిషికి అక్రమమైన నష్టముకలుగ చెయ్యవలెనని యత్నించి "జడ్" అనేమనిషి తాలూకు మంచుగడ్డలువుంచి వుండేయింటిలోనికి నీరువచ్చేటట్టుచేసి అందువల్ల ఆ మంచుగడ్డలు కరిగిపొయ్యేటట్టు చేస్తున్నాడు. "ఏ" అనే మనిషి కీడు చేసినవాడు అవుతున్నాడు.

(3) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషికి నష్టము కలుగచెయ్యవలెనని యత్నించి "జడ్" అనేమనిషితాలూకు ఒకవుంగరము స్వేచ్ఛగా నదిలో పారవేస్తున్నాడు. "ఏ"అనేమనిషి, కీడు చేసినవాడు అవుతున్నాడు.

(4) "ఏ" అనే మనిషి, "జడ్" అనే మనిషికి తాను బాకీవుండే ఋణముకు చెల్లుగా తన ఆస్తి జప్తుచెయ్యబడుచున్నది అని తెలుసుకొని అందువల్ల "జడ్" అనే మనిషియొక్క ఋణముకు చెల్లుకాకుండా చెయ్యవలెననిన్ని, "జడ్" అనే మనిషికి నష్టము కలుగచెయ్యవలెనని‌న్ని యత్నించి ఆ ఆస్తి నశింపచేస్తున్నాడు. "ఏ" అనే మనిషి కీడు చేసినవాడు అవుతున్నాడు.

(5) "ఏ" అనే మనిషి ఒక ఓడకు ఇన్స్యూరెన్సు చేయించుకొని ఆ ఇన్స్యూరెన్సు చేసినవారికి నష్టము కలుగచెయ్యవలెననే యత్నముతో, ఆఓడ మెరక పట్టేలాగున స్వేచ్ఛగా చేస్తున్నాడు. "ఏ" అనే మనిషి కీడు చేసినవాడు అవుతున్నాడు.

(6) "ఏ" అనేమనిషి, ఓడ తాకట్టువుంచుకొని ఆ ఓడమీద పయికము బదులు యిచ్చిన "ఏ" అనే మనిషికి నష్టము కలుగచెయ్యవలెనని యత్నించి ఆ ఓడ మెరక పట్టేలాగున చేస్తున్నాడు. "ఏ" అనేమనిషి కీడు చేసినవాడు అవుతున్నాడు.

(7) "ఏ" అనేమనిషి, "జడ్డు" అనేమనిషితో ఒక గుఱ్ఱమును వుమ్మడిగా వుంచుకొని "జడ్డు" అనే మనిషికి అక్రమమైన నష్టము కలుగచెయ్యవలెనని యత్నించి ఆ గుఱ్ఱమును కాల్చివేస్తున్నాడు. "ఏ" అనేమనిషి, కీడుచేసినవాడు అవుతున్నాడు.

(8) "ఏ" అనేమనిషి, "జడ్డు" అనే మనిషియొక్క పంటకు నష్టము కలుగ చెయ్యవలెనని యత్నించిన్ని, కలుగవచ్చునని యెరిగివుండిన్ని, "జడ్డు" అనేమనిషి తాలూకు పొలములోకి పశువులు ప్రవేశించేలాగున చేస్తున్నాడు. "ఏ" అనేమనిషి కీడు చేసినవాడు అవుతున్నాడు.

## వ్యాఖ్య.

ఈ సెక్షన్ క్రింద ఋజువు చేయవలసిన అంశములు:—

(1) లోపులకుగాని లేక యే మనిషికైనా అక్రమమైన నష్టము, లేక లోటు కలుగచెయ్యవలెననే ప్రయత్నముతోటి లేక తాను కలుగచెయ్యవచ్చునని యెరిగివుండి,

(2) ముద్దాయి యేదైన ఆ ఆస్తిని నశింపుగాని, లేక దాని కిమ్మతుగాని ఉపయోగముగాని నశింపుచేసేలాగున లేక తక్కువ చేసేలాగున లేక దానికి హానికలిగేటట్లు,

(3) సదరా స్తికి మార్పు కలుగజేసినాడని ఋజువు చేయవలెను.

ఈ సె॥ క్రింద నేరములను విచారించినపుడు పంచాయతీ కోర్టువారు నశింపు అయిన ఆ స్తియొక్క కిమ్మతు లేక హాని లేక లోటుయొక్క విలువను తీర్పులో నమోదు చేయవలెను. చార్జిలోకూడా నమోదుచేయబడియుండవలెను. అట్టికిమ్మతుగాని లోటుగాని రు 10 లకు మించియున్నయెడల ఆకేసులను పంచాయతీకోర్టులు విచారించుటకు అధికారము యుండదు.

ఒక రైతు తన భూమిలోని మురుగునీటిని పోగొట్టుటకు రైల్వేలైనుకు గండి పెట్టును. ఆతడు అప్పుడు యీ సెక్షను ప్రకారము నేరస్థుడగును.

ఒకడు తన యజమానుని పొలములో మేయుచున్న ఫిర్యాది పశువులను బైటికి తోలిన తరువాత వాటిని పెద్దరాళ్లతో కొట్టి ఒకపశువు కాలు విరుగగొట్టును. అతడు యీ సెక్షను ప్రకారము నేరస్థుడగును.

కాని యెవ్వరైనను అజాగ్రత్తగా యుండుటవల్ల ఏదైనా ఆ స్తికి నష్టము సంభవించేయెడల వారు యీ సె. క్రింద నేరస్థులు కారు, ఉ॥ ఒకడు తనపశువులను కట్టకుండా అజాగ్రత్తగా యుండును. అవి ఫిర్యాది పొలములోనికిపోయి పైరును నష్టము చేయును. అప్పుడు యజమాని యీ సె. క్రింద నేరస్థుడు కాడు. కాని అతడు తన పశువులు ఫిర్యాది పొలములోపడి అతని పైరు నష్టము చేయవలెననే యుద్దేశ్యముతో సదరు పశువులను ఫిర్యాదిచేనిలోనికి వదలిపెట్టినగాని, లేక తాను గొడ్లవద్దయుండిన్నీ గొడ్లు ఫిర్యాది చేనిలోనికి వెళ్ళుచుండగా అవి ఫిర్యాది పైరును నష్టముచేయుననియెరిగి యుండిన్నీ బుద్ధిపూర్వకముగా గొడ్లను బయటకు తోలక ఉపేక్షించి వూరకున్నను యీ సెక్షను క్రింద నేరస్థుడగును.

అల్లరి కలుగచేయవలెనని వుద్దేశముతోటి బుద్ధిపూర్వకముగా పరిభవపరచడము.

సె. 504. "ఏ మనిషి అయినా పరిభవపరచడమునుబట్టి కలిగే ఆగ్రహ కారణమువల్ల అట్టి మనిషి అల్లరి, లేక యేదైనా యితర నేరము జరిగించేటట్లు చెయ్యవలెనని వుద్దేశించిగాని అతడు అట్లా జరిగించవచ్చునని ఎరిగి వుండిగాని అతనిని

బుద్ధిపూర్వకముగా పరిభవపరచి ఆగ్రహకారణము కలుగచేసే, యే మనిషి యయినా, రెండు సంవత్సరములకు వ్యాపించగూడిన కాలము వరకు రెండు తరహాలలో ఒకతరహా ఖైదువల్లగాని జుల్మానా వల్లగాని ఈ రెంటివల్లగాని శిక్షించబడవలసినది."

## వ్యాఖ్య

ఈ సె॥ క్రింద ఋజువు చేయవలసిన అంశములు:—

(1) ముద్దాయి ఫిర్యాదిని పరిభవపరచి అతనికి ఆగ్రహము కలుగజేసినాడనిన్నీ

(2) ఫిర్యాదిపొందిన పరిభవమువల్ల ఫిర్యాది అల్లరిగాని మరి యేయితర నేరము గాని జరిగించేటట్టు చేయవలెనని ఉద్దేశించినాడనిగాని లేక అతడు అట్లా జరిగించ వచ్చునని యెరిగియున్నాడనిగాని ఋజువు చేయవలెను.

ముద్దాయి మాటలవల్లగాని, ప్రవర్తన వల్లగాని ఫిర్యాదికి పరిభవము కలుగ జేయ నుద్దేశించినట్లు కనుపడవలెను. ముద్దాయి కలుగచేసిన పరిభవము కేవలము మాటలవల్లనే అయియున్నయెడల ఆ మాటలను చార్జీలో వ్రాయవలెను. సాక్ష్యము వల్ల ఋజువుచేయవలెను. అట్టిమాటలు సాధారణముగా పరిభవము కలుగజేయదగినవా లేదా అను సంశమును కోర్టువారు తీర్మానించవలెను.

ఫిర్యాది ముద్దాయి మాటలవల్ల యెక్కువ భయపడిపోయినందున అల్లరిగాని, మరి యేయితర నేరమునుగాని చేయుస్థితిలో లేదని చెప్పుట నేరమునకు క్షమాపణ కానేరదు. ఫిర్యాదిఅల్లరిగాని, మరియేయితర నేరముగానిజరిగించే స్వభావముకలవాడు కాడని చెప్పినను ముద్దాయి నేరస్థ డగును.

తప్పత్రాగిన మనుష్యుని వల్ల బహిరంగమైనస్థలమందు జరిగించబడే దుర్నడత.

సె. 510. "తప్ప త్రాగిన స్థితిలోవుండి ఏదయినా బహిరంగ మయిన స్థలముకుగాని తాను అక్కడికి ప్రవేశించిన యెడల అతిక్రమమైన ప్రవేశము అనే నేరము అయ్యే ఏ స్థలముకు అయినా గాని, వెళ్ళి అక్కడ యే మనిషికి అయినా బాధ కలుగతగ్గ తరహాను ప్రవర్తించే యేమనిషిఅయినా, యిరవయినాలుగు గంటలకు వ్యాపించ గూడిన కాలమువరకు సాధారణమైన ఖయిదు వల్లగాని పదిరూపాయల వరకు వ్యాపించ గూడిన జుల్మానా వల్లగాని యీ రెంటివల్లగాని శిక్షించబడవలసినది."

## వ్యాఖ్య

ఈ సెక్షన్ క్రింద ఋజువు చేయవలసిన అంశములు:—

(1) ముద్దాయి త్రాగియుండి; ఒక బహిరంగ ప్రదేశములోగాని, లేక మరియొకని స్వాధీనములోయున్న స్థలములోనికి అక్రమముగా ప్రవేశించినగాని;

(2) అచ్చట యుండే యే మనిషికైనా బాధ కలిగేలాగున ప్రవర్తించి నాడని ఋజువు చేయవలెను.

కేవలము త్రాగియున్నంత మాత్రమున నే ముద్దాయి నేరస్థుడు కాడు. అప్పుడు అతని ప్రవర్తన యితరులకు బాధాకరముగా యున్నదనిన్ని, అతడు ఒక బహిరంగ ప్రదేశములోగాని, అక్రమముగా ప్రవేశించిన మరియొక ప్రదేశములోగాని యున్నాడని ఋజువు చేయవలెను. బహిరంగస్థలమనగా నేదో సె. 159 క్రింది వ్యాఖ్యానము చూడవలెను. కాని యిప్పుడు అమలులోయున్న మద్రాస్ మద్యపాన నిషేధ ఆక్టు ప్రకారము తాగినంత మాత్రమున నే నేరస్థుడగును. త్రాగిన వారిపై యిప్పుడు చర్య పై ఆక్టు క్రింద తీసుకొనబడుచున్నది.

మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె 76 ప్రకారము పంచాయతీ కోర్టువారు విచారించే నేరములలో సదరు నేరములను ప్రోత్సాహపరుచుట (కుమ్మకు చేయుట) కూడా నేరములుగా పరిగణించబడునని విధించబడియున్నది.

"కుమ్మకు చెయ్యడము" "కుమ్మకు చేసే" అను మాటలకు ఇ॥ పీ॥ కో॥ సె. 107, 108 లలో యీ క్రింది విధముగా నిర్వచన మీయబడినది.

సె.107 ఒకమనిషి ఒకకార్యముజరిగించచముకుగాను కుమ్మకు ఒకకార్యముకు కుమ్మకు చేసినవాడు అవుతున్నాడు. అది యెలాగంటే—చేయడము.

(1) ఏ మనిషికైనా ఒక కార్యము చేసేలాగున దుర్బోధన చేసిన పక్షముకు, లేక

(2) ఒక కార్యము జరిగించడముకయి ఒక మనిషితో, లేక యెక్కువమందితో బందుకట్టు చేసికోవడము, అనగా, అట్లా బందుకట్టు చేసుకోవడమువల్లనున్ను, ఆ కార్యము జరిగించడము కొరకున్ను న్యాయశాస్త్ర విరుద్ధమైన యేదైనా యొకకార్యముగాని లోపముగాని సంభవించిన పక్షముకు, లేక

(3) ఒక కార్యము జరగడమునుగురించి న్యాయశాస్త్ర విరుద్ధమైన ఒక కార్యమువల్ల, లేక లోపమువల్ల బుద్ధిపూర్వకముగా సహాయము చేసిన పక్షముకు.

వివరణము (1):- తాను వెల్లడిచెయ్యడముకు బద్ధుడయివుండే ఒక ముఖ్యమైన సంగతిని బుద్ధిపూర్వకముగా తప్పుగా తెలియచెయ్యడమువల్లగాని బుద్ధిపూర్వకముగా దాచడమువల్లగాని ఒక కార్యము స్వేచ్ఛగా చేయించే లేక జరిగించేలాగున చేసే లేక చేయించడముకు యత్నించే లేక జరిగించేలాగున ప్రయత్నముచేసే మనిషి ఆకార్యము జరిగించడముకు దుర్బోధన చేస్తున్నాడు అని చెప్పబడి వున్నాడు.

దృష్టాంతము.

ఒకపబ్లిక్ వుద్యోగస్థుడైన "ఏ" అనేమనిషి, ఒకకోర్టు ఆఫ్ జస్టిస్ వారి వారంటువల్ల "జడ్" అనే మనిషిని పట్టుకొనేలాగున అధికారము కలిగివున్నాడు. "బి" అనే మనిషి అట్లా అధికారము కలిగివుండే సంగతియున్నూ "సీ" అనేమనిషి "జడ్" అనే మనిషి కాడనే సంగతియున్నూ యెరిగివుండిన్ని "సీ" అనేమనిషి "జడ్" అనేమనిషి అయినట్లు బుద్ధిపూర్వకముగా "ఏ" అనే మనిషికి తప్పుగా తెలియజేసి అదుంవల్ల బుద్ధి పూర్వకముగా "సీ" అనే మనిషిని "ఏ" అనే మనిషి పట్టుకొనేలాగున చేస్తున్నాడు. ఈ సంగతిలో దుర్బోధనవల్ల "సీ" అనే మనిషిని పట్టుకొనేలాగున "బీ" అనే అతడు కుమ్మకు చేసిన మనిషి అవుతున్నాడు.

వివరణము (2):- ఒక కార్యము జరిగించడముకు ముందు లేక జరిగించే కాలమందు ఆ కార్యము జరిగించడమును సులభ పరచగలందుకయి ఏదైనా ఒకకార్యము జరిగించి అందువల్ల అది జరిగించడమును సులభపరిచే మనిషి ఆ కార్యము జరిగించుటకు కుమ్మకుచేసినట్లు చెప్పబడివున్నాడు.

108. ఒక నేరము చెయ్యడముకుగాని కుమ్మకుచేసే మనిషి

కుమ్మకుచేసే మనిషి

వలెనే అదే యత్నముకున్ను జ్ఞానమున్ను కలిగి నేరము జరిగించడముకు గురించి న్యాయశాస్త్ర ప్రకారము తగివుండే ఒక మనిషివల్ల జరిగించబడ్డ పక్షముకు

నేరముగా వుండగూడిన ఒక కార్యము జరిగించడముకుగాని సహాయము చేసేమనిషి, ఆ నేరముకు కుమ్మకుచేసే మనిషి అవుతున్నాడు.

వివరణము (1) — న్యాయశాస్త్ర ప్రకారము చెయ్యవలసిన ఒక కార్యము జరిగించకపోవడమును గురించి చెయ్యబడే కుమ్మకు, అట్లా కుమ్మకుచేసేమనిషి ఆ కార్యము జరిగించడముకు తాను బద్ధుడు కాకపోయినా ఒక నేరము కావచ్చును.

వివరణము (2)—కుమ్మకుఅనే నేరమును యేర్పాటు చెయ్యడముకుగాను, కుమ్మకు చెయ్యబడ్డ కార్యము జరిగించబడడముగాని ఆ నేరము యేర్పాటు చెయ్యడము ఆవశ్యముగావుండే ఫలము కలుగ చెయ్యబడడముగాని జరూరువుండనేరదు.

దృష్టాంతములు.

(1) "ఏ" అనేమనిషి, "సీ" అనే మనిషిని ఖూనీ చేసేలాగున "బీ" అనే మనిషికి దుర్బోధన చేస్తున్నాడు. "బీ" అనేమనిషి, ఆ ప్రకారము చెయ్యడములేదని చెప్పుతున్నాడు. ఖూనీ చేసేలాగున "బీ" అనే మనిషికి దుర్బోధనచేసిన నేరమును గురించి "ఏ" అనేమనిషి నేస్థుడవుతున్నాడు.

(2) "ఏ" అనే మనిషి "డీ" అనేమనిషిని ఖూనీచేసేలాగున "బీ" అనేమనిషికి దుర్బోధన చేస్తున్నాడు. "బీ" అనే మనిషి ఆ దుర్బోధనవిని "డీ" అనేమనిషిని పొడుస్తున్నాడు. "డీ" అనేమనిషికి దుర్బోధనచేసిన నేరమునుగురించి "ఏ" అనే మనిషి నేరస్థుడవుతున్నాడు.

వివరణము (3)— కుమ్మకు చెయ్యబడ్డ మనిషి న్యాయశాస్త్ర రీత్యా ఒక నేరము చెయ్యతగ్గవాడుగా గాని కుమ్మకుచేసే మనిషికి కలిగివుంటూ వచ్చిన నేరముగల ఉద్దేశము లేక యెరుక లేక మరి యేదైనా నేరముగల ఉద్దేశము లేక యెరుక కలిగివుండే మనిషిగాగాని వుండవలసిన జరూరు లేదు.

దృష్టాంతములు.

(1) "ఏ" అనేమనిషి, నేరముగల ఉద్దేశముతో న్యాయశాస్త్ర ప్రకారము ఒక నేరము జరిగించ తగ్గటువంటిన్నీ "ఏ" అనేమనిషికి కలిగివున్న ఉద్దేశము కలిగి

నటువంటివిన్ని ఒకమనిషివల్ల జరిగించిన పక్షమును నేరముఅయ్యే యొక కార్యము జరిగించే లాగున ఒకపిల్లకు, లేక వెర్రెత్తిన మనిషికి కుమ్మకు చేస్తున్నాడు. ఈ సంగతిలో "ఏ" అనే మనిషి ఆ కార్యము జరిగించబడ్డాసరే జరిగించబడక పోయినాసరే ఒక నేరమును కుమ్మకు చేసినందునగురించి నేరస్థుడవుతున్నాడు.

(2) "ఏ" అనేమనిషి "జడ్"అనేమనిషిని ఖూనీ చెయ్యవలెననే ఉద్దేశముతో "జడ్" అనేమనిషికి మరణముకలుగజేసే ఒకకార్యము జరిగించేలాగున ఏడు సంవత్సరముల యీడుకు లోపుగాయుండే "బీ" అనేపిల్లకు దుర్బోధనచేస్తున్నాడు. "బీ" అనే పిల్ల అట్టి కుమ్మకువల్ల ఆ కార్యము జరిగించి అందువల్ల "జడ్డు" అనే మనిషికి మరణము కలుగజేస్తున్నది. ఇందులో న్యాయశాస్త్రప్రకారము "బీ"అనేపిల్ల నేరము చెయ్యతగివుండకపోయినా "బీ" అనే పిల్ల న్యాయశాస్త్ర ప్రకారము ఒక నేరము జరిగించడమును తగివుండి ఆ ఖూనీ జరిగించివుంటే యేలాగో అలాగే "ఏ"అనేమనిషి శిక్షకు పాత్రుడు కావలసినది. గనుక మరణ దండనకు లోబడుతున్నాడు.

(3) వాసముచేసే ఒక యింటికి నిప్పు పెట్టవలసినదని "బీ"అనేమనిషికి "ఏ" అనేమనిషి దుర్బోధనచేస్తున్నాడు. "బీ"అనేమనిషి, మతిస్థైర్యములేని కారణమువల్ల ఆకార్యపు స్వభావముగాని, తప్పుగా, లేక న్యాయశాస్త్రమును విరోధముగా వుండే కార్యమును తాను చేస్తూవున్నాననిగాని, తెలుసుకోలేక, "ఏ" అనేమనిషి యొక్క దుర్బోధనవిని ఆయింటికి నిప్పు పెట్టుతున్నాడు. "బి"అనేమనిషి నేరముచేసినవాడు కాడు. అయితే వాసము చేసేయింటికి నిప్పుపెట్టడము అనేనేరమును కుమ్మకుచెయ్యడమునుగురించి "ఏ" అనేమనిషి నేరస్థుడయి ఆ నేరమునుగాను నిర్ణయించబడి వుండే శిక్షకు పాత్రుడవుతున్నాడు.

(4) "ఏ"అనేమనిషి ఒకచోరీ జరిగించబడవలెననే ఉద్దేశముతో "జడ్"అనే మనిషితాలూకు ఆస్తి ఆ "జడ్" అనే మనిషియొక్క స్వాధీనములోనుంచి యెత్తుకొని వచ్చేలాగున "బీ" అనేమనిషికి దుర్బోధన చేస్తున్నాడు. "బీ" అనే మనిషి అది "ఏ" అనే మనిషియొక్క ఆస్తి అని నమ్మి కృత్రిమము లేకుండా ఆఆస్తి "జడ్" అనేమనిషియొక్క స్వాధీనములోనుండి యెత్తుకొనివస్తున్నాడు. ఈ పొరపాటుమీద ఆ కార్యము జరిగించే "బీ" అనేమనిషి అయోగ్యముగా యెత్తుకొనిరాలేదు. గనుక చోరీఅనేనేరము జరిగించినవాడుకాడు, అయితే "ఏ"అనేమనిషిని, చోరీఅనేనేరమును కుమ్మకు జరిగించినందునగురించి నేరస్థుడై "బీ" అనే మనిషి చోరీ జరిగించివుంటే యేలాగో అలాగే శిక్షకు పాత్రుడగుచున్నాడు.

వివరణము (4)— ఒక నేరపు కార్యమును కుమ్మకు చెయ్యడము అనేది నేరముగా వున్నందున అట్టి కుమ్మకుకు, కుమ్మకు చెయ్యడముకూడా నేరముగా వుంటున్నది.

దృష్టాంతము

"ఏ" అనేమనిషి "జడ్" అనేమనిషిని ఖూనీచేసేలాగున "సీ" అనేమనిషికి దుర్బోధన చెయ్యవలసినది అని "బీ" అనేమనిషికి దుర్బోధనచేస్తున్నాడు. "బీ" అనే మనిషి అదే ప్రకారము "జడ్" అనేమనిషిని ఖూనీ చేసేలాగున "సీ" అనే మనిషికి దుర్బోధన చేస్తున్నాడు. "బీ" అనే మనిషినియొక్క దుర్బోధనవల్ల "సీ" అనేమనిషి నేరము జరిగిస్తున్నాడు. "బీ" అనేమనిషి తన నేరమును గురించి మరణ దండనవల్ల శిక్షించబడడమునకు పాత్రుడవుతున్నాడు. "ఏ" అనేమనిషి ఆ నేరము జరిగించేలాగున "బీ" అనేమనిషికి దుర్బోధన చేసినందున "ఏ" అనే మనిషికూడా అదే శిక్షకు పాత్రు డవుచున్నాడు.

వివరణము (5)— ఇతరులతో బందుకట్టుగా నేరము జరిగించడమునకు కుమ్మకుచెయ్యడము ఆ నేరమునకు, కుమ్మకుచేసే మనిషి ఆ నేరము జరిగించే మనిషితోకూడా ఆ నేరమును గురించిన యేర్పాట్లు చెయ్యవలసిన జరూరులేదు. దేనిని అనుసరించి ఆ నేరము జరిగించబడ్డదో అట్టి బందుకట్టులో ప్రవర్తించడమే చాలును.

దృష్టాంతము

"ఏ" అనేమనిషి, "జడ్డు" అనే మనిషికి విషము పెట్టవలెనని "బీ" అనే మనిషితో ఆలోచన చేస్తున్నాడు. అంతట "ఏ" అనేమనిషి "జడ్డు" అనే మనిషికి విషము పెట్టేలాగున వారు నిర్ణయించుకొన్నారు. తర్వాత "బీ" అనే మనిషి, ఆ ఏర్పాటు "సీ" అనేమనిషికి తెలియచేసి "ఏ" అనేమనిషిపేరుచెప్పకుండా "జడ్డు" అనేమనిషికి మరియొకమనిషి విషముపెట్టి పోతున్నాడనిమాత్రము తెలియచేస్తున్నాడు. "సీ" అనేమనిషి ఆ విషము సంపాదించి యివ్వగలందులకు వప్పి, పైన వివరించబడ్డ ప్రకారము పెట్టడమునకు విషముసంపాదించి "బీ" అనేమనిషివద్దయిస్తున్నాడు. "ఏ" అనే మనిషి విషము పెట్టడమువల్ల "జడ్" అనే మనిషి చనిపోతున్నాడు. ఇందులో "ఏ" అనే మనిషిన్ని, "సీ" అనేమనిషిన్ని కలిసి దురాలోచన చెయ్యకపోయినా "ఏ" బందుకట్టునుబట్టి "జడ్" అనే మనిషి ఖూనీచెయ్యబడ్డాడో ఆ బందుకట్టులో "సీ" అనే మనిషి ప్రవర్తించినాడుగనుక "సీ" అనే మనిషి యీ సెక్షనులో నిర్ధారణ చెయ్యబడ్డ నేరముజరిగించినవాడు అయి ఖూనీనిగురించి శిక్షకు పాత్రుడవుతున్నాడు.

ఇండియన్ పీనల్ కోడులోచెప్పబడిన సాధారణమైన మినహాయింపులు:

పైన చెప్పబడిన పీనల్ కోడు సెక్షన్లలోని నేరములలో చెప్పబడిన పనులు యీ క్రింద చెప్పబడిన సందర్భములలో యీక్రింద చెప్పబడిన వారివల్ల చేయబడిన నేరములుగా పరిగణించబడవు.

(1) ఒక కార్యమును జరిగించుటకు న్యాయశాస్త్రము వల్ల అర్హుడైయుండే మనిషిగాని, లేక నిజము తెలియక యెట్టి కృత్రిమము లేకుండా తాను అట్టి కార్యమును జరిగించుటకు బద్ధుడైయున్నాడని నమ్మియుండే మనిషిగాని చేసే ఆ కార్యము నేరము కాదు.

(2) "లా" ప్రకారము తనకు అధికారముయుండి లేక అధికారముయున్నట్లు కృత్రిమము లేకుండా నమ్మి, అట్టి అధికారము చెలాయించుటకుగాను ఒకన్యాయాధిపతి చేసే కార్యము నేరము కాదు.

(3) ఒక కోర్టువారి తీర్పు ననుసరించి చేయబడే ఏ కార్యమును సదరు ఉత్తరవు యిచ్చుటకు అధికారము కలదని నమ్మికతో చేసే యే కార్యము గాని నేరము కాదు.

(4) చెడ్డ ఉద్దేశ్యము లేకుండా తగు జాగ్రత్తతో న్యాయమైన పనిని చేయుచున్నప్పుడు అకస్మాత్తుగాగాని, దురదృష్టమువలన గాని కీడు సంభవించినను నేరము కాదు. ఉ॥ ఒకడు తన స్థలములోని చెట్టును ఒక గొడ్డలితో తగు జాగ్రత్తతో కొట్టుచుండును. అకస్మాత్తుగా గొడ్డలి అలుగు వూడిపోయి, ప్రక్కన నిలుచున్న వానికి గాయము తగులును. అప్పుడు చెట్టు కొట్టుచున్నవాడు ఘాతనేరము జరిగించినందున శిక్షకు పాత్రుడుగాడు

(5) ఒక ఆస్తికిగాని, ప్రాణమునకుగాని యెక్కువ కీడు సంభవించుచున్నప్పుడు అట్టి కీడును తొలగించవలెననే ఉద్దేశ్యముతో చేసిన యే కార్యమువల్లనైనా కీడుగాని హానిగాని సంభవించినను నేరము కాదు. ఉ॥ ఒకయిల్లు కాలిపోతున్నది. ఆ అగ్ని యితరులయిండ్లకు వ్యాపించకుండా ఆపవలెననీ ప్రక్కనయున్నటువంటి ఆవరణలోని తాటాకుపాకను ఒకడు పడగొట్టుచున్నాడు. అప్పుడు అతడు చెరుపునేరము చేసినట్లు యెంచబడడు.

(6) 7 సం॥లకు లోపు వయస్సుగల బిడ్డ ఏమిచేసినను నేరముగా పరిగణించబడడు.

(7) 7 సం॥లకు పైనయున్నూ 12 సం॥లకులోపు వయస్సు గల బిడ్డ తాను చేసే పని చేయకూడదనిన్నీ, దానివల్ల ఒక కీడు సంభవించుననిన్నీ తెలుసుకొనే జ్ఞాన పరిపక్వము లేనిదైయుండి ఏపని చేసినను నేరము కాదు.

(8) ఒక కార్యముయొక్క స్వభావముగాని, దానివల్ల కీడు సంభవించుననిగాని అది "లా"ప్రకారము చేయగూడదనిగాని యెరుగజాలిన మతిస్థిమితములేని పిచ్చివాళ్ల వల్ల చేయబడు ఏ కార్యము నేరము కాదు.

(9) కల్లు, సారాయి, నల్లమందు వగైరా విషావస్తువులు ఒకడు తాను బుద్ధిపూర్వకముగా పుచ్చుకొనక, తన్ను మోసముచేసిగాని, బలాత్కారముగాగాని యిత

రులవల్ల పెట్టబడి ఆ వస్తువులవల్ల కలిగిన మత్తులోయుండి, తానుచేసే కార్యము యొక్క స్వభావమునుగాని, దానివల్ల సంభవించే కీడునుగాని తెలుసుకొనగల జ్ఞానములేని స్థితిలో జరిగించిన ఏ పనిన్నీ నేరముకాదు కాని అట్టి నిషాపదార్థము బుద్ధిపూర్వకముగా పుచ్చుకొని ఆ మత్తులోయుండగా నేరములు చేసిన శిక్షకు పాత్రుడగును.

(10) ఆత్మసంరక్షణము నిమిత్తము ఆత్మసంరక్షణ హక్కు పరిమితి దాటకుండా జరిగించే ఏ పనిన్నీ నేరముకాదు.

(11) సాధారణమైన ఓర్పుగల మనిషి సహించగల కొద్దినష్టము కలుగజేసే ఏ కార్యము నేరముకాదు.

(1) ఉ॥ గవర్నమెంటు బంజరుస్థలములోయున్న ఒకమామిడి చెట్టుయొక్క రెండుకాయలను తినుటకు ఒక బాటసారి కోయును. అప్పుడు అతడు చోరీ జరిగించినట్లు యెంచవీలులేదు. ఏలనన జరిగించిన నష్టము చాలా స్వల్పముగనుక.

(2) ఉ॥ ఒకఅధికారి తన బంట్రోతు సరిగా పని నిర్వర్తించనందుకు కొద్ది తిట్లు తిట్టినయెడల నేరము కాదు.

2. 1889 సం॥ 3వ మదరాసు షహరుల న్యూసన్సు ఆక్టు క్రింద

## నే ర ము లు.

మదరాసు గ్రామకోర్టుల ఆక్టు సె. 76 (b) క్లాజు ప్రకారము షహరుల న్యూసెన్సు ఆక్టు 3 సె. (9) (11) (12) వ క్లాజుల క్రింద శిక్షింపబడతగు నేరములు విచారించుటకు పంచాయతీ కోర్టులకు అధికార మియ్యబడినది. సదరు సె. 1 క్లాజు (e) ప్రకారము యేచట్టము ననుసరించే అయినా జుల్మానాచేగాని ఆరునెలలకు మించనట్టి కాలమునకు ఖయిదుచే మాత్రముగాని యీ రెంటిచేగాని శిక్షింపబడదగు నేరములనుగూడ విచారించుటకు అధికార మివ్వవచ్చును.

షహరుల న్యూసెన్సు ఆక్టుక్రింద ముఖ్యమైన నేరములు యీ దిగువ ఉదహరింపబడినవి.

## రాజవీధిలోని కొన్ని నేరములకుగాను శిక్ష.

సె. 3 ఏ మనిషి అయినా ఏదయినా పబ్లిక్ స్థలములో యీ క్రిందవచ్చే నేరములలో దేన్ని అయినా జరిగించిన పక్షమునకు అతడు నేరస్థాపన చెయ్యబడ్డమీదట యాభై రూపాయలకు మించని అపరాధమునకుగాని ఎనిమిదిరోజులకు మించని రెండు తరహాలల్లో ఒక తరహా ఖయిదుకుగాని పాత్రుడు కావలసినది:—

(1) ఉగ్రముగా, లేక అశ్రద్ధగా తోలడము.

ఏ మనిషిఅయినా ఉగ్రముగా, లేక అశ్రద్ధగా యేదయినా జంతువును తోలిన పక్షమునకు లేక సవారీచేసిన పక్షమునకు, లేక యేదయినా బండితోలిన పక్షమునకు, లాగిన పక్షమునకు, లేక, తోసిన పక్షమునకు.

(2) పశువులు తోలడములో అశ్రద్ధవల్ల ప్రతిబంధకము కలుగ చెయ్యడము.

ఏ మనిషి అయినా, పశువులను అజాగ్రత్తగాగాని దౌర్జన్యముగా గాని తోలడము చేత అట్టి పశువుల మూలముగా యేదయినా హాని, లేక ప్రతిబంధము కలుగ చేసిన పక్షమునకు.

(3) బాటను సమీపమైన లేక ఎడమవైపున కాకుండా మరియొకవైపున తోలడము వగైరాలు.

ఏ మనిషి అయినా బాటకు సమీపమయిన, లేక ఎడమవైపున కాకుండా మరియొక వైపున యేదయినా బండిని న్యాయమయిన సబబు లేకుండానున్ను యే మనిషి కయినా అపాయముగాని ప్రతిబంధముగాని కలుగిచేసేలాగునున్నూ తోలిన పక్షమునకు, లాగిన పక్షమునకు, లేక తోసినపక్షమునకు.

(4) బండిగాని, పశువులనుగాని క్రమమైన కట్టులో వుంచకుండా వదలి పెట్టడము.

ఏదయినా బండి లేక పశువులను స్వాధీనమందు వుంచుకొని వుండే యేమనిషి అయినా, దాన్ని లేక వాటిని క్రమముగా కట్టులో వుంచుకోవడమునకు సాధ్యము కానంతదూరమందు దాన్ని లేక వాటిని వదలిపెట్టి పోయిన పక్షమును.

(5) ఒక తట్టునుండి మరియొక తట్టుకు వెళ్లడమునకు వుండే దారికి అడ్డు కలుగ చేయడము.

ఏ మనిషి అయినా సరుకులు ఎక్కించడమునకు గాని, దించడమునకు గాని నిర్ణయించబడివున్న స్థలములయందుతప్ప మరి ఏస్థలమందైనా అందుకు అవశ్యకముగా ఉండేటంతకన్నా యెక్కువ కాలమువరకు యేదయినా బండి వుండే లాగున, లేక నిలిచే లాగున చేసిన పక్షమునకు, లేక ప్రతిబంధము కలుచేసే లాగున యేదయినా గుర్రమును గాని యితర జంతువును గాని కట్టివేసిన పక్షమునకు, లేక జనులు ఒకతట్టు నుండి మరియొక తట్టుకు వెళ్ళడమునకుగాను వుండే యే దారిలోనైనా ధారాళముగా వెళ్ళుటకు బుద్ధిపూర్వకముగా ఏ విధమున నయినను ప్రతిబంధించే పక్షమునకు, లేక ప్రతిబంధము కలుగచేసే పక్షమునకు;

(6) ఆటంకము కలిగేటట్లు సరుకులను బైట పెట్టడము.

ఏ మనిషి అయినా ఆటంకము కలిగేటట్టు సామానులను అమ్మకమునకు గాను బైట కనపరచే పక్షమునకు,

(7) గుఱ్ఱములనుగాని క్రూరమైన కుక్కలనుగాని కులాసాగా వదలిపెట్టడము.

ఏ మనిషి అయినా, అశ్రద్ధగా ఏదయినా గుఱ్ఱమును వదలిపెట్టిన పక్షముకు, లేక మూతి చిక్కము లేకుండా యేదయినా క్రూరమయిన కుక్కను కులాసాగా వుండనిచ్చిన పక్షముకు, లేక ఎవరయినా మనిషిమీద గాని, పశువులమీద గాని పడేలాగున, హింసించేలాగున, లేక జడుపు పుట్టించేలాగున ఏదయినా కుక్కనుగాని యితర జంతువునుగాని వుసికొలిపిన పక్షముకు, లేక యెగ్గొలిపిన పక్షమునకు.

(8) కుప్ప, రాళ్లు మొదలైనవి వుంచడము.

ఏ మనిషి అయినా యేదయినా కుప్ప, మురికి పెంట, లేక యేమైనా రాళ్ళుగాని, కట్టుసామానులుగాని న్యాయమైన కారణము లేకుండా వేసే పక్షముకు, లేక వుంచే పక్షముకు.

(9) వీధిలో అసహ్యము చేయడము.

ఏ మనిషి అయినా తన మానమును బుద్ధిపూర్వకముగా నున్న, సిగ్గు లేకుండా నున్న బైటికిఅగుపరచిన పక్షముకు, లేక జలమలాదులు విసర్జించడమువల్ల అసహ్యము చేసిన పక్షముకు; మరిన్ని ఏడుఏండ్లకు లోబడ్డ ఏ బిడ్డనయినను తన వశమందయినా స్వాధీనమందయినా వుంచుకొన్న యేమనిషి అయినా పైన చెప్పిన ప్రకారము ఆబిడ్డ అసహ్యము చెయ్యడమును ఆపకుండా తప్పిపోయిన పక్షముకు.

(10) త్రాగివుండడము, అల్లరిగా లేక సిగ్గులేని తరహాను నడచుకోవడము.

ఏ మనిషి యైనా తప్ప తాగిన్ని, స్వసంరక్షణ చేసికోలేకుండా నున్న కనపడ్డ పక్షముకు, లేక ఏదైనా అల్లరి కలిగేలాగున, అక్రమముగా, లేక సిగ్గులేని తరహాను నడచుకొనే నేరము చేసినపక్షముకు.

నుయ్యి, గుంట వగైరా చుట్టూ కంచెవెయ్యక అశ్రద్ధచేయడము.

సె. 4 ఏ మనిషి అయినా యేదయినా నుయ్యి, గుంట, లేక అపాయకరమైన యితర స్థలము, లేక కట్టడము వీటిచుట్టూ, కంచె కట్టించకుండా, లేక కాపు చెయ్యకుండా అశ్రద్ధ చేసే పక్షముకు లేక

ఇల్లు వగైరాలలోనుండి అసహ్యాకరమైన నీళ్లుపారేటట్లు చేయడము.

"ఏ మనిషియైనా యేదైనా యింట్లోనుంచి, ఫ్యాక్టరీలోనుంచి, పేడకుప్పనుంచి లేక అట్టి మరియొక చోటనుంచి వీధిలోకి యేదయినా అసహ్యాకరమైన నీళ్లు పారేటట్లు చేసిన పక్షమునకు,

నేరస్థాపన చెయ్యబడ్డమీదట యాభై రూపాయలకు మించని అపరాధమునకు గాని, ఒక మాసమునకు వ్యాపించగల రెండు తరహాలలో ఒకతరహా ఖయిదుకు గాని పాత్రుడు కావలసినది."

జంతువులయెడ క్రూరముగా ప్రవర్తించే పక్షమునకు శిక్ష.

సె. 5 "ఏ మనిషియైనా జంతువును క్రూరముగా కొట్టినపక్షమునకు, హింసించిన పక్షమునకు; వేధించినపక్షమునకుగాని, తోలుటకయినా సవారీచేయుటకయినా లేక వుపయోగించుటకయినా అనర్హముగావుండే యేజంతువునైనా వేరేవిధముగా అట్లా తోలే పక్షమునకు గాని, సవారీచేసే పక్షమునకు గాని లేక వుపయోగించుకొనే పక్షమునకు గాని ఏదైనా జంతువు తోలబడుటకుగాని సవారీ చేయబడుటకు లేక వుపయోగించుకోబడుటకు అనర్హముగా వుండేటప్పుడు దాన్ని క్రూరముగా కొట్టేలాగున హింసించే లాగున వేధించేలాగున, తోలేలాగున, సవారీచేసేలాగున లేక వుపయోగించుకొనేలాగునచేసిన పక్షమునకు గాని అతడు నేరస్థాపన చెయ్యబడ్డమీదట యాభై రూపాయలకు మించని అపరాధమునకు నైనను ఒక మాసమునకు మించని రెండు తరహాలలో ఒక తరహా ఖైదు కయినను, యీ రెంటి కయినను పాత్రుడు కావలసినది."

3.—జనన మరణముల రిజిష్ట్రేషను ఆక్టు ననుసరించిన నేరములు.

37. (1899 వ సం॥పు 3 వ మదరాసు ఆక్టు అగు) 1899వ సం॥పు మదరాసు జనన మరణముల రిజిష్ట్రేషను ఆక్టుయొక్క 18 వ సెక్షను ననుసరించిన నేరములను విచారించుటకు కొన్ని పంచాయతీ కోర్టులకు అధికార మివ్వబడినది.

ఈ ఆక్టుయొక్క ముఖ్య నిబంధనలు యీ క్రిందివిధమై యున్నవి.—

8 సె. ప్రసవించిన సంగతి రెండు వారములలోగా తెలుపవలయును.

"ప్రతి శిశువు యొక్క తండ్రియు, లేక తండ్రి చనిపోయియున్న యెడల, అతడు వ్యాధిగ్రస్తుడుగా వున్నయెడల. హాజరు లేనియెడల లేక అసమర్థుడై యున్న యెడల ప్రసవ సమయమందు ఉపచరించుచున్నట్టి మంత్రసానియు, అట్టి మంత్రసాని తప్పినచో బిడ్డ పుట్టిన యింటిలో వాసము చేయుచుండు కుటుంబములో వయస్సు వచ్చిన ప్రతి పురుషుడును, బిడ్డను స్వాధీనము గల యే మనిషియైనను, లేక పయిన చెప్పినవారును తప్పినచో తల్లియు, ఆబిడ్డ పుట్టినదినముతరువాత రెండువారములలోగా తనకు తెలిసినంతవరకును, తాను నమ్మినంత వరకును 7 వ సెక్షనుబట్టి నిర్ణయింపబడిన నమూనాలలో దాఖలుచేయుటకు అగత్యమైన వివిధ వివరములును, వ్రాతమూలముగా గాని, నోటి మాటలుగా గాని గ్రామము లేదా వార్డుయొక్క జనన మరణముల రిజిష్ట్రారునకు తెలుపవలయును, లేదా యెరుక చేయించ వలయును.

అయినను పుట్టుముదటనే తాను సమాచారము తెలియబఱుప వలసియుండక మరియొకరు తప్పిననే తెలియబఱుప వలసియుండు మనుష్యుడు, అట్టి మఱియొకని వలన సమాచారము క్రమముగా ఎఱుక చేయబడి యుండవచ్చునని గాని లేక సరిగా ఎఱుక చేయబడియుండుననిగాని తలంచుటకు తగిన కారణముండిన యెడల, సమాచారమును తెలియబఱుచుటకు అతడు బద్ధుడై యుండడు.

మఱియు జారజశిశువు విషయములో, సమాచారమును తెలియబఱుప వలసినది పుట్టుముదట అట్టి శిశువుయొక్క తల్లికి విధాయకమై యుండును. మరియు సదరు శిశువుయొక్క పుట్టుక విషయమై యెవరుగాని ఆ బిడ్డయొక్క తండ్రిగా సమాచారమును తెలియబఱుపవలసినది లేదు.

## 9 సె. పాఱవేయబడియుండగా చూచిన బిడ్డనుగుఱించి సమాచారము తెలుపుట.

క్రొత్తగా పుట్టిన బిడ్డ పాఱవేయబడియుండగా చూడబడినపుడు, అట్టి బిడ్డను చూచిన మనుష్యుడుగాని, ఆబిడ్డ యెవరి హవాలాలో నుండబడునో ఆమనుష్యుడుగాని తనకు తెలిసినంతవరకును, తాను నమ్మినంతవరకును. ఆ బిడ్డ పుట్టుకనుగురించి రిజిష్టరు చేయవలసిన వివరముల విషయమై తనకు తెలిసిన సమాచారమును ఆ బిడ్డను చూచిన తర్వాత ఏడు దినములలోగా రిజిస్ట్రారునకు తెలియబఱచుట వానికి విధాయకమయి యున్నది.

## 10 సె. మరణమును గుఱించిన సమాచారము నాల్గు దినములలోగా తెలియ జేయవలయును.

"గ్రామమునందు యే మనుష్యుడైన చనిపోయినపుడు మరణ సమయమున సమీపమున నుండినట్టి లేక అతడు కడపట వ్యాధిగ్రస్తుడయియుండినపుడు ఉపచరించు చుండినట్టి వయస్సువచ్చిన దగ్గరి మగచుట్టముగాని, అట్టి చుట్టము తప్పినచో మరణ సమయమున సమీపమునందుండిన వయస్సువచ్చిన ప్రతి పురుషుడు గాని అట్టివారు తప్పినచో నాయింటి యధీనదారుడు గాని లేక అతడు తప్పినచో అట్టి మరణము తటస్థించిన యింటిలో వసించుచుండిన వయస్సువచ్చినట్టి ప్రతిపురుషుడుగాని లేక అట్లు ఇంటిలో నుండువాడు తప్పినచో శవమునకు దహనాదిక్రియలు జరిపించినవాడు గాని తనకు తెలిసినంతవఱకును తాను నమ్మినంతవఱకును, నిర్ణయింపబడిన నమూనాలో దాఖలుచేయుటకు కావలసిన వివిధ వివరములను, మరణము సంభవించిన తేదీనుండి నాలుగు దినములులోగా నోటిమాటలుగాగాని వ్రాతమూలముగా గాని రిజిస్ట్రారునకు తెలుపవలసినది, లేక ఎఱుక చేయించవలసినది.

అయినను, పుట్టుముదటనే తాను సమాచారము తెలియబఱుపవలసి యుండక మరియొకరుతప్పిననే తెలియబఱుపవలసినమనుష్యుడు,అట్టిమరియొకనివలనసమాచారము

క్రమముగా రెజిస్టరు చేయబడి యుండవచ్చునని గాని లేక సరిగా రెజిస్టరు చేయబడునని గాని తలంచుటకు తగిన కారణ ముండిన యెడల, సమాచారమును తెలియబఱచుటకు అతడు బద్ధుడై యుండడు."

## 11 సె. ఇతర మరణములనుగురించి గ్రామపు హెడ్డు సమాచారము తెలుపుటకు బద్ధుడైయుండుట.

"ఒక గ్రామమందు, 10 వ సెక్షనులోని విషయములకు లోనై యుండని సందర్భములలో నే మనుష్యుడైన మృతినొందియుండగా కనుగొనబడినయెడల ఆ గ్రామపు హెడ్డు, తనకు తెలిసినంతవఱకు తాను నమ్మినంతవఱకును అట్టి మరణమునుగురించి రిజిష్టరు చేయవలసిన వివరముల విషయమై తనకు తెలిసిన సమాచారమును రిజిష్ట్రారునకు వెంటనే తెలియపఱచుట ఆయనకు విధాయకమై యున్నది.

12 సె॥ 10, 11 సెక్షనులలో నేమి చెప్పియున్నప్పటికి దానితోనిమిత్తము లేకుండ—

(1) ఆస్పత్రిలో కలిగెడు జననముల విషయములోను, మరణముల విషయములోను, దాని చార్జిగల మెడికల్ ఆఫీసరు రిజిస్ట్రారుకు నోటీసు పంపవలయును.

"ఏ యాస్పత్రిలోనైన ఒక బిడ్డ పుట్టు విషయములో లేక ఒక మనుష్యుడు చనిపోవు విషయములో, దాని చార్జిగల మెడికల్ ఆఫీసరు అట్టి జననమును గురించి గాని, మరణమునుగురించిగాని నిర్ణయింపబడిన నమూనాలో దాఖలు చేయుటకు కావలసిన వివిధ వివరములు గల వ్రాతమూలకమయిన ఒక నోటీసును వెంటనే రిజిష్ట్రారునకు పంపుట ఆయనకు విధాయకమై యున్నది."

(2) చావళ్లు వగయిరాలయందు కలిగెడు జనన మరణముల సంగతిలో వాని నుంచుకొనియున్నవాడు లేక వాని చార్జిగల మనుష్యుడు కావలసిన సమాచారము తెలుపవలయును.

"ఏ చావడియందుగాని, సత్రమునందుగాని, హోటలునందుగాని పూటకూళ్ళ యింటియందుగాని, విడిదియింటియందుగాని, సారాయి దుకాణమునందుగాని కల్లంగడియందుగాని, జనులు సాధారణముగా వెళ్ళెడి యితరుల స్థలమునందుగాని పుట్టినట్టి బిడ్డ విషయములో లేక మృతినొందు మనుష్యుని విషయములో, దాని యజమానుడు గాని, దానిని వుంచుకొన్నవాడుగాని, దాని చార్జిగలవాడుగాని 8, 10 సె॥లనుబట్టి కోరబడ్డ సమాచారమును అందు ఉదహరించబడిన విధమున, ఆయా సంగతికి తగినట్లు సదరు జననము లేక మరణము సంభవించిన తర్వాత 48 గంటలలోగా తెలియబఱచుట వానికి విధాయకమై యున్నది.

13 సె. సమాచారమును నోటిమాటలతో తెలియబరుచు మనుష్యుడు రిజిస్టరులో తన పేరు వ్రాయవలెను.

"కోరబడిన సమాచారమును ఒక రిజిస్ట్రారునకు నోటి మాటలతో తెలియపరచిన ప్రతిమనుష్యుడును, రిజిస్టరులో తన పేరును, వివరమును, నివాసస్థలమును వ్రాయవలయును. మరియు అతనికి వ్రాయుటకు తెలియనియెడల, రిజిస్ట్రారుచే ఇట్టి విషయమును గురించి వ్రాయబడ్డ తన పేరునకు, వివరమునకు నివాసస్థలమునకు రిజిస్టరులో తన నిశానీ చేయవలయును."

18 సె. సమాచారమును ఎఱుకపఱచక పోవుట వగైరాలకు శిక్ష.

"(1) 8, 9, 10, 11, 12. సెక్షన్ల ననుసరించి యే సమాచారమునైనను ఎఱుకపఱచుట తనకు విధియై యుండగా ఆ సమాచారమును ఎఱుకపఱచుటకు న్యాయమైన కారణములేకుండ తప్పిపోవునట్టి, లేక

(2) తెలిసికొనబడవలసినట్టియు రిజిస్టరు చేయబడవలసినట్టియు విషయములను వేనిని గురించియు యయిన, అబద్ధమయినట్టియు అబద్ధమయినదని తనకు తెలిసినట్టియు లేక తాను నమ్మునట్టియు ఏ సమాచారమునుగాని జననముల లేక మరణముల రిజిస్టరు నందు దేనినందునయినను వ్రాయుటకయి ఇచ్చునట్టి, లేక ఇప్పించునట్టి, లేక-

(3) 13వ సెక్షన్ ననుసరించి కోరబడినయెడల, రిజిస్టరులో తన పేరును వివరమును వాసస్థలమును వ్రాయుటకుగాని, తన నిశాని వేయుటకుగాని నిరాకరించునట్టి యే మనుష్యుడైనను, పది రూపాయలకు మించని జుల్మానాకు పాత్రుడు కావలెను."

19 సె. తహశీల్‌దారు లేక డిప్యూటీ తహశ్శీలుదారునియొక్క-లేక వారికి పై దర్జాగల ఆఫీసరుయొక్క- ఉత్తరువుమీాద తప్పు ఫిర్యాదులు దాఖలు చేయకూడదు.

ఈ యాక్టు ననుసరించి ప్రతి ఫిర్యాదును సదరు నేరము ఏ గ్రామములో జరిగింపబడెనో ఆగ్రామముపై అధికారముగల తహశీలుదారు లేక డిప్యూటీతహశ్శీలుదారునియొక్క-గాని సదరు తహశీలుదారుడు లేక డిప్యూటీతహశీలుదారు ఏ యాఫీసరునకు తాబేదారుగా నున్నాడో ఆ యాఫీసరుయొక్క-గాని వుత్తరువుమీాదతప్ప వేరువిధముగ దాఖలు చేయకూడదు. డిస్ట్రిక్టు కలెక్టరుగాని, అతని వలన అధికారము యివ్వబడిన ఇతర ఆఫీసరుగాని, అట్టి ఫిర్యాదును నిలిపిపెట్టవచ్చును.

నేరము మోపబడిన మనుష్యులు ఏజంట్లద్వారా హాజరై వారిచే ప్రతివాదము చేయించవచ్చును.

ఈ యాక్టు ననుసరించి చేయబడు ఫిర్యాదులలో. నేరము మోపబడినవాడు, ఏజెంటుద్వారా హాజరు కావచ్చును. మరియు వాడు ఏజంటుచే ప్రతివాదము చేయించుకొనుటకును హక్కు- గలిగియుండును.

అయినను మాజిస్ట్రేటుచర్యలు జరుగుచుండుసమయమందెప్పుడైనను, నేరములు మోపబడినవాడు ఖుద్దున హాజరగునట్లు కోరవచ్చును; అట్లు కోరినపుడు కోరుటకు గల కారణములను వ్రాతమూలకముగా రికార్డు చేయవలెను.

## టీకాల విధులు

1920 సం॥పు మదరాసు లోకల్ బోర్డుల ఆక్టు సె. 137, 199 ల క్రింద టీకాలు వేయించుకొనుట నిర్బంధము చేయుటకు ఈ క్రింది విధులు చేయబడినవి. మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టుక్రిందకూడ ఈ విధుల మాదిరివే చేయబడి మునిసిపాలిటీల సరిహద్దులలో అమలులో పెట్టబడుచున్నవి. మునిసిపాలిటీల ఆక్టుక్రింద వేయబడిన విధులలో ఈ విధులలో డిస్ట్రిక్టు హెల్తు ఆఫీసరుకు ఇవ్వబడిన అధికారములు, మునిసిపల్ హెల్తు ఆఫీసరుకున్నూ, జిల్లాబోర్డు ప్రెసిడెంటుకు యివ్వబడిన అధికారములు మునిసిపల్ ఎగ్జిక్యూటివ్ అధికారికిన్ని యివ్వబడినవి. కాని విధులలో భేదము ఏమిన్ని లేదు.

## విధులు

1 ఈ విధులలోని విషయమందుగాని, సందర్భమందుగానివిరోధము ఏమిన్ని లేని యెడల,

(1) "శిశువు" అనగా 18 సం॥ లోపు వయస్సుగల పిల్లవాడు, లేక పిల్ల.

(2) "గార్డియన్" (సంరక్షకుడు) అనగా యెవరైతే "లా" ప్రకారము గాని స్వతస్సిద్ధమైన హక్కులవలనగాని, లేక ఏదైనా అంగీకరింపబడిన ఆచారమువల్లగాని లేక తన యిష్టానుసారముగాని, లేక న్యాయశాస్త్రప్రకారము అధికారముగలవారిచే ఒప్పగింత చేయబడినందునగాని, ఒక శిశువును తన స్వాధీనమువో యుంచుకొని యున్నాడో లేక సంరక్షణ చేయుచున్నాడో వాడు.

(3) "తల్లిదండ్రులు" అనేమాట తల్లికిగాని, తండ్రికిగాని లేక శిశువు జారజాతమైన తల్లికిగాని వర్తించును.

(4) "పురుషుడు" అనేమాట 18 సంవత్సరములు వయస్సుగల పురుషునికి లేక స్త్రీకి వర్తించును.

(5) "అరక్షితశిశువు" అనగా రసమువొక్కించుటవల్లగాని లేక యథార్థముగాగాని మశూచికము పడుటవల్ల, లేక జయప్రదముగా టీకాలు వేయబడి లేక అట్లు టీకాలు వేయబడిన 10 సం॥రముల తరువాత తిరిగి టీకాలు వేయబడి (రీవాక్సినేషన్) లేక టీకాలు అంటవని యీ క్రింద విధించబడిన ప్రకారము సర్టిఫయి చేయబడిన వాడుగా యుండకగాని, మశూచికము రాకుండా రక్షితుడుగాని శిశువు.

(6) 'అరక్షిత పురుషుడు' అనగా ఏసమయ యొక్కనుచుటవల్లగాని, లేక యత్నాని ముగా మశూచకిపు పడుటవల్ల, లేక జయప్రదముగా టీకాలు వేయబడి లేక అట్టి టీకాలు వేయబడిన 10 సం॥ల తరువాత తిరిగి టీకాలు వేయబడి లేక టీకాలు అంటు వని యీ క్రింద విధించబడిన ప్రకారము సర్టిఫై చేయబడినవాడుగా నుండకగాని మశూచకము రాకుండా రక్షితుడుగాని పురుషుడు.

(7) "టీకాల డిపో" అనగా జిల్లాబోర్డు ఉత్తర్వు ప్రకారము ఉచితముగా టీకాలు వేయుస్థలము, లేక యిల్లు.

(8) "వాక్సినేటరు" (టీకాలు వేయు అధికారి) అనగా,

(a) 1914 సం॥పు మదరాసు మెడికల్ రిజిష్ట్రేషను ఆక్టు ప్రకారము రిజిష్టరు అయిన వైద్యుడు, లేక

(b) ఇండియన్ మెడిసిన్‌లో లైసెన్సుయేటుగా, లేదా అసోసియేట్ లైసెన్సుయేటుగా A తరగతి క్రింద రిజిష్టరైన వైద్యుడు, లేక

(c) ప్రావిన్షియల్ గవర్నమెంటువల్ల వాక్సినేటరుకు విధింపబడిన అర్హతగలిగి జిల్లాబోర్డుచే నియమింపబడిన వాక్సినేటరు, లేక

(d) టీకాలు వేయుటలో అర్హత సంపాదించిన శానిటరీ ఇన్‌స్పెక్టరు.

2. ఈ విధులు ప్రావిన్షియల్ గవర్నమెంటు వారివల్ల, లేక డిస్ట్రిక్టుబోర్డువల్ల డిస్ట్రిక్టు గెజెటులో ప్రచురణమూలముగా నిర్దేశింపబడిన ప్రదేశములకు వర్తించును.

3. ఈ విధులువర్తించు ప్రదేశ హద్దులలో ఒక మాసము వాసము చేసినట్టియు 6మాసములకు తక్కువగాని వయస్సు గల అరక్షిత శిశువుయొక్క తల్లిదండ్రులు లేక గార్డియన్ వాక్సినేటరు వచ్చినప్పుడు వాక్సినేటరు చేతగాని, లేక టీకాలడిపోవద్దకు పంపిగాని ఆ శిశువుకు టీకాలు వేయించవలెను. వాక్సినేటరు వచ్చుటను గురించి గ్రామమునకు దండూరా మూలముగా గాని, నోటీసు జారీచేయుట మూలముగా గాని తెలియజేయవలెను.

అరక్షితపురుషుడు ఈ విధులు వర్తించు ప్రదేశములో ఒక మాసము వాసము చేసే యెడల తాను వాక్సినేటరుచేతగాని, లేక టీకాలడిపోవద్దకు వెళ్ళిగాని లేక మరి యే యితర వాక్సినేటరుచేతగాని టీకాలు వేయించుకొనవలెను.

4. డిస్ట్రిక్టు హెల్తాఫీసరు (డి॥ హె॥ ఆ॥) లేక డిస్ట్రిక్టు బోర్డు ప్రెసిడెంటు (డి॥ బో॥ ప్రె॥) లేక వారిచే అధికారము పొందిన యితర ఆఫీసరుగాని ఏ రెవిన్యూ గ్రామములోనైనా మశూచకము వ్యాపించియున్న గాని, లేక వ్యాపించునట్లు కనుపడిన గాని ఆ గ్రామములో నుండే అరక్షిత శిశువులను, పురుషులను టీకాలు వేయించుకొనవలసినదని ఉత్తరువు చేయవచ్చును.

అయితే, ఒక శిశువుయొక్క తల్లిదండ్రులు గాని, గార్డియన్ గాని ఆశిశువుకు టీకాలు వేయించుటకుగాని, లేక పరీక్షార్థముగాని సదరు రెవిన్యూ గ్రామ హద్దులను దాటి ఆ శిశువును తీసికొని వెళ్లుటకు బద్ధులైయుండరు. మరియు యే పురుషుడున్నూ తాను టీకాలు వేయించుకొనుటకు గాని, లేక పరీక్షార్థము గాని తాను వాసము చేయు రివిన్యూ సరిహద్దులను దాటి వెళ్లుటకు బద్ధుడు కాడు.

5. ఎప్పుడైన అరక్షితపురుషుని యొక్క లేక శిశువుయొక్క నివాస స్థలము,

(a) ఈ విధులు వర్తించు డిస్ట్రిక్టుబోర్డు లేక పంచాయతీ అధికారహద్దులలో యున్న ఒక ప్రదేశము నుండి మరియొక ప్రదేశముకు, లేక

(b) ఆ హద్దులలోపలి ఒక ప్రదేశమునుండి ఆహద్దులవెలుపలయున్న మరియొక ప్రదేశమునకు, లేక

(c) ఆ హద్దుల వెలుపలయున్న ఒక ప్రదేశమునుండి ఆహద్దులలోపలయున్న యొక ప్రదేశమునకు మార్చినపుడు ఆ పురుషుడుగాని, లేక ఆ శిశువుయొక్క తల్లిదండ్రులు, లేక గార్డియన్ గాని అట్లు వాసస్థలము మార్చిన తేదీనుండి నెలదినముల లోగా ఆ గ్రామ హెడ్మనుకుగాని, లేక యీ విషయములో డి॥ బో॥ ప్రె॥ వల్ల అధికారము పొందిన ఆఫీసరుకుగాని అట్టి పురుషుని యొక్క, లేక శిశువుయొక్క నూతన వాసస్థలముయొక్క పూర్తి వివరములు తెలుపవలెను.

ఆ గ్రామహెడ్మను, లేదా పైనచెప్పబడిన ఆఫీసరు యీ వివరముల నన్నిటిని నూతన వాసస్థలముపై అధికారము గల స్థానిక అధికారివర్గమునకు తెలుపవలెను.

6. (1) అరక్షిత పురుషుడుగాని, శిశువుగాని టీకాలు వేయించుకొనుటకు తగిన ఆరోగ్యస్థితిలో లేనట్లు కనుపడినయెడల, అట్టి పురుషునికి లేక అట్టిశిశువుయొక్క తల్లిదండ్రులు లేక గార్డియన్ కు వాక్సినేటరు అట్టిపురుషుడు లేక శిశువు టీకాలువేయించుకొనుటకు తగిన ఆరోగ్యస్థితిలో లేనట్లు సర్టిఫికెట్టు యివ్వవలెను. అట్టి సర్టిఫికెట్టు 3 మాసములకు మించకుండా అందులో ఉదహరించబడిన కాలమువరకు అమలులో యుండును. కాని అట్టి పురుషుడుగాని, లేక శిశువుగాని తరువాతకూడా టీకాలు వేయించుకొనుటకు తగియుండనియెడల క్రొత్తసర్టిఫికెట్టు ఇవ్వవచ్చును. ఆసర్టిఫికెట్టులో యెందువల్ల తగియుండలేదో కారణము నిర్దేశింపబడవలెను.

(2) అరక్షిత పురుషుడుగాని, శిశువుగాని, టీకాలు వేయించుకొనగలిగిన ఆరోగ్యము కలిగియుండిన వాక్సినేటరు అట్టివారికి వెంటనే టీకాలువేసి ఆయాసందర్భము లనుబట్టి ఆ పురుషునకుగాని, లేక ఆశిశువుయొక్క తల్లిదండ్రులు, లేక గార్డియన్ కు గాని టీకాలువేసిన తారీఖున్నూ, గ్రామమునసబు టముకుమూలముగా గాని, నోటీసు జారీచేయుట మూలముగాగాని తెలియజేయు, పరీక్షార్థము నిర్దేశింపబడిన ఒకస్థలములో తారీఖున యిన్ని గంటలకు హాజరు కావలసినదని తెల్పు మెమోరాండము (చీటీ) యివ్వవలెను.

7. (1) పైన చెప్పబడిన స్థలములో, నిర్దేశింపబడిన తారీఖున, నిర్దేశింపబడిన కాలములో పరీక్షార్థము టీకాలు వేయించుకొన్న పురుషుడు హాజరు కావలెను. లేక టీకాలు వేయించుకొన్న శిశువు హాజరు పెట్టబడవలెను.

(2) పరీక్షాధికారికి టీకాలు వేయడము జయప్రదముగాయున్నట్లు కనుపడిన యెడల ఆ సంగతి నుదహరించుచు ఆ పురుషునికి గాని, లేక ఆ శిశువుయొక్క తల్లిదండ్రులు, లేక గార్డియన్‌కు ఒక సర్టిఫికెట్టు యివ్వవలెను.

(3) టీకాలు సరిగా అంటని సందర్భములో తనకు యుక్తమని తోచే యెడల ఆపరీక్షాధికారి ఆపురుషునకుగాని, లేక శిశువునకుగాని వెంటనే తిరిగి టీకాలు వేయించుకోవలసిన దనియు, మరియు 1 వ సబ్ రూలులో చెప్పబడిన ప్రకారము పరీక్షకు హాజరు కావలసినదనియు ఉత్తరువు చేయవచ్చును.

8. పరీక్షాధికారి అరక్షిత పురుషుడు గాని, శిశువును గాని, ఆ వివరలో మూడు పర్యాయములు టీకాలు వేయబడినను అంటక అట్టివానికి టీకాలు అంటవని తలచే యెడల ఆ సంగతి ఉదహరించుచూ ఒక సర్టిఫికెట్టు యివ్వవలెను.

9. ఒక అరక్షిత పురుషుడుగాని, శిశువుగాని జిల్లాబోర్డు వల్ల నియమింపబడని వాక్సినేటరు వల్ల టీకాలు వేయించుకొన్న యెడల అట్టి పురుషుడు లేక అట్టి శిశువు యొక్క తల్లిదండ్రులు, లేక గార్డియన్ డి॥ హె॥ ఆ॥ గారికి గాని లేక వారివల్ల అధికారము పొందిన ఆఫీసరుకుగాని అట్లు టీకాలు వేయించుకొన్న 15 దినముల లోగా ఆ వాక్సినేటరు వద్దనుండి టీకాలు జయప్రదముగా వేయబడినట్లు సర్టిఫికెట్టు పంపవలెను.

10. డి॥ హె॥ ఆ॥ గాని, డి॥ బో॥ ప్రె॥ గాని యీ విధుల క్రింద యివ్వబడిన యే సర్టిఫికెట్టు నయినా అట్టిది అక్రమముగా యివ్వబడినదని గాని లేక అక్రమముగా తీసికొన బడినదనిగాని, తనకు తృప్తిగా ఋజువు అయినయెడల, ఆ సర్టిఫికెట్టును రద్దు చేయవచ్చును. అటు తరువాత ఆసర్టిఫికెట్టు చెల్లకూడదు. అట్లు రద్దుచేసినట్టు అరక్షిత పురుషునకు గాని, లేక శిశువుయొక్క తల్లిదండ్రులు లేక గార్డియన్‌కు గాని వెంటనే తెలియ చేయవలెను

11. లోకల్ బోర్డువారి ఉద్యోగములోనున్న యే వాక్సినేటరునూ యీ విధుల ప్రకారము టీకాలు వేసినందుకుగాని, సర్టిఫికెట్టు యిచ్చినందుకుగాని యెట్టి రుసుము గాని ప్రతిఫలము గాని పుచ్చుకొన కూడదు.

కాని డి॥ హె॥ ఆ॥ గాని, డి॥ బో॥ ప్రె॥ గాని లేక యీ విషయములో వారి వల్ల అధికారమును పొందిన యితర అధికారిగాని ఎవరైనా దరఖాస్తు చేసికొన్నమీదట.

లోకల్ బోర్డువారు నిశ్చయించిన రుసుము చెల్లించినమీదను యీవిధులలో నిర్దేశింపబడినప్రకారము టీకాలు వేయుట లేక పరీక్షించుట ఆ పురుషునియొక్క యింటివద్ద చేయవలసినదిగా వాక్సినేటరుకు ఉత్తరువు చేయవచ్చును.

12. (1) డి॥హె॥ఆ॥ గాని, డి॥బో॥ప్రె॥ లేక వారివల్ల అధికారము పొందిన యితర అధికారి గాని, 3 వ విధిలో చెప్పిన ప్రకారము వాక్సినేటరు వెళ్ళినట్టి యీ విధులు వర్తించు ఒక రెవిన్యూ గ్రామములోయున్న ఒకయింటిలో అరక్షితపురుషుడు గాని, లేక శిశువుగాని యున్నట్లు నమ్ముటకు కారణమున్న యెడల,

(a) అట్టిపురుషుని ఉదయము 6గం॥లకు, సాయంత్రం 6గంటలకుమధ్య పరీక్షార్థము హాజరై తన వయస్సు, తల్లిదండ్రులపేర్లు, జన్మస్థలము, తాను ఆ ప్రదేశములో వాసము చేయుచున్న కాలమున్ను తెలియ జేయవలసినదిగాను, లేక

(b) ఆశిశువుయొక్క తల్లిదండ్రులుగాని, లేక గార్డియన్ గాని తమసంరక్షణలో యుండి ఆ యింటిలోయున్న అందరు శిశువులను ఉదయం 6 గంటలు సాయంత్రము 6 గంటలు మధ్య పరీక్షార్థము హాజరుపరచవలసినదిగాను; వారలవయస్సు, తల్లిదండ్రుల పేర్లు, ఆ ప్రదేశములో వాసము చేయుచున్న కాలపరిమితియు చెప్పవలసిన దనిన్ని అడుగవచ్చును.

(2) (a) డి॥ హె॥ ఆ॥ గాని, లేక డి॥ బో॥ ప్రె॥ లేక వారివల్ల అధికారము పొందిన యితర అధికారి టీకాలు వేయుటకు తగిన స్థితిలోనున్న పురుషుడు గాని, శిశువుగాని యున్నట్లు తెలుసుకొన్న యెడల, లేక

(b) సబ్ రూలు (1) ప్రకారము కోరబడినన్ని యే పురుషుడైనను వచ్చుటకు నిరాకరించిన గాని, లేక యే శిశువుయొక్క తల్లిదండ్రులు లేక గార్డియన్ తన సంరక్షణలోయున్న యే శిశువునైనను పరీక్షార్థము హాజరు పరచుటకు నిరాకరించిన, లేక

(c) పరీక్షానంతరము యే పురుషుడైన లేక శిశువైన రక్షితుడుగా లేడనిన్ని, టీకాలు వేయించుకొనగలిగిన స్థితిలో నున్నాడని తనకు ఋజువు అయిన యెడల అట్టి పురుషునికి లేక శిశువుయొక్క తల్లిదండ్రులు లేక గార్డియనుకుగాని ఆపురుషుడు, లేక శిశువు నోటీసులో నిర్దేశింపబడినకాలములో నిర్దేశింపబడినస్థలములో టీకాలు వేయించుకొనవలసినదిగా నోటీసుఅందజేయవలెను, లేక అట్టి పురుషుడు లేక తల్లిదండ్రులు లేక గార్డియను నివసించియుండు యింటికి అంటించవలెను. అట్లు నోటీసు అందజేసిన లేక నోటీసు యింటికి అంటించిన పురుషుడు లేక ఆతల్లిదండ్రులు లేక గార్డియన్ ఏవాక్సినేటరు వద్దనుండియైనా ఆపురుషునకుగాని, శిశువునకుగాని అదివరలో జయప్రదముగా టీకాలు వేయబడినట్లుగాని, లేక టీకాలు వేయుటకు తగినస్థితిలోలేడనిగాని లేక టీకాలు అంటవని వ్రాసినిగాని సర్టిఫికెట్టు దాఖలు చేసిననే తప్ప లేనియెడల పై ఉత్తరువు ప్రకారము నడచుటకు బద్ధులై యుందురు.

13. ఈ విధులలో చెప్పబడిన నిబంధనలు అరక్షితుడైన యే పురుషుడు, లేక శిశువునకు తిరిగి టీకాలు వేయించుకొనుటకు కూడ వర్తించును.

14. పైన చెప్పబడిన యేవిధులనైన ఉల్లంఘించినట్లు నేరస్థాపనఅయినయెడల వారికి,

(a) రు 20 ల వరకు జుల్మానా విధించబడవచ్చును.

(b) అట్లు ఉల్లంఘించుట వరుసగాయున్న యెడల, మొదటిసారి ఉల్లంఘించినందుకు శిక్షవిధించబడిన తరువాత లేక అట్లు ఉల్లంఘించుట మానవలసినదిగా జిల్లా బోర్డు ప్రెసిడెంటు వద్దనుండి వచ్చిన నోటీసు పుచ్చుకొన్న తరువాత జుల్మానా దినము 1 కి రు 5-0-0 లు విధించబడవచ్చును. అయితే యే సందర్భములోను కూడా అట్టి జుల్మానా రు 100 లు మించకూడదు.

# నాలుగవ భాగము

## గ్రామ కోర్టుల ఆక్టుకు సంబంధించిన యితర గవర్నమెంటు ఆర్డర్లు

(i)

### గ్రామకోర్టులచే వసూలుచేయబడిన కోర్టు రుసుములకు లెక్కలను చెప్పుటకు అనుసరింపబడవలసిన చర్య.

(1) 1920వ సంవత్సరపు 2వ మదరాసు ఆక్టుచే సవరింపబడినట్లుండు 1888వ సంవత్సరపు మదరాసు గ్రామకోర్టుల ఆక్టు ననుసరించి జారీచేయబడినట్టిన్ని, 1932 వ సంవత్సరము మార్చి నెల 2వ తేదీగల (లాజనరల్) జి.ఓ నె 572 రులో జారీచేయబడినట్టిన్ని విధులలో 57, 58, 60, 61 విధుల ననుసరించి విధింప బడతగిన యావత్తు రుసుములున్ను గ్రామకోర్టులచే వసూలు చేయబడవలెను. మరియు వాటిని చెల్లించు మనిషికి ఒక రశీదు యివ్వబడవలెను.

(2) అట్లు వసూలుచేయబడిన రుసుములు, సాధ్యమైనంత శీఘ్రముగా గ్రామ మునసబు (గ్రామపెత్తనదారు) కు అందజేయవలెను. ఆతడు ఆ మొత్తమును తాను అప్పుడు పంపుచున్న భూమిశిస్తు లేక ఇతర వసూళ్లతోగాని లేక తనకు సొమ్ము యివ్వబడిన తరువాత తాలూకా ఆఫీసుకు పోవుచున్న ముదటి గ్రామనౌకరు ద్వారాగాని, సబ్ ట్రెజరీకి పంపవలెను. గ్రామమునసబు, గ్రామకోర్టు ప్రెసిడెంటు అయినను పైన చెప్పినవిధి వర్తించును; అనగా ఆతడు సొమ్మును తాను అప్పుడు పంపుచున్న యితర సొమ్ముతోగాని లేక తాలూకాఆఫీసుకు పంపబడుచున్న ముదటి గ్రామనౌకరుద్వారాగాని పంపవలెను. రుసుములు సివిల్ కేసులకు సంబంధించియున్నవో లేక క్రిమినల్ కేసులకు సంబంధించియున్నవో ఆయాసంగతికి తగినట్టు 17అడ్మినిస్ట్రేషను ఆఫ్ జస్టిస్ (న్యాయపరిపాలన) - రొక్కరూపముగా వసూలుచేయబడిన రుసుములు - సివిల్ కేసులలో గ్రామకోర్టులచే వసూలుచేయబడిన రుసుములు — క్రిమినలు కేసులలో గ్రామకోర్టులచే వసూలుచేయబడిన రుసుములు — అను పద్దుక్రింద ప్రొవిన్షియల్ (రాష్ట్రీయ) రివిన్యూలకు జమ కట్టబడవలెను.

నోటీసులు, వారంటు అమలుచేసినందుకు వాస్తవముగా వసూలైన రుసుముల విషయములో మనిషి 1కి నెలకు రు 12-0-0 లకు మించకుండా నోటీసులు, వారంటు

అమల్లో జరిపిన ప్రాసెస్ సర్వరులకు యివ్వబడ వచ్చును. ఖర్చుకంటే హెచ్చుగా ఒక నెలలో యే మొత్తమైన వసూలైన, తర్వాత మొత్తము వచ్చిన నెలలో ఖర్చు చేయుటకు ప్రత్యేకించబడవలెను. అఫీషియల్ సంవత్సరము ఆఖరున హెచ్చుగా యున్న మొత్తమును ట్రెజరీకి ఇరసాలు చేయవలెను.

ఒక సంవత్సరములో యెప్పుడైనా ట్రెజరీకి ఇరసాలుచేయకుండా గ్రామకోర్టు ప్రెసిడెంటువద్ద రు 15-0-0 లు మించిన మొత్తము యుండకూడదు.

(3) రుసుములు వసూలుచేయబడిన తేదులను, అవి ట్రెజరీకి ఇరసాలు చేయబడిన తేదులను . గనపరచు ఒక క్యాషు (రొక్కం)పుస్తకమును, ఒక ఇరసాలు పుస్తకమును గ్రామకోర్టు ఉంచవలెను.

ఆ (రొక్కం) క్యాషు పుస్తకము అన్నివసూళ్ళను, జమపైపున వాటిలో నుండి యివ్వబడిన మొత్తములను ఖర్చుపైపున చూపవలెను. ట్రెజరీకి ఇరసాలు చేయబడిన మొత్తములుకూడ ఖర్చుపైపున చూపబడవలెను.

(4) దేనివిషయమున ఒక రుసుము విధింపబడతగియున్నదో అట్టిప్రతిప్రాసెస్సు పైనను దానికి తగిన రుసుము కట్టబడెనని గ్రామకోర్టుచే ఎండార్సు చేయబడవలెను. మరియు ప్రతి సందర్భములోను పైకము మొత్తము స్పష్టపరుపబడవలెను

(5) కడచిన అఫీషియల్ సంవత్సరములో సివిల్ కేసులలో గ్రామకోర్టులచే వసూలుచేయబడి ట్రెజరీకి ఇరసాలు చేయబడిన కోర్టు రుసుములను గురించి, ప్రతి సంవత్సరమందు మే నెల 12 వ తేదీనిగాని, అంతకు పూర్వముగాని డిస్ట్రిక్టు ట్రెజరీ ఆఫీసరు డిస్ట్రిక్టు జడ్జికి ఒక స్టేటుమెంటును పంపవలెను. క్రిమినల్ కేసులవిషయమున ఇటువంటి స్టేటుమెంటే ఒకటి డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుకు పంపబడవలెను.

వగా:— సివిలు కోర్టుల విచారణాధికారపు సరిహద్దులు డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుల విచారణాధికారపు సరిహద్దులతో సరిసమానముగా అంతముకానట్టి సందర్భములో ఆ యా కోర్టులకు ట్రెజరీ ఆఫీసర్లు వేర్వేరు లెక్కలనువుంచి, సంబంధముగల డిస్ట్రిక్టు జడ్జికి లేదా డిస్ట్రిక్టు మేజిస్ట్రేటుకు రిటర్నులను పంపవలెను.

(6) డిస్ట్రిక్టు కలెక్టరు తన డిస్ట్రిక్టులోని గ్రామ కోర్టులచే వుంచబడు లెక్కలను అర్ధ సంవత్సరమున కొకసారి తన తాబేదారీ ఉద్యోగస్థులచే తనిఖీ చేయించుటకు యేర్పాటు చేయవలెను.

వెనుకటి విధి ప్రకారము పంచాయతీ కోర్టులు యుంచిన లెఖ పుస్తకమును తనిఖీ చేయునప్పుడు తహశ్శీలుదార్లు డిప్యూటీ తహశ్శీలుదార్లు పంచాయతీ కోర్టుల యొక్క సివిల్ క్రిమినల్ పనియొక్క సామాన్య పద్ధతులను తనిఖీ చేయవలెను.

## II

### కోర్టు రుసుములు ఆక్టుక్రింద జి. ఓ. లు.

(1) కోర్టు రుసుముల ఆక్టు 1, 2 షెడ్యూళ్ళలో చెప్పబడిన రుసుములను యావత్తుగాని, వాటిలో కొన్నిటినిగాని తగ్గించుటకు లేదా వదలుకొలుటకు హక్కు యున్న, సదరు ఆక్టు సె. 35 ననుసరించి లోకల్ గవర్నమెంటువారు తా 11-10-21 న ప్రచురించిన ఫోర్టు సెయింటు జార్జి గెజెటు 1008-1011 పేజీలలో యున్న జి. ఓ. 358 లోని 36వ అయిటముప్రకారము గ్రామకోర్టులలో దాఖలు చేయబడు దరఖాస్తులు పిటీషనులు, గ్రామకోర్టులలో దాఖలుచేయు, గ్రహింపబడు లేదా రికార్డు చేయబడు లేక గ్రామకోర్టువారివల్ల యివ్వబడు అన్ని నకళ్ళకు కోర్టు రుసుముల ఆక్టు 1, 2 షెడ్యూళ్ళ ప్రకారము యివ్వవలసిన యావత్తు రుసుములను వదలుకొనియున్నారు.

(2) పైనచెప్పిన జి. ఓ. 358 అయిటము 36 ను 31-1-22 తేదీన ప్రచురించిన ఫోర్టుసెయింటుజార్జిగెజెటు 98-99 పేజీలలో జి. ఓ. 61 ప్రకారము మదరాసు గ్రామకోర్టుల ఆక్టుప్రకారము గ్రామకోర్టులలో దాఖలు కాబడే ప్లయింట్లు పైన రుసుములనుకూడా వదలుకొనియున్నారు.

(3) దరిమిలా తిరిగి జి. ఓ. 358 అయిటము 36 ను 17-7-23 తేదీగల జి. ఓ. 431 వల్ల గ్రామకోర్టుల ఆక్టుక్రింద యేర్పడిన పంచాయతీ కోర్టులలో దాఖలు కాబడే ప్లయింట్లు ఫిర్యాదులపైని చెల్లించవలసిన రుసుములను వదలుకొనియున్నారు.

(4) పైన చెప్పబడిన జి. ఓ. 358, అయిటము 37 వల్ల గ్రామకోర్టులలో యితరకోర్టులయొక్క జడ్జిమెంట్లు, డిక్రీలు,యితర రికార్డుల పబ్లిక్ కాపీలు దాఖలు చేసేయెడల వాటికి కోర్టు రుసుముల ఆక్టు 1, 2 షెడ్యూళ్ళలోచెప్పబడిన యెట్టిరుసుము లున్నా చెల్లించవలసిన అవుసరములేదు. గ్రామకోర్టులలో దాఖలు చేయబడు యెట్టి పిటీషనులు, దరఖాస్తులు, నకలుదరఖాస్తులు, ప్లయింట్లు ఫిర్యాదులకు యెట్టి రుసుము లున్నా చెల్లించవలసిన అవుసరములేదు. గ్రామకోర్టులచే యివ్వబడిన యే నకళ్ళు అయినను యితర కోర్టులలో దాఖలుచేసే యెడల వాటిపైన సదరు కోర్టులలోకోడ యెట్టి రుసుములున్నా చెల్లించవలసిన అవుసరములేదు.

## III

### కోర్టు ఉండే స్థలము.

జి.ఓ. నెం. 2356 ర (లా జనరల్) న 26-9-24 ప్రకారము చావడి, ఏదైన బహిరంగస్థలము, లేదా ఏదైనా ఫైద్దయింటికి చేరిన వసారా, లేదా మహల్, లేదా పాక కోర్టు జరిగించుటకు ఉపయోగించబడవచ్చును.

# గ్రామ కోర్టులలో దాఖలు కాబడు ప్లయింట్లుపై చెల్లించవలశిన కోర్టుఫీజు రుసుము



లోగడ అమలులోయున్న మద్రాస్ కోర్టుఫీజు ఆక్టు సె 19 క్లాజు 5 ప్రకారము గ్రామ కోర్టులలో దాఖలు కాబడు ప్లయింట్లకు యెట్టి కోర్టు ఫీజు చెల్లించవలశిన అగత్యము లేదు.

అటు తరువాత పంచాయతీ కోర్టులు యేర్పడిన తరువాత పంచాయతీ కోర్టులలో దాఖలు కాబడు ప్లయింట్లు చార్జీలకు ఎట్టి కోర్టుఫీజు చెల్లించ వలసిన అవసరము లేదని మద్రాస్ కోర్టుఫీజు ఆక్టు సె 35 క్రింద నోటిఫి కేషన్లు No. 61 dated 31-1-22, G. O. No. 421, dated 17-7-23 వల్ల మినహాయింపబడినవి.

ఇటీవల ఆంధ్ర రాజ్యమునకు వర్తించునట్లు ఆంధ్ర కోర్టుఫీజు మరియు సూట్సు వాల్యుయేషను ఆక్టును జారీచేసి దానిని ది 1-5-56 నుండి అమ లులో పెట్టిరి.

సదరు ఆక్టు సె 68 క్రింద రాజ్య గవర్న మెంటు గ్రామ కోర్టులలో (అనగా గ్రామమునసబు కోర్టులు, పంచాయతీకోర్టులు (పంచాయతీకోర్టులైన అన్ని పంచాయతీలు) దాఖలుకాబడు ప్లయింటు విలువ రు 5-0-0 లకు మించినయెడల అట్టిప్లయింటుకు 1-0-0 రు కోర్టుఫీజురుసుము చెల్లించవలెనని ఆర్డరును జారీచేసిరి. ఆ ఆర్డరు యీా దిగువ యివ్వబడినది అది 8-11-56 తేదీ ఆంధ్రప్రదేశ్ గెజిటులో ప్రకటింపబడి ఆ తేదీ నుండి అమలులోనికి వచ్చినది. ఆ తేదీనుండి అన్ని గ్రామ కోర్టులలో (పంచాయతీలు, పంచా యతీకోర్టులు సహా) ప్లయింటు విలువ రు 5—0—0 లు పైనయున్న ఒక్కొక్క ప్లయింటుకు రు 1—0—0 చొప్పున రుసుము వసూలు చేయవలెను.

## హోం డిపార్టుమెంటు (ఆంధ్రా)

## ఆంధ్ర కోర్టుఫీజు మరియు సూట్సు వాల్యుయేషను ఆక్టు క్రింద రుసుముల తగ్గింపు

జి. ఒ. పి. నెం. 2513 (హోం) కోర్టులు-I 16-10-56

నెం. I.

1956 సం॥పు ఆంధ్ర కోర్టుఫీజు ఆక్టు మరియు సూట్సు వాల్యుయేషన్ ఆక్టు (1956 సం॥పు 7వ ఆంధ్ర ఆక్టు) సె 68 క్రింద యివ్వబడిన అధికారములను చెలాయించుచూ ఆంధ్ర గవర్నరుగారు పై ఆక్టు షెడ్యూలు I ఆర్టికల్ (1) (సి) క్రింద ఒకష్లయింటు, లేదా యెదురు దావాయున్న ఆన్సరుకు లేక యితర దస్తావేజుకు తగాయిదా అంశము యొక్క మొత్తము లేదా విలువ రు 5 లకు మించినపుడు ఒక రూపాయికి యిందుమూలముగా తగ్గించుచున్నారు.

ఈ నోటిఫికేషను ఆంధ్ర గెజెటులో ప్రకటింపబడిన తేదీనుండి అమలులోనికి వచ్చినట్లు యెంచబడును.

ఆంధ్రప్రదేశ్ గెజెటు పార్టు I ది 8-11-56 లో
యీ నోటిఫికేషను ప్రకటింపబడినది.

# IV

## చిల్లర ఖర్చులు.

1. పంచాయతీ కోర్టులకు వారి స్వంతముగా కావలసినట్టి కాగితములు వగైరాలు తహశ్శీలుదారు ద్వారా సప్లయి చేయబడును. (1922 సం॥ మార్చి 25 తాకీఖు గల జి. ఓ. మిస్. నెం 590 రు).

2. గ్రామ కోర్టులకు ఒక చాపయున్నూ, ఒకచిన్న ఏటవాలు డెస్కున్నూ, రికార్డులను ఉంచుటకు ఒక కావడి పెట్టెయున్నూ యివ్వబడును.

(1922 సం॥ సెప్టెంబరు 26 తేదీ (లాజనరల్) జి. ఓ. నెం 2356 రు)

3. బడ్జెటు ఏర్పాటుకు లోబడి కలెక్టరు తనకు యుక్తమని తోచే యెడల ముఖ్యమైన గ్రామకోర్టులకు యీ క్రిందిప్రమాణము ప్రకారము బల్లలు వగైరా సామానులు సప్లయి చేయవచ్చును.

1 కుర్చీ, 1 బెంచి, 1 చిన్నబల్ల మరియు 1 రికార్డుపెట్టె.

# V

## గవర్న్మెంటు ఆఫీసర్లుగాని, పంచాయతీకోర్టు ప్రెసిడెంట్లకు ప్రయాణపు ఖర్చులు యివ్వడమును గురించి

జి.ఓ. నెం 110 (ఫైనాన్షియల్) డి 11-2-25:—గవర్న్మెంటు నౌకర్లుగాని, పంచాయతీకోర్టు ప్రెసిడెంట్లు తమ ఉద్యోగధర్మములో డిస్ట్రిక్టు మునసబు యెదుట హాజరైనప్పుడు, తమకు వారి స్వంతముగా అయిన ప్రయాణపు ఖర్చులకు రెండుప్రతులతో బిల్లును దాఖలుచేయవచ్చును. డిస్ట్రిక్టు మునసబు సదరు రెండుప్రతుల పైన సంతకము చేసి ప్రెసిడెంట్లకు యిచ్చివేయవలెను. ప్రెసిడెంట్లు ఆ బిల్లులను సొమ్ము నిమిత్తము ట్రెజరీలో దాఖలుచేసినప్పుడు ట్రెజరీ ఆఫీసరు రెండవ ప్రతిపైన సొమ్ము యిచ్చిన తాకీఖు నమోదుచేసి దానిని డిస్ట్రిక్టుమునసబుకు పంపవలెను. అప్పుడు డిస్ట్రిక్టుమునసబు ఆ బిల్లును తన ఆఫీసు A రిజిష్టరు 24 (2) ముఫిజిల్, సివిల్, సెషన్సు కోర్టు 1A (ఓపెన్)లో రికార్డు చేసుకొనవలెను.

# VI

## రికార్డులు నాశనముచేయు విధులు.

### i

రికార్డులు నాశనముచేయు ఆక్టు క్రింద చేయబడిన 5 (a) విధి ప్రకారము గ్రామకోర్టుల ఆక్టు క్రింద చేయబడిన 54 విధి ననుసరించి డిస్ట్రిక్టు మునసబుకు పంప

వలపిన పంచాయతీకోర్టుల రికార్డులుపంపబడిన తరువాత ఒకవారము దాటినతరువాత తక్కిన రికార్డులను నాశనము చేయవలెను. అయితే అట్టి నాశనము చేయుటనుగురించి ముందుగా దండూరా మూలముగా గ్రామములో ప్రచురపరచవలెను.

ii

ఈ దిగువ నమోదుచేయబడిన రిజిష్టర్లు, రికార్డులు, ఆ కేసులు పూర్తియైన తేది నుండి దిగువ చెప్పబడిన కాలపరిమితి దాటిననతరువాత నాశనముచేయబడవలెను.

| దస్తావేజుల స్వభావము............ | ఎన్ని సంవత్సరములు యుండవలసినది. |
|---|---|
| (1) గ్రామకోర్టుల, పంచాయతీకోర్టుల దావాల రికార్డులు | 3 సం॥లు |
| (2) గ్రామమునసబులు, పంచాయతీకోర్టుల క్రిమినల్ కేసులలోని రికార్డులు అన్ని | 1 సం॥ |
| (3) గ్రామమునసబులు పంచాయతీకోర్టులలోని క్రిమినల్ కేసులలో దాఖలు చేయబడిన దస్తావేజులు | 3 సం॥లు |
| (4) గ్రామకోర్టుల దావాల రిజిష్టర్లు | 12 సం॥లు |
| (5) గ్రామమునసబు, పంచాయతీకోర్టుల క్రిమినలు కేసుల రిజిష్టర్లు | 5 సం॥లు |

# 5 వ భాగము

## వడ్డీకి సంబంధించిన ఆక్టుల అంశములు

### I

### మదరాసు వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు 1938 సం॥పు 4 వ ఆక్టు

(1) ఈ ఆక్టు ఉద్దేశములు, కారణములయొక్క వివరములు:- ఈ రాష్ట్రము లోని ప్రధాన పరిశ్రమయగు వ్యవసాయమును పునరుద్ధారణ చేయుటయే ఈ ఆక్టు యొక్క ఉద్దేశము. ప్రత్యక్షముగానో, పరోక్షముగానో యావత్తు తరగతుల ప్రజల సంపద వ్యవసాయదారుని ఆర్థిక క్షేమముపైన ఆధారపడి యున్నది. విషాదకరమైన వాని ప్రస్తుత దుస్థితి అందరకును తెలిసియే యున్నది. ఒక వైపున వాని ఆదాయము తగ్గిపోవుచున్నది. మరియొక వైపున వాని ఋణముమీది వడ్డి తరుచుగా అన్యాయమైన రేటు చొప్పున నానాటికి స్థిరముగా పెరిగిపోవుచున్నది. అతని దుస్థితియొక్క ముఖ్య లక్షణము ఋణభారముయొక్క ఫలితము. జనుల ఆహారమును ఉత్పత్తి చేయువారిని యిట్టి దుర్భరమైన భారమునుండి విముక్తులను చేయుట ప్రజలయెడల తనకుగల బాధ్యత లను గుర్తించు ఏ నవీన ప్రభుత్వమునకైనను విధాయకధర్మము. వ్యవసాయదారులకు వంశపారంపర్యముగా వచ్చుచున్న నైపుణ్యము పనిపాటలు లేక వ్యర్థమై వ్యవసాయ వృత్తిని యెరుగనివారికి భూములు సంక్రమింపనిచ్చుట ప్రభుత్వమునకు ధర్మములేదు. రాజీపద్ధతులును, ఇతర ఐచ్ఛిక పద్ధతులును నిష్ప్రయోజనములైనందున నిర్బంధ సూత్రమును అనుసరించుట అవసరమగుచున్నది.

ఈ పద్ధతులపైని శాసనము రానున్నదని గ్రహించి వ్యవసాయదార్లకు దారుణ మైన దుస్థితి కలిగించుచూ నిర్బంధ చర్యలను ఋణదాతలు తీసుకొనుచున్నట్లు ఫిర్యాదులు విస్తారముగా వచ్చియున్నందున, 1-10-37 తేదీనుండి ఎవరిపైన ఎట్టిచర్యలు తీసుకొనబడినవో అట్టి ఋణస్థులకుకూడ ఈ శాసనముయొక్క లాభము కలుగజేయ వలెనని ఉద్దేశింపబడుచున్నది.

(2) ఈ ఆక్టు ఫోర్టుసెంటుజార్జి గెజెటులో 22-3-1938 తేదీన ప్రచురింపబడి ఆ తేదీనుండి అమలులోనికి వచ్చినది.

ఈ ఆక్టు లాభములను పొందదగు వ్యవసాయదారుడు వగైరా మాటలకు ఈ క్రిందివిధముగా నిర్వచనమీయబడినది.

నిర్వచనములు. 3. ఈ ఆక్టులో విషయమునకుగాని పూర్వోత్తర సందర్భములకుగాని విరుద్ధముగా నేదైన నున్న నేతప్ప,

(i) "మనిషి" అనగా ఒక వ్యక్తికి అనిఅర్థము. మరియు దీనిలో ఒక అవిభక్త హిందూకుటుంబము, మరుమక్కతాయము లేదాఅళియ సంతాన తర్వాడు లేదా తావళి చేరును. కాని సంఘీభూతము చేయ బడిన ఒక సంస్థ, ధర్మ లేదా మత, సంబంధమైన సంస్థ, లేదా సంఘీ భూతము చేయబడని కంపెనీ లేదా అసోసియేషను (సంఘము) చేరదు.

(ii) "వ్యవసాయదారుడు" అనగా—

(a) రాష్ట్రీయ గవర్నమెంటువారిచే (షేష్‌కష్, క్విట్‌రేంటు చేరియున్నట్లు భావింపబడవలసిన) భూమిశిస్తు విధింపబడిన ఒక మనిసి పాలిటి లేదా కంటోన్మెంటులోపలనుండు భూమికానట్టి, లేదా గవర్నమెంటువారిచే చేయబడిన, ఖాయపరుపబడిన లేదా అంగీకరింప బడిన ఒక గ్రాంటుననుసరించి పన్ను లేకుండ ఉంచుకొనబడియున్న, మదరాసు రాష్ట్రములోని యెట్టి వ్యవసాయ లేదా తోటభూమిలో విక్రయించుట కైన హక్కునుకలిగిన; లేదా

(b) అట్టి భూమిలో, 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టు ననుసరించి ఒక భూస్వామి క్రింద పాయకారీ రైతుగా, రైతుగా లేదా లోపాయకారీ రైతుగా బాధ్యతకలిగిన, లేదా

(c) అట్టిభూమిలో, 1929 వ సం॥పు మలబారు టెనన్సీఆక్టులో అంగీకరింపబడిన బాధ్యతను కలిగిన; లేదా

(d) అట్టి భూమిని (a), (b) లేదా (c) సబు క్లాజులలో నిర్దేశింప బడిన ఏమనిషివద్దనుండియైన గుత్తకు తీసుకొన్న లేదా అట్టి భూమి తాలూకు ఒక లోగుత్తదారు అగు

ఒక మనిషి అని అర్థము:

అయితే ఒక మనిషి—

(A) 1938 వ సం॥ మార్చి 31 వ తేదీతో అంతమగు రెండు ఆర్థిక సంవత్సరములలో దేనిలోనైన, 1922 వ సం॥పు ఇండియా దేశపు నచ్చుబడిపన్ను ఆక్టు ననుసరించి లేదా యెట్టి యిండియాదేశపు సంస్థానముయొక్కయైన లేదా విదేశప్రభుత్వముయొక్కయైన నచ్చుబడి పన్ను చట్టముల్ననుసరించి నచ్చుబడిపన్ను విధింపబడియున్నను; లేదా

(B) 1937 వ సం॥ అక్టోబరు 1 వ తేదీకి అవ్యవహితముగా పూర్వముందు నాలుగు అర్ధసంవత్సరములలోను 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టు, 1919 సం॥పు మదరాసు షహరు మునిసిపలుఆక్టు, 1924 వ సం॥పు కంటోన్మెంటుల ఆక్టు, లేదా బ్రిటిషు ఇండియాలోని ఏ ఇతర రాష్ట్రములోనైన, యే స్వదేశ సంస్థానములోనైన లేదా ఇండియాదేశములోని యే విదేశ రాజ్యము లోనైన మునిసిపలు లేదా స్థానిక సంస్థలను పరిపాలించు యెట్టి చట్ట మునుగాని ననుసరించి, లేదా 1930 వ సం॥ ఆగష్టు 26 వ తేదీకి పూర్వము ఒక యూనియనుగా నుండిన ఒక పంచాయితీలో 1920 వ సం॥పు మదరాసు లోకలు బోర్డుల ఆక్టు ననుసరించి వ్యవసాయము కానట్టి యితర వృత్తినుండి వచ్చిన ఆరువందల రూపాయలకంటె యెక్కువయైన అర్ధ సంవత్సర ఆదాయముమీద వృత్తిపన్ను విధించ బడియున్నను, లేదా

(C) 1937 వ సం॥ అక్టోబరు 1 వ తేదీకి అవ్యవహితముగా పూర్వముందు నాలుగు అర్ధసంవత్సరములలోను, కట్టడముల విషయ ములో లేదా వ్యవసాయభూములు కానట్టి యితరభూములవిషయములో 1920 వ సం॥పు మదరాసు డిస్ట్రిక్టు మునిసిపాలిటీల ఆక్టుననుసరించి, 1919 వ సం॥పు మదరాసు షహరు మునిసిపలు ఆక్టుననుసరించి, 1924 వ సం॥పు కంటోన్మెంటుల ఆక్టు ననుసరించియు, లేదా బ్రిటిషు ఇండియాలోని యే యితర రాష్ట్రములో లేదా ఎట్టి స్వదేశ సంస్థాన

ములోనైన నుండు మునిసిపలు లేదా స్థానిక సంస్థలను పరిపాలించు యెట్టి చట్టమునైన ననుసరించి లేదా 1930 వ సం॥ ఆగష్టు 26 వ తేదీకి పూర్వము ఒక యూనియనుగా నుండిన ఒక పంచాయతీలో 1920 వ సం॥పు మదరాసు లోకలు బోర్డుల ఆక్టు ననుసరించి ఆస్తి లేదా ఇంటిపన్ను విధింపబడియున్నను, అయితే అట్టి కట్టడముల, భూముల వెరసి సంవత్సరవారి అద్దె విలువ, అవి అద్దెకివ్వబడననుసరే, ఖామందు అనుభవములో నుండినను సరే, రూ 600 లకు తక్కువగా నుండకూడదు; లేదా

(D) ఎట్టి ఎస్టేటు, వాటా, లేదా భాగము విషయములో రూ 500 లకు మించు యెట్టి మొత్తమైన పేష్కషుగా లేదా రూ 100 లకు మించు యెట్టి మొత్తమైన క్విటెర్రెంటుగా, జోడుగా కట్టుబడిగా, పొరుప్పుగా లేదా అదేవిధముగా చెల్లించబడునో అట్టి 1908 వ సం॥పు మదరాసు యెస్టేట్ల భూమియాక్టు ననుసరించి ఒక ఎస్టేటు యొక్క లేదా అందలి వాటా లేదా భాగముయొక్క ఒక భూస్వామిగానున్నను లేదా రాష్ట్రీయ గవర్నమెంటుకు భూమిశిస్తురూపముగా రూ 500 లకు మించిన యెట్టి మొత్తమునైన చెల్లించు 1929 సం॥పు మలబారు టెనన్సి ఆక్టు ననుసరించి ఒక జన్మిగాయునున్నను ఆతడు ఒక "వ్యవసాయదారుడు"గా భావింపబడకూడదు.

వివరణము—(C) మినహాయింపు నిబంధనయొక్క కార్యముల నిమిత్తము యెట్టి కట్టడము లేదా భూమియొక్కయైన సంవత్సరవారీ అద్దె విలువ—

(1) శిస్తు, సంవత్సరవారీ అద్దె విలువమీద ఆధారపరుపబడిన, సందర్భములో అట్టి విలువగా భావింపబడవలెను;

(2) శిస్తు, పెట్టుబడి విలువమీద ఆధారపరుపబడిన సందర్భములో, పెట్టుబడి విలువలో నూటికి ఐదోవంతుగా భావింపబడవలెను; మరియెన్ని

(3) ఏ యితర సందర్భములోగాని, నిర్ణయింపబడిన విధముగా తెలుసుకొనబడిన విలువగా భావింపబడవలెను.

(iii) 'ఋణము' అనగా ఒక సివిల్ లేదా రెవిన్యూ కోర్టు యొక్క డిక్రీ లేదా ఉత్తరువు ననుసరించి అయినను లేదా యితర విధముగా నైనను చెల్లించవలసిన ఒక వ్యవసాయదారుని వద్దనుండి బాకీగారావలసిన, జామీను కలిగియున్ననుసరే, కలిగియుండకపోయి ననుసరే రొక్కరూపమైన లేదా వస్తురూపమైన యేదైన బాధ్యత అని అర్థము. అయితే (iv) వ క్లాజులో నిర్వచింప బడినట్లుండు శిస్తు లేదా 1929 వ సం॥పు మలబారు టెనన్సీ ఆక్టుయొక్క 3 (1) (i) సెక్షనులో నిర్వచింపబడినట్లుండు కానార్తము దీనిలో చేరదు;

(iv) 'శిస్తు' అనగా 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్లభూమి యాక్టుచే నిర్వచింపబడినట్లుండు శిస్తు లేదా 1929వ సం॥పు మలబారు టెనెన్సీ ఆక్టుచే నిర్వచింపబడినట్లుండు శిస్తు లేదా మిచ్చవారం లేదా 1908 వ సం॥పు మదరాసు ఎస్టేట్ల భూమి యాక్టుచే నిర్వచింపబడి నట్లుండు ఒక ఎస్టేటుతాలూకు భూస్వామికి దానివిషయమున ఒకసివిల్ లేదా రివిన్యూకోర్టుయొక్క డిక్రీ లేదా ఉత్తరువు పొందబడియున్నను సరే లేకపోయిననుసరే చెల్లింపబడివలసిన క్విట్ రెంటు, జోడి, కట్టుబడి పొరుప్పు లేదా అదే విధమైనది. యని అర్థము. మరిన్ని దానిమీద చెల్లించవలసిన వడ్డీ దీనిలో చేరియుండును. కాని ఒక సివిలు లేదా రెవిన్యూ కోర్టుద్వారా దాని వసూలు విషయమున తగిలిన ఖర్చు లేదా 1920వ సం॥పు మదరాసు లోకల్ బోర్డుల ఆక్టుయొక్క 88 వ సెక్షనుక్రింద భూస్వామి వసూలు చేసుకొనతగిన భూమి సెస్సునందలి భాగము దీనిలో చేరియుండదు. మరిన్ని,

(v) "ఋణదాత"అనుమాటలో అతనివారసులు, చట్టసమ్మత మైన ప్రతినిధులు, మరియు అస్సైనులు చేరియుందురు.

## వ్యాఖ్య

(1) "వ్యవసాయదారుడు" నిర్వచనములో ఒక అవిభక్తజాయింటుకుటుంబము కూడ చేరవచ్చును. వ్యవసాయభూములను కవులుకుతీసికొని వ్యవసాయముచేయువారు వ్యవసాయ భూములను తనఖా వ్రాయించుకొన్నవారు గూడ ఈ ఆక్టు లాభములను పొందుటకు వ్యవసాయదారులుగా పరిగణింపబడుదురు. కవులు వ్రాతమూలకముగా గాని, మాజువాణిగా గాని యుండవచ్చును.

మరిన్ని వ్యవసాయభూమిలో సంపూర్ణ హక్కులుండవలసిన పనిలేదు. జీవిత కాలపు హక్కులున్నవారు గూడ ఈ ఆక్టులాభములను పొందనర్హులు. ఒక భూమికి నామకః యితరులపేర దస్తావేజులు వగైరాలున్నప్పటికి ఆభూమియందు అసలుహక్కు యున్నవాడు తన హక్కును ఋజువుచేసుకొని ఈ ఆక్టు లాభములను పొందవచ్చును.

(2) వ్యవసాయదారుని వద్దనుండి రావలసిన ఋణములు వ్రాత మూలకముగా గాని, మాజువాణిగాగాని, హామీగలదిగాగాని, హామీలేకుండాగాని యుండవచ్చును. వ్యవసాయదారునికి స్వంత జవాబుదారీయున్న బాకీలేగాక యితర విధముగా బాధ్యత యేర్పడిన బాకీలకు అనగా వారసత్వమువల్ల యితరుల ఆస్తితోపాటు తీర్చవలసినబాకీలు తనఖా ఆస్తులు ఖరీదుచేయుటవల్ల తీర్చవలసిన బాకీలవంటివి గూడ యీ ఆక్టు క్రింద వ్యవసాయదారుని ఋణముగా యెంచబడి తగ్గించబడవలెను.

(3) 'ఋణదాత' అనుమాటలో అతనివారసులు చట్టసంబంధమైన ప్రతినిధులు మరియు అతనివల్ల బాకీని ట్రాన్సుఫరు పొందినవారుగూడ చేరుదురు. ఇట్టి నిబంధనలేని యెడల ఋణదాతలు తమకు రావలసిన బాకీలను యితరులపేర ట్రాన్సుఫరుచేసి యీ ఆక్టు నిబంధనలను నిష్ఫలముగా జేయుదురని యీ విధముగా నిర్వచన మీయబడినది.

ఋణములను తగ్గించుట, ఆక్టుదరిమిలా పడ్డీరేటు.

ఈ ఆక్టు సె 7 లో యీ క్రిందివిధముగా యున్నది.

వ్యవసాయదారులు చెల్లించవలసిన ఋణములను తగ్గించవలెను.

7. ఇందుకు విరుద్ధముగా ఏ చట్టము, ఆచారము, ఒడంబడిక లేదా కోర్టు డిక్రీవున్నను దానితో నిమిత్తము లేకుండ యీ యాక్టు ప్రారంభమున ఒక వ్యవసాయ దారునిచే చెల్లింపబడవలసిన యావత్తు ఋణములు, ఈ అధ్యాయములోని నిబంధనల ననుసరించి తగ్గించబడవలెను.

అట్లు తగ్గించబడినట్లుండు మొత్తమునకు అదనముగా ఎట్టిసొమ్ము గాని అతని వద్దనుండి లేదా అతనికి చెందిన ఎట్టి భూమినుండి లేదా భూమియందలిబాధ్యతనుండిగాని రాబట్టుకొనతగియుండకూడదు లేదా అతనిమీదనుండు యెట్టి డిక్రీని అమలుపరచుటలో గాని, అట్టి డిక్రీ యీ అధ్యాయము ననుసరించి తగ్గింపబడినట్లుండు సొమ్మునకు అదనముగా నుండు ఒక మొత్తమునకైనంతవరకు అతని ఆస్తి జప్తు చేయబడుటకు, విక్రయించబడుటకు లేదా ఏ యితరవిధముగా గాని, చర్య జరిగించబడుటకు లోబడి యుండకూడదు.

ఈ ఆక్టు నిబంధనలప్రకారము గ్రామమునసబుకోర్టులు పంచాయతీ కోర్టులుగూడ వడ్డీని తగ్గించవలసి యుండును. గ్రామకోర్టుల ఆక్టు సె 47 లో నెల 1 కి 100 కి రు 1-0-0 చొ॥ వడ్డీ యివ్వవచ్చునని యున్నప్పటికి యీఆక్టుక్రింద వ్యవసాయదారుల విషయములో అటుల యిప్పించుటకు వీలులేదు. నెల 1 కి 100 కి రు 0-7-4 లు కంటె హెచ్చు వడ్డీ యిప్పించకూడదు.

కోర్టులు వ్యవసాయదారుల విషయములో వారు దావాలలో హాజరైనను, కాకున్నను వారు వ్యవసాయదారులని యీఆక్టులాభములను పొందనర్హులని యెంచినప్పుడు ఈ ఆక్టు ప్రకారము వడ్డీ తగ్గించవలసియుండును.

సె 8 లో 1-10-32 తేదీపూర్వము వ్యవసాయదారుడు చేసిన ఋణముల విషయములో 1-10-37 తేదీవరకు నిలచియున్న యావత్తు వడ్డీని ఋణస్థుడు యివ్వనక్కరలేదని అప్పటికినిలచియున్న అసలున్ను ఆ తేదీ నుండి 100 కి సంవత్సరమునకు 6½ సామాన్య వడ్డీ మాత్రము యివ్వవలెనని నిబంధన చేయబడినది.

సె 9లో 1-10-1932 దరిమిలాను ఆక్టుకుపూర్వము చేయబడిన ఋణముల విషయములో నిబంధన చేయబడినది. అట్టి ఋణములకు ఋణము తేదీలగాయితు ఆక్టు అమలులోనికి వచ్చిన 22-3-38 వరకు సంవత్సరమునకు నూటికిఅయిదుచొప్పున సామాన్యవడ్డీకంటె హెచ్చు

మొత్తము యివ్వనక్కరలేదని నిబంధన చేయబడినది. ది 22-3-38 లగాయతు నెల 1కి 100కి $6\frac{1}{4}$ చొప్పున సామాన్య వడ్డి యివ్వవలెను.

సె 13 ఆక్టు దరిమిలా చేయబడిన ఋణములకు వర్తించును. సె 13 లో యిటులున్నది.

క్రొత్త ఋణముల మీద వ్యవసాయదార్లు చెల్లించవలసిన వడ్డీరేటు.

13. ఒక ఋణమును రాబట్టుటకైన ఎట్టి చర్యలోనైన ఈఆక్టు ప్రారంభమైన తరువాత ఒక వ్యవసాయదారుడు చేసిన ఎట్టిరుణముమీదనైన బాకీగా రావలసియుండు యావత్తు వడ్డీని, కోర్టు వారు సంవత్సరమునకు నూటికి $6\frac{1}{4}$వంతున సామాన్యవడ్డికి అనగా, నెల ఒకటింటికి ఒక దమ్మిడి సామాన్య వడ్డి వంతున లెక్కపెట్టబడిన ఒక మొత్తమును మించకుండునట్లు తగ్గించవలెను;

అయితే రాష్ట్రీయ గవర్నమెంటువారు సర్కారు గెజెటులో ప్రకటన మూలముగా అప్పుడప్పుడు వడ్డి రేటును మార్చవచ్చును. మరిన్ని యే యితర వడ్డీరేటునుగాని నిర్ణయించవచ్చును.

వివరణము:— ఈ సెక్షను యొక్క కార్యముల నిమిత్తము, 3 (ii) వ సెక్షనులోని "వ్యవసాయదారుడు" అనుమాట యొక్క నిర్వచనము—

(i) ఆ సెక్షను తాలూకు (A) మినహాయింపు నిబంధనలలో "1938 వ సం॥ మార్చి 31 వ తేదీతో అంతమగు ఆర్థిక సంవత్సరములలో" అను మాటలకు బదులుగా "ఋణముచేసిన తేదీకి అవ్యవహితముగా పూర్వపు మార్చి 31 వ తేదీన అంతమగు ఆర్థిక సంవత్సరములలో" అను మాటలు; మరిన్ని

(ii) ఆ సెక్షనుతాలూకు (B) (C) మినహాయింపు నిబంధనలలో "1937 వ సం॥ అక్టోబరు 1 వ తేదీకి అవ్యవహితముగా పూర్వముండు

రెండు సంవత్సరములలో" అనుమాటలకు బదులుగా "ఋణముచేసిన తేదీకి అవ్యవహితముగా పూర్వపు మార్చి 31 వ తేదీన లేదా సెప్టెంబరు 30 వ తేదిన వీటిలో ఏది ఆలస్యముగా నుండునో ఆ తేదీన అంతమగు నాలుగు అర్ధ సంవత్సరములలో" అను మాటలు ఉండిన నెట్లో అట్లే చదువబడవలెను.

## వ్యాఖ్య.

ఈ సెక్షను క్రింద రాష్ట్రీయ గవర్నమెంటువారికి వడ్డీని మార్చుటకుగల అధికారము ను చెలాయించుచు వ్యవసాయదారులు యివ్వవలసిన వడ్డీరేటును నూటికి సంవత్సరము కు $6\frac{1}{4}$ నుండి $5\frac{1}{2}$కు తగ్గించుచూ జి.ఓ 2919 డి 7-7-1947న జారీచేసిరి. ఆ జి.ఓ. 29-7-47 ఫోర్టుసెయింటు జార్జిగెజెటు పార్టు I పేజీ 632 లో ప్రకటింపబడి ఆ తేదీ నుండి అమలులోనికి వచ్చినది.

పై జి.ఓ. ప్రకారము 29-7-47 తేదీనుండి వ్యవసాయదారులు నెల 1కి 100కి 0-7-4 చొ॥ మాత్రమే వడ్డీని యిచ్చుటకు బాధ్యులు. 29-7-47 వరకు నెల 1కి 100కి 0-8-4 చొప్పుననే వడ్డీ యివ్వవలెను.

ఉదాహరణము:-10-7-46 తేదీన ఒకడు ప్రోనోటు వ్రాసెను. ఆప్రోనోటుకు 10-7-46 తేదీ మొదలు డి 29-7-47 వరకు నెల 1కి 100కి రు 0-8-4 చొప్పున యున్నూ 29-7-47 నుండి నెల 1కి 100 కి 0-7-4 చొ॥ యున్నూ వడ్డీకట్టవలెను.

1947 సం॥ 23 వ మదరాసు వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు సవరణ ఆక్టు వల్ల సె 13 తరువాత సె 13A అని నూతన సెక్షను చేర్చబడినది.

సె 13. A. సె 3 (ii) తాలూకు (B)మినహాయింపు నిబంధన లేక (C) మినహాయింపు నిబంధన వర్తించని పక్షమున, యెవరు ఆసెక్షనులో నిర్వర్తింపబడినట్లు, వ్యవసాయదారుడుగా నుండునో అట్టి మనిషిని ఋణము చేసియుండు సందర్భములో, సదరు ఋణమునకు వర్తించగల వడ్డీరేటు, చట్టమును, ఆచారమును, ఒడంబడికను లేక కోర్టుయొక్క యే డిక్రీక్రింద సదరు ఋణము ఏర్పడునో ఆడిక్రీ ననుసరించి దానికి వర్తించగల రేటు లేక 13 వ సెక్షను క్రింద వ్యవసాయదారునికి వర్తించగల రేటు, వీటిలో యేది తక్కువగా యుండునో ఆ రేటుగా యుండవలెను.

ఇటీవల దేశములో ధరలు వగైరాలు హెచ్చి అధికచలామణి ప్రబలియున్నందున మ. వ్య. స. ఆక్టు నిర్వచనము ప్రకారము వ్యవసాయదారులై ఆక్టులాభమును పొందగలవారికిగూడ కొన్నివృత్తులనుండి సె 3 (ii) B మినహాయింపులో చెప్పబడిన అర్థ సంవత్సరమునకు రు 600 లు మించి ఆదాయము వచ్చినను (c) మినహాయింపులో చెప్పబడిన ప్రకారము ఆస్తులపైన సంవత్సరవారీ అద్దెవిలువ రు 600 లకు మించియున్నప్పటికి రైతువారికిగూడ సె 13 ను ప్రకారము యివ్వవలసిన వడ్డీ రేటు కంటె హెచ్చువడ్డీ ఇవ్వనగత్యములేదని యీసెక్షను చేర్చబడినది. ఒకరు సె 3 (ii) (B)(C) మినహాయింపుల ప్రకారము వ్యవసాయదారుడుగా యెంచతగనప్పటికి యిప్పుడు ఈ ఆక్టు లాభములను పొందనర్హుడు.

మద్రాసు వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు నిబంధనలు ఈ దిగువ చెప్పబడిన వ్యవసాయదారుల ఋణములకు బాధ్యతలకు వర్తించవు.

అవి సె 4 లో చెప్పబడినవి.

కొన్ని ఋణములున్ను, బాధ్యతలున్ను బాధింపబడకూడదు. — 4. ఈయాక్టులోనున్న దేదియును ఈక్రింది శీర్షికల క్రిందనచ్చు ఒక వ్యవసాయదారుని ఋణములను, బాధ్యతలను బాధించకూడదు.

(a) రాష్ట్రీయ గవర్నమెంటుకు చెల్లించవలసియుండు ఏదైన శిస్తు, పన్ను లేదా సెస్సు లేదా ఋణము రూపముగా లేదా యితర విధముగా వారికి బాకీగా రావలసియుండు యేదైన యితర సొమ్ము;

(b) సెంట్రలు (కేంద్ర) ప్రభుత్వమునకు చెల్లించవలసియుండు యేదైన శిస్తు, పన్ను లేదా సెస్సు లేదా ఋణమురూపముగా లేదా యితర విధముగా వారికి బాకీగా రావలసియుండు యేదైన యితర సొమ్ము;

(c) ఎట్టి స్థానిక అధికారవర్గమునకు గాని చెల్లించవలసియుండు ఏదైన పన్ను లేదా సెస్సు లేదా ఋణము రూపముగా లేదా యితర విధముగా వారికి బాకీగా రావలసియుండు యేదైన యితర సొమ్ము;

(d) ఒక మునిసిపాలిటీలో కంటోన్మెంటులో లేదా 1930 వ సం॥ ఆగస్టు 26 వ తేదీకి పూర్వము యూనియనుగానుండిన ఒక

పంచాయతీలో ఇంటి ఆస్తి జామీనుమీద మన్నానను చేయబడిన ఏదైన ఋణము;

(e) 1932 వ సం॥పు మదరాసు సహకార సంఘముల ఆక్టు ననుసరించి రిజిష్టరుచేయబడిన లేదా చేయబడినట్లు భావింపబడిన ఒక భూమి తనఖా బ్యాంకితో చేరి ఎట్టి సహకార సంఘమునకైన బాకీగానుండు ఎట్టి సొమ్ము విషయమునకైనగల ఏదైనబాధ్యత లేదా ఏదైన పార్లమెంటు యొక్క ఒక ఆక్టును లేగా యేదైన ప్రత్యేకమైన ఇండియాదేశపు చట్టమును లేదా రాయలు ఛార్టరును లేదా లెటర్సు పేటెంటును అనుసరించి ఏర్పాటుచేయబడిన ఎట్టి కార్పొరేషనుకుగాని బాకీగా రావలసియుండు ఏదైన ఋణము;

(f) నమ్మక ద్రోహము మూలముగా కలుగు ఏదైన బాధ్యత;

(g) కోర్టుయొక్క డిక్రీని అనుసరించినైనను సరే యితర విధముగా నైనను సరే భరణము విషయమైన ఏదైన బాధ్యత;

(h) 1937 వ సం॥ అక్టోబరు 1 వ తేదీన ఏ యితర ఆస్తినిగాని కలిగి యుండని ఒక స్త్రీకి ఆ తేదీన ఆమెను బాకీగా రావలసి యుండు యేదేని ఋణము లేదా ఏవేని ఋణములు—

అయితే అట్లు బాకీగా రావలసియుండుఋణము లేదాఋణముల యొక్క అసలుమొత్తముతో చేరి ఆ తేదీన ఆమెకు స్వంతముగాయున్న ఆస్తి విలువ రు 6000 లకు మించి యుండకూడదు.

వివరణము:— ఈ క్లాజుయొక్క కార్యము నిమిత్తము ఋణదాతయగు స్త్రీ నివసించియుండిన యిల్లు, లేదా అందులోని కుర్చీలు బల్లలు మొదలగు ఏవైన వస్తువులు, లేదా ఆమె గృహ సంబంధమైన పాత్రలు, ధరించుకొను వుడుపులు, ఆభరణములు లేదా యిటువంటి ఆమె సొంతవస్తువులు ఆస్తిగా తలంపబడకూడదు.

(i) వ్యవసాయము చేయు లేదా యితర గ్రామమునకు చెందిన కూలివానికి రావలసియుండు ఏదైనకూలి.

అయితే (e) క్లాజులో చెప్పబడిన బాధ్యతలు సహకార సంఘమునకు అస్సైనుచేసిన కారణముచే కలుగు సందర్భములో, అట్టి అస్సైనుమెంటు 1937 వ సం॥ అక్టోబరు 1 వ తేదీకి పూర్వము జరిగి యుండవలెను. లేదా అట్టిసంఘమునకు అది ఒక సహకారసంఘముచే యివ్వబడిన ఒక ఋణముయొక్క అస్సైను మెంటుగా నుండవలెను.

## వ్యాఖ్య

ఈ సెక్షనులో ఉదహరించిన బాకీలు ఒక వ్యవసాయదారునిచే యివ్వబడ వలసినను వాటికి యీ ఆక్టు వర్తించదు.

(a) to (c) క్లాజులలోని బాకీలు గవర్నమెంటువారికిన్నీ, స్థానిక సంస్థలకు రావలసిన బాకీలయియున్నవి. వాటిని తగ్గించినయెడల గవర్నమెంటువారికి పరిపాలన నడుపుట కష్టముగా యుండును. గాన వాటిని మినహాయించడ మయినది.

(d) క్లాజు ఒక మునిసిపాలిటీ లేదా కంటోన్మెంటు లేదా 26-8-1920 సం॥ పూర్వము యూనియన్‌గాయున్న పంచాయతీ సరిహద్దులలోపల యున్న యింటి ఆస్తి మాత్రము తాకట్టుపెట్టి ఋణము తీసుకొన్నయెడల అట్టి ఋణమునకు ఈ ఆక్టు నిబంధనలు యేవియు వర్తించవు. ఈ ఆక్టు నిబంధనల ప్రకారము అట్టి బాకీని తగ్గించ వీలు లేదు. కాని అట్టి యింటితోపాటు యితర గ్రామములలో యున్న యిండ్లను గాని, భూములనుగాని లేదా యెట్టిచరాస్తినిగాని చేర్చి తాకట్టుపెట్టినయెడల అట్టి ఋణము నకు యీ ఆక్టు వర్తించును.

(e) క్లాజు ప్రకారము కో-ఆపరేటివ్ సంఘముల వద్దనుగాని రావలసిన బాకీలకుగూడ యీ ఆక్టునిబంధనలనుండి మినహాయించినారు. ఈ క్లాజులో చెప్పబడిన బాకీ ఒక పరపతి సంఘమువల్ల మరియొక పరపతిసంఘమునకు ట్రాన్స్ఫరు చేయబడిన బాకీ కానియెడల అట్టి ట్రాన్స్ఫరు 1-10-1937 తేదీకి పూర్వము జరిగియున్న అట్టి బాకీకి యీ ఆక్టు నిబంధనలు వర్తించవు. 1-10-1937 తేదీకి దరిమిలా పరపతి సంఘము కాని ఒకనివద్దనుండి ఒకబాకీని పరపతిసంఘము ట్రాన్స్ఫరు చేసుకొన్నను అట్టిబాకీకి యీ ఆక్టు నిబంధనలు వర్తించును. ఏలనన అట్టి వీలున్నచో ప్రతి ఋణదాతయున్ను తనకు రావలసిన బాకీలను ఏ పరపతి సంఘమునకైనా ట్రాన్స్ఫరుచేసి యీ ఆక్టువలన వ్యవసాయదారులకు చేయబడిన సౌకర్యములు లేకుండా చేయవచ్చును. అందువల్ల యిట్లు శాసించబడినది.

(f) "నమ్మకద్రోహము మూలముగా కలుగు ఏదైనాబాధ్యత" లకు ఈ ఆక్టు వర్తించదు. నమ్మకద్రోహము అనగా ఒకనికి కొంత ఆస్తినిగాని, సొమ్మునుగాని ఒక విధముగా ఉపయోగించమని గాని, లేదా కాపాడమని గాని వప్పగింత చేయబడి నపుడు అట్టి యేర్పాటుకు భిన్నముగా అతడు అక్రమ లాభమును పొందు దురుద్దేశముతో అట్టి ఆస్తిని గాని, సొమ్మును గాని తాను హరించిన లేదా పాడు

చేసిన దానికి అతడు యివ్వవలసి వచ్చు నష్టము క్రింద యివ్వవలసియున్న సొమ్ముగాని లేదా యిప్పించబడిన బాకీకి యీ అక్టు నిబంధనలు వర్తించవు. ఒకరు మరియొకరి ఆస్తికి విల్లుద్వారా యెగ్జిక్యూటరుగాయుండి సదరు విల్లుద్వారా సొమ్మునుగాని ఆస్తినిగాని విల్లులోని షరతులకు భిన్నముగా హరించినప్పుడు లేదా సరుకులు నిల్వ చేయు కొట్లు కలిగిన ఒకని కొట్టులో సరుకులు నింపి జాగ్రత్తగా కాపాడవలెనని లకు ఆతనికి వప్పగింత చేయబడినపుడు అతడు వాటిని అమ్ముకొని హరించిన లేదా ఒక ఏజెంటు తన యజమాని సొమ్ములను సరుకులు అతని యిష్టము ప్రకారము అతడు చెప్పిన విధమున వినియోగించక లేదా కాపాడక హరించిన లేదా ఒక రైల్వే దారుగాని లేదా మోటారు సర్వీసువారుగాని, లేదా నావలు నడపువారు లేదా బండ్లవారు రవానాచేయుటకు తమకు వప్పగింతచేయబడిన సరకులను హరించిన అట్టి వారు నమ్మక ద్రోహముచేసినట్లు యెంచబడుదురు. అందుకుగాను వారుయివ్వవలసి వచ్చు నష్టమునకు వారు వ్రాసియిచ్చిన ఖరారు వగైరాలలోని బాకీలనుగాని, సదరు మొత్తములకు డిక్రీలు అయియున్న సదరు డిక్రీ బాకీలనుగాని ఈ అక్టు నిబంధనల ప్రకారము తగ్గించ వీలులేదు.

(g) మనోవర్తి విషయమైన బాకీలకు ఈ అక్టు వర్తించదు. అట్టి మనోవర్తికి డిక్రీపొందినను లేదా దస్తావేజుద్వారా బాకీయుండినను లేదా మూజువాణిగా బాకీయుండినను, అట్టిబాకీలపైన వడ్డీని తగ్గించుటకు వీలులేదు. అనాథలగువారికి రావలసిన మనోవర్తి తగ్గిపోయి వారికి యిబ్బంది కలుగకుండగలందులకు యీనిబంధన చేయబడినది.

(h) ఈ క్లాజు ప్రకారము 1-10-37 తేదీనాటికి ఒక స్త్రీకి రావలసియుండు ఋణములకు ఆ స్త్రీకి ఆ తేదీన ఆమెకు రావలసిన ఋణముల అసలుతోచేరి ఆమె స్వంతఆస్తి కిమ్మతు రు 6000 లకు మించనియెడల ఆ వడ్డీ నిబంధనలు వర్తించవని ఈక్లాజువల్ల నిబంధనచేయబడినది. 1-10-37 తేదీకి రు 6000 లకుమించిన ఆస్తియున్న స్త్రీకిరావలసిన ఋణములకు ఆవడ్డి వర్తించును. 1-10-37 తేదీ దరిమిలా స్త్రీలకు రావలసిన అనగా 1-10-37 తేదీదరిమిలా స్త్రీలుఇచ్చిన అప్పులుతాలూకు ఋణములకు ఆవడ్డీ నింబధనలు వర్తించును. 1-10-37 తేదీదరిమిలా అప్పులకు పురుషులకురావలసిన ఋణములకు స్త్రీలకురావలసిన ఋణములకు భేదములేదు. కాని కొందరు అపోహతో ఆవడ్డీదరిమిలా యిప్పటివరకు తమబాకీలకు స్త్రీలపేర ప్రోనోట్లుపత్రములు వగైరాలు వ్రాయించుచున్నారు. కాని ఆ బాకీలకుకూడ ఆవడ్డీ నిబంధనలు వర్తించును.

(i) క్లాజు:— ఈ క్లాజుప్రకారము వ్యవసాయములో నియమింపబడు కూలీల యొక్కయు, యింకా గ్రామాదులలో పనిచేయు కూలీలయొక్కయు, కూలి బాకీలు ఈఅక్టు నిబంధనలలోనుండి మినహాయింపబడినవి. అట్టివారికి కూలివల్లనే నిత్యజీవనము జరుగవలసి యున్నందున వారిబాకీలు చాలాతక్కువ మొత్తములుగాయుండును. గాన వారికికూడ ఈఅక్టునువర్తింపజేసి బాకీలను తగ్గించినయెడల వారి జీవనాధారమునకు భంగము కలుగునని యిట్లు మినహాయింప బడినవి.

5 వ భాగము

# II

# 1935 వ సంవత్సరపు 7 వ ఆక్టు

## మదరాసు ఋణగ్రస్థుల రక్షణ ఆక్టు

ఆక్టుయొక్క ఉద్దేశములు, కారణములు :—

"కొన్ని తరగతుల ఋణదాతలు జరిగించు వడ్డీవ్యాపారసరళిలో తరచుగా నగలు మరియు సాధారణముగా వాడుకలోయుండు ఇతరవస్తువులు విక్రయమును తటస్థించుచుండును. ఇట్టి వడ్డీవ్యాపారము మిక్కిలి అసంతృప్తిగాయుండి ఋణగ్రస్తులు ఋణదాతల దయాదాక్షిణ్యములకులోనై యిబ్బందిబడుచున్నారు. ఈఋణగ్రస్తులు సాధారణముగా సామాన్యసంసారుల తరగతులకును పాటకపు తరగతులకును చెందినవారు. ఋణగ్రస్తులకుండు జరూరును, అజ్ఞానమును విద్యావిహీనతను పురస్కరించుకొని కొన్ని తరగతుల ఋణదాతలు పాపభీతిలేకుండ వారిని పీల్చి పిప్పిచేయుచున్నారు. కొందరు ఋణదాతలు ఋణగ్రస్తులనుండి తాము తీసుకొన్న పైకములకు రశీదులను విధిగా నెన్నడును యివ్వక తమ లెక్కలను తమకుతప్ప ఇతరులు యెవ్వరికిని తెలియని లేదా బోధపడని భాషలలోను సమూనాలలోను ఉంచుచున్నారు. ఇంతేకాక విధించబడువడ్డి అత్యధికముగా నున్నది. ఈ వడ్డి న్యాయమైన గరిష్ఠమొత్తము పరిమితికి నిర్ణయింపబడవలసిన సమయమువచ్చినది.

కనుక న్యాయమైన గరిష్ఠవడ్డీ నిర్ణయించుటయును కొన్నిరకముల వడ్డీవ్యాపారము సౌష్ఠవముగను క్షేమముగను జరుపబడునట్లు ఏర్పాటుచేయుటయును కొన్ని తరగతుల ఋణదాతలకును ఋణగ్రస్తులకున్నూ మధ్య ఋణగ్రస్తులకు అప్పుడప్పుడు తమ లెక్కలెట్లున్నవో అవి ఎట్లు వ్రాయబడుచున్నవో తెలుసుకొనుట కవకాశమిచ్చి మేలైన లెక్కలను ఉంచుపద్ధతిని ఏర్పాటుచేయుటయును ఈ ఆక్టుయొక్క ఉద్దేశము.

అయినను ఋణదాతలను అనవసరముగా బాధించకుండుటకును ఋణము పుట్టుటకునుగల సదుపాయములను సంకుచితపరుపకుండుటకు ఈ ఆక్టు చాలినంత

జాగ్రత వహించుచున్నది. ఇంతేకాక కొన్ని తరగతుల ఋణములను మినహాయించుట మూలముగా ఇది వర్తకవాణిజ్యములకు సంబంధించిన లెక్కలతో స్పష్టముగా జోక్యము కల్పించుకొనకుండా మానివేయుచున్నది. ఈ బిల్లు నిబంధనల ప్రకారము జరిగించనందుకు విధింపబడు అపరాధము న్యాయముగను ఆ యా సందర్భములయొక్క అవసరములకు మాత్రము చాలినవిగను యున్నవేగాని కఠినముగాలేవు. ఈఆక్టు రు 500లు లోపు ఋణములకు మాత్రము వర్తించును. సె 6 A లో అట్టి ఋణముల పైన వడ్డీ హామీగల ఋణముల విషయములో నూటికి సంవత్సరమునకు తొమ్మిదికంటె హామీ లేని విషయములలో నూటికి సంవత్సరమునకు పదిహేనుకంటె యెక్కువ వడ్డీ యున్న యెడల కోర్టువారు వడ్డీ అధికముగా యున్నదనియు, 1918 సం॥పు దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు ననుసరించి వారు సహాయము చేయవలెనని భావించవలెనని యున్నది. కాని ఋణదాత యెక్కువవడ్డీ తీసుకొనుటకు ప్రత్యేకపరిస్థితులున్నట్లు ఋజువుచేయ గలిగిన యెడల కోర్టువారు అంతకు యెక్కువ వడ్డీని యిప్పించవచ్చునని ఋణదాతల సౌకర్యము కొరకు శాసించబడినది.”

3 వ క్లాజు (1) ఈ ఆక్టు జి. ఓ. నెం. 4064 రు. లా (జనరల్) వల్ల 15-1-1936 తేదీనుండి అమలులోనికి తేబడినది.

(ఫోర్టు సెయింటుజార్జి గెజెటు Iవ భాగము 1680 పేజీ చూడవలెను.)

(2) ఈ ఆక్టులోనున్న దేదియును ఈ ఆక్టు అమలులోనికివచ్చుటకు పూర్వము యివ్వబడిన ఏ ఋణము విషయములోను వర్తించదు.

ఈ ఆక్టు వర్తించు “ఋణదాత” వడ్డీ, ఋణము, అను మాటలకు ఈ క్రింది విధముగా నిర్వచన మీయబడినది

(5) “ఋణదాత” అను మాటకు క్రమమైన వ్యాపారసరళిలో ఒక ఋణమును ఇచ్చు తాకట్టు పట్టువానితో చేరి ఒక మనిషి అని అర్థము. మరియు ఈ మాటలో ఋణమిచ్చిన మనిషి తాలూకు చట్టసమ్మతమైన ప్రతినిధియును, అట్టి ఋణమిచ్చిన వానియొక్క బాధ్యతను అతని తరువాత వారసత్వము మూలమునగాని అస్సైను మెంటువలనగాని యితర విధమునగాని వహించు వారసుడును చేరి యుండును.

(6) "వడ్డీ" అను మాటలో ఆక్టుయొక్క నిబంధనల కనుగుణముగా ఖర్చుల, చార్జీల లేదా వ్యయముల కై లేదా వాటి విషయములో ఒక ఋణదాతచే చట్టసమ్మతముగా కట్టబడిన ఎట్టి పైకపు మొత్తముగాని చేరదు. కాని పైన చెప్పబడిన విధముగా తప్ప ఒక ఋణమునకు ప్రతి ఫలముగా లేదా దాని విషయములో యితర విధముగా ఋణదాతకు అసలుకు అదనముగా చెల్లించిన లేదా చెల్లించ వలసియుండు యెట్టిమొత్తముగాని, అది యేపేరుతో పిలువబడినను సరే, దానిలో చేరును.

(7) "ఋణము" అను మాటకు యే ఒక వ్యవహారములోనైన ఒక్కొక్కసారి ఐదువందల రూపాయలకు తక్కువ మొత్తము లేదా విలువగల వడ్డీకి రొక్కముగా లేదా వస్తురూపముగా అప్పు యివ్వ బడిన మొత్తము అని అర్థము. మరిన్ని యీ మాటలో కోర్టువారు వస్తుతః అట్టి ఒక ఋణముగా నుండునట్లు తీర్మానించునట్టి యే వ్యవహారమైనను చేరియుండును; కాని,

(i) ఒక గవర్నమెంటు పోస్టు ఆఫీసు సేవింగ్సు బ్యాంకిలో గాని, ఒక బ్యాంకిలోగాని, ఒక కంపెనీలోగాని, సహకార సంఘములోగాని వేయబడిన పైకము లేదా యితర ఆస్తియొక్క డిపోజిట్టున్ను;

(ii) ఒక బ్యాంకిచే, కంపెనీచే లేదా సహకార సంఘముచే యివ్వబడిన ఋణమున్ను;

(iii) గవర్నమెంటువారిచే లేదాగవర్నమెంటువారివలన వారి తరఫున అప్పుల నిచ్చుటకు అధికార మివ్వబడిన ఎట్టిమనిషిచే లేదా యేదైన స్థానిక అధికారుల సంఘముచే యివ్వబడిన ఋణమున్ను;

(iv) వడ్డీ వ్యాపారము ప్రధాన వుద్దేశముగా నుండని యేదైన వ్యాపారమును సదుద్దేశముతో చేయు యేమనిషినైన అట్టి వ్యాపారముయొక్క క్రమసరళిలో ఋణమివ్వబడినయెడల, అట్టిఋణమున్ను;

(v) ఒక భూస్వామిచే వాని రైతునకుగాని కవులిచ్చువానిచే వాని కవులు తీసుకొను వానికి గాని వ్యవసాయములో ఒక భాగ స్వామిచే లేదా వాటాదారునిచే వ్యవసాయమును సాగించు కార్యము నిమిత్తము మరియొకనికిగాని యివ్వబడిన ఋణమున్ను,

[vi] 1881 వ సం॥పు నెగోషియబిల్ యినుస్ట్రుమెంట్సుఆక్టులో నిర్వచింపబడినట్లుందునట్టిన్ని ప్రామిసరినోటు కానట్టిన్ని పరివర్తనార్హమైన దస్తావేజుయొక్క ఆధారముపైన యివ్వబడిన ఋణమున్ను చేరి యుండవు.

5 క్లాజు:— (1) "ఋణదాత" అనగా వడ్డీవ్యాపారము చేయుట ప్రధానోద్దేశముగా యుండి అట్టి క్రమమైన వ్యాపారసరళిలో అప్పులనిచ్చువాడు అని అర్థము. ఈ "ఋణదాత" అను మాటలో వస్తువులను తాకట్టు పెట్టుకొని అప్పు యిచ్చు ఋణదాతలు చేరుదురు. కాని వడ్డీవ్యాపారముచేయుట ప్రధానోద్దేశముగా యుండక అప్పుడప్పుడు అప్పులనిచ్చు యితర వర్తక వాణిజ్యముల చేయువారు యీ ఆక్టులో నిర్వచింపబడిన "ఋణదాతలు" కారు. అట్టివారికి యీ ఆక్టు వర్తించదు.

(2) "ఋణదాత" అను మాటలో ఒక ఋణదాతయొక్క చట్టసమ్మతమైన ప్రతినిధులు, వారసులు, బాధ్యస్థులు వగైరాలు కూడా చేరుదురు. ప్రథమములో ఋణదాతయిచ్చినఋణమునకు "లా" ప్రకారముగాని వారసత్వమువల్లగాని ట్రాన్స్ఫరు వల్లగాని హక్కు ఏర్పడిన యితరమనిషికికూడ ఈఆక్టు నిబంధనలు వర్తించును. అట్టి మనిషికూడ యీ ఆక్టు నిబంధనలప్రకారము లెక్కలు వగైరాలను వుంచుట, రశీదుల నిచ్చుట మొదలైనవి చేయవలెను. మరిన్ని అట్టి ఋణము విషయములో మొదటి ఋణదాత ఏమైన లోపములుచేసిన అట్టి లోపములు ఆఋణమునకు హక్కుయేర్పడిన వానినికూడ బాధించును. అట్టిహక్కు ఏర్పడినమనిషి తాను సదుద్దేశముతో ఋణమును ట్రాన్స్ఫరు పొందితిననియు అందువల్ల ఈ ఆక్టు నిబంధనలుగాని మొదటి ఋణదాత చేసిన లోపములుగాని తన్ను బాధించవని వాదన చేయుటకును హక్కు యుండదు. ఇట్టినిబంధనలేకున్న ఋణదాతలు తమకురావలసిన ఋణములను ఇతరులపేర ట్రాన్స్ఫరు వగయిరాలు చేసి ఈ ఆక్టు నిబంధనలు నిష్ఫలములగునట్లు చేయుటకు అవకాశముండెడిది. అందువల్ల ఋణదాత నిర్వచనములో అతని ప్రతినిధులు వగైరాలుచేరునట్లు శాసించబడినది.

6 క్లాజు:— వడ్డీఅనుమాటలో ఈ ఆక్టుయొక్క నిబంధనల కనుగుణముగా కట్టబడిన ఖర్చులు ఏవిన్ని చేరవు. కాని అసలుమించి అదనముగా చెల్లింపబడవలసిన అన్ని ఇతర మొత్తములు చేరును.

7 (1) "ఋణము" అనగా:—

(i) ఒక్కసారి యివ్వబడిన ఏ మొత్తము రు 500 లకు మించి యుండ కూడదు.

(ii) అట్టి ఋణము రొఖరూపముగా గాని లేదా వస్తురూపముగా గాని యుండవచ్చును. వస్తురూపముగా యున్నప్పుడు దాని విలువ రు 500 లకు మించకూడదు.

రెండుసార్లు ఒకే ఋణదాత ఒకే ఋణస్థునికి రు 500 లకు తక్కువ మొత్తము లను అప్పుయిచ్చినయెడల సదరు రెండు ఋణములకును ఈ అక్టు వర్తించును.

(2) కొన్ని ఋణములు పై స్వభావమును కలదిగా యున్నప్పటికిని ఈఅక్టులో నుండి మినహాయింపబడినవి. అవి ఈ క్లాజుచివర చెప్పబడినవి. వాటిలో (i) మొదలు (iii) సబ్ క్లాజులలో చెప్పబడినవాటి విషయములో అట్టి ఋణముల నిచ్చువాడు వారికి వర్తించు చట్టముల ప్రకారము అన్ని లెక్కలను ఉంచవలసిన బాధ్యత మరియు అట్టి లెక్కలను ఋణస్థులు తనిఖీచేయుటకు నకళ్ళను పొందుటకును అవకాశ మిచ్చు బాధ్యత యుండియున్నందున మరియు వారు అట్లు లెక్కలు పద్దరాలను ఉంచుచున్నందున వారికి ఈ అక్టును వేరేవర్తింపజేయవలసిన అగత్యములేనందున అట్టి ఋణములు మినహాయింపబడినవి. iv, v సబ్ క్లాజులలో చెప్పబడిన ఋణములనిచ్చు వారు వడ్డీవ్యాపారముచేయుట ప్రధానోద్దేశముగా గలవారుకానందున వారు యిచ్చు ఋణములను మినహాయించిరి. vi క్లాజులోని ఋణములవిషయమై నెగోషియబుల్ యిన్‌స్ట్రుమెంట్సు అక్టులోని నిబంధనల ప్రకారము వాటిని మినహాయించడమైనది. ఈ అక్టు నెగోషియబుల్ యిన్‌స్ట్రుమెంట్సు అక్టులో చెప్పబడిన ప్రామిసరినోట్లకు మాత్రము వర్తించును. మిగతావాటికి వర్తించదు.

ఈఅక్టునిబంధనలప్రకారము ఋణదాతప్రతిఋణస్థునికిఋణములతాలూకుఅన్ని వివరములతో లెక్కలను వ్రాసియుంచవలెను. ఋణస్థుడు వసూలుయిచ్చినపుడల్ల క్రమ మైన రశీదు నీయవలెను. ఋణస్థుడు వ్రాతమూలకముగా కోరిన లెఖనకలు యివ్వ వలెను. ఋణదాత యిచ్చురశీదు ఇంగ్లీషులోగాని లేదా ఆప్రాంతములోని ముఖ్యమైన దేశభాషలో యుండవలెను. మరియు అంకెలు అరబిక్ అంకెలుగాయుండవలెను. అర బిక్ అంకెలనగా 1, 2, 3 వగైరా.

ఋణదాత రశీదుయివ్వక తప్పిపోయినయెడల, ఋణస్థుడుకోరిన తరువాత ఒక నెలలోగా ఋణదాత లెఖనకలు పంపకపోయినను అటుల తప్పిపోయిన తేదీనుండి, రశీదు లెఖనకలు యివ్వనంతవరకు ఋణముపై వడ్డినికోరుటకు ఋణదాతకు హక్కు యుండదు.

ఋణస్థుడు లెఖనకలు పంపమని కోరినప్పుడల్లా ఋణదాత ఈ క్రిందివిధముగా రుసుములు కోరవచ్చును. రు 50 ల లోపు ఋణములకు రు 0-1-0 రు 100 లకు మించనపుడు రు 0-2-0, రు300 లకు మించనపుడు రు 0-3-0, రు 300ల కు మించినపుడు రు 0-4-0 ఋణదాత ఉంచవలసిన లెఖలనుసరిగాయుంచలేదని కోర్టువారు అభిప్రాయపడు నెడల అతనిఖర్చులు యివ్వించబడవు.

ఈ ఆక్టుప్రకారము ఋణదాత తీసికొనతగినవడ్డి సె 6 A లో నిర్దేశింపబడినది.

కొన్ని ఋణముల విషయములో ఎట్లు భావింపబడవలెను ?

6 A. (1) 1936 సం॥ మదరాసు ఋణస్థుల రక్షణాకైన ఆక్టు ప్రారంభమైన తర్వాత యివ్వబడిన ఋణమునకు సంబంధించిన ఏదావాలోనయిన లేదా చర్యలోనైన హామీ గల ఋణము విషయములో నూటికి సంవత్సరమునకు తొమ్మిది సాధారణవడ్డికంటెను, హామీలేని ఋణము విషయములో నూటికి సంవత్సరమునకు పన్నెండు సాధారణ వడ్డి కంటెను ఏక్కువదైన వడ్డి కట్టబడినదని కనుగొనబడినయెడల కోర్టువారు అందుకువ్యతిరిక్తముగా ఋజువుచేయబడు నంతవరకు, కట్టబడిన వడ్డి 1918 సం॥పు దారుణపు వడ్డిగల ఋణముల ఆక్టుయొక్క 3వ, 4వ సెక్షనుల కార్యమునిమిత్తము అధికమనియు, దానికి సంబంధించిన కక్షిదారుల మధ్య జరిగిన వ్యవహారము ముఖ్యముగా అన్యాయమైనదనియు భావించవలెను.

వివరణము:— అట్లు యివ్వబడిన ఏఋణము విషయములోనయిన చాంపౌండువడ్డి కట్టబడి ఋణము వసూలు నిమిత్తము తేబడు దావా లేదా చర్యజరుపబడు తేదీవరకు అట్టివడ్డి రూపమున ఋణదాత వలన కోరబడిన మొత్తములు ఆయా సందర్భమునకు తగినట్లు నూటికి సంవత్సరమునకు తొమ్మిది రేటుచొప్పున లేదా నూటికి సంవత్సరమునకు పన్నెండు చొప్పున లెక్కింపబడిన సాధారణ వడ్డియొక్క మొత్తమును మించినయెడల కోర్టువారు అందుకు వ్యతిరేకముగా ఋజువు చేయబడునంతవరకు ఈ సబుసెక్షనులో చెప్పబడిన అభిప్రాయము కలవారైయుండవలెను.

(2) ఆ యా సందర్భమునకు తగినట్లు కట్టబడిన వడ్డి నూటికి సంవత్సరమునకు తొమ్మిది, సాధారణ వడ్డీకి మించనప్పటికిని అధిక ముగానుండి దానికిసంబంధించిన కక్షిదారుల మధ్యజరిగిన వ్యవహారము ముఖ్యముగా అన్యాయముగానుండెనని నమ్ముటకు కోర్టువారికి కారణ మున్న సందర్భములో (1) వ సబు సెక్షనులో నున్న నిబంధనలు 1918 సం॥పు దారుణపు వడ్డిగల ఋణముల ఆక్టుయొక్క 3, 4, వ ననుసరించి కోర్టువారికిగల అధికారములకు విరుద్ధముగాకుండ నుండ వలెను.

కాని యిప్పుడు అమలులోనికి వచ్చిన మదరాసు వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టువల్ల వ్యవసాదారులు యివ్వవలసిన వడ్డీ విషయములో చాలా మార్పులు చేయబడినవి. ఈ ఆక్టులో యేమి చెప్పబడియున్నను దానితో నిమిత్తము లేకుండా మదరాసు వ్యవసాయదారులకైన సహాయపు ఆక్టు వర్తించు వారలకు సదరు ఆక్టు ప్రకారముయివ్వవలసిన వడ్డీకంటె యెక్కువ వడ్డీనిరాబట్టుకొనుటకు యే ఋణదాతకు హక్కుయుండదు.

5 వ భాగము

# III

## దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు

( 1918 సం॥ 10 వ ఇండియా ఆక్టు )

1926 సంవత్సరపు 28 వ ఇండియా ఆక్టువల్ల మరియు 1937 సం॥రం మదరాసు ఆక్టువల్ల సవరింపబడినట్లుండునది. (1918 సం॥ మార్చి 22 తేదీన గవర్నరుజనరల్‌గారి అంగీకారము పొందినది.)

దారుణపువడ్డీగల పైకపు లేదా ధాన్యపు ఋణముల విషయమై కొన్ని సందర్భములలో వర్తించుటకై కోర్టులకు యెక్కువ అధికారమును ఇచ్చుటకైన ఆక్టు.

దారుణపువడ్డీగల పైకపు లేదా ధాన్యపు ఋణములవిషయమై కొన్ని సందర్భములలో వర్తించుటకై కోర్టులకు ఎక్కువ అధికారములను ఇచ్చుట యుక్తముగా నున్నందున ఇందువల్ల ఈ క్రిందివిధమున శాసింపబడమైనది.

సంగ్రహనామము వ్యాప్తియును.

సె 1. (1) ఈఆక్టును 1918 సం॥పు దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు అని చెప్పవచ్చును.

(2) ఇది బెలూచిస్థానముతో చేరిన యావత్తు బ్రిటిష్ ఇండియాకు వ్యాపించును.

(3) ప్రావిన్షియల్ గవర్నమెంటువారు లోకల్ అఫీషియల్ గెజిటులో ప్రకటనద్వారా వారిప్రకటనలో నిర్దేశింపబడగల ప్రదేశమునకు, లేదా తరగతుల మనుష్యులకు లేదా తరగతుల వ్యవహారములకు ఇది వర్తించకూడదని ఆజ్ఞాపించవచ్చును.

## వ్యాఖ్య:

### ఆక్టుయొక్క ఉద్దేశ్యములు, కారణములు:—

(1) బ్రిటిష్‌పరిపాలన ఇండియాదేశములో ప్రారంభించినతరువాత ఇంగ్లండులో అప్పటికప్పుడు శాసించబడు చట్టముల ననుకరించుచూ హిందూ దేశములో కూడ కొన్ని చట్టములు శాసించబడుచూ వచ్చినవి. ఇంగ్లాండు దేశములో షుమారు 1783 సంవత్సరములో గరిష్ఠ వడ్డీ రేట్లు నిర్ణయించుచూ శాసనము చేయబడెను. తరువాత 1802 లో మదరాసు రాజధానిలో 35 వ రిగ్యులేషనువల్ల కోర్టులో ఏ కేసులో నైనా అనుమతించగల గరిష్ఠవడ్డీ 100కి సంవత్సరమునకు రు 12-0-0 లు చొ॥న నిర్ణయించ బడినది. అట్టిశాసనమువలన వ్యక్తులు తమఇష్టానుసారము ఒడంబడికలుచేసికొను స్వాతంత్రము బోవుచున్నదనియు, అట్టి స్వతంత్రమును భోగొట్టు శాసనములు రద్దుకావలెనని ఇంగ్లాండు, ఇండియాదేశములలో ప్రబలమైన ఆందోళన ప్రారంభమైనది. దాని పర్యవసానముగా ఇంగ్లాండులో 1854 సం॥రంలో అన్యాయపు వడ్డీచట్టముల రద్దు చట్టము శాసించబడినది. ఇండియాలో 1855 సం॥రం లో అన్యాయపువడ్డీ చట్టముల రద్దుఆక్టు శాసించబడినది. దానితో పార్టీలు యెంత హెచ్చు మొత్తము వడ్డీ ఏర్పరుచుకున్నను కోర్టులు ఆ మొత్తములను అనుమతించవలసి వచ్చినది. ఋణదాతలు ఆ పరిస్థితులలో ఋణస్థులయొక్క అమాయకత్వమును జరూరు అవకాశము తీసికొని అక్రమములు చేయుట ప్రారంభించిరి. కొంతకాలమునకు దేశములో అన్యాయపు వడ్డీలనుండి నిస్సహాయులును వ్యవహారజ్ఞానములేనివారు నగు బీదలకు తగినరక్షణయొసగుట పరిపాలకుల కర్తవ్యమని ప్రజలు గుర్తించి ఆందోళన చేయసాగిరి. "ఈ విషయమున ఇండియా గవర్నమెంటువారు ఆలోచించుచూ అక్రమమైన అధికారము కారణముమీద ఒక కంట్రాక్టు ఏ సిద్ధాంతముననుసరించి త్రోసివేయ తగియుండునో అది యెక్కువ స్పష్టముగా నిర్వచించునట్లుగా 1872 సం॥పు ఇండియా కంట్రాక్టు ఆక్టుయొక్క 16, 19 సెక్షనులు 1899 సం॥లో సవరింపబడినవి.

(2) "అక్రమమైన ఆధికారము అనే అంశము ఋజువుపడినయెడల దారుణపు వడ్డీకంట్రాక్టులకు సంబంధించిన వ్యాజ్యములలో ధర్మవిచారణాధికారమును ఇండియాలోని కోర్టులకు యిచ్చుటయే ఆ సవరణవలన కలిగిన ఫలితముకాని అక్రమమైన అధికారము రుజువు పరచుటకు వీలులేనప్పుడు కోరబడినవడ్డీ వగైరాలు యెంతమితిమీరియున్నను చేసినబేరము యెంతఅన్యాయమైయున్నను (1885 సం॥ 28 వ దగు) అన్యాయపువడ్డీ చట్టముల రద్దుఆక్టుయొక్క 2 వ సె॥ యొక్క కాఠిన్యము తీవ్రముగునట్లు చేయుటయే పర్యవసానమైనది. ఇదిగాక ఇండియా కంట్రాక్టుయొక్క 16 వ సె॥లోని "అన్యాయమైన" అనుమాటకు ఇంగ్లీషు ధర్మవిచారణలో యేర్పడిన సాంకేతిక అర్థమును చేయుటయు అందలి పర్యవసానముగా జోక్యము కలుగచేసికొనుటకు తమకుగల అధికారమును పరిమితపరచుకొనుటయును కోర్టులధోరణిగా నున్నది.

(3) కోర్టుఎదుటనుండు ఒక ప్రత్యేకవ్యవహారము తరచు వరుసగావచ్చు నేఅక వ్యవహారములలో ఒకటిమాత్రమే అయియుండును. దానినిదాటి వెనుకకువెళ్ళుటకును తత్సంబంధమైన పూర్వపుఒడంబడికలను, అట్టిస్థితిగతులను పరిశీలించుటకును అధికారమున్ననేతప్పధర్మానుకూలముగ తీర్మానమునకువచ్చుటకు కోర్టులకుసాధ్యమగుటలేదు.

(4) (1) వడ్డిగాని, వసూలియ్యవలపిన యితరమొత్తముగాని ఎక్కువగానున్నదనిన్ని (2) ఆవ్యవహారము ముఖ్యాంశములలో అక్రమముగానున్నదనిన్ని కోర్టువారు తృప్తిపొందియుండు సందర్భములలో పైకపు లేదా ధాన్యపు ఋణముల రూపకమైన వ్యవహారములను తిరుగదోలుటకు (మరలప్రారంభించుటకు) ను తత్కాలమునగాని, తత్పూర్వముగాని దానికి సంబంధించిన స్థితిగతులను పరిశీలించినమీదట ఆ కక్షిదారుల మధ్య ఆ వ్యవహారము సవరించుటకును, ఆ సందర్భములో ఉండగల అపాయమును, యావత్తు స్థితిగతులను గమనించి అగత్యమైనయెడల కోర్టువారు న్యాయముగానుండునని తీర్మానించు మొత్తమువరకు చెల్లించవలసిన పైకమునుతగ్గించుటకు కోర్టులకు అధికారమిచ్చుటనుగురించి ఇండియా గవర్నమెంటువారు ప్రావిన్షియల్ గవర్నమెంట్లతో అలోచించి 1918 సం॥పు దారుణపు వడ్డీగల ఋణముల చట్టమును చేసిరి.

(5) పైకపు ఋణములేగాక ధాన్యపు ఋణములుకూడ చేరునట్లుగా నిబంధన ఏర్పరుపబడినది. ఏలయన ధాన్యపు ఋణములు తరుచు మిక్కిలిభారమైన షరతులతో చేయబడుచున్నవి. అందువల్ల అట్టి ఋణములకుకూడ ఈఆక్టు వర్తింపజేయడమైనది.

(6) ఈ రాజధానిలో (1918 సం॥ 10 వ దగు) దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు ఎట్లు పనిచేయుచున్నదని విచారించగా సదరు ఆక్టువలన కోర్టులకివ్వబడిన అధికారములు ముఖ్యముగా 3వ సెక్షనువలన యివ్వబడిన అధికారములు, ఇష్టమునకుసంబంధించిన వగుటచేత, ఏవిధముగాగాని ఒకేవిధముగా వినియోగింపబడినట్లు కనుపడలేదు. హైకోర్టువారితో ఆలోచించినమీదట కోర్టులు అట్టిఅధికారములను తప్పకుండ చెలాయించుట తప్పనిసరిగాచేయుట వాంఛనీయమని గవర్నమెంటువారు తలచిరి. ఈఉద్దేశ్యమును నెరవేర్చుటకు 1937 సం॥ VIII వ దారుణపు వడ్డీగల ఋణముల (మదరాసు సవరణ) ఆక్టును సాదరుచేసిరి. ఆ ఆక్టు 31-12-36 తేదీన గవర్నరుగారి యొక్కయు 5-2-37 తేదీన గవర్నరు జనరల్‌గారి యొక్కయు అనుమతిని బడసి 5-2-37 తేదీన అమలులోనికి వచ్చినది.

(7) ఈ సవరణ ఆక్టుప్రకారము యిరువురు కక్షిదారులకు మధ్యజరిగిన వ్యవహారము ముఖ్యముగా అన్యాయముగా నున్నయెడల, కష్టము నివారింపబడవలెననియు కట్టబడిన వడ్డీరేటు అధికముగా నున్నయెడల అట్టి అన్యాయము జరిగినట్లూహింపబడవలెననియు ఈఆక్టు శాసించుచున్నది. కాని అధికవడ్డీ రేటును సమర్థించు ప్రత్యేక పరిస్థితు లున్నవని ఋజువు చేయుటవలన అట్టి వూహ ఖండింపబడుట కవకాశమివ్వబడినది.

(8) ఈ రాజధానియందు వ్యవసాయదారులు తాము కాంపౌండు వడ్డీతో ఋణముల భారమును భరించజాలరను విషయమును గమనించి వ్యవసాయదారుల కివ్వబడు ఋణములకు కాంపౌండు వడ్డీ కట్టబడినయెడల అట్టి వడ్డి అధిక మైనదిగా తలంపబడవలెనని శాసించబడినది. ”

(9) మదరాసు ఋణస్థుల రక్షణ ఆక్టుకూడ కొన్నితరగతుల ఋణములకు వడ్డి గరిష్ఠరేట్లను నిర్ణయించుచూ కొన్ని సౌకర్యములను కలుగజేసినది. ఇప్పుడుఅమలులోనికి వచ్చిన మద్రాసు వ్యవసాయదారులకైన సహాయపుఆక్టు నిబంధనల ప్రకారము సదరు ఆక్టులో నిర్వచింపబడిన వ్యవసాయదారులకు చాలా ఎక్కువసౌకర్యములు చేయబడి నవి. ఆ ఆక్టు వర్తించనివారికి యీ దారుణపు వడ్డీగల ఋణముల ఆక్టు క్రింద తగిన కేసులలో పరిహార మివ్వబడును.

సె 2. ఈ ఆక్టులో విషయమందుగాని సం

నిర్వచనములు దర్భమందుగాని విరోధమైన దేదైనయున్న నే తప్ప—

(1) “వడ్డి” అనగా వడ్డియొక్క రేటు అని అర్థము. మరియు దానిలో వాస్తవముగా ఇచ్చిన ఋణముగాక దానికిపైగా అట్టిని ఏర్పాటుగా వడ్డిమూలముగనో లేదా మరియొక విధముగనో కట్టబడిన లేదా రాబట్టుకొనుటకు ప్రయత్నము చేయబడిన ప్రతిఫలముచేరును.

(2) “ఋణము” అనగా పైకపు లేదా ధాన్యపు ఋణము అని అర్థము. మరియు దానిలో కోర్టువారి అభిప్రాయములో వస్తుతః ఋణ ముగాయున్న యేవ్యవహారమైన చేరును.

(3) “ఈ ఆక్టు వర్తించు దావా” అనగా

(a) ఈ ఆక్టు ప్రారంభించిన తరువాత చేయబడిన ఋణమును రాబట్టుటకైన లేదా

(b) ఈ ఆక్టు ప్రారంభించుటకు పూర్వముగాని తరువాతగాని చేయబడిన అట్టి ఏదేని ఋణము విషయములో ఈఆక్టు ప్రారంభించిన తరువాత చేయబడిన ఏదేని ఒడంబడికనో, పుచ్చుకోబడిన ఏదేని జామీనునో అమలుజరుపుటకైన, లేదా

(c) ఈ ఆక్టు ప్రారంభించుటకు పూర్వముగాని, తరువాతగాని అట్టి ఏదేని ఋణవిషయములో ఈ ఆక్టు ప్రారంభమయిన తరువాత యివ్వబడిన ఏదేని జామీను యొక్క విడుదలకు అయిన యే దావా అయినా అని అర్థము.

వ్యవహారములను తిరుగ దోడించుట (మరల ప్రారంభించుట.)

సె 3. (1) 1885 సం॥పు అన్యాయపువడ్డీ చట్టములరద్దు ఆక్టులో యున్న దేనితోను నిమిత్తము లేకుండా ఎక్సుపార్టీగా గాని మరియొక విధముగా గాని యున్న ఈఆక్టు వర్తించు ఏ దావాలోనైనాదానికిసంబంధించినకక్షీదారుల మధ్య జరిగినవ్యవహారము ముఖ్యముగా అన్యాయముగా నున్నదని తలచుటకు కారణమున్న యెడల యితర కోర్టు వారు ఈ క్రింది అధికారములలో ఒకటినైన లేదా అంతకు మించిన వాటినైనా చెలాయించవచ్చును.

అవి ఏమనగా:—

i. ఆ వ్యవహారము తిరుగదోడి (మరలప్రారంభించి) ఆ కక్షీదారులకు గల లెక్కలనుజూచి మరియు అట్లే ఎక్కువగాయున్న వడ్డీ విషయములో బాధ్యత ఏ మాత్రము లేకుండా ఋణస్థునికి విముక్తి కలుగ చేయవలెను.

ii. తత్పూర్వపు వ్యవహారములను మర్తబుచేయునట్లును క్రొత్త బాధ్యతలను కలుగ చేయునట్లును తాత్పర్యముగు ఒడంబడిక యేది యున్నను దానితో నిమిత్తము లేకుండా వారి సంబంధములో ఇది వరలోనే తయారుచేయబడిన ఏ లెక్కనైనను తిరుగదోడుచూ అట్టి ఎక్కువగానున్న వడ్డీ విషయములో బాధ్యత ఏ మాత్రము లేకుండా ఋణస్థునికి విముక్తి గలుగచేయవలెను. మరియు అట్టి బాధ్యత విషయములో ఏదైనా చెల్లింపబడియుండినను లేదా వసూలిచ్చి వేయబడి యుండినను దాని విషయములో ఋణదాత తిరిగి ఇచ్చివేయ తగినదని కోర్టువారు తలచునట్టి యెంతమాత్రమునైనను తిరిగి యిచ్చివేయ వలసినదని ఋణదాతకు ఉత్తర్వు యివ్వవచ్చును.

iii. అట్టి ఏ ఋణము విషయములోనైనను యిచ్చిన యేదేని జామీనునైనను చేసిన ఏదేని ఒడంబడికనైనను పూర్తిగనో కొంత వరకో త్రోసివేయవచ్చును, లేదా సవరించవచ్చును, లేదా మార్చవచ్చును. మరియు ఋణదాత తాకట్టు వస్తువును అన్యాక్రాంతము చేసియున్నయెడల కోర్టువారు న్యాయమని తలచునట్టి విధముగాను అంతవరకును ఋణస్థునికి నష్ట పరిహారము కలుగ చేయవలసినదని వుత్తరువు చేయవచ్చును.

అయితే ఈ అధికారములను చెలాయించుటలో కోర్టువారు

(i) కక్షిదారులు లేదా కక్షిదారుల ద్వారా హక్కు కలిగిన యితర మనుష్యులును ఏర్పాటు చేసుకొన్న తత్పూర్వపు వ్యవహారపులను మర్దబు చేయునట్లును, క్రొత్త బాధ్యతను కలుగ చేయునట్లును తాత్పర్యమగు ఒడంబడికను ఆ వ్యవహారము జరిగిన, తేదీకి 12 సంవత్సరములు తరువాత తిరుగదోడకూడదు.

(ii) ఒక కోర్టుయొక్క డిక్రీని మార్పుచేదేనిని చేయకూడదు.

1వ వివరణము:— వడ్డీ అధికముగా నున్నయెడల ముఖ్యముగా సదరు వ్యవహారము అన్యాయముగా నున్నదని కోర్టువారు ఊహించవలెను. అయితే వడ్డీ రేటును సమర్థించు ప్రత్యేకమగు పరిస్థితుల యొక్క ఋజువుచేత అట్టి ఊహను ఖండించవచ్చును.

2 వ వివరణము:- వరుసగావచ్చు అనేక వ్యవహారములనుబట్టి తేబడిన ఒక దావాలో 1 వ మినహాయింపు కార్యము నిమిత్తము వ్యవహారము అనగా అట్టి వ్యవహారములో మొదటిది అని అర్థము. అట్టి వ్యవహారములో

(2) (a) ఈ సెక్షనులో "మిక్కిలి ఎక్కువగా యున్న" అను మాటలకు ఋణము ఈయబడు తారీఖున ఋణదాతకు పొందునట్లు కనుపడిన లేదా కనుపడినట్లు యెంచబడిన అపాయమును గమనించి కోర్టువారు న్యాయమని తలచుదానికంటె యెక్కువ అని అర్థము.

(b) ఈ సెక్షను ననుసరించి వడ్డి యెక్కువగా నున్నదా యను సంగతిని విచారించడములో ఖర్చులు, విచారణలు, జుల్మానాలు, బోనసులు, ప్రీమియములు, రిన్యూయల్సు (పాత ఋణమును తిరిగి కొత్తగా ఏర్పాటు చేయుట) కు లేదా వేరే ఏవేని ఖర్చుల కొరకై రొఖముగాగాని వస్తురూపముగాగాని కట్టిన లేదా చెల్లించిన యే మొత్తములనైనను మరియు కాంపౌండు వడ్డి (వడ్డీకి వడ్డీ) కట్టబడే యెడల అది ఎంతకాలము కట్టబడినదిన్ని ఆవ్యవహారమువలన న్యాయముగా ఎంతలాభము వచ్చునని యెంచి యుండునట్లు భావింపతగి యుండునదిన్ని కోర్టువారు ఆలోచనలోకి తేవలెను.

అయితే వ్యవసాయదారులకు యివ్వబడు ఋణముల సందర్భములో కాంపౌండువడ్డి కట్టబడినయెడల సదరు వడ్డి అధికమైనదని కోర్టువారు ఊహించవలెను.

(c) అపాయమునుగురించి విచారించడములో తాకట్టువున్నది లేనిదిన్ని మరియు దాని విలువ ఋణస్థునియొక్క అర్థిక స్థితి, మరియు అంతకుపూర్వము ఋణములు చేయుటమూలముగా ఋణస్థుడు చేసిన వ్యవహారముల యొక్క ఋణదాతకు తెలిసియున్నంతవరకును లేదా తెలిసియున్నట్లు భావింపతగి యున్నంతవరకు పర్యవసానమున్నూ కోర్టువారు ఆలోచనకు తేవలెను.

(d) ఒక వ్యవహారము ముఖ్యాంశములో అక్రమముగా నున్నదా అను సంగతిని విచారించడములో ఋణదాతకు తెలిసి యున్నంతవరకు గాని, తెలిసియున్నట్లు భావింపవలసియున్నంతవరకు గాని, ఋణము ఈయబడి యుండుకాలములో ఋణస్థునికుండిన లేదా ఉన్నట్లు ఊహింపబడిన అక్కరలుసహా; ఋణము ఈయబడియుండు కాలములో ఆ కక్షిదారుల పరస్పర సంబంధములను వాస్తవముగా బాధించునట్టి లేదా ఆ వ్యవహారము అన్యాయముగా యున్నట్లు రూపించగల యావత్తు స్థితిగతులనున్ను కోర్టువారు ఆలోచనలోనికి తేవలెను.

(3) ఏ దావాఅయినను దాని స్వరూపము ఎట్టిదై యుండినను ముఖ్యాంశముతో ఒక ఋణమును రాబట్టుటకొరకైన దైనను, ఒక ఋణము విషయములో ఏదేని ఒడంబడికనో లేదా జామీనునో అమలుజరుపుటకైనదైనను లేదా అట్టి యేదైన జామీను విడుదల నిమిత్తమైనను దానికి యీ సెక్షను వర్తించవలెను.

(4) విలువ (ప్రతిఫలము) యిచ్చి తన స్వాధీనమందుంచుకొని యుండి తనకు చేయబడిన పరివర్తన (ట్రాన్స్ఫరు సదుద్దేశముతో కూడినదనియు, మరియు ఆ పరివర్తన కాలములో ఋణస్థునికి ఋణదాతపైన యీసెక్షనుప్రకారము పరిహారముకోరగల ఏ సంగతిన్ని తనకు దృష్టిలో లేదనిన్ని, కోర్టువారిని తృప్తిపరచు యే ట్రాన్స్ఫరు దారునియొక్క హక్కులను ఈ సెక్షనులో నున్న దేదియును బాధింప కూడదు.

ఈ సబుసెక్షను కార్యము నిమిత్తము "దృష్టి" అను మాటకు 1882 సం॥పు ఆస్తి పరివర్తన ఆక్టు సె 4 క్రింద ఆరోపింపబడిన అర్థమునే కలిగియుండవలెను.

(5) ఈ సెక్షనులో నుండునదేదియును ఏదేనికోర్టుకు ప్రస్తుతము నందు గల అధికారములనైన అధికార వ్యాప్తి నైనను బాధించునట్లు భావింపకూడదు.

సె. 4. దివాళా అగుటనుగురించి ఏ చర్యలోనైనా ఋజువును అంగీకరించుటకు సంబంధించిన లేదా ఆ ఋజువు యొక్క బలమునకు సంబంధించిన ఏదేని దరఖాస్తుపైని ఈ ఆక్టు వర్తించు ఒక దావాలో 3 సె. ననుస రించి ఒక కోర్టువల్ల చెలాయింపబడునట్టి అధికారమును ఆ కోర్టు చెలాయించవచ్చును.

దివాళాచర్యలు.

# ఆఱవ భాగము

## పంచాయతీ ఆక్టు నిబంధనలు

### మద్రాస్ గ్రామ కోర్టుల ఆక్టును సవరణ చేయుట గ్రామపంచాయతీలు గ్రామపంచాయతీ కోర్టులుగా మార్చుటకు నిబంధనలు.

మదరాసు గ్రామకోర్టుల ఆక్టును సవరణ చేయుట

సె 132 (ఇందు నిటుతర్వాత ఈ సెక్షనులో సదరు ఆక్టు అని చెప్పబడు) 1888 సంవత్సరపు మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టులో యేది యున్నను, దానితో నిమిత్తము లేకుండ

(1) ఏ ప్రదేశమునకైనను ఈ ఆక్టుక్రింద నిర్మింపబడిన లేక నిర్మింపబడినట్లు భావింపబడిన ప్రతిపంచాయతీ సదరు ఆక్టుయొక్క 9 (1) సెక్షను క్రింద ఆ ప్రదేశమునకైన పంచాయతీకోర్టుగా భావింపబడవలెను. అట్టి పంచాయతీయొక్క సభ్యులు (ప్రెసిడెంటు మరియు వైస్ ప్రెసిడెంటుతో సహా) అట్టి పంచాయతీ కోర్టుయొక్క ఉద్యోగరీత్యా మెంబర్లుగా భావింపబడవలెను. పైనచెప్పిన ప్రెసిడెంటు, వైస్ ప్రెసిడెంటు ఆ పంచాయతీ కోర్టుయొక్క క్రమముగా ఉద్యోగరీత్యా ప్రెసిడెంటు వైసు ప్రెసిడెంటుగా కూడ భావింపబడవలెను.

(2) ఒక పంచాయతీ ఆక్టుయొక్క 48 (1) సెక్షనుక్రింద అంత్యము కావింపబడిన లేక రద్దుచేయబడిన విషయములో, పైన చెప్పిన పంచాయతీ కోర్టులో, సదరు పంచాయతీ తిరిగి నిర్మింప బడునంతవరకు—

(a) ఆయా సందర్భమునకు తగినట్లు పంచాయతీ యొక్క ప్రెసిడెంటు లేక ఈ ఆక్టుయొక్క సె 48 (5) క్రింద నియమింపబడిన మనిషి ఉండవలెను.

(b) పంచాయతీ మెంబర్లుగా ఎన్నుకొనబడుటకు అర్హతగల మనుష్యులనుండి ఇన్స్పెక్టరు నియమించిన యితర ముగ్గురు మెంబర్లు యుండవలెను.

(3) ఈ ఆక్టుక్రింద నిర్మింపబడినట్లు భావింపబడిన ఒక పంచాయతీ యొక్క విచారణాధికారములోని ఏ విస్తీర్ణమునందైన యీ ఆక్టు ప్రారంభమునకు పూర్వము సదరు ఆక్టుక్రింద సాపింపబడిన ఏదైన గ్రామ లేక పంచాయతీ కోర్టు లేక కోర్టులు

ఏదైన యున్నయెడల, దాని విచారణాధికారము అంతము కావలెను. మరియు ఆ పంచాయతీ సదరు ఆక్టుయొక్క 9A మరియు 9B సెక్షనుల అర్థములోను, దాని కార్యముల నిమిత్తమును అట్టి కోర్టు లేక కోర్టులకు బదులుగా స్థాపించబడిన ఒక పంచాయతీ కోర్టుగా భావింప బడవలెను.

(4) అట్టిపంచాయతీయొక్కయైన విచారణాధికారములోనుండు ప్రదేశములో.

(a) సదరు ఆక్టుయొక్క 6 నుండి 8, 9 (2) (3) (4) (5) (A) మరియు (7) సెక్షనులయొక్క నిబంధనలు వర్తించకూడదు.

(b) ఇన్స్పెక్టరు రే పంచాయతీ కోర్టుయొక్కయైన ప్రెసిడెంటు, వైసు ప్రెసిడెంటు లేక మెంబర్లను వారు (1)వ క్లాజు (2)వ క్లాజుక్రింద ఉద్యోగము కలిగి యుండినప్పటికిని అసమర్థత, విధిని ఉపేక్షించుట, దుర్నడత, లేక యితర న్యాయమైనట్టియు, చాలినట్టియు కారణము నిమిత్తము ఉద్యోగమునుండి తొలగించవచ్చును;

(c) సదరు ఆక్టుయొక్క సె 9(5) (b) (c) (d) మరియు(e) సెక్షనుయొక్క నిబంధనలు (2)వ క్లాజులో చెప్పబడిన సందర్భములో వర్తించకూడదు. అట్టిసందర్భములో ఆ పంచాయతీయొక్క ప్రెసిడెంటు దానిసమావేశములకు అధ్యక్షతవహించవలెను. ఆయన ఏసమావేశమునకైనను హాజరుకానిపక్షమున హాజరుగానుండు సభ్యులు ఆ సమావేశముయొక్క కార్యముల నిమిత్తము తమలోనుండి ఒకరిని ప్రెసిడెంటుగా ఎన్నుకోవలెను.

(d) సదరు ఆక్టుయొక్క 13వ సెక్షనుయొక్క నిబంధనలు "ఏబదిరూపాయల మొత్తము" అనుమాటలకు బదులుగా "వందరూపాయల మొత్తము" అనుమాటలు ఉంచబడిన నెట్లో అట్లే అర్థము చేసికోవలెను.

(5) ప్రభుత్వమువారు ప్రకటనద్వారా, ఈ సెక్షను క్రింద స్థాపించబడిన యే పంచాయతీకోర్టుకైన సదరు ఆక్టులో నిబంధింపబడని ఏ సివిల్ లేక క్రిమినల్ విచారణాధికారములైన ఇయ్యవచ్చును.

పంచాయతీలను డీసిపే యుటయును, రద్దు చేయుట యును.

సె. 48 (1) గవర్నమెంటువారి యొక్క అభిప్రాయములో ఒక పంచాయతీ చట్టమువలన విధింపబడిన పనులను చేయుటకు అర్హత కలిగి యుండని యెడల లేదా చేయుటలో పదేపదేతప్పిపోవు చుండునెడల, లేదా దాని అధికారములను అతిక్రమించుచున్న యెడల దుర్వినియోగపరచుచున్న యెడల వారు ప్రకటనద్వారా—

(a) నిర్ణయింపబడిన ఒక తేదీనుండి పంచాయతీ తొలగింపబడి, వెంటనే లేదా నిర్ణయింపబడిన మరియొక తేదీనుండి అది పునర్నిర్మాణము చేయబడవలెనని ఆజ్ఞాపింప వచ్చును; లేదా

(b) నిర్ణయింపబడిన ఒక తేదీనుండి ఒక సంవత్సరమునకు మించని ఒక కాలపరిమితికి సదరు పంచాయతీని రద్దుచేయవచ్చును.

(2) (1) వ సబు సెక్షనులో నున్న దేదియును, పంచాయతీ పరిసమాప్తి చేయబడిన లేక రద్దుచేయబడినకాలపరిమితిలో ప్రెసిడెంటు ఉద్యోగములో నుండుటకును బాధించ గూడదు.

(3) (1) వ సబుసెక్షను ననుసరించి ఒక ప్రకటన ప్రకటించుటకు పూర్వము గవర్నమెంటువారు ఏ కారణములనుబట్టి వారు అట్లు చేయుటకు ఉద్దేశించిరో ఆ కారణములను పంచాయతీకి తెలియజేసి ఆఉద్దేశమునకువ్యతిరేకముగా గల కారణమును పంచాయతీ తెల్పుటకు న్యాయమైన ఒక కాలపరిమితిని నిర్ణయించి, దానిసంజాయిషీలు ఆక్షేపణలు ఏవైన వున్నయెడల, వాటిని ఆలోచించవలెను.

(4) (1) వ సబుసెక్షనుననుసరించి ఒకపంచాయతీని తీసివేయుటకు లేదా రద్దుచేయుటకు నిర్ణయింపబడిన తేదీన దానిమెంబర్లు అందరును, దాని వైస్ప్రెసిడెంటునుకూడ అట్టివారుగ తమ ఉద్యోగములను వెంటనే ఖాళీచేసినట్లుగా తలంపబడవలెను.

(5) ఆయాసంగతికి తగినట్లు ఒక పంచాయతీ తీసివేయబడుటకును, పునర్నిర్మాణము చేయుటకును మధ్య వ్యవధి యేదైన యున్న యెడల ఆ కాలములో లేదా అది రద్దు చేయబడియుండు కాలములో ప్రెసిడెంటు, గవర్నమెంటువారు ఆవిషయముగా నిర్ణయించ గల విధముగా సాధ్యమైనంతవరకును, అట్టిమేరకును పంచాయతీ అధికారములను చెలాయించవలెను. విధులను నెరవేర్చవలెను. పంచాయతీ పరిసమాప్తియగు లేదా రద్దుయగు తేదీన ప్రెసిడెంటు ఉద్యోగము ఖాళీగా యున్న సందర్భములలో లేక పంచాయతీని పునర్నిర్మాణము చేయు

టకు పూర్వము ఖాళీయైన సందర్భములలో, పంచాయతీ యొక్కయు, దాని ప్రెసిడెంటు యొక్కయు అధికారములను చెలాయించుటకును, విధులను నెరవేర్చుటకును, మరియు ప్రెసిడెంటు కార్యనిర్వాహక అధికారిగాకూడ నుండుపక్షమున పంచాయతీ పునర్నిర్మాణముచేయబడు నంతవరకు అతని అధికారములను చెలాయించుటలో విధులను నెరవేర్చుటతో సహా ఇన్‌స్పెక్టరు ఒక మనిషిని నియమించవచ్చును. అట్లు నియమింపబడిన కార్యనిర్వాహక అధికారి కానట్టి ఏ యితర మనిషియైనను, ఇన్‌స్పెక్టరు అట్లు ఆజ్ఞాపించిన పక్షమున ఆయన అట్లు కొలువుచేసినందుకు పంచాయతీనుండి జీతమును పొందవచ్చును.

# ఏడవ భాగము

## సాక్షి చట్టపు అంశములు.

(1) "సాక్ష్యము"

అనగా ఒక సివిల్ లేదా క్రిమినల్ కేసు విచారణలో కోర్టులు తీర్మానించ వలసిన అంశములనుగురించి, సాక్షులు చెప్పు మాటలు, అట్టిఅంశములను సంబంధించిన దస్తావేజుల నిర్వచన మీయవచ్చును. సాక్షులు చెప్పు మాటలు మూజువాణి సాక్ష్యమనియు, దస్తావేజులు దస్తావేజు సాక్ష్యమని చెప్పబడును.

(2) సివిల్ క్రిమినల్ కేసులలో యుండవలసిన సాక్ష్యము యొక్క స్వభావము.

సివిల్ క్రిమినల్ కేసులకు ఒకేసాక్షి చట్టపునిబంధనలు వర్తించును. కాని సివిల్ కేసులలో ఒక అంశమునుగురించి ఉభయవాదులు సాక్ష్యము పెట్టినపుడు సాధారణముగా కోర్టులు ఆ రెంటిలో యేసాక్ష్యము యెక్కువ నమ్మదగినదిగాయున్న ఆసాక్ష్యమునుబట్టి తమతీర్పును యిచ్చెదరు కాని క్రిమినల్ కేసులలో ఒకనిపై నేరస్థాపన చేయవలెనన్న, కేసులోని ముద్దాయియే నేరముచేసెనని యేమాత్రము అనుమానమునకు అవకాశములేనంత సాక్ష్యముండవలెను. అనుమాన మేమాత్రమున్నను దానియొక్క లాభమును ముద్దాయికి కలుగజేసి అతడు నిర్దోషియని విడుదల చేయవలసియుండును.

ఉదాహరణము:- ఒక ప్రోనోటునుబట్టి ఒకడు మరియొకనిపై దావా తెచ్చెను. ప్రతివాది దావానోటు తాను వ్రాయలేదని అది ఫోర్జరీచేయబడినదని వాదనచేయును. కోర్టువారు వాది ప్రతివాదులు సాక్ష్యమునువిని ప్రతివాదితరఫు సాక్ష్యము యెక్కువ నమ్మదగినదిగా యున్నదనియెంచి వాది దావాను పరిహరించిరి. వాది ఆదావానోటును ఫోర్జరీచేసినట్లు అతనిపై క్రిమినల్ కేసు పెట్టిన అదివరలో సివిల్ కేసులోని సాక్ష్యమున్న చాలకపోవచ్చును. క్రిమినల్ కేసులో ముద్దాయి నేరముచేసినట్లు రుజువుచేయవలసిన భారమంతయు ఫిర్యాదిపైనుండును. వాది దావా ప్రోనోటును ఫోర్జరీచేసినట్లు ఖచితమైన రుజువుయున్నగాని వాది శిక్షాపాత్రుడుగాడు. దావానోటు ప్రతివాది వ్రాసియుండుటకు యెట్టిఅవకాశములేదని వాది దానిని ఫోర్జరీచేసినాడని స్పష్టముగా రుజువుచేయగల సాక్ష్యమున్నగాని ముద్దాయిని శిక్షించుటకు వీలులేదు.

## (3) సాక్ష్యమిచ్చుటకు యెవరు అర్హులు ?

కోర్టులు, ఏవ్యక్తియైనా పసితనమువల్ల లేదా అతివృద్ధాప్యమువల్ల లేదా శరీర లేదా మానసిక వ్యాధివల్ల లేక అట్టి యేయితర కారణమువల్లనైనా అడిగినప్రశ్నలను అర్థముచేసుకొని, సరియైన జవాబులు చెప్పుటకు అవకాశములేదని తలచినగాని లేకున్న ప్రతిమనిషి (అనగా స్త్రీ పురుషులు) సాక్ష్యము చెప్పుటకు అర్హతయున్నది.

ఒకడు పిచ్చివాడుగయున్నను, ఆతడు అడిగిన విషయములను అర్థముచేసుకొని తగిన సమాధానములు చెప్పగలస్థితిలోయున్న అతనిని సాక్షిగా విచారించవచ్చును.

మూగవాళ్ళు మాట్లాడుటకు శక్తిలేనివారైనను, వ్రాయుటమూలముగా గాని సంజ్ఞలు ఇతరగుర్తులవల్ల తమ అభిప్రాయములను చెప్పగలిగినవారలను సాక్షులుగా విచారించవచ్చును.

## (4) సాక్షులను ప్రమాణము చేయించి విచారించవలెను.

సాక్షులను విచారించకపూర్వము వారిచే నిజము చెప్పుదుమని ప్రమాణము చేయించవలెను. కాని ఇండియన్ ప్రమాణముల ఆక్టు సె 6 ప్రకారము 12 సంవత్సరములలోపు వయస్సుగల సాక్షి ప్రమాణముయొక్క స్వభావమును గ్రహింపజాలడని కోర్టుతలచిన ప్రమాణముచేయించకుండనే సాక్ష్యము తీసుకొనవచ్చునని, ప్రమాణముపై చెప్పలేదని సాక్ష్యము చెల్లదని వాదనచేయుటకు వీలులేదని నిబంధనచేయబడినది.

## (5) ఒక కేసులో ఎంత సాక్ష్యముండవలెను ?

ఈకేసులో ఇటువంటి సాక్ష్యముండవలెననే స్పష్టమైన నిబంధనచేయుటకు అవకాశమేలేదు. ఒకకేసులో ఇంతమందిసాక్షులను విచారించవలెనని చెప్పుటకు వీలులేదు. చాలామంది సాక్షులను విచారించినంతమాత్రముననే వారిసాక్ష్య మంగీకరించవలసిన అగత్యములేదు. కాని సాధారణముగా కేసు అంశములను గురించి చెప్పగల ముఖ్యమైన సాక్షులందరిని విచారించవలసియుండును. చాలాముఖ్యమైనసాక్షులను కారణములేకుండవదలిన ఆఅంశము రుజువుఅయినట్లు కోర్టులంగీకరించవు. అయా కేసుసందర్భములనుబట్టి ఆవిషయము తీర్మానించవలసి యుండును. కొన్ని కేసులలో పార్టీలుమాత్రమే సాక్ష్యము చెప్పవచ్చును. వారు పార్టీలైనంతమాత్రముననే వారిసాక్ష్యము నమ్మతగనిది కాకపోదు. కోర్టులు ఉభయపార్టీలలో యెవరిసాక్ష్యము నమ్మతగినదాయని విచారించి తీర్మానించెదరు. కొన్ని విషయములలో పార్టీల సాక్ష్యముతప్ప యితరసాక్ష్యముండుటకవకాశము యుండకపోవచ్చు. కాని యితరసాక్షులుయుండుటకు అవకాశమున్నపుడు అట్టివారిని విచారించవలసియుండును. లేనియెడల పార్టీసాక్ష్యమును కోర్టువారు నమ్మకపోయినను తప్పుగాదు.

కేసులో న్యాయశాస్త్ర ప్రకారము అవసరమైన రుజువుయుండవలెను. కోర్టు వారికిగల అనుమానమును బట్టిగాని, కోర్టువారు మనస్సులోపడిన తృప్తిననుసరించి గాని కేసులను తీర్మానించరాదు. కేసులో రుజువుచేయబడిన సాక్ష్యము నాధారమును జేసికొని తీర్పుయుండవలెను. కోర్టులు ఒకవిషయమై తీర్మానించుటలో జడ్జీలకు స్వయముగా తెలిసిన విషయములనుబట్టి తీర్మానించరాదు.

## (6) ఏ విషయములను గురించి సాక్ష్యముండవలెను ?

ఒక కేసులో తీర్మానించవలసిన అంశములనుగురించి ఆ అంశములకు సంబంధము కలిగి ఆఅంశముల నిజానిజములు తెలియుటకు పనికివచ్చు విషయములనుగురించి ఒక విషయము జరుగుటకుగల ఉద్దేశము కారణములనుగురించి సాక్ష్యము పెట్టవచ్చును.

తీర్మానించవలసిన అంశములను గురించి ఇదివరలో పార్టీలవప్పుదలలున్న లేదా ఉభయులమధ్య అదివరలో జరిగిన తగాయిదా అంశములనుగురించిన తీర్పునున్న వాటిని ఋజువుచేయవచ్చును. సాక్ష్యము సాధారణముగా సాక్షులు కోర్టుకువచ్చి ప్రమాణముచేసి చెప్పవలసి యున్నప్పటికిని, కొన్ని సందర్భములలో ఆసాక్షులు అదివరలో ఆపార్టీలమధ్యజరిగిన వ్యవహారములలోయిచ్చిన జబాన్మాలములను దాఖలుచేయవచ్చును ఆసందర్భములేవన- ఒకసాక్షి అదివరలో ఆపార్టీలమధ్య లేదా వారి ప్రతినిధులమధ్య జరిగిన వ్యవహారములో సాక్ష్యమిచ్చియుండి, యెవరికి వ్యతిరేకముగా సాక్ష్యము యిచ్చెనో ఆపార్టీవల్ల క్రాసుపరీక్షచేయబడియుండి రెండవవ్యవహారమునాటికి ఆసాక్షి చనిపోయియున్నగాని, లేదా యెచ్చటనున్నది తెలియకున్నగాని, లేదా సాక్ష్యమిచ్చు పరిస్థితిలో లేకున్నగాని, లేదా యెదుటికక్షిదారునివల్ల సాక్ష్యముకు రాకుండా చేయబడుచున్నగాని, లేదా అతనిని తిరిగి విచారించుట కేసుసందర్భములనుబట్టి చాలా కాలహరణము వ్యయప్రయాసలగునని కోర్టుయెంచిన అదివరలోచెప్పిన వాజ్మూలము సాక్ష్యముగా దాఖలు చేయవచ్చును.

ఏజడ్జీ లేదా మాజిస్ట్రేటునుగాని, వారి ఉద్యోగధర్మములో వారిప్రవర్తనను గురించి, వారిపైఅధికారి ప్రత్యేక ఆర్డరు ప్రకారముగాకూడ వారిని ప్రశ్నలు అడుగరాదు. కాని వారిసమక్షమున జరిగిన అంశములను గురించి విచారించవచ్చును.

ఏ మాజిస్ట్రేటు లేదా పోలీసు ఆఫీసరును ఒక నేరమును గురించిన సమాచారము వారికి యెవరిద్వారా తెలిసినది అడుగరాదు.

ఒకపార్టీ వకీలువద్దకువెళ్లి సలహాతీసుకొనునప్పుడు చెప్పిన అంశములనుగురించి గాని, చూపించిన దస్తావేజులను గురించిగాని, ఆపార్టీయొక్క స్పష్టమైన అంగీకారమున్నగాని, వకీలు సాక్ష్యము చెప్పరాదు.

పార్టీలు ఒకవ్యవహారమును రాజీచేసుకొను ప్రయత్నములో పార్టీలుచేసినఒప్పుదలలు, ఆఒప్పుదలలనుగురించి కోర్టులో సాక్ష్యమివ్వరాదనే యేర్పాటుతోమాట్లాడుకొన్నప్పుడు ఆవిషయములను గురించి సాక్ష్యము పెట్టరాదు.

సివిల్ కేసులలో పార్టీలయొక్క నడవడినిగురించి యెట్టిసాక్ష్యము పెట్టరాదు. పార్టీలు మంచివారా చెడ్డవారా అను అంశము సివిల్ కేసులలో విచారించవలసిన అగత్యములేదు. కాని చాలాకోర్టులలో పార్టీలను వారిప్రవర్తననుగురించి క్రాస్ పరీక్ష చేయుట జరుగుచునేయున్నది కాని కోర్టులు ఆ విషయమునుగురించి ప్రశ్నలు వేయ నీయరాదు.

క్రిమినల్ కేసులలో ముద్దాయి మంచివాడని సాక్ష్యము చెప్పించవచ్చును. అట్టిసాక్ష్యమున్నపుడు ముద్దాయి చెడ్డవాడని ఫిర్యాదితరపు సాక్ష్యము చెప్పవచ్చును. కాని ఫిర్యాదితరపు ముందుగా ముద్దాయి చెడ్డవాడని సాక్ష్యము పెట్టుటకు వీలులేదు.

## (7) మూజువాణీ సాక్ష్యము.

మూజువాణీ సాక్ష్యము సాధారణముగా ప్రత్యక్ష సాక్ష్యముగా యుండవలెను. అనగా ఒక విషయమును ఒకరుచూచుటకువీలైన అటుల చూచినవాడు వినుటకువీలైన వినినవాడు మాత్రమే చెప్పవలెను. మరియొకనివద్దనుండి తెలుసుకొన్న విషయములను గురించి మూజువాణీ సాక్ష్యము పనికిరాదు. కోర్టులు అతిజాగరూకతతో అట్టిసాక్ష్యమును తీసుకొనుటకు నిరాకరించవలెను.

## (8) దస్తావేజుల సాక్ష్యము.

(1) దస్తావేజులను ప్రత్యక్షముగా దాఖలు చేయుటమూలముగా వాటి షరతు లను రుజువు చేయవచ్చును.

(2) కొన్నిసందర్భములలో అసలు దస్తావేజులు దాఖలు చేయకుండా యితర సాక్ష్యమువల్ల వాటిషరతులను రుజువు చేయుటకు అవకాశ మివ్వబడినది.

అట్టి ఇతర సాక్ష్యము అనుఘాటలో

(1) అట్టి దస్తావేజులయొక్క పబ్లిక్ నకళ్ళు

(2) అసలుదస్తావేజుచూచినవాడు దానిషరతులనుగురించి సాక్ష్యమిచ్చుటచేరును

సాధారణముగా అసలు దస్తావేజులను దాఖలుచేసియే వాటిని రుజువు పరచ వలసియుండును.

కాని యీదిగువ సందర్భములలో ఒక దస్తావేజుయున్నట్లు, దానిపరిస్థితి షర తులను గురించి యితర సాక్ష్యమువల్ల రుజువుచేయవచ్చును.

(1) ఆదస్తావేజు అసలు యెవరికివ్యతిరేకముగా ఆదస్తావేజు దాఖలు చేయబడ నున్నదో వారి స్వాధీనములో లేదా అధికారములోగాని కోర్టువారి అధికారమునకు లోబడని ఒకని స్వాధీనములో యున్న మరియు అట్టివానికి నోటీసునిచ్చినను హాజరు పరచని సందర్భములో,

(2) అసలు దస్తావేజు నశింపుచేయబడిన లేదా పోయిన లేదా దానినిగురించి యితరసాక్ష్యము పెట్టువ్యక్తి తనలోపము అశ్రద్ధవల్లగాకుండా న్యాయమైన కాల ములో హాజరుపరచ లేకపోయిన,

(8) అసలు దస్తావేజుకు పబ్లిక్ కాపీ దాఖలుచేయుటకు యేన్యాయశాస్త్రము వల్లనైనా వీలున్న అసలు దస్తావేజు దాఖలుచేయబడ నక్కరలేదు.

అసలు దస్తావేజు ప్రత్యర్థి స్వాధీనములో యున్నపుడు అతనికి ఆ దస్తావేజు హాజరుపరచమని నోటీసు నిచ్చినగాని దాని విషయమై యితర సాక్ష్యము పెట్టుటకు వీలులేదు.

ఒకకంట్రాక్టు షరతులు వ్రాతమూలకముగా యున్నపుడు ఆపార్టీల మధ్య వారి ప్రతినిధులమధ్య ఆ దస్తావేజు షరతులను అదనముగా భిన్నముగా లేదా వాటిని మార్చుచూ షరతులున్నవనే సాక్ష్యము అంగీకరించబడదు.

(9) రుజువు భారము.

ఎవడు ఒకకోర్టును తన హక్కునుగురించి కొన్ని అంశములనుబట్టి తనకు అనుకూలముగా తీర్మానము చేయవలెనని కోరునో, అతడు ఆఅంశములను రుజువుచేయవలెను. ఒకకేసులో రెండుపక్షముల పైపున సాక్ష్యము పెట్టకుండిన ఏపార్టీ ఓడిపోవునో ఆ పార్టీపైన రుజువుభారమున్నట్లు యెంచవలెను. ఒకడు ఒక ప్రత్యేక విషయముపై ఆధారపడిన ఆ ప్రత్యేకవిషయముపై ఆధారపడినవాడే ఆవిషయమును రుజువు చేయవలసియుండును.

ఒకనిపై ఒక నేరము మోపబడినపుడు అతడు చేసినపని ఇండియన్ పీనల్ కోడు మినహాయింపులక్రిందకు వచ్చునని నేరముకాదని వాదించిన ముద్దాయి తాను చేసినపని ఆమినహాయింపులలోనికి వచ్చునని రుజువుచేయవలసియుండును.

ఒకవిషయము ఒకనికిప్రత్యేకముగా తెలిసియున్న అతడే ఆవిషయమును రుజువు చేయవలసియుండును.

ఉదాహరణము:—ఒకడు ఒకపనిని సదుద్దేశముతో చేసితినని చెప్పినవాడే తన సదుద్దేశమును రుజువుచేయవలెను. ఒకనిపై టికెట్టులేకుండా రైలులో ప్రయాణము చేసెనని కేసుపెట్టిన అతడు తనవద్ద టిక్కెట్టుయున్నట్లు రుజువుచేయవలసియుండును.

(10) కొన్ని విషయములు నిజమని కోర్టులు నమ్మవచ్చును.

మామూలు ప్రపంచ ధోరణినిబట్టి, మనుష్యస్వభావమునుబట్టి వ్యాపారసరళిని బట్టి కోర్టువారు ఒకవిషయమునుబట్టి మరికొన్ని విషయములు నిజమని నమ్మవచ్చును. కాని అది నిజముగాదని రుజువుచేయుటకు పార్టీలకు అవకాశముండును.

ఉదాహరణములు:—ఒకడు ఒక దొంగతనము జరిగినవెంటనే చోరీఆస్తి స్వాధీనము కలిగియున్న కోర్టువారు అతడు దొంగయనిగాని, దొంగఆస్తియని తెలిసి తీసుకొన్నాడనిగాని యూహించవచ్చును. అయితే అతడు ఆ ఆస్తి తనస్వాధీనము లోనికి యెట్లువచ్చినదో తెలుపుటకు అవకాశముండును.

ఒకప్రోనోటు వ్రాయబడినట్లు ఒప్పుకొన్న అది ప్రతిఫలసహితమైనదని నమ్మవచ్చును; కాని దానికి ప్రతిఫలములేదని రుజువుచేయవచ్చును. ఒక ప్రోనోటువ్రాసిన

వానివద్దయున్న ఆ ప్రోనోటు తీరిపోయినట్లు యెంచవచ్చును. కాని ప్రోనోటు వ్రాయించుకొన్నవాడు ఆ ప్రోనోటును వ్రాసినవానిని స్వాధీనములోనికి యెటుల వచ్చినది అని తీరనట్లు రుజువుచేయవచ్చును.

## (11) విరుద్ధ వాదన చేయరాదు.

ఒకడు మరియొకనికి ఒకవిషయము నిజమని నమ్మకము కలుగజేసి ఆ నమ్మకము ప్రకారము రెండవవాడు ప్రవర్తించిన, అట్టినమ్మకము కలుగజేసినవాడుగాని అతని ప్రతినిధులుగాని మొదటివిషయము అబద్ధమని వాదించరాదు. "ఏ" అనువాడు బుద్ధిపూర్వకముగాను అబద్ధముగా ఒకభూమి తనదనిచెప్పి "బి" అనువానివద్ద సొమ్ము తీసుకొని అమ్మును. తరువాత కొన్నిదినములకు ఆఆస్థి 'ఎ' కు సంక్రమించును. అటుతర్వాత 'ఎ' తాను ఆస్థిని అమ్మినపుడు తనకు దానిలో హక్కులేదని తానుచేసిన క్రయముచెల్లదనివాదించుటకు హక్కుయుండదు. ఒకస్థిరాస్థిని కవులుకుపుచ్చుకొన్న రైతుగాని అతని ద్వారా హక్కుకలిగినవాడుగాని మొదట కవులుకుయిచ్చినవానికి ఆస్థిలో కవులు నాటికి హక్కులేదని వాదించుటకు వీలులేదు.

## (12) సాక్షుల విచారించు క్రమము.

ఏకక్షిదారుడు ఒకనిని సాక్ష్యముగా విచారించదలచినాడో ఆకక్షిదారుడు ప్రథమములో సాక్షిని విచారించును. తరువాత ఎదుటి కక్షిదారుడు అడ్డసవాళ్ళు (క్రాస్‌పరీక్ష) చేయును. అటుతరువాత మొదటివాడు తిరిగిక్రాస్‌పరీక్షలోని అంశములను విచారించుటకు మాత్రము విచారించవచ్చును. కోర్టువారి అనుమతితో క్రొత్త ప్రశ్నలనుగూడ వేయవచ్చును. కాని అట్టి సందర్భములో ఎదుటి కక్షిదారునికి తిరిగి క్రాస్‌పరీక్షకు అనుమతి నివ్వవలెను.

ఒక సాక్షిని దస్తావేజు హాజరుపరచమని మాత్రము సమనుచేయబడినప్పుడు అతడు సాక్షికాడు. అతనిని ఎదుటిపార్టీ క్రాస్‌చేయుటకు అధికారము యుండదు.

ఒక సాక్షిని క్రాస్‌పరీక్ష చేయునప్పుడు అతని నిజాయతీని పరీక్షచేయుటకు అతనిస్థితిగతులు తెలుసుకొనుటకు అతనిప్రవర్తన మంచిదిగాదని అతడునమ్మతగినవాడు గాదని తెలుపుటకు అవసరమైన ప్రశ్నలను వేయవచ్చును. కాని అట్టి ప్రశ్నలను సరియైన సంజాయిషీలేనిదే అవి నిజమైనవని నమ్మనిదే వేయరాదు. ఏప్రశ్నయైన ఒకసాక్షికి అవమానము కలుగజేయవలెనని లేక అప్రతిష్ఠకలుగజేయవలెనని వేయబడెనని కోర్టుతలచేయెడల అట్టి ప్రశ్నలను అడుగనీయకూడదు.

కొన్ని పరిస్థితులలో ఒక సాక్షి తిరిగిపోయిన కోర్టు ఆసాక్షిని విచారించిన కక్షిదారునికి ఆసాక్షిని క్రాస్‌పరీక్ష చేయుటకు అనుమతించవచ్చును. కోర్టులకు న్యాయసిద్ధికొరకు నిజము తెలుసుకొనుటకు ఏసాక్షినైనా యెప్పుడైనను ఏప్రశ్ననైనను వేయవచ్చును.

# ఎనిమిదవ భాగము

## గ్రామకోర్టులకు సంబంధించిన లిమిటేషను ఆక్టు అంశములు.

(1) ఏ దావాగాని, పిటీషనుగాని లిమిటేషను ఆక్టులోగాని లేక మ. గ్రా. కో. ఆక్టులోగాని విధింపబడిన కాలపరిమితి దాటినతరువాత దాఖలుచేయబడిన యెడల సదరుదావానుగాని పిటీషనునుగాని కక్షిదారుల వాదనలతో నిమిత్తము లేకుండా కోర్టువారు పరిహరించవలసి యుండును.

(2) ఏ దావాగాని, పిటీషనుగాని దాఖలుచేయవలసిన ఆఖరుదినము కోర్టుకు సెలవుఅయినయెడల అట్టిదావానుగాని, పిటీషనునుగాని సదరుకోర్టు తెరచిన దినమున దాఖలుచేయవచ్చును. గ్రామకోర్టుల ఆర్డర్లు డిక్రీలనుండి దాఖలుచేయు రివిజన్ పిటీషనులకు లిమిటేషను కాలమును లెక్కించుటలో అట్టిఆర్డరు లేదా డిక్రీనకలు తీసికొనుటకు పట్టిన కాలమును మినహాయించవలెను.

(3) లిమిటేషను ఆక్టుక్రింద కాలము లెక్కించునపుడు సదరు కాలము యింగ్లీషు తారీఖుల ప్రకారమే లెక్కించవలసి యుండును. అవగా ఒక ప్రోనోటులో తెనుగు మాసము, తిధి వేయబడియుండును. ఆ తిథికి సరియైన యింగ్లీషు తారీఖు 10-12-1930 అని అనుకొందము. ఆ ప్రోనోటునుబట్టి సదరు దావాను 10-12-1933 తారీఖులోగా దాఖలు చేయవలెను. 3 సం॥ల తరువాత వచ్చే ప్రోనోటులో ఉదహరించిన మాసము తిథి 10-12-1936 తేదీకి లోపల గతించినను దావా 10-12-1933 తేదీన దాఖలు చేసినయెడల కాలదోషము యుండదు. కాని సదరు తిథి 10-12-1933 దరిమిలా వచ్చిన యెడల అంతవరకు దావా వేయక ఆగుటకు వీలులేదు. 10-12-33 తేదీయే దావా దాఖలు చేయుటకు ఆఖరు దినము.

(4) ఒక దావాకు లేక పిటీషనుకు కాలపరిమితి లెక్కించునపుడు వాది ఆదావా వ్యాజ్యకారణముపైన లేక ఆ పిటీషనులో కోరే పరిహారమునకు మరియొక సివిల్ కోర్టులో దావాగాని యితర చర్యగాని తగు జాగ్రత్తతోను సదుద్దేశముతోను జరిపి యుండి, సదరు కోర్టుకు అధికారము లేకపోవడము వల్లగాని లేక మరి అట్టిదే యితర కారణమువల్లగాని సదరు దావాను గాని పిటీషనును గాని త్రిప్పి వేసిన యెడల, సదరు దావా, పిటీషనులు ఆ కోర్టులో నిల్వయున్న కాలమును లిమిటేషను ఆక్టు ప్రకారము కాలము లెక్కించునపుడు మినహాయించుకొనవచ్చును. అట్లు మినహాయించుటలో దావాగాని పిటీషనుగాని దాఖలయిన దినమున్నూ, వాటిని కోర్టువారు త్రిప్పివేసిన దినమున్నూ కూడ మినహాయించవచ్చును.

(5) ఏ గ్రామకోర్టు డిక్రీఅయినను, యితర కోర్టులవల్ల యింజక్షను ద్వారాగాని మరియే యితర ఆర్డరువల్లగాని ఆపుదల చేయబడినయెడల సదరు యింజంక్షను లేక

యితర ఆర్డరు నిల్వలోయున్న కాలమును లిమిటేషను ఆక్టు విధుల ప్రకారము డిక్రీ అమలుకు యేర్పడిన కాలపరిమితి లెక్కించు నపుడు మినహాయించు కొనవచ్చును.

ఉ॥ వాది ప్రతివాదిపైన 10-10-1930 తేదీన డిక్రీ పొందెను. సదరు డిక్రీ అమలు జరుపుటకు 10-10-33 తేదీలోగా వారంటు దరఖాస్తు దాఖలు చేయవలెను. సదరు డిక్రీ అమలు 10-10-31 తేదీ మొదలు 10-10-32 తేదీవరకు డి॥ము॥ కోర్టువల్ల యింజంక్షనువల్ల ఆపబడినది. అట్టి సందర్భములో వాది తనడిక్రీ అమలుకు దరఖాస్తు 10-10-34 తేదీనకూడ దాఖలు చేయవచ్చును. ఏలనన అదివరకు డిక్రీ అమలు ఆపబడిన ఒక సంవత్సరము మినహాయించుకొనవచ్చును.

(6) ఏ వ్యక్తి అయినను ఒక దావా దాఖలు చేయుటకుగాని ఒక పిటీషను పెట్టుటకుగాని హక్కును కలిగియుండి అట్టి హక్కు ప్రతివాది చేసినదగావల్ల తనకు తెలియకపోయిన యెడల వాది సదరుదగా తనకు తెలియవచ్చినప్పటినుండి అట్టిదావాను గాని పిటీషనును గాని లిమిటేషను ఆక్టులో చెప్పబడిన కాలపరిమితిలోగా దాఖలు చేయవచ్చును. సదరు దావానుగాని పిటీషనునుగాని దగాచేసినవాని పైననేగాక అతనికి సహాయకుడుగా యుండి దగాచేయించినవారిపైన, దగాచేసినవాని ద్వారా హక్కును పొందిన వారిపైననూ పైచెప్పిన కాలపరిమితిలోగా దాఖలు చేయవచ్చును ప్రతివాది గాక యితరులు చేసిన దగావల్ల వాది మోసపోయినయెడల వాది దావాకుగాని, పిటీషనుకుగాని యెట్టికాలమున్నూ ముజరారాదు. దావాకుగాని పిటీషనుకుగాని వ్యాజ్యకారణములు యేర్పడినుండినదే కాలము లెక్కించవలసియుండును.

వాది లిమిటేషను కాలపరిమితిని ప్రతివాది చేసిన దగా తెలియవచ్చినప్పటి నుండియు లెక్కించమని కోరినప్పుడు వాది సదరు దగా విషయమై దావాలోగాని పిటీషనులోగాని స్పష్టముగాను విపులముగాను వ్రాసి విచారణలో దగానున్నూ సదరు దగా తనకు తెలియవచ్చిన తేదీయున్నూ స్పష్టముగా ఋజువుచేయవలెను.

దగా అనగా ప్రతివాది మౌనముగా వూరకుండుట దగా కానేరదు. ప్రతివాది వాది హక్కు తెలియకుండా ప్రయత్న పూర్వకముగా కప్పిపుచ్చి యుండవలెను.

(7) వాది హక్కును స్థిరపరుచుటకు ఏదైనా దస్తావేజు కావలసియుండి సదరు దస్తావేజుసంగతి ప్రతివాది బుద్ధిపూర్వకముగా తన చర్యవల్ల వాదికి తెలియకుండా కమ్మీచేసిన యెడల సదరు దస్తావేజును వాది హాజరుపరచగలిగినప్పటినుండి గాని లేక సదరు దస్తావేజును హాజరుపరిపించుటకు వాది నిర్బంధముచేయగలిగినప్పటి నుండిగాని లిమిటేషను పరిమితి లెక్కించవచ్చును.

(8) ఏ దావాకుగాని, పిటీషనుకుగాని విధించబడిన కాలపరిమితిలోగా ప్రతివాదిగాని, ప్రతివాదిద్వారా హక్కును పొందినవారుగాని, వాదికి గల హక్కును వప్పుకొనుచున్నూ సంతకముచేసిన వ్రాతమూలకమైన దస్తావేజు యున్నయెడల సదరు కాలపరిమితిని తిరిగి అట్టి వప్పుదలయున్న తేదీనుండి లెక్కించవచ్చును. సదరు వప్పుదలపైన తారీఖు లేకపోయినను, లేక తప్పు తారీఖు యున్నను సదరు తేదీని వాది యితర సాక్ష్యమువల్ల ఋజువు చేయవచ్చును. సదరు వప్పుదలలో వాది హక్కుయొక్క

వివరములు స్పష్టముగా వ్రాయబడనప్పటికిన్ని లేక సదరు హక్కును చెలాయించుటకుగాని, బాకీని రాబట్టుకొనుటకుగాని వాయిదా రాలేదని వ్రాసినను, లేక బాకీని యిచ్చుటకుగాని ఖరారు ప్రకారము చేయవలసిన పనిని చేయుటకు నిరాకరించిన లేక ప్రతివాది తనకుకూడా వాది వేరే బాకీయున్నందున సదరుబాకీ తీరిపోయినదని చెప్పిన సదరు వప్పుదల చెల్లగలదు. అట్టి వప్పుదల తేదీనుండిన్ని కాలపరిమితి లెక్కించవచ్చును సదరు వప్పుదల దస్తావేజా వాదిపేరనే వ్రాయవలసిన అగత్యములేదు. ఇతరులపేర వ్రాసిన దస్తావేజులో యున్నను చాలును. ప్రతివాది యే కోర్టులోనైనా తన సంతకముతో యున్న వ్రాతమూలకమైన వాఙ్మూలములో బాకీయున్నట్లు వప్పుకొన్నను అది పైనచెప్పిన వప్పుదల అగును. అటులనే ప్లయింట్లలోగాని, స్టేటుమెంట్లలోగాని, లేక దివాళాపిటీషనులలోగాని వప్పుదల యుండిన అట్టి వప్పుదల తేదీనుండి కాలపరిమితి లెక్కించవచ్చును.

అయితే వప్పుకొన్నవాడు వప్పుదల కాలములో మైనరుగా యుండినయెడల అట్టి వప్పుదల చెల్లనేరదు. వప్పుదలక్రింద పూర్తి సంతకము యుండవలెనుగాని పొడి అక్షరములున్న చాలవు. దస్కతు చేయలేనివారు నిశాని పెట్టించుటగాని, లేక నిశాని పెట్టించి వేలుముద్ర వేసినగాని చాలును. వప్పుదల చేసినవారికి అప్పట్లో దావా వ్యవహారములో యే హక్కు లేనప్పటికి థరిమిలా దావాలో సదరు వ్యక్తిపైన పరిహారము కోరినయెడల అతను చేసిన వప్పుదల చెల్లును. అది అతనిని బైండుచేయును. ఒక రిజిష్టరు కాని విక్రయదస్తావేజు లేక తనఖా దస్తావేజులలో వప్పుదల యున్నప్పటికి సదరు వప్పుదల చెల్లును. దస్తావేజా రిజిష్టరు కాని దోషము దీనికి వర్తించదు.

(9) ఒక బాకీపైన యివ్వవలసిన వడ్డీక్రింద గాని, అసలుక్రిందగాని బాకీదారు వల్ల సొమ్ము వసూలు యివ్వబడి సదరు వసూలు వ్రాతమూలకముగాయుండి దానిపైన బాకీదారుయొక్క సంతకమున్నయెడల సదరు వసూలు తేదీనుండిన్ని కాలపరిమితి లెక్కించవచ్చును.

(10) 8వ పేరాలో చెప్పబడిన వప్పుదలగాని, 9వ పేరాలో చెప్పబడిన వసూలుగాని బాకీదారుని వల్లగాని, అతనివల్ల అధికారము పొందిన ఏజెంటువల్లగాని యివ్వబడవచ్చును. అట్టి వప్పుదల లేక వసూలు డిక్రీలనుబట్టి రావలసిన బాకీలకు కూడ వర్తించును.

హిందూ "లా" ప్రకారము జీవితకాలపుహక్కు కలిగిన ఒక వితంతువు లేక ఇతరుని వల్ల ఒక బాకీ విషయములో స్వయముగాగాని, వారిచే అధికారమివ్వబడిన ఏజెంటు వల్లగాని, చేయబడిన వప్పుదల లేక యివ్వబడిన వసూలు దరిమిలా వారసులను కూడ బైండుచేయును. మరియు ఒక బాకీ ఒకహిందూ అవిభక్తకుటుంబముచేగాని లేక సదరు కుటుంబముతరఫునగాని చేయబడిన ఆ కుటుంబముయొక్క మానేజరుగాని, అతనివల్ల అధికారముపొందిన ఏజెంటుగాని ఒక ఒప్పుదల చేసినగాని లేక వసూలు యిచ్చినగాని, సదరు వసూలు లేక వప్పుదల ఆ అవిభక్తకుటుంబమువారిని బైండు చేయును.

జాయింటు బాకీదార్లు యిరువురుగాని యిరువురికంటె యెక్కువ మందిగాని యున్నప్పుడు వారిలో యేఒకరు లేక వారి ఏజెంటు చేసే వప్పుదల లేక వారిచే యివ్వబడే

వసూలు తక్కిన జాయింటు బాకీదార్లను బైండుచేయదు. అవి వారిపైన చెల్లవు. ఉదా॥ ఇద్దరుకలసి ఒకనిపేర ఒకప్రోనోటు వ్రాసిరి. అందులో ఒకరుమాత్రము కొంత వసూలు యిచ్చిరి. అట్టివసూలు యివ్వబడిన తరువాత 3 సం॥లకు దావా తెచ్చినపుడు ఆ వసూలు యివ్వనివానిపై దావాకు లిమిటేషను పట్టినట్లు యెంచబడును.

## గ్రామకోర్టులు విచారించతగిన దావాలకు లిమిటేషను.

### దావాకారణము ప్రారంభమైనతరువాత 1 సం॥లో తేవలసినదావాలు.

(11) ఇంటి నౌకర్లయొక్కగాని, కూలీలయొక్కగాని లేక శిల్పులయొక్కగాని జీతములకు, జీతములు యివ్వవలసిన తేదీనుండి ఒక సంవత్సరములోగా దావా తేవలెను. ఒకచిత్రకారుడుగాని, వడ్రంగిగాని, బంగారు వెండి పనిచేయువారుగాని, పనికిము త్తం మీద కొంతసొమ్ము యిచ్చేయేర్పాటుతో పనిచేసినయెడల వారికి రావలసిన ము త్త ముకు ఒక సంవత్సరములో దావాచేయవలసినపనిలేదు. అట్టిదావాలకు 3 సం॥ల వరకు కాలపరిమితి యుండును. వ్యవసాయములో పనిచేయు పాలేళ్ళు కూలీలుగాయెంచబడు దురు. వారి జీతములకు ఒకసంవత్సరములోగా దావా వేయవలసియుండును. అటులనే వంటవారు, యింకా యితర యింటి నౌకర్లజీతములకుకూడ ఒకసంవత్సరములోదావా వేయవలెను. ఒక దేవాలయములో నిత్యము వూడ్చి, నీళ్లుచల్లి, దేవునిపూజకు పుష్ప ములు సమకూర్చు నౌకరును యింటినౌకరుగాగాని, లేక కూలీగాగాని యెంచవీలులేదు. అతనికి రావలసిన జీతముకు ఒకసంవత్సరములోగా దావావేయవలసిన పనిలేదు. 3 సం॥ లలోగా తేవచ్చును. అటులనే ఒకషాపులో సరుకులు తూచుటకు పెట్టుకొన బడిన మనిషిని కూలీగా యెంచుటకు వీలులేదు.

ఇంటినౌకర్లకుగాని, కాలీలకుగాని, శిల్పులకుగాని యివ్వవలసినజీతము నెలకు యిచ్చే యేర్పాటు యున్నయెడల వాజ్యకారణము నెలాఖరునుండి ప్రారంభమగును. అట్టి యేర్పాటులేనియెడల పనిపూర్తిఅయినప్పటినుండి వ్యాజ్యకారణము కలుగును.

(12) ఒక హోటలులోచేసిన భోజనమునకుగాని, త్రాగిన పానీయములకు గాని, భోజనముపెట్టిన లేక పానీయములు యిచ్చినప్పటినుండి ఒక సంవత్సరములో దావా తేవలసియుండును.

(13) హోటలులో యున్నందుకు యివ్వవలసిన అద్దెకుకూడ అద్దెయివ్వవలసిన తేదీనుండి ఒక సంవత్సరములో దావా తేవలెను.

మామూలుగా యిండ్లలో కాపురమున్నపుడు సదరుయింటిఅద్దెలకు ఒకసంవత్స రములోగా దావాతేవలసినఅవసరములేదు. కాని తాత్కాలికముగా ఒక హోటలులో యున్నగదులలో అద్దెకుయున్నయెడల ఆఅద్దెకు ఒక సంవత్సరములో దావా తేవలెను.

### 3 సంవత్సరముల కాలపరిమితిగల దావాలు.

(14) పశువులకుగాని, బండ్లకుగాని, పడవలకుగాని, లేక యితర యింటిసామా నుల అద్దెకుగాని, యిండ్లఅద్దెలకుగాని, గుమాస్తాల వగైరాల జీతములకుగాని సొమ్ము యివ్వవలసిన తేదీనుండి 3 సం॥లలోగా దావా తేవలెను. ఏవస్తువుల కిమ్మతుకైనా

లేక పైరు లేక చెల్లుకిమ్మత్తుగాని, ప్రతివాదికి వాదిచేసిన యే పనికి అయినను గావల సిన ముత్తమునకుగాని, ప్రతివాదికి వాదియిచ్చిన అప్పునకుగాని 3 సం॥లలోగా దావా తేవలెను. వాది ప్రతివాదులమధ్య డబ్బుయిచ్చుటకు యేదైనా వాయిదా యున్న యెడల సదరు వాయిదా తేదీనుండి 3 సం॥లలోగా దావా తేవచ్చును. ప్రతివాదికి వాది చేసిన పనికి సొమ్ము రావలసియుండి అట్టిసొమ్ము యిచ్చుటకు వాయిదా లేని యెడల ఆపని పూర్తిఅయిన తేదీనుండి 3 సం॥ల లోగా దావా తేవలెను. వాది ప్రతి వాదులమధ్య జరిగిన ఖాతానుబట్టి దావా తెచ్చినపుడు ఖాతాలోని మొదటిఖర్చుపద్దుల క్రింద మొదటయిచ్చిన జమపద్దులు వసూలుపోను మిగిలియున్న ఖర్చుపద్దులన్నియు దావాకు 3 సం॥లలో పుగా యుండవలెను. అంతకుపూర్వము ఖర్చపద్దులున్న వాటికి లిమిటేషనుపట్టును. వాది ప్రతివాదులు పెరసికట్టుకట్టుకొని ప్రతివాది సంతకముచేసిన యెడల అప్పటినుండియు, 3 సం॥లలోగా దావా తేవచ్చును. భాగస్వాములమధ్య దావాలలోగూడ భాగస్వాములు లెఖలు తేల్చుకొన్నప్పటినుండియు 3 సం॥లలోగా దావా తేవచ్చును. ఒక వకీలుకు యివ్వవలసిన ఫీజుకుగాని, ఖర్చులకుగాని సొమ్ము యిచ్చుటకు యెట్టి వాయిదా లేనప్పుడు వకీలు ప్రతివాది తరఫున చేసిన దావాగాని, యితర వ్యవహారముగాని అంతమైన తేదీనుండి 3 సం॥ లలోగా దావా తేవచ్చును.

## గ్రామకోర్టుల డిక్రీలకు లిమిటేషను.

సి॥ ప్రొ॥ కో॥ వర్తించు యితర సివిల్ కోర్టు డిక్రీలను సి॥ప్రొ॥కో॥ సె. 48 ప్రకారము డిక్రీ తేదీ లగాయతు 12 సం॥ దాటిన తరువాత అమలుజరుపుటకు వీలులేదు. కాని సదరు సెక్షను గ్రామకోర్టులకు వర్తించనందున గ్రామకోర్టు డిక్రీలు 2 సం॥ల గతించినను లిమిటేషను పట్టవు. లిమిటేషను ఆక్టు ఆర్టికిల్ 182 ప్రకారము 3 సం॥ల కొక పర్యాయము వారంటు దరఖాస్తులు దాఖలుచేయుచున్న వేరె లిమిటేషనుదోషము లేకుండా డిక్రీలను అమలుజరిపి సొమ్ము రాబట్టుకొనవచ్చును. గ్రామకోర్టుడిక్రీ అమలు నిమిత్తము డి॥ము॥ కోర్టుకు ట్రాన్సఫర్ కాబడినను 12 సం॥లతో లిమిటేషను పట్టదు.

గ్రామకోర్టు డిక్రీలలో సొమ్ము చెల్లించుటకు యేదైనా వాయిదా యివ్వబడిన యెడల ఆ వాయిదా తేదీనుంచి 3 సం॥లలోగా వారంటు దరఖాస్తు దాఖలు చేయ వలెను. దరిమిలా దరఖాస్తులు అదివరలో దరఖాస్తుపైన కోర్టువారు జారీచేసిన ఆఖరు ఆర్డరు లగాయితు 3 సం॥లలోగా దాఖలు చేయవచ్చును. కాని మొదటి దరఖాస్తు తేదీ లగాయతు 3 సం॥లలో దాఖలు చేయవలసిన అవసరములేదు.

వారంటు దరఖాస్తులేగాక, ప్రతివాదిగాని వాదిగాని చనిపోయినపుడు వారి న్యాయశాస్త్ర ప్రతినిధులను చేర్పించుటకుగాని, డిక్రీని ఒకకోర్టునుండి అమలు నిమి త్తము మరియొక కోర్టుకు ట్రాన్సఫర్ చేయించుకొనుటకుగాని దాఖలుచేయబడిన పిటీష నలుపైన దాఖలు చేసినను డిక్రీకి లిమిటేషను పట్టదు. అట్టి పిటీషనులపై కోర్టువారు జారీ చేసిన ఆఖరు ఆర్డరు తేదీనుండి 3 సం॥లలోగా కూడ దరిమిలా వారంటు దరఖాస్తులు దాఖలు చేయవచ్చును.

# తొమ్మిదవ భాగము.

## స్టాంపు ఆక్టు అంశములు.

(1) గ్రామకోర్టుల న్యాయవిచారణలో స్టాంపుఆక్టు ప్రకారము స్టాంపు కావలసిన ఒక దస్తావేజు అసలే స్టాంపు లేకుండాగాని, లేక కొరత స్టాంపుతో యున్నదిగాని దాఖలు చేయబడిన యెడల, దానిని కోర్టువారు యింపౌండు చేయవలెను. (అనగా దస్తావేజునుపట్టి యుంచవలెను.) కాని అట్టి దస్తావేజు యేదైనా క్రిమినల్ కేసు విచారణలో దాఖలు చేయబడిన యెడల అట్టి దానిని కోర్టువారు అవసరమని యెంచేయెడల యింపౌండు చేయవచ్చును. లేనియెడల చేయకపోవచ్చును.

(2) పై పేరాలో చెప్పబడిన దస్తావేజు ప్రోనోటు లేక ఒక అణా లేక అంతకంటె తక్కువ స్టాంపుడ్యూటీ చెల్లించబడవలసినది. కానియెడల, సదరు దస్తావేజునకు అసలే స్టాంపు లేనియెడల సదరు దస్తావేజునకు చెల్లించవలసిన పూర్తి స్టాంపు మొత్తమున్నూ, కొరత స్టాంపుతో యున్నయెడల తక్కువ అయిన స్టాంపు మొత్తమున్నూ, సదరు పూర్తి మొత్తము లేక తక్కువ అయిన మొత్తమునకు రు 5-0-0 లకు తక్కువకాని 10 రెట్లు సొమ్ము పినాల్టీ క్రిందను చెల్లించే యెడల ఆ దస్తావేజును కోర్టువారు సాక్ష్యముగా అంగీకరించవచ్చును. కాని అట్లు చెల్లించని యెడల అట్టి దస్తావేజును సాక్ష్యముగా అంగీకరించకూడదు. ఉదా॥ ఒకయెగ్రిమెంటు స్టాంపులేనిది దాఖలు చేయబడినది. అప్పుడు సదరు యెగ్రిమెంటును చెల్లించవలసిన మొత్తము రు 1-8-0 లున్ను పినాల్టీ క్రింద సదరు మొత్తమునకు 10 రెట్లు మొత్తము రు 15-0-0 లున్ను వెరశి 16-8-0 చెల్లించవలెను. అట్టి ఎగ్రిమెంటుకు రు 0-8-0 లు స్టాంపుయున్నయెడల తక్కువ అయిన స్టాంపు మొత్తము రు 0-4-0 లున్ను పినాల్టీ క్రింద రు. 5-0-0 లున్ను వెరశి రు 5-4-0 చెల్లించవలెను. ఏలనన ఏసందర్భములోను పినాల్టీ మొత్తము రు. 5-0-0 లకు తక్కువ యుండకూడదు.

(3) ప్రోనోట్లకు చీట్లులేనియెడల వాటికిగాని యింకాఒకఅణా లేక అంతకంటె తక్కువ మొత్తము స్టాంపుడ్యూటీగల దస్తావేజులు స్టాంపులేకుండాగాని కొరతస్టాంపుతోగాని దాఖలుచేయబడిన యెడల వాటికి పినాల్టి వసూలు చేయకూడదు. వాటిని సాక్ష్యముగా అంగీకరించుటకువీలు లేదు. అయితే ఒకడు తాను స్టాంపుఅంటించి రశీదు యివ్వవలసియుండియు, స్టాంపులేని రశీదు యిచ్చినయెడల రు. 1-0-0 స్టాంపు డ్యూటీ పినాల్టీల క్రింద యిచ్చినయెడల సదరు రశీదును రశీదు యిచ్చినవానికి వ్యతిరేకముగా సాక్ష్యములో అంగీకరించవచ్చును. కాని ఇతరులవ్యవహారములలో దానిని అంగీకరించుటకు వీలులేదు.

(4) రెండవ పేరాలో చెప్పబడిన ప్రకారము యే దస్తావేజునకైనా స్టాంపు డ్యూటీ పినాల్టీలు చెల్లించబడనియెడల అట్టి దస్తావేజును కోర్టువారు కలెక్టరుగారికి పంపవలెను. స్టాంపుడ్యూటీ పినాల్టీలు వసూలుచేయబడినయెడల కోర్టువారు ఆ దస్తా

వేజుకు సరియైననకలును వ్రాయించి, దానిని యెంత మొత్తము వసూలు చేసినది తెలుపు సర్టిఫికెట్టుతో సహా కలెక్టరుగారికి పంపవలెను. వసూలు చేసిన సొమ్మును కలెక్టరుగారికి గాని, యీ విషయములో వారివల్ల నియమింపబడిన యితర అధికారికి గాని పంపవలెను.

(5) కోర్టువారు ఒక కేసులో దాఖలు కాబడిన ఒక దస్తావేజు పైన స్టాంపుడ్యూటీ పినాల్టీలు వసూలు చేసినప్పుడు, సదరు దస్తావేజుకు ఖరారును బట్టిగాని 'లా' ప్రకారము గాని సదరు స్టాంపుడ్యూటీ యివ్వవలసినవారు యింకొకరైనప్పుడు కోర్టులో స్టాంపు డ్యూటీ పినాల్టీలు చెల్లించినవారు సదరు మొత్తమును అసలు స్టాంపుడ్యూటీ యివ్వవలసినవారి వద్దనుండి రాబట్టుకొనవచ్చును. కాని ఆ మొత్తమును చెల్లించవలసినవారు ఆ కేసులో పార్టీలుగా యున్నయెడల సదరు మొత్తమును ఖర్చులలో చేర్చి వారిచేత మొదట స్టాంపుడ్యూటీ పినాల్టీలు చెల్లించినవారికి యిప్పించవచ్చును. కోర్టువారు అట్లు యిప్పించనియెడల సదరు మొత్తమును యితర విధముగా రాబట్టుకొనుటకు హక్కు యుండదు.

## స్టాంపు ఆక్టు ప్రకారము కొన్ని దస్తావేజులకు చెల్లతగ్గ స్టాంపు డ్యూటీ టేబిల్

| | రు. అ. పై. |
|---|---|
| 1 "బాండు" మొత్తము లేక విలువ 10 రు లకు మించనప్పుడు | 0—4—0 |
| ,, ,, ,, 10 రు లకు మించి 50 రు లకు మించనప్పుడు | 0—8—0 |
| ,, ,, ,, 50 ,, 100 | 1—0—0 |
| ,, ,, ,, 100 ,, 200 | 2—8—0 |
| ,, ,, ,, 200 ,, 300 | 3—12—0 |
| ,, ,, ,, 300 ,, 400 | 5—0—0 |
| ,, ,, ,, 400 ,, 500 | 6—4—0 |
| ,, ,, ,, 500 ,, 600 | 9—0—0 |
| ,, ,, ,, 600 ,, 700 | 10—8—0 |
| ,, ,, ,, 700 ,, 800 | 12—0—0 |
| ,, ,, ,, 800 ,, 900 | 13—8—0 |
| ,, ,, ,, 900 ,, 1000 | 15—0—0 |
| రు 1000 లకు పైన ప్రతి రు 500 లకు లేక అందలి భాగమునకు | 7—8—0 |

షరా:- "బాండు" అనేమాటకు స్టాంపు ఆక్టులో యీ క్రిందివిధముగా నిర్వచన మీయబడినది.

"బాండు" అనే మాటలో

(a) ఒకరు మరియొకనికి, ఒకరుని చేసినగాని, లేక చేయక ఉండినగాని యెట్టి సొమ్మున్నా యిచ్చే బాధ్యత లేకుండాయుండే షరతుతో కొంతసొమ్ము యిచ్చుటకు ఖరారయున్న దస్తావేజు.

(b) ఒకరు మరియొకనికి (అతని ఆర్డరుకుగాని లేక ఆదస్తావేజును స్వాధీనము కలిగినవానికిగాని కాకుండా) కొంతసొమ్ము యిచ్చుటకు ఖరారుయుండి సాక్షి సంతకము చేయబడిన దస్తావేజు.

(c) మరియు, ఒకరు మరియొకనికి కొంతధాన్యముగాని లేక మరి యేయితర వ్యవసాయసంబంధమైన ఫలసాయముగాని యిచ్చుటకు ఖరారయుండి సాక్షిసంతకము చేయబడిన దస్తావేజు చేరును.

ఒక దస్తావేజులో ఒకడు కొంతసొమ్మును మరియొకనికిగాని, అతనివల్ల ఆర్డరు పొందినవారికిగాని, లేక ఆదస్తావేజు స్వాధీనము కలిగినవానికిగాని, యెట్టిషరతు లేకుండా యిచ్చేఖరారు యుండేయెడల అట్టి దస్తావేజు ప్రామిసరీనోటు అగును. పైన (a) క్లాజులో చెప్పబడిన దస్తావేజుగాక (b) (c) క్లాజులలో చెప్పబడిన దస్తావేజులపైన సాక్షిసంతకములు యుండవలెను. లేనియెడల ఆదస్తావేజులు "బాండ్లు" గా నేరవు. ఎగ్రిమెంట్లుఅగును. ఉదా: 'నేనుయీరోజున నీవద్దపుచ్చుకున్న రు 100-0-0 లు నీవు అడిగినపుడు యివ్వగలవాడను.' అని ఒక దస్తావేజులో యుండి దానిపైన సాక్షి సంతకము యున్నయెడల బాండు అగును. అట్టి దస్తావేజులో వడ్డీషరతు యున్నప్పటికి బాండుఅగును. కొంతధాన్యం అప్పుపుచ్చుకొని, తిరిగి ఆధాన్యమును, ధాన్యరూపకమైన వడ్డీతో (నాముతో) యిచ్చే యేర్పాటుతో వ్రాయబడి సాక్షి సంతకమున్న దస్తావేజు "బాండు" అగును. సాధారణముగ జట్టీకంట్రాక్టులు, సాక్షి సంతకములున్న బాండ్లు అగును. కాని సదరు జట్టీ కంట్రాక్టులలో షరతులు నెర వేర్చనియెడల యేదైనా నష్టము యిచ్చేలాగునగాని, యింకా యేయితర దండన షరతుగాని యున్నయెడల సదరు దస్తావేజులు బాండ్లు కానేరవు. ఎగ్రిమెంట్లుఅగును. జామీనుదారు వ్రాసియిచ్చిన ఒక జామీనుపత్రము సాక్షిసంతకమున్నయెడల 'బాండు' అగును. సాక్షిసంతకము లేనియెడల ఎగ్రిమెంటుఅగును. 'బాండ్లు' ప్రోనోట్లుగాని యితర ఖరారులు, ఎగ్రిమెంట్లు అగును.

2. ప్రామిసరీనోటు

| | రు. అ. పై. |
|---|---|
| మొత్తం రు 250-0-0 లకు మించనపుడు | 0—1—0 |
| ,, రు 250 లకు మించి రు 1000 లకు మించనపుడు | 0—2—0 |
| ,, రు 1000 కు మించిన యేమొత్తమునకైన | 0—4—0 |

| | రు. అ పై. |
|---|---|
| 3. ఎగ్రిమెంటు | 1—8—0 |

షరా:—వ్యాపారములో వర్తకపు సరుకులు ఖరీదుచేయుటకు వ్రాసికొన్న ఎగ్రిమెంట్లకు యెట్టిస్టాంపుడ్యూటీ ఇవ్వనక్కరలేదని మినహాయింపబడినది.

4. రశీదు

| | రు: అ. పై |
|---|---|
| రు 20 ల పై మొత్తమునకుగాని లేక రు 20 ల పైన కిమ్మతుచేసే చరాస్తికిగాని యివ్వబడినరశీదు. | 0—1—0 |

# పదవ భాగము

## అనుబంధము.

మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు ప్రకారము
గ్రామకోర్టులలో దాఖలు చేయవలసిన
ప్లయింట్లు, స్టేటుమెంట్లు, పిటీషనులు, చార్జీలు
వగైరాల నమూనాలు.

## ప్లయింటు ఫారములు 1

### 1 వ ఫారము — ప్రోనోటు ప్లయింటు.

మహారాజశ్రీ............గ్రామ పంచాయతీ లేక
గ్రామ మునసబు కోర్టువారి సముఖమునకు—

దావా నెం రు సం 19...

ఏ..........వాది

బి..........ప్రతివాది

వాది మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు 22, 23 సె.ల ప్రకారము
దాఖలు చేసిన ప్లయింటు.

| నెం | పార్టీల పేర్లు | తండ్రి లేక భర్తపేరు | వయస్సు | కులం | వృత్తి | సా॥ గ్రామం | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | వాది ఏ | | | | | | |
| 2 | ప్రతివాది బి | | | | | | |

3. వానివద్ద ప్రతివాది తనఅవసరము నిమిత్తము రు..........లు అప్పుపుచ్చుకొని సదరు మొత్తమును నెల 1కి 100 కి రు..........లు చొ॥న వడ్డీతో అయ్యే అసలుఫాయిదాలు వాదికిగాని వాని ఆర్డరు పొందినవారికిగాని అడిగినప్పుడు యిచ్చే మొదలగు షరతులతో ది.......... తేదీన వాదిపేర ప్రతివాది యిందుతో దాఖలు చేసిన ప్రామిశరీనోటును వ్రాయించియిచ్చి యున్నాడు.

4. దావానోటు బాకీనిగురించి వాదివల్ల ప్రతివాది అనేకసార్లు తగాయిదాను పొందినీన్నీ, యేమి వసూలుయిచ్చి యుండలేదు. (ప్రతివాది కొంతవసూలు యిచ్చిన యెడల "ప్రతివాది ది.............. తేదీన రు..........లు మాత్రము వసూలు యిచ్చియున్నాడు. మిగతాబాకీ యిచ్చియుండలేదు." అని వ్రాయవలెను.)

5. దావా కారణం:-వానిపేర ప్రతివాది దావానోటు వ్రాసియిచ్చిన ది............ తేదీనుండిన్నీ ప్రతివాది కాపురమున్న (లేక లాభంనిమిత్తము స్వయముగా పనిచేయుచున్న లేక వ్యాపారముచేయుచున్న) ఈమ కోర్టుయిలాకా...... గ్రామంలో కలిగినది. (దావాకారణము వ్రాయుటలో యీ మాన్యుయల్ లో లిమిటేషను ఆక్టునుగురించి వ్రాయబడిన అంశములను గమనించి వ్రాయవలెను.

6. దావావివరం :— రు. అ. పై.

దావానోటు అసలు
అందుకు నోటు తేదీ అయిన..........నుండిన్నీ
నెల 1కి 100 కి॥ రు...చొ॥.......... తేదీ
వరకు అయినవడ్డీ

వెరశి

(కొంత వసూలుయిచ్చినయెడల ఆ వసూలును తీసివేసి మిగతాబాకీ కనుపరచవలెను)

7. కాబట్టి కోర్టువారు విచారించి :-

(1) దావామొత్తమున్నూ (2) దావాఖర్చులున్నూ (3) సదరు రెండు మొత్తములపైన నెల 1కి 100 కి రు..........చొ॥ దరిమిలావడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చుకొనేలాగునయున్నూ (4) యింకా దావా స్వభావమునుబట్టి కోర్టువారికి న్యాయమని యుక్తమని తోచే అన్ని యితరపరిహారములు కలుగచేస్తూ డిక్రీ దయ చేయించగలందులకు వాది ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

మకాం:—

తేదీ:—

వాది సంతకము లేక నిశాని; వేలుముద్ర.

N. B:- 1. గ్రామకోర్టులలో దాఖలుఅయ్యే దావాలన్నియు గ్రామకోర్టులక్టు సె.15 ప్రకారము యే గ్రామకోర్టు అధికారముగల గ్రామములో ప్రతివాది లేక యెక్కువమంది ప్రతివాదులున్న అందరు ప్రతివాదులు కాపురముచేయుచున్నారో లేక స్వయముగాలాభంనిమిత్తం పనిచేయుటగాని లేక వ్యాపారముచేయుటగాని జరిగించుచున్నారో ఆ గ్రామకోర్టులో దాఖలుచేయవలసియున్నది. కాని సదరు గ్రామకోర్టు గ్రామమునసబుకోర్టుఅయి సదరు గ్రామమునసబుకు దావాలో స్వయముగా యేదైన సంబంధమున్నగాని సదరుదావాఆస్తిలో హక్కుయున్నగాని ఆ దావాను ఆ గ్రామమునకు ఆనుకొనియున్న మరియొక గ్రామకోర్టులో దాఖలు చెయ్యవచ్చును. ఆసంగతి "వ్యాజ్యకారణము అని వ్రాసిన పేరాలో చివర యీ క్రింది విధముగా వ్రాయవలసియున్నది" ప్రతివాదులు ........... గ్రామకోర్టు అధికారమునకు లోబడియున్న ...... గ్రామములో యున్నప్పటికిన్ని, యీ దావాతో సదరు గ్రామమునసబుకు స్వయముగా సంబంధమున్నందున ఆ గ్రామకోర్టుకు ఆనుకొనియున్న తమకోర్టులో యీదావాను మద్రాస్ గ్రామకోర్టులక్టు సె. 16 ప్రకారము దాఖలుచేయడమైనది.

2. ప్రోనోటు ప్లయింట్లలో దావానోటును వాది యితరులవద్ద నుండి ట్రాన్సఫరు పొందినయెడల పైఫారములో 3 పేరా తర్వాత 4 పేరాగా "సదరునోటును వాదిసరియైన ప్రతిఫలమునకు లేక వసూలు చేయునిమిత్తము...... తేదీన ట్రాన్సఫరు పొందినందున దావాబాకీని వాదరాబట్టుకొనుటకు సంపూర్ణహక్కుకలదు" అని వ్రాయవలెను.

2 వ ఫారము – ఖాతాప్లయింటు

కోర్టుపేరున్నూ పార్టీలపేర్లున్నూ అడ్రసులున్నూ
1 వ ఫారములోవలె వ్రాయవలెను.

3. వాదికొట్లో ప్రతివాది ఖాతాతెరువంబడి యిరువురితో దాఖలు చేసిన లెఖ్ఖపత్రాలు దాఖలా పరుకలున్నా రొఖ్ఖమున్నా వాదుకొనియున్నాడు. సదరు మొత్తముల క్రింద ప్రతివాది యిచ్చిన పనుల్కుబడిను ప్రతివాది వాదికి రు... లు బాకీయుండియున్నాడు. ప్రతివాది వాదుకున్న పత్రముతోను వాది ప్రతివాదుల మధ్యజరిగిన యేర్పాటు ప్రకారమున్నా, వర్తకపు రాయల ప్రకారమున్నా, లా ప్రకారమున్నా వాదికి ప్రతివాది

నెల 1కి ధ' 100 కి రు 1-9-0 చొ|| వడ్డీ యివ్వవలసియున్నాడు. ఆ ప్రకారమువడ్డీ కోరుచూ యీ దావా తేవడమైనది.

4. సదరు బాకీనిగురించి వాదివద్ద ప్రతివాది అనేకసార్లు తగాయిదాను పొందిన్నీ వసూలు యిచ్చియుండలేదు.

5. దావాకారణం:-ప్రతివాది వాడుకున్న ముందుఖర్చు పద్దులక్రింద, ముందు యిచ్చిన జమపద్దులు వసూలుపోను ప్రతివాది యివ్వవలసిన దావాకుపూర్వం 3 సం||ల లోపలయున్న ప్రధమ ఖర్చుపద్దు తేదీయగు ది.............నుండిన్నీ తమ కోర్టు యిలాకా ప్రతివాది కాపురమున్న (లేక స్వయముగా లాభంనిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారముచేయుచున్న)......గ్రామంలో వ్యాజ్యకారణము గలిగినది.

6. దావా వివరం :—

ఖాతా నకలు దాఖలా మొత్తం రు. అ. పై.

7. కాబట్టి (యీపేరా 1 వ ఫారములోవలెనే వ్రాయవలెను.)

**N. B:** ఖాతానఖలువ్రాసి వాది సంతకముచేసి ప్లయింటుతో జతపరచవలెను. విచారణకాలమందు వాదిఖాతాపుస్తకమును దాఖలు చేయవలసియుండును.

---

3 వ ఫారము - జట్టీకంట్రాక్టు ప్లయింటు
కోర్టుపేరున్నూ పార్టీలపేరున్నూ అడ్రసులున్నూ
1 వ ఫారములోవలె వ్రాయవలెను.

3. వాదివద్ద ప్రతివాది ది.......న రు.......లు అప్పుపుచ్చుకొని (లేక ధాన్యం పుచ్చుకొన్నయడల—బస్తాలధాన్యం పుచ్చుకొని) అందుకుగాను వాదికి... తేదీనాటికి.......బస్తాలధాన్యం కొలిచేలాగుననున్నూ, అలావాయిదానాటికి ధాన్యం కొలవకతప్పిపోయేయడల అప్పటి బజారుధరప్రకారముఅయ్యేమొత్తమున్నూ, అప్పటి నుంచి సదరు మొత్తముపైన నెలకి 1కి 100 కి రు.......చొప్పున వడ్డీతో వాదికి ప్రతివాది యిచ్చేలాగునయున్నూ మొదలగు షరతులతో వాదిపేర ప్రతివాది....... తేదీన యిందుతో దాఖలుచేసిన జట్టీకంట్రాక్టును వ్రాయించియిచ్చియున్నాడు.

4. ప్రతివాది కంట్రాక్టు షరతులప్రకారము యివ్వవలసిన ధాన్యమును వాయిదానాటికి యిచ్చియుండలేదు. వాయిదా తేదీకి ధాన్యంధర బస్తా 1కి రు...లు యుండియున్నది. ఆప్రకారము వాదికి ప్రతివాది యివ్వవలసిన ధాన్యం...బస్తాలకు కిమ్మతు రు..................లున్ను సదరు మొత్తముపైన వాయిదా గుజస్తు తేదీ అయిన..................తేదీలగాయతు నెల 1కి 100 కి రు...............లు చొప్పున వడ్డీయున్ను రాబట్టుకొనుటకు యీదావా దాఖలుచేయడమైనది.

5. వాదివల్ల ప్రతివాది దావా బాకీ విషయమై అనేకసార్లు తగాయిదాను పొందినప్పటికిన్నీ యేమి వసూలు యిచ్చియుండలేదు.

6. దావా కారణం:— వాది పేర ప్రతివాది వ్రాసియిచ్చిన జట్టీ కంట్రాక్టు షరతుల ప్రకారము వాయిదా తేదీ అయిన ది————నుండిన్నీ తమ కోర్టు యిలాకా ప్రతివాది కాపురమున్న (లేక లాభం నిమిత్తము స్వయముగా పనిచేయుచున్న లేక వ్యాపారము చేయుచున్న)———గ్రామములో వ్యాజ్యకారణము కలిగినది.

7. దావా వివరం:—

(1) వాదికి ప్రతివాది యివ్వవలసిన ధాన్యం రు. అ. పై.
——బస్తాలకు బస్తా 1కి రు————లు
చొ॥ అయిన కిమ్మతు

(2) సదరు మొత్తముపైన వాయిదా తేదీ లగాయతు
యీ సరికి నెల 1కి 100కి రు————చొ॥
అయిన వడ్డీ

వెరశి

8. (ఆఖరుపేరా 1వ ఫారములోవలె వ్రాయవలెను.)

---

4వ ఫారము – ఇండ్లు లేక స్థలముల అద్దెకు ప్లయింటు.

కోర్టు పేరున్నూ పార్టీల పేరున్నూ అడ్రస్‌లున్నూ
1వ ఫారములో వలెనే వ్రాయవలెను.

3. వాది తాలూకు————గ్రామంలోని యింటిని ప్రతివాది కాపురముండుటకుగాను నెల 1కి రు————చొ॥ అద్దె యిచ్చేలాగునన్నూ, ఏ నెల అద్దె ఆ నెలాఖరున యిచ్చేలాగునన్నూ, అలా యివ్వనియెడల గుజస్తు తేదీ లగాయతు నెల 1కి 100కి రు————లు వడ్డీతో యిచ్చేలాగునన్నూ మొదలగు షరతులతో వాది పేర ప్రతివాది————తేదీన యిందుతో దాఖలు చేసిన అద్దె కంట్రాక్టు వ్రాయించి యిచ్చి వాదియింట్లో ప్రవేశించి కాపురమున్నాడు.

4. వాదికి ప్రతివాది ది————తేదీనుండి యీసరికి————నెలల అద్దె బాకీ యుండియున్నాడు. సదరు బాకీ విషయమై వాది వల్ల తగాయిదాను పొందిన్నీ యేమిన్నీ వసూలు యిచ్చియుండలేదు.

5. దావా కారణం:— వాదికి ప్రతివాది యివ్వవలసిన, 19...సం॥ జనవరి ఫిబ్రవరి నెలల అద్దెకు ఆయా నెలాఖరు తేదీ నుండిన్నీ (ప్రతివాది కాపురమున్న లేక స్వయముగా లాభం నిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారము చేయుచున్న) గ్రామములో వ్యాజ్య కారణము కలిగినది.

6. దావా వివరం:—

వాదికి ప్రతివాది యివ్వవలసిన అద్దె రు. అ. పై

(1) జనవరి నెల అద్దె-అసలు
అందుకు 1-2—నుంచి నెల 1 కి 100 కి
రు——చొ॥ యీ సరికి అయిన వడ్డీ

(2) ఫిబ్రవరి నెల అద్దె అసలు
అందుకు 1-3—నుంచి నెల 1 కి 100 కి
రు——చొ॥ యీ సరికి అయిన వడ్డీ

వెరశి

7. కాబట్టి కోర్ను వారు
(ఆఖరు పేరా మొదటి ఫారములోవలె వ్రాయవలెను.)

---

5 వ ఫారము - భూమి కట్టుబడికి ప్లయింటు.

కోర్టు పేరున్నూ, పార్టీల పేరున్నూ అడ్రసులున్నూ
1వ ఫారములో వలెనే వ్రాయవలెను.

3. వాది తాలూకు————గ్రామములోని డి॥ నెం——రు——పల్లం. (లేక మెరక) య——ల భూమిని ప్రతివాది————ఫసలీలో సాగు చేసికొనుటకు కవులుకు పుచ్చుకొని అందుకుగాను వాదికి కట్టుబడిక్రింద——బస్తాల ధాన్యం —బొద్దుల వరిగడ్డిన్ని——తేదీనాటికి యిచ్చేలాగునయున్నూ, అలావాయిదానాటికి ధాన్యం వగైరాలు వప్పగించనియెడల అప్పటి బజారు ధర ప్రకారము అయ్యే కిమ్మతున్నూ అందుపైన గుజస్తు తేదీలగాయతు నెల1కి 100కి రు——ల చొప్పునవడ్డీతో యిచ్చే మొదలగు షరతులతో వాది పేర ప్రతివాది——తేదీన యిందుతో దాఖలు చేసిన ఖత్తును వ్రాయించియిచ్చి భూమిని స్వాధీనముచేసికొని సాగుచేసికొని ఫలసాయమును అనుభవించినాడు.

4. కాని వాదికి యివ్వవలసిన కట్టుబడి ధాన్యం గాని, వరిగడ్డి బొద్దులుగాని యిచ్చియుండలేదు. వాయిదానాటికి ధాన్యంధర బస్తా 1కి రు.........లు యున్నది. గడ్డిబొద్దు ధర 1కి రు......చొప్పున యున్నది. ఆ ప్రకారము యివ్వవలసిన మొత్తమున్నూ అందుపైన యివ్వవలసిన వడ్డీయున్నూ రాబట్టుకొనుటకు యీ దావా తేవడమైనది.

5. దావా కారణం:— వాదికి ప్రతివాది ధాన్యం వగైరాలు యివ్వవలసిన వాయిదా తేదీ అయిన......నుండి. తమ కోర్టు యిలాకా ప్రతివాది కాపురమున్న (లేక స్వయముగా లాభం నిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారము చేయుచున్న) ......గ్రామములో వ్యాజ్యకారణము కలిగినది.

6. దావా వివరం :-

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| (1) వాదికి రావలసిన——బస్తాల ధాన్యము బస్తా 1కి రు——చొ॥ అయిన కిమ్మతు | | | |
| (2) వాదికి యివ్వవలసిన వరిగడ్డి బోద్దులు బోద్దు 1కి రు————చొ॥ అయిన కిమ్మతు | | | |
| (3) సదరు రెండు మొత్తములపైన వాయిదా తేదీ లగాయితు యీసరికి నెల 1కి 100 కి రు చొ॥ అయిన వడ్డీ | | | |
| వెరశి | | | |

7 (ఆఖరుపేరా 1 వ ఫారములోవలెనే వ్రాయవలెను.)

---

## 6 వ ఫారము - చేబదుళ్లకు ప్లయింటు.

కోర్టుపేరున్నూ, పార్టీలపేరున్నూ అడ్రస్‌లున్నూ 1 వ ఫారములోవలెనే వ్రాయవలెను.

3. వాదివద్ద ప్రతివాది తన అవసరము నిమిత్తము రు————లు చేబదులు పుచ్చుకొనియున్నాడు. సదరు మొత్తమునకు ఆ తేదీనుండిన్నీ ప్రతివాది నెల 1కి 100 కి రు..............లు చొప్పున వడ్డీ యిచ్చుటకు వప్పుకొనియున్నాడు.

4. సదరు బాకీనిగురించి వాదివల్ల ప్రతివాది అనేకసార్లు లిఖితవాగ్రూపకముల ద్వారా తగాయిదాను పొందిన్నీ పనూలు యిచ్చియుండలేదు.

5. దావాకారణం :-వాదివద్ద ప్రతివాది చేబదులు పుచ్చుకొన్న————— తేదీనుండి ప్రతివాది కాపురముున్న (లేక స్వయముగా లాభంనిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారము చేయుచున్న) తమ కోర్టుయిలాకా————గ్రామంలో వ్యాజ్యకారణము కలిగినది.

6. దావా వివరం :-

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| (1) చేబదులు మొత్తం అసలు | | | |
| (2) అందుకు..........తేదీలగాయితూ యీసరికి. నెల 1కి 100 కి రు————చొ॥ అయిన వడ్డీ | | | |
| వెరశి | | | |

7. (ఆఖరు పేరా 1 వ ఫారములోవలె వ్రాయవలెను.)

7 వ ఫారము — చరాస్తికి ప్లయింటు.

కోర్టుపేరున్నూ పార్టీలపేరున్నూ అడ్రస్‌లున్నూ
1 వ ఫారములోవలెనే వ్రాయవలెను.

3. ప్రతివాది వాదితాలూకు ఒకబండిని (లేక నాగలిని లేక యింక యేచరాస్తిఅయిన దానిని ఉదహరించవలెను.) తనపనికిగాను వెంటనే తిరిగి యిచ్చెదనని చెప్పి తీసికొని వెళ్ళి యింతవరకున్నూ ఇచ్చియుండలేదు. సదరు బండికిమ్మతు రు——లు చేయును.

4. అందువల్ల ప్రతివాది వద్దనుంచి సదరు చరాస్తినిగాని సదరు ఆస్తిని ప్రతివాది స్వాధీనపరచనియడల దానికిమ్మతు రు——లు గాని రాబట్టుకొనుటకు యీ దావా లేవడమైనది.

5. దావాకారణం ప్రతివాది వాదిబండిని తీసికొనివెళ్లి యివ్వక తప్పిపోయిన ————తేదీనుండి తమకోర్టుయిలాకా ప్రతివాది కాపురమున్న (లేక స్వయముగా లాభం నిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారముచేయుచున్న)————గ్రామంలో వ్యాజ్యకారణము కలిగినది.

6. దావా వివరం :—

ప్రతివాది తీసికొనివెళ్లిన బండికిమ్మతు..............రు. అ. పై.

7. కాబట్టి కోర్టువారు విచారించి:-(1) వాదితాలూకు ప్రతివాది స్వాధీనములో యున్న బండిని ప్రతివాది స్వాధీనములోనుండి తెప్పించి వాదికి స్వాధీన పరిపించ గలందులకు (2) ప్రతివాది స్వాధీనముచేయక తప్పిపోయినయడల సదరాస్తికిమ్మతు రు——లు ప్రతివాదివల్ల వాది రాబట్టుకొనేలాగునయున్నూ (3) యీదావాఖర్చులు ప్రతివాది భరించేలాగునయున్నూ (4) దావామొత్తముపైన వాదికి ప్రతివాది నెల 1కి 100 కి రు——చొ॥ దరిమిలా వడ్డీయిచ్చేలాగునయున్నూ (5) యింకా దావాస్వభావ మునుబట్టి కోర్టువారికి న్యాయమని యుక్తమనితోచే అన్ని యితరపరిహారములు కలుగ జేస్తు డిక్రీయిప్పించగలందులకు వాది ప్రార్థించుచున్నాడు. చిత్తగించవలెను.

వాది సంతకము లేక నిశాని వేలుముద్ర

---

8 వ ఫారము — భాగస్వాములు లెఖలు తేల్చుకొన్నతరువాత యివ్వతేలిన బాకీలకు ప్లయింటు.

కోర్టుపేరున్నూ పార్టీపేర్లున్నూ అడ్రస్‌లున్నూ
1 వ ఫారములోవలెనే వ్రాయవలెను.

3. వాదిన్నీ ప్రతివాదిన్నీ 19—సం॥నుండి 19—సం॥వరకున్నూ జాయింటుగా చెరిసగంగా లాభములు భరించే యేర్పాటుచేసికొని ధాన్యం వ్యాపారము చేసి యున్నారు. సదరు వ్యాపారం లెఖలు పరిష్కరించుకుని తేల్చుకొని ఫైసలుకట్టు కట్టుకొని

యున్నారు. సదరు వెరసికట్టు ప్రకారము వాదికి ప్రతివాది రు..............లు యివ్వ తేలినాడు. సదరు మొత్తమునకు వాది ప్రతివాదుల మధ్య జరిగిన యేర్పాటును బట్టిన్నీ, వర్తకపు రివాజునుబట్టిన్నీ నెల 1కి 100కి రు..............చొ॥ వడ్డీ వాదికి ప్రతివాది యివ్వవలసి యున్నాడు.

4. సదరు బాకీనిగురించి వాదివల్ల ప్రతివాది తగాయిదాను పొందెన్నీ వసూలు యిచ్చియుండలేదు.

5. దావాకారణము:- వాది ప్రతివాదులు లెక్కలు తేల్చికొని వెరశికట్టు కట్టుకొన్న———తేదీనుండి ప్రతివాది కాపురమున్న (లేక స్వయముగా లాభం నిమిత్తము పనిచేయుచున్న లేక వ్యాపారము చేయుచున్న) తమ కోర్టు యిలాకా.............. గ్రామములో వ్యాజ్యకారణము కలిగినది.

6. దావా వివరం:— రు. అ. పై.

(1) వెరశి కట్టు ప్రకారము ఇవ్వవలసిన అసలు

(2) అందుపైన———తేదీనుండి నెల 1కి 100కి రు———చొ॥ అయిన వడ్డీ

వెరశి

7. (అఖరు పేరా 1వ ఫారములోవలెనే వ్రాయవలెను.)

---

## స్టేటుమెంట్లు – ఫారములు II

స్టేటుమెంట్లు వ్రాయునపుడు గమనించవలసిన అంశములు.

1. ప్రతివాది తనస్టేటుమెంటులో వాది దావా చెల్లదని చెప్పుటకు అవసరమైన అంశములన్నింటిని విపులముగాను స్పష్టముగాను వ్రాయవలెను. ప్లయింటులో వ్రాయబడిన అంశములలో ఏ అంశములైనను అబద్ధములైనయెడల సదరు అంశములు అబద్ధములనిన్నీ కొన్ని అంశముల నిజానిజములు ప్రతివాదికి తెలియని యెడల సదరు అంశములు ప్రతివాదికి తెలియవనిన్నీ, ప్రతివాది వాటిని వప్పుకొనడనిన్నీ, ప్రతిఅంశమునకు స్పష్టముగా వేరువేరుగా జవాబు వ్రాయవలెను. కాని మొత్తముమీద ప్లయింటులో సంగతులను ప్రతివాది వప్పుకొనేట్లు వ్రాసిన చాలదు. ప్రతివాది ప్లయింటుసంగతులలో వేటినైన వప్పుకొన్నట్లు వ్రాయనియెడల సదరు సంగతులను ప్రతివాది వప్పుకొన్నట్లు యెంచబడును.

2. వాది దావా, వాదిచేసిన దగానల్లగాని, బలాత్కారము వగైరాలవల్లగాని చెల్లనేరదని ప్రతివాదన యగునెడల వాది చేసిన దగా యొక్క లేక బలాత్కారము వగైరాలయొక్క సంగతులన్నియు విపులముగా ప్రతివాది ఆన్సరులో వ్రాయవలసియుండును. వాది దగా చేసినాడనిగాని బలాత్కారము చేసినాడనిగాని వ్రాసిన చాలదు.

3. వాది దావాకు లిమిటేషను పట్టినదని ప్రతివాది ఆన్సరు అయినయెడల లిమిటేషను పట్టినట్లు కనబడగల అంశములను స్పష్టముగా వ్రాయవలెను.

4. ప్రతివాది దావా బాకీకి వాయిదాల ప్రకారము డిక్రీ యిప్పించమని కోరేయెడల ఆ అంశమును ఆన్సరులో వ్రాయవచ్చును లేక వేరే పిటీషనుకూడ దాఖలు చేయవచ్చును.

5. ప్రతివాది తనకు వాదివల్ల రావలసిన యే బాకీకైన యెదురు దావాగా వాదివద్దనుండి యే మొత్తములైనా కోరే యెడల సదరు యెదురుదావా అంశములన్నియు ఆన్సరులో వ్రాయవలసియుండును.

---

1 వ ఫారము – ప్రోనోటు ప్లయింటుకు స్టేటుమెంటు.

మహారాజశ్రీ——————గ్రామ పంచాయతీ లేక
గ్రామ మునసబుకోర్టువారి సముఖమునకు
దావా నెం—రు సం॥ 19.........

ఏ.—వాది
బి.—ప్రతివాది

1 వ ఫారము – ప్రోనోటు ప్లయింటు స్టేటుమెంటు.

ప్రతివాది మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 35 ప్రకారము దాఖలు చేసిన స్టేటుమెంటు.

1. వాది దావా న్యాయమైనదిన్నీ, చెల్లతగినదిన్నీ కాదు. దావా సంగతులు నిజముగావు. దావా 'లా' ప్రకారము నిల్వనేరదు.

2. వాదివద్ద ప్రతివాది దావామొత్తముగాని, అంతకంటెహెచ్చుమొత్తముగాని తక్కువ మొత్తముగాని యెన్నడూ అప్పుపుచ్చుకొని యుండలేదు. అందుకుగాను వాదిపేర ప్రతివాది దావానోటు వ్రాసియిచ్చి యుండలేదు. దావానోటు కేవలము వాది సృష్టించినదై యున్నది. దావానోటుపైన యున్న సంతకము (లేక వ్రేలుముద్ర) యూ ప్రతివాదిది కాదు.

3. వాదికిన్నీ యీ ప్రతివాదికిన్నీ యిటీవల యేర్పడిన విరోధములవల్ల యీ ప్రతివాదిని సాధించుదురుద్దేశముతో యీ ప్రతివాది విరోధులైన———వగైరాలకు ప్రోత్సాహములతో వాది దావానోటును సృష్టించి యీ దావాను దాఖలు చేసినాడు.

4. వాది ప్లయింటులో కోరిన యే పరిహారమునకు అర్హుడుకాడు. ఆ అన్సరులో స్పష్టముగా వప్పుకొన్న సంగతులు తప్ప మిగతా యావత్తు ప్లయింటు సంగతులు యీ ప్రతివాది వప్పుకొనడు. వాదియే ఋజువు చేసికొనవలెను.

5. కాబట్టి కోర్టువారు విచారించి వాది దావాను పరిహరించి యీ ప్రతివాది ఖర్చులు వాదిభరించేలాగున తీర్పుదయచేయించగలందులకు యీ ప్రతివాది ప్రార్థించు చున్నాడు. చిత్తగించవలెను.

ముకాం:- } సంతకము బి
తేది:- }

---

2 వ ఫారము – వాది దగావల్ల దావా చెల్లదని ప్రతివాది వాదన అయినయెడల అన్సరు.

కోర్టు పేరున్ను, పార్టీల పేర్లున్ను 1 వ పేరాయున్ను స్టేటుమెంటు 1 వ ఫారములోవలె వ్రాయవలెను.

2. వాదివద్ద ప్రతివాది యెన్నడున్ను దావామొత్తమునుగాని మరి యేమొత్తమునుగాని ది............లేదీనగాని మరియొకప్పుడుగాని అప్పుపుచ్చుకొని యుండలేదు. ప్రతివాదికి అప్పుపుచ్చుకొనవలసిన అవసరమున్ను లేదు.

3. ఈ ప్రతివాది చదువురానివాడున్ను వ్యవహారజ్ఞానము లేనివాడున్ను అయిన అవకాశము జూచుకొని యీ ప్రతివాదిచేత గ్రామసాముదాయక స్థలము విషయమై తహశ్శీలుదారుగారికి అర్జీఅనిచెప్పి వాది యీ ప్రతివాదిచేత ఒకకాగితముపై నవీదిరో వ్రాసి వేలుముద్ర వేయించినాడు. వాది యీ ప్రతివాదిని పైవిధముగా దగాచేసి ప్రోనోటువ్రాసి దానిపైన యీ ప్రతివాది వేలుముద్ర వేయించియున్నాడు. కాని ఈ ప్రతివాది వాదివద్ద అప్పుపుచ్చుకొనుటగాని అందుకుగాను దావానోటువ్రాయుటగాని జరిగియుండలేదు. దావా నోటు ఫోర్జరీచేయబడినది. దావానోటు యెంతమాత్రము చెల్లనేరదు.

( 4, 5 చివర రెండు పేరాలున్ను 1 వ ఫారములోవలె వ్రాయవలెను.

3 వ ఫారము–వాది దౌర్జన్యముచేసి దావానోటు వ్రాయించుకొన్నందున దావా చెల్లదని అన్సరు అయినయెడల.

కోర్టుపేరున్నూ పార్టీలపేర్లున్నూ, 1 వ పేరాయున్నూ చివర రెండుపేరాలున్నూ 1 వ ఫారములోవలె వ్రాయవలెను.

2. వాదికిన్నీ, యీ ప్రతివాదికిన్నీ యిటీవల విరోధము యేర్పడి ఉభయుల మధ్య సివిల్ క్రిమినల్ కేసులు జరుగుచున్నవి. ఆ విరోధమువల్ల ...... తేదీన ప్రతివాది ఒంటరిగా వెళ్లుచుండగా వాదిన్నీ, వాదిన్నీ హితులైన............వారున్నూ యీ ప్రతివాదిని పట్టుకొనికొట్టి దౌర్జన్యముగా దావానోటువ్రాసి యీ ప్రతివాది చేత సంతకము చేయించుకొన్నారు. కాని ప్లయింటులో చెప్పినట్లు వాదివద్ద యీ ప్రతివాది అప్పుపుచ్చుకొనుటగాని అందునిమిత్తము దావానోటు వ్రాయుటగాని జరిగి యుండలేదు. దావానోటు పైసందర్భములలో వ్రాయబడినది. దానికి ప్రతిఫలము యెంతమాత్రములేదు. దావానోటు చెల్లనేరదు.

4 వ ఫారము—దావానోటుకు లిమిటేషను పట్టినదని వాదన అయినయెడల.

కోర్టుపేరున్నూ పార్టీలపేర్లున్నూ, I వ పేరాయున్నూ, చివర రెండుపేరాలున్నూ 1 వ ఫారములోవలె వ్రాయవలెను.

2. వాదిపేర యీ ప్రతివాది దావానోటు వ్రాసియిచ్చినమాట వాస్తవము. కాని సదరునోటుక్రింద యీ ప్రతివాది.........తేదీన ప్లయింటులో చెప్పినట్లు రు.........లు వసూలుయిచ్చుటగాని, సదరు వసూలుపైన సంతకముచేయుటగాని జరిగించియుండలేదు. వాదిద్వారాను లిమిటేషను పట్టినందున అక్రమలాభమును పొందు దురుద్దేశముతో వాదె వసూలును సృష్టించి యీ ప్రతివాది సంతకమును ఫోర్జరీచేసి యున్నాడు. ఈ ప్రతివాది సదరు వసూలు యిచ్చియుండనందున దావానోటుకు లిమిటేషను పట్టినది.

5 వ ఫారము – ఖాతాపైన తెచ్చిన ప్లయింటుకు ప్రతివాది ఖాతా ఒప్పుకోనియెడల.

కోర్టు పేరున్నూ, పార్టీల పేర్లున్నూ, 1వ పేరాయున్నూ చివర రెండు పేరాలున్నూ 1వ ఫారములో వలెనే వ్రాయవలెను.

2. వాది కొట్లో ప్రతివాది యెన్నడున్ను ఖాతాయుంచి ప్లయింటుతో దాఖలు చేసిన ఖాతానకలు దాఖలా సరుకులుగాని రొఖ్ఖమునుగాని వాదుకొనియుండలేదు. దావా ఖాతాయావత్తు వాది అక్రమలాభమునుపొందు దురుద్దేశముతోను ఈ ప్రతివాది యందుగల విరోధముచేతను యీ ప్రతివాదిని సాధించవలెనని సృష్టించియున్నాడు.

3. ప్రతివాది వాదివద్ద ఖాతాయుంచినప్పుడు వాది అసలు మొత్తమునుగాని అందుపైన వడ్డీనిగాని కోరుటకు యెంతమాత్రము హక్కు లేదు. కోరినవడ్డీయున్ను చాలా హెచ్చుగాయున్నది.

N.B:- ఖాతాప్లయింట్లలో ప్రతివాది ఖాతా దాఖలా కొన్ని అయిటములను వప్పుకొన్న యెడల యే తారీఖు అయిటములు వప్పుకొనుచున్నాడో యే తారీఖు అయిటములు నప్పుకొనుటలేదో స్పష్టముగా వ్రాయవలెను.

6వ ఫారము - జట్టీ కంట్రాక్టు దావాలో ప్రతివాది కంట్రాక్టు వప్పుకొన్నప్పుడు ఆన్సరు.

కోర్టుపేరున్నూ పార్టీల పేర్లున్నూ, 1 పేరాయున్ను 1 వ ఫారములో వలె వ్రాయవలెను.

2. వాదిపేర ప్రతివాది దావా జట్టీకంట్రాక్టు వ్రాసియిచ్చియుండలేదు.(సదరు కంట్రాక్టు మాజువానీ కంట్రాక్టు అయినయెడల "వాదితో ప్రతివాది దావా జట్టీ కంట్రాక్టు యెన్నడూ చేసియుండలేదు".) వాదికి యీ ప్రతివాది యందుగల విరోధముచేత దావా కంట్రాక్టును సృష్టించి యీ ప్రతివాదిని సాధించి తాను అక్రమ లాభమును పొందుమరుద్దేశముతో యీఅబద్ధపుసంగతులతో దావాను తెచ్చియున్నాడు.

3. వాదిప్లయింటులో ధాన్యంధర చాలాహెచ్చుగా నమోదు చేసియున్నాడు. వాదికి వడ్డీకోరే హక్కు యెంతమాత్రములేదు. కోరిన రేటున్ను జాస్తిఅయియున్నది.

(చివరరెండు పేరాలును 1 వ ఫారములోవలె వ్రాయవలెను.)

7 వ ఫారము - ప్రతివాది దావా బాకీని నప్పుకొని వాయిదాలమీాద తీర్చుకొనే పద్ధతిని డిక్రీ యిప్పించమని కోరినవుడు ఆన్సరు.

కోర్టుపేరున్నూ, పార్టీలపేరున్నూ, 1వ ఫారములోవలె వ్రాయవలెను.

1. వాదికి యీ ప్రతివాది దావాబాకీ యివ్వవలసినమాట వాస్తవము.

2. ప్రతివాదికి యెట్టి స్థిరా స్తిన్నీలేదు. కూలీచేసిన్నీ, వ్యవసాయము చేసిన్నీ అతి కష్టముమీాద జీవనము చేయుచున్నాడు. ప్రతివాది చేసిన వ్యవసాయములో పంటలు పండక పోవుటవల్లనున్నూ, దుక్కిటి పశువులు చచ్చిపోవుటవల్లనున్నూ వాది బాకీని ప్రతివాది యినివరలో తీర్చలేకపోయినాడు. వాది ఇప్పుడు డిక్రీని పొంది యీ ప్రతివాదిని కష్టపెట్టవలెననే ప్రయత్నములో యున్నాడు.

3. దావా బాకీని ఒకసారి తీర్చుటకు యీ ప్రతివాదికి తాహతు లేదు. సదరు బాకీని 3 సం॥లలో 3 సమాన వాయిదాలమీాద 3 సమాన మొత్తములను తీర్చుటకు యీ ప్రతివాది సిద్ధముగా యున్నాడు.

4. కాబట్టి కోర్టువారు కరుణించి:— దావా బాకీని 3 సం॥లలో 3 సమాన వాయిదాలపైన 3 సమాన మొత్తములుగ తీర్చేలాగున డిక్రీ దయచేయించగలందులకు యీ ప్రతివాది ప్రార్థించుచున్నాడు. చిత్తగించవలెను.

మకాం:—
తేదీ:— } ప్రతివాది సంతకము లేక నిశాని వేలుముద్ర.

8 వ ఫారము – వాది దావాకు ప్రతివాది యెదురు దావా వేసేయడల ప్రతివాది 'అన్సరు.

కోర్టుపేరున్నూ, పార్టీలపేర్లున్నూ 1వ ఫారములోవలె వ్రాయవలెను. ప్రతివాది మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 38 ప్రకారము దాఖలుచేసిన యెదురు దావా.

1. వాదికి ప్రతివాది దావా నోటుబాకీ యివ్వవలసినమాట వాస్తవము.

2. వాదివద్ద ప్రతివాది గత సంవత్సరములో పాలేరుగా యుండియున్నాడు. ప్రతివాది చేసినపనికి వాది ప్రతివాదికి నెల 1 కి జీతము క్రింద రు 8-0-0 లు యివ్వవలసి యున్నాడు. గతసంవత్సరము యివ్వవలసిన జీతము మింజువలె జనవరినుండి ఆగష్టు మాసమువరకు యివ్వవలసిన జీతమును యిచ్చివేసియున్నాడు. కాని సెప్టెంబరు నుండి డిశంబరు ఆఖరువరకు యివ్వవలసిన జీతము రు 32-0.0 లు యిచ్చియుండలేదు.

3. కాబట్టి వాదిదావానోటుపైన యీ ప్రతివాదియివ్వవలసినబాకీ రు50-0-0లో నుంచి యీ ప్రతివాదికి రావల్సిన 4 మాసముల జీతము. రు 32-0-0 పోను

బాకీ రు. 18-0-0 లు

4. కాబట్టి కోర్టువారు విచారించి ప్రతివాది యెదురు దావా మొత్తము పోను వాదికి యీ ప్రతివాది యివ్వవలసిన రు 18-0-0 లకు మాత్రము డిక్రీ యిప్పించగలందులకు యీ ప్రతివాది ప్రార్థించుచున్నాడు.

ప్రతివాది సంతకము లేక నిశాని వేలుముద్ర

మకాం:—

తేదీ:—

---

## పిటీషనులు – ఫారములు III.

ఈ ఆక్టుక్రింద దాఖలుచేయు పిటీషనులు వ్రాయుటలో వాదిగాని, ప్రతివాదిగాని, లేక యితరులుగాని యేసెక్షనుక్రింద పిటీషనులు దాఖలు చేయుచున్నాడో ఆ సెక్షను ఉదహరించవలెను. పిటీషనులలో పిటీషనరు కోరే పరిహారమున్నూ, అట్టి పరిహారమునకు పిటీషనరు యెట్లు అర్హుడో ఆ సంగతులను స్పష్టముగా నుదహరించవలెను.

1 వ ఫారము

మహారాజశ్రీ......గ్రామపంచాయతీ లేక
గ్రామమునసబు కోర్టువారి సముఖమునకు—
దావా నెం రు సం॥

1 ఏ—వాది
2 బి—ప్రతివాది

వాది ప్రతివాదులు మద్రాస్ గ్రామకోర్టుల ఆక్టు సె. 14 ప్రకారము తమ కోర్టు యెదుట వ్రాసి దాఖలు చేసిన నప్పొందల.

3. ఈ నెంబరు దావా ముత్తం రు 200-0-0 లు అయియున్నది. సదరు దావాను తమకోర్టువారు విచారించి తీర్పుచెప్పుటకు మేము ఉభయవాదులము ఇందుమూలముగా ఒప్పుకొనుచున్నాము. చిత్తగించవలెను.

గ్రామం:— }
తేదీ:— }
వాది—ఏ సంతకము లేక నిశాని వేలుముద్ర
ప్రతివాది—బి

---

2 వ ఫా ర ము.

వాది ప్రతివాదుల పేర్లున్నూ, కోర్టుపేరు వగైరాయున్ను 1వ ఫారములోవలెనే వ్రాయవలెను.

వాది మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 32 ప్రకారము దాఖలు చేసిన పిటీషను.

3. ప్రతివాది వాదిపేర వ్రాయించి యిచ్చిన ప్రోనోటును బట్టి వాది యీ దావాను తెచ్చియున్నాడు. కోర్టువారు యీదావాను......... తేదీకి ప్రతివాది హాజరగుటకు వాయిదా వేసియున్నారు. ఆ తేదీన ప్రతివాది హాజరై దావా బాకీని వప్పుకొనియుండలేదు. ఈ వాది ఆ తేదీన తనకు వంట్లోజ్వరముగాయుండి లేవలేనిస్థితిలో యుండి కోర్టుకు హాజరు కాలేకపోయినాడు. కోర్టువారు వాది హాజరులేనందున ప్రతివాది దావాబాకీని వప్పుకోనందున మదరాసు గ్రామకోర్టుల ఆక్టు సె 30 (2) క్లాజు ప్రకారము వాది దావాను ది............ పరిహరించియున్నారు.

4. వాది సదరు వాయిదాకు తమకోర్టుకు హాజరుకాకపోవడములో బుద్ధిపూర్వకముగా జరిగించిన లోపమెద్దియును లేదు. జబ్బుగా యుండి లేవలేనిస్థితిలో యున్నందున కోర్టుకు హాజరై యుండలేదు.

5. కాబట్టి, కోర్టువారు విచారించి వాది......... తేదీన తమ కోర్టుకు హాజరు కాని లోపమును క్షమించి వాది దావాను కోర్టు త్రోసివేసిన ఆర్డరును రద్దుపరచి యీ దావాను తిరిగి విచారించగలందులకున్నూ, యింకా యీపిటీషను స్వభావమునుబట్టి కోర్టువారికి న్యాయమని, యుక్తమని తోచే అన్ని యితర పరిహారములు కలుగజేస్తూ ఆర్డరు దయచేయుగలందులకు వాది ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

వాది సంతకము లేక నిశాని వేలుముద్ర

గ్రామం:—
తేదీ:—

## 3 వ ఫారము.

కోర్టుపేరున్నూ పార్టీల పేర్లున్ను దావా నెంబరు వగైరాలు
1 వ ఫారములోవలె వ్రాయవలెను.

ప్రతివాది మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 33 ప్రకారము దాఖలు చేసిన పిటీషను.

ఈ ప్రతివాది పైన వాది యీ నెంబరున ఒక అబద్ధపు దావా దాఖలుచేసి అందులో యీ ప్రతివాదికి సమను అందనియ్యకుండా దగాచేసి అబద్ధపు సంగతులతో సమనులు రిటర్న్ చేయించి ది.............. తేదీన యక్సుపార్టీ డిక్రీనిపొంది యున్నాడు.

4. ఈ దావాలో యీ ప్రతివాదికి బలమైన వాదనయున్నది. ఈ ప్రతివాదికి దావా సంగతి యీ ప్రతివాది చరాస్తిని తమ కోర్టువారు జప్తుచేసిన ది.......... తేదీన తెలియవచ్చినది. అంతకుపూర్వము యీ దావాసంగతి య్యీ ప్రతివాదికి తెలియదు.

5. కాబట్టి కోర్టువారు విచారించి యీ నెంబరులో యిచ్చిన ఎక్సుపార్టీ డిక్రీని రద్దుపరిపించి దావాను తిరిగివిచారించగలందులకు యీ ప్రతివాది ప్రార్థించుచున్నాడు.

చి తగించవలెను.
ప్రతివాది సంతకము లేక నిశాని వేలుముద్ర

గ్రామం:—
తేదీ:—

---

## 4 వ ఫారము.

### క్లయిము పిటీషను

మహారాజశ్రీ............గ్రామపంచాయతీ లేక
గ్రామమునసబుకోర్టువారి సముఖమునకు—
దావా నెం రు of సం॥

ఏ—పిటీషనరు

బి—కవుంటరు పిటీషనరు

పిటీషనరు మద్రాస్ గ్రామకోర్టు ఆక్టు సె. 57 ప్రకారము దాఖలుచేసిన పిటీషను.

| నెం | పార్టీపేరు | తండ్రిపేరు | కులం | వయస్సు | వృత్తి | సా॥ గ్రామము |
|---|---|---|---|---|---|---|
| 1 | ఏ (పిటీషనరు) | | | | | |
| 2 | బి (కవుంటరు పిటీషనరు) | | | | | |

3......గ్రామకాపురస్థుడైన "సి" మీద కవుంటరు పిటీషనరు తమకోర్టులో యీ నెంబరు దావాచేసి డిక్రీపొందినట్టున్నూ, సదరు డిక్రీ అమలులో అని యిందుతో దాఖలుచేసిన షెడ్యూలు దాఖలా చరాస్తిని, సదరాస్తి యీ నెంబరులో ప్రతివాదియైన "సి" ది అయినట్లు చెప్పుచు, డి.........తేదీన జప్తుచేయించినాడు.

4. షెడ్యూలు దాఖలా ఆస్తియందు యీ నెంబరు ప్రతివాదికి యెట్టిహక్కు-భుక్తములున్నూ లేవు. సదరాస్తి యీపిటీషనరు ఆస్తియయి అతని స్వాధీనానుభవములలో నుంటూయున్నది. దీనిని జప్తుచేయించుటకు వాదికి యెట్టిహక్కు-న్ను లేదు. సదరాస్తి యీపిటీషనరుకు చెందినదని యెరిగియుండిన్నీ వాది అక్రమలాభమును పొందు దురుద్దేశముతోను, యీపిటీషనరుయందుగల విరోధముచే యీపిటీషనరును సాధించవలెననిన్నీ జప్తుచేయించియున్నాడు. సదరుజప్తు 'లా' ప్రకారము చెల్లనేరదు. సదరాస్తియందు యీ నెంబరు ప్రతివాదికి యెన్నడూ యెట్టిహక్కు-భుక్తములున్ను లేవు. అది యెల్లప్పుడు యీ పిటీషనరుయొక్క ప్రత్యేక స్వాధీనానుభవములో యుంటూయున్నది.

5. కాబట్టి కోర్టువారు విచారించి (1) షెడ్యూలు దాఖలా ఆస్తిలో ఈ పిటీషనరు హక్కు-భుక్తములను స్థిరపరిపించి (2) సదరాస్థిని జప్తులోనుండివిడుదలచేయించి యీ పిటీషనరుకు స్వాధీన పరిపించగలందులకున్ను (3) యీ పిటీషనరు ఖర్చులు కవుంటరు పిటీషనరు భరించేలాగునయున్ను, (4) యింకా పిటీషను స్వభావమునుబట్టి కోర్టువారికి న్యాయమని యుక్తమనితోచే అన్ని యితర పరిహారములుకలుగజేస్తూ ఆర్డరు దయచేయగలందులకు యీ పిటీషనరు ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

మకాం:—
తేదీ:—

పిటీషనరు ఏ (సంతకము)

మహారాజశ్రీ.........గ్రామపంచాయతీ లేక
గ్రామమునసబు కోర్టువారి సముఖమునకు—
దావా నెంబరు of సం||

పిటీషనరు—ఏ
కవుంటరు పిటీషనరు—బి

పిటీషనరు దాఖలుచేసిన జప్తుఆస్తి షెడ్యూలు.

చిత్తగించవలెను.
(సంతకము) ఏ పిటీషనరు.

(1)
(2)
(3)

## 5 వ ఫారము వారంటు దరఖాస్తు.

మహారాజశ్రీ.........గ్రామపంచాయతీ లేక
గ్రామకోర్టువారి సముఖమునకు

దావా నెం రు సం॥

ఏ—(వాది) డిక్రీదారు

బి—(ప్రతివాది) తీర్పు ఋణస్థుడు

డిక్రీదారు (వాది) మ॥గ్రా॥కో॥ అ॥ సె. 52 ప్ర॥ దాఖలు చేసిన వారంటుదరఖాస్తు.

| | |
|---|---|
| దావా నెంబరు | |
| వాది పేరు, సా॥ గ్రామము | |
| ప్రతివాది పేరు సా॥ గ్రామము | |
| డిక్రీ తేది | |
| డిక్రీపైన రివిజన్ పిటీషను పెట్టినారా? దాని పర్యవసానము | |
| ఇదివరలో దాఖలు అయిన వారంటు దరఖాస్తులు తేదీలు వాటి పర్యవసానములు | |
| డిక్రీ దరిమిలాయిచ్చిన వసూళ్లు అమలు ఎవరిపైన చేయవలసినది | |
| డిక్రీ ప్రకారము రావలసిన మొత్తము | (1) డిక్రీ ప్రకారము రానలసిన రు. అ. పై మొత్తము<br>(2) సదరు మొత్తముపైని డిక్రీ తేదీలగాయతు ఈసరికి నెల 1 కి 100 కి రు.......చొ॥ అయిన వడ్డీ<br>(3) లోగ వారంటు ఖర్చులు |

వెరశి

| | |
|---|---|
| కోర్టువారి వలన పొందకోరే సహాయము. | ప్రతివాది తాలూకు ప్రతివాది స్వాధీనములో యున్న చరాస్తిని యీ ఆక్టు సె. 52 ప్రకారము జప్తుచేయించి లేక ప్రతివాది తాలూకు............ వారి స్వాధీనములోయున్న చరాస్తిని సె. 54 ప్రకారము జప్తుచేయించి లేక ప్రతివాదికి.........వాడి వల్ల రావలసిన బాకీని సె. 55 ప్రకారము జప్తు చేయించి, సదరు ఆస్తిని వేలం వేయించి వేలంవల్ల వచ్చిన సొమ్ము యీడిక్రీక్రింద వసూలుయిప్పించుట మూలముగా డిక్రీని అమలు జరిపించ గలందులకు డిక్రీదారుడు ప్రార్థించుచున్నాడు.<br>చి తగించవలెను. |

ముకాం:-<br>తేది:-

(వాది)—ఏ డిక్రీదారు.

---

## 6·వ ఫారము – గ్రామకోర్టు డిక్రీని డిస్ట్రిక్టు మునసబు కోర్టుకు ట్రాన్స్‌ఫరు చేయమని పిటీషను.

సెక్షన్ 52 ప్రకారము దాఖలుచేయవలసిన వారంటు దరఖాస్తువలెనే తయారు చేసి పైన సెll 52 అనుమాటను తీసివేసి సెll 66 ప్రకారము దాఖలుచేసిన పిటీషను అని వ్రాయవలెను. ఆఖరు కలములో "యీ నెంబరు ప్రతివాది................ డిస్ట్రిక్టు మునసబుకోర్టు యిలాకా...............గ్రామములోయున్నందున యీడిక్రీని అమలు జరుపుటకు ...............డిస్ట్రిక్టు మునసబుకోర్టుకు ట్రాన్స్‌ఫరు చేయించ గలందులకు (వాది) డిక్రీదారు ప్రార్థించుచున్నాడు." అని వ్రాయవలెను.

## 7వ ఫారము. చనిపోయిన వాదిస్థానే అతని న్యాయశాస్త్ర ప్రతినిధి చేరుటకు పిటీషను.

మహారాజశ్రీ............గ్రామపంచాయతీ లేక
గ్రామ మునసబుకోర్టువారి సముఖమునకు——
దావా నెం రు 19 సం॥

ఏ——————పిటీషనరు
బి——————కవుంటరు పిటీషనరు

పిటీషనరు మ॥ గ్రా॥ కో॥ సె. 68 ప్రకారము దాఖలుచేసిన పిటీషను.

పేరు తండ్రిపేరు వయస్సు కులం వృత్తి సా॥ గ్రామము

(1) పిటీషనరు
ఏ

(2) కవుంటరు పిటీషనరు
బి

(3) కవుంటరు పిటీషనరు యీ నెంబరులో వాదిగాయున్న యీ పిటీషనరు అవిభక్త తండ్రిపేర వ్రాయించి యిచ్చిన ప్రోనోటునుబట్టి యీ నెంబరు దావా దాఖలు చేసియున్నాడు. యీ దావా యిప్పుడు పెండింగులో యున్నది.

4. యీ దావాలో వాదియైన యీ పిటీషనరు తండ్రి యీ నెంబరుతో అవిభక్తుడుగా యుంటూ ది——————తేదీన చనిపోయినాడు. అందువల్ల యితరకుటుంబా స్తితోపాటు దావా బాకీలోకూడ యీ పిటీషనరుకు సంపూర్ణ హక్కుయేర్పడినది.

5. కాబట్టి కోర్టువారు విచారించి:——

(1) యీ దావాలో యీపిటీషనరు లేటు తండ్రిస్థానే యీపిటీషనరును వాదిగా చేర్పించి దావా గ్రంథము జరుపుటకు ఆర్డరు దయచేయగలందులకున్నూ (2) యింకా యీపిటీషను స్వభావమును బట్టి కోర్టువారికి న్యాయమని, యుక్తమని తోచే అన్ని యితర పరిహారములు కలుగజేస్తూ ఆర్డరు దయచేయగలందులకు యీ పిటీషనరు ప్రార్థించుచున్నాడు.

మకాం:——
తేదీ:——

చిత్తగించవలెను
(పిటీషనరు) ఏ సంతకము లేక నిశాని వేలుముద్ర

## 8వ ఫారము - తీర్పుఋణస్థుడు చనిపోయినప్పుడు అతని న్యాయ శాస్త్రప్రతినిధిపై అమలు జరుపుటకు పిటీషను.

మహారాజశ్రీ......గ్రామ పంచాయతీ లేక
గ్రామ మునసబుకోర్టువారి సముఖమునకు
దావా నెం రు సం॥ 19

ఏ—పిటీషనరు (వాది)
బి—కవుంటరు (పిటీషనరు)

పిటీషనరు మ॥ గ్రా॥ కో॥ సె. 72 ప్రకారము దాఖలు చేసిన పిటీషను

| పేరు | తండ్రి పేరు | వయస్సు | కులం | వృత్తి | సా॥ గ్రామము |
|---|---|---|---|---|---|
| 1. పిటీషనరు ఏ | | | | | |
| 2. కవుంటరు పిటీషనరు బి | | | | | |

3 యీ పిటీషనరు వాదిగాయుండి......గ్రామ కాపురస్థుడున్నూ యీ కవుంటరు పిటీషనరు అవిభక్తతండ్రిన్నీ అయిన లేటు———పైన యీ నెంబరు డిక్రీ పొంది యున్నాడు.

4 కవుంటరు పిటీషనరు డ్రి యీ నెంబరు డిక్రీబాకీక్రింద యేమిన్నీ వసూలు ఇచ్చియుండలేదు. అతడు— -తేదీన చనిపోయినాడు. కుటుంబా స్తితోని అతని హక్కు యావత్ యీ కవుంటరు పిటీషనరుకు సంక్రమించినది. యీ పిటీషనరు తీర్పు ఋణస్థుని న్యాయశాస్త్ర ప్రతినిధి అయియున్నాడు. అందువల్ల డిక్రీ బాకీని తీర్చుటకు యీ కవుంటరు పిటీషనరు బద్ధుడై యున్నాడు.

5. కాబట్టి కోర్టువారు విచారించి:—

(1) ఈ నెంబరులో చనిపోయిన తీర్పుఋణస్థుని స్థానే యీ కవుంటరు పిటీషనరును చేర్చి అతనిమీద వారంటు గ్రంథము జరుపుటకు ఉత్తరువు యిప్పించుటకున్నూ (2) యింకా యీపిటీషను స్వభావమునుబట్టి కోరువారికి న్యాయమని యుక్తమని తోచే అన్ని యితర పరిహారములు కలుగజేస్తూ ఆర్డరు దయచేయించగలందులకు పిటీషనరు ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

(పిటీషనరు) ఏ సంతకము లేక నిశాని వేలుముద్ర.

మకాం:—
తేదీ:—

# ఛార్జిలఫారములు. IV

మహారాజశ్రీ——గ్రామపంచాయతీ
కోర్టువారి సముఖమునకు—

క్రిమినల్ కేసు నెం ది సం॥ 19

1. ఏ————ఫిర్యాది సా॥——గ్రామము——

2. బి————ముద్దాయి సా॥——గ్రామము——

3. నేరం తేదీ, కాలము:— 1-10-35 ఉదయం 8 గంటలకు

4. నేరం స్థలం:————గ్రామంలో, బజారులో

5. నేరం స్వభావం:— ఇం॥పీ॥కో॥ సె. 323, 504 ల ప్రకారము.

6. నేరముకు కారణము:—ఫిర్యాదు ముద్దాయివల్ల తనకురావలసిన బాకీకి—డిస్ట్రిక్టు మునసబుకోర్టులో దావాదాఖలుచేసినాడు. కోర్టుప్రాసెస్ సర్వరు ఆదావాలో ప్రతివాది సమనుతీసికొనివచ్చి ఫిర్యాదిని ముద్దాయిని చూపమని అడుగగా ఫిర్యాది బజారులోయున్న ముద్దాయిని చూపించగా ప్రోసెస్ సర్వరు సమను ముద్దాయికియిచ్చినాడు. ముద్దాయి సమనుచూచుకొని ఫిర్యాది దావా చేసినాడనే కోపముతో.

7. ముద్దాయిచర్య:- దౌర్జన్యముగా ఫిర్యాదిమీదికివచ్చి "ప్లయింటు చేసినావు నీవు. బాకీ వసూలుచేసియేడ్చితే చూస్తాను. ప్లయింటుచేసే పొగరుఎక్కినదా?" అని అనగా ఫిర్యాది అనవసరముగా మాటలు యెందుకు? వ్యవహారము చేసికొనవలెనుగాని అని అనగా ముద్దాయి "లంజకొడకా" వ్యవహారము చేసికొనవలెనా? నిన్నుతన్నితే నీకు దిక్కువరువస్తారు" అని తనచేతిలోయున్నకఱ్ఱతో ఫిర్యాదినెత్తిమీద ఒక బలమైన దెబ్బకొట్టినాడు. దానితో ఫిర్యాది తలచిట్లి రక్తముకారినది. ఫిర్యాదికి తగిలిన దెబ్బవల్ల ఫిర్యాదికి బాధకలిగినది. ముద్దాయి తిట్టినతిట్లకు ఫిర్యాదికి చాలకోపమువచ్చినది. అప్పుడు సాక్షులువచ్చి ముద్దాయిని కఠినముగా మందలించినమీదట ముద్దాయి ఫిర్యాదిని బూతులుతిట్టుచు వెళ్ళిపోయినాడు.

ఫిర్యాదికి తగిలినదెబ్బకు డాక్టరుగారివల్ల సర్టిఫికెట్టు పుచ్చుకొని యిందుతో దాఖలుచేయడమైనది.

8. కాబట్టి కోర్టువారు విచారించి ముద్దాయి జరిగించిన నేరమునకు ముద్దాయికి తగినశిక్ష విధించగలందులకు ఫిర్యాదీ ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

మకాం:—
తేదీ:—

ఏ ఫిర్యాది.

సంతకము లేక నిశాని వేలుముద్ర

9. సాక్షులు:—

పేర్లు నివాసస్థలము.

---

## 2 వ ఫారము

మహారాజశ్రీ............గ్రామపంచాయతీ
కోర్టువారి సముఖమునకు—

క్రిమినలు కేసు నెం రు సం॥ 19

1. ఏ—ఫిర్యాది సా॥
2. బి—ముద్దాయి సా॥
3. నేరం తేదీ, కాలము:— 1-10-35 రాత్రి 10 గంటలకు
4. నేరం స్థలము:—ఫిర్యాదితోటలో
5. నేరం స్వభావం:—ఇం॥ పీ॥ కో॥ సె. 379 ప్రకారము

6. నేరంకు కారణము:- ముద్దాయి యీ ఫిర్యాదితాలూకు యీ ఫిర్యాది ప్రత్యేక స్వాధీన హక్కుభుక్తములోయున్న తాటితోటలోని తాటాకులను కోసికొని యెత్తుకొనిపోయి అక్రమలాభమునుపొందు దురుద్దేశముతో.

7. ముద్దాయి చర్య:—ఫిర్యాదియొక్క యెట్టిఅనుమతిలేకుండా నేరం తేదీ రాత్రి 10 గంటలకు ఫిర్యాది తోటలోనికివెళ్లి ఫిర్యాది తాటిచెట్ల ఆకులను కొట్టి 10 మోపుల ఆకులను యెత్తుకొనిపోయితన యింటివద్ద వేసికొన్నాడు. ఆ ఆకులు యిప్పుడు ముద్దాయి యింటివద్ద యున్నవి. ముద్దాయి యెత్తుకొనిపోయిన ఆకులు రు 5-0-0 ల కిమ్మతుచేయును.

8. కాబట్టి కోర్టువారు విచారించి:_ముద్దాయి యింటివద్దయున్న తాటాకులు తెప్పించి, యీ ఫిర్యాదికిప్పించి ముద్దాయి జరిగిన నేరమునకు ముద్దాయికి తగిన శిక్ష నొసంగగలందులకు ఫిర్యాది ప్రార్థించుచున్నాడు.

చిత్తగించవలెను.

మకాం:—
తేదీ:—

(ఫిర్యాది) ఏ సంతకము లేక నిశాని వేలుముద్ర

9 సాక్షులు

పేర్లు నివాసస్థలము.



ప్రథమ ముద్రణము

మద్రాస్ గ్రామకోర్టుల మాన్యుయల్ నుగురించి కొన్ని అభిప్రాయములు

# ఆంధ్ర పత్రిక అభిప్రాయము

గ్రంథకర్త;

బండా కనకరాజుగారు, బి. ఏ; జిల్లాకోర్టు వకీలు, గుడివాడ, (కృష్ణా)

న్యాయశాస్త్రమును గురించిన పరిజ్ఞానము పండితులకేగాక పామరులకుగూడ అవసరమైనది. విపుల న్యాయశాస్త్రాంశములన్నియు కరతలామలకములగుట సాధ్యము కాకున్నను అపుడపుడు నిర్మింపబడు చట్టములను గురించిన విషయములు గ్రామస్తుల పిడికిళ్లలో నుండవలయును. దైనిక వ్యవహారములను నిర్వహించుటలో ఇట్టి పరిజ్ఞానము ఎంతేని మేలుచేకూర్చును. అజ్ఞానము వలనను అర్ధానర్థస్వార్థజ్ఞానము వలననుగదా ఎన్నేని చెరుపులు తలయెత్తును. అవసరమగు శాసనాంశములను మన పల్లెవాసులు హృదయంగమ మొనరించుకొనుచో న్యాయభూయిష్ఠమైన వ్యాజ్యములు విజృంభింప నేర్వు......

"లా" కు సంబంధించిన గ్రంథములును, రిపోర్టులును, ఆంగ్లమందుండుటచే ఇవి గ్రామస్థులకు దురూహ్యములయియున్నవి. సాధారణ గ్రామస్థులమాట అటుండ గ్రామమునసబులకును పంచాయతీ కోర్టువారికిని ముఖ్యమయిన న్యాయశాస్త్రాంశములు గగనకుసుమములయి యున్నవి.

గ్రామములందలి న్యాయమూర్తుల కట్టుకుటందోచు నీకష్టము సామాన్యమైనదికాదు. ఈకష్టమును నెట్టించుటకై ఈవరలో గట్టియత్నముచేసినన్యాయవాదు లెవ్వరునులేరు. గ్రామములలో పొడసూపుఇక్కట్టులు హైకోర్టువరకు ప్రాకుచున్నవి. కొంతకాలమునకుమున్ను ఈయంశం న్యాయమూర్తి వెంకటసుబ్బారావుగారిదృష్టి నాకర్షించినది. పట్టణములనుండి వకీళ్లు పల్లెలకుతరలిపోయి వ్యాజ్యములుపుట్టిన చోటులందే వాని నెదుర్కొనిన యెడల నవి అవలీలగా పరిష్కారమగుననివారనిరి. ఈ న్యాయమూర్తి అభిప్రాయమును బలపరచుచు చెన్నపురి వై. ఎం. సి. ఏ. లో జరిగిన డిబేటులో ప్రధానవక్తయై నిలిచిన శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు ఈ గ్రంథమునకు తొలిపలుకు వ్రాసి గ్రంథకర్త యుద్దేశముపై శుభాక్షతలుచల్లుట ముదావహము. పల్లెలందు తలయెత్తు వాదములను అచ్చటివారే పరిష్కరించుకొనవలెనని